# POTANA AND HIS WORKS
# LITERARY ART OF POTANA



DEDICATED TO LORD VENKATESWARA

Dr. N. RAJESWARI, M.A. (HONS), Ph.D.,

*Best Thesis Awardee of*
SIR R.VENKATARATNAM
RESEARCH GOLD MEDAL

# ఉపోద్ఘాతము

భగీరథుడు దివిజగంగాభవాని నవతరింప చేసినట్లు భక్తి రస తరంగిణిని తెలుగునాట భాషా రూపమున ప్రవహింపజేసి, ఆస్తికతకు పాదులు వెట్టిన కృషీవలుఁడు పోతన. ఆంధ్ర మహాభాగవతము వీరభద్ర విజయము భోగినీ దండకము ననునవి ఆ మహనీయుని రచనలుగా వ్యవహృతములగు చున్నవి. వీనిలో ఆంధ్రమహాభాగవతమునందలి అయిదు, ఆఱు, పదునొకండు, పండ్రెండు స్కంధములు తక్క తక్కినవి పోతన కృతములని యెల్లరు నిస్సందేహముగ నంగీకరించిన విషయమే. వీరభద్ర విజయము పోతన కృతమని తాళపత్ర గ్రంధములందు ముద్రిత ప్రతులలోను స్పష్టముగ నున్నను దాని కర్తృత్వమును గూర్చి విమర్శకులలో వాద ప్రతివాదములు బయలు దేరినవి. భోగినీ దండకము పోతన కృతమని దండకాంత పద్యమును బట్టి తెలియుచున్నను, ఆ పద్యము ప్రక్షిప్తము కానోపునను సందియము కల్గుటచే దాని కర్తృత్వ విషయము కూడ నట్టిదే యైనది. ఈ రెండు గ్రంధములను గూర్చి యింత వఱకు నేదైన కృషి జరిగినచో నది ప్రధానముగ కర్తృత్వ నిరూపణమును గూర్చియే యగుచున్నది. ఈ రెండిటిలో వీరభద్ర విజయ మొక ప్రత్యేక ప్రబంధమైనను, అద్దానిని గూర్చి యింత వఱకుఁ జెప్పుకొనఁదగిన కృషి యేమియు నంతగా జరుగ లేదనియే చెప్పవచ్చును.

ఇంతవఱకు పోతనామాత్యుని నివాస స్థల కాల నిర్ణయములను గూర్చి విశేషములగు చర్చలనేకములు జరిగినవి. కాని వానివలన సాహిత్యమునకుఁగల్గిన ప్రయోజన మత్యల్పము. పోతనామాత్యుఁ డెచ్చటి వాఁడైనను నెప్పటి వాఁడైనను నాతని కవిత్వకళాప్రాభవమున కవి ప్రధాన కారణములు కావు.

ఇఁక, నాంధ్ర భాగవతమును గూర్చి కృషి జరుగక పోలేదు. తత్సంబంధమైన వ్యాసములు గ్రంధములు అనేకములు వెలువడినవి. అందు కొన్ని యేక దేశములు, కొన్ని యతి సంగ్రహములు, కొన్ని యసమగ్రములును. మొత్తముపై ఆంధ్ర భాగవత గ్రంధ కళాస్వరూపమును సమగ్రముగ వ్యక్తీకరించు గ్రంధమింతవఱకు వచ్చి యుండలేదనియే చెప్పవచ్చును. ఈ పరిశోధక వ్యాసమున నాలోపము దీర్చుటకు కొంత ప్రయత్నము జరిగినది.

ఇందు పోతనామాత్యుని కాల న్నిర్ణయమును గూర్చి సూక్ష్మమగు పరిశోధనమును, అతని స్థలమును గూర్చియు భాగవత కర్తృత్వమును గూర్చియు నిష్పాక్షికమగు సమీక్షయు జరిగినవి. పోతనామాత్యుని యాంధ్రీ కరణ విధానమును సాధ్యమైనంత విపులముగను సోపపత్తికముగను చర్చించి, వ్యాసభట్టారకుని నీడలో నున్న పోతన స్వరూపమును కొంత వెల్గులోనికి తెచ్చుట జరిగినది. సమానేతి వృత్తమును గైకొని రచించిన పూర్వాంధ్ర కవుల యాత్మీయతయు, పోతనామాత్యునిపై నాతనికిఁ బూర్వమందున్న కవుల ప్రభావము నవసరమని తోఁచినంతవఱకు నిరూపింపబడినది. భాగవత తత్త్వము, పురాణ ప్రాశస్త్యము అను నంశములకు నీయవలసిన స్థానము నిచ్చి వివరించితిని.

పోతనామాత్యుని యితర కృతులైన వీరభద్ర విజయ భోగినీదండకముల కర్తృత్వమును విచారించి, యందు వీరభద్రవిజయ కావ్యస్వరూపమును సూక్ష్మముగను, భోగినీ దండకమును గూర్చి సంగ్రహముగను విమర్శించుట జరిగినది. పోతనామాత్యుని కృతులలో చూపట్టు ముఖ్యములగు సాంఘికాచారాది విషయములు కూడ నిందు వివరింపఁబడినవి. ఈ విధముగా పోతనామాత్యుని కృతులన్నిటిని గూర్చి సమగ్రమైన స్వరూపమునిచ్చుటకై చేసిన కృషి ఫలితమే యీ పరిశోధనము. అట్లని యింతటితో పోతనామాత్యుని కవిత్వ విమర్శకు 'శ్రీరామ రక్ష' యని నా యభిప్రాయము కాదు.

రత్నగర్భవంటి యీతని కవిత్వము నుండి యేన్నియెని మణులను తీయవచ్చును. ఈతని కమనీయ కవిత్వ మహాసముద్ర తీరమునందెన్ని నూతులు త్రవ్విన నన్ని క్రొత్త యమృతపు జలలూరుచునే యుండును. దేని మాధుర్యము దానిది. దేని తీరు దానిది. ఈ జలల చవులు భావుకుని హృదయ తత్త్వమును బట్టి పెంపెసలారును.

పోతన రచనలను గూర్చి యింకను చెప్పవలసిన యంశములుండ వచ్చును, కాని కాలనియమమునకు గట్టువడి యింత వఱకు నుత్సాహముతో నేను గావించిన యీ పరిశోధక గ్రంథమును సహృదయుల యామోదమున కందించుచున్నాను.

ఈ రచన సాధ్యమైనంతవఱకు సలక్షణమైన భాషలోనే జరిగినది. శ్రుతి సౌలభ్యమునకు, అర్థ స్పష్టతకు కొన్ని యెడల విసంధి చేయుటయు జరిగినది. దీనిని సహృదయులు గుర్తింతురు గాక.

# ఉత్తమ పరిశోధన

భాషాసేవకుడు
**డాక్టర్ తిరుమల రామచంద్ర**
హైదరాబాద్ -530 380

దేవర్షియైన నారదునికి ఒకానొకప్పుడు మనస్సు శోక వ్యాకులమయింది. ఎన్నో విద్యలు నేర్చెను. వాటి పరమార్థాన్ని తెలుసుకోలేకపోయేనే అని బ్రహ్మమానస పుత్రుడు నిత్యజ్ఞాని అయిన సనత్కుమారుని వద్దకు పోయి ''ఋగ్వేదం భగవోధ్యేమి యజుర్వేదం సామవేద మధర్వణం చతుర్థమితి హాస పురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకో వాక్య మేకాయనం వేదవిద్యాం బ్రహ్మవిద్యాం దూరవిద్యాం క్షత్రవిద్యాం సర్పదేవ జన విద్యాయేత దృగవో ధ్యేమి సోహంభగవో మంత్ర విదేవాస్మి నాత్మవిత్ (భగవన్ నేను ఋగ్వేదాన్ని యజుర్వేదాన్ని సామవేదాన్ని నాల్గవ దైన అధర్వణ వేదాన్ని ఐదవ వేదమైన ఇతిహాసపురాణాలను పిత్రులో కాలకు సంబంధించిన వేదాన్ని గణితాన్ని భాగ్యాన్ని నిధినిక్షేపాల విద్యను క్షత్ర విద్యను, నక్షత్ర విద్యను విషవిద్యను సర్వ దేవతలకు సర్వ ప్రజలకు సంబంధించిన విద్యను అధ్యయనం చేసేను. కాని భగవన్! కేవలం మంత్రాలను తెలుసుకున్నానుగాని, ఆత్మను దాని ఆంతర్యాన్ని తెలుసుకోలేక పోయాను. ఇదే నా శోక కారణం దీనిని పోగొట్టి నాకు శాంతి కలిగించు'' అనిప్రార్థించేడు.

సనత్కుమారుడు అతని ప్రార్థనను మన్నించి కేవలం విద్యాసంపాదనం ప్రాధాన్యం కాదని ఆవిద్యల తత్వం సర్వశ్రేష్ఠం సర్వసారం సర్వాంతర్యం అయినది ప్రాణం అని అది ప్రధానమని బోధించి నారదుని శోకవిముక్తుణ్ని చేసేడు. (ఛాందోగ్యం) బుద్ధి కన్నా హృదయం గొప్పదని దీని తాత్పర్యం.

శ్రీమద్భాగవతావతరణ గురించి కూడా యిలాటి గాథే ఉంది. వేదాలను వింగడించి, మహా పురాణాలు రచించి, మహాశాస్త్రాలు ప్రవచించి, బ్రహ్మసూత్రాలు నిర్వచించి ఋషీశ్వరులకే తలమానికమైన వ్యాసమహర్షి చిత్త శాంతి లేక ఏకాంతంలో విచారగ్రస్తుడై వుండగా, త్రిభువన పర్యాటకుడైన నారదుడు కాకతాళీయంగా వచ్చి విచార కారణమేమని ప్రశ్నించేడు. వ్యాస మహర్షి తన ఆవేదనను తెలిపాడు. అప్పుడు నారదుడు ''అంచితమైన ధర్మచయమంతయు జెప్పితి వందులోననించుక గాని విష్ణు కధ లేర్పడ జెప్పవు ధర్మములే ప్రపంచించిన మెచ్చునే గుణ విశేషణ మెన్నిన గాక నీకు నీ కొంచెము వచ్చుటెల్ల హరి గోరి నుతింపమి నార్యపూజితా'' అని వివరించి, కేవలము మనో బుద్ధులపై ఆధారపడే శాస్త్ర

సముదాయం శాంతి కలిగించ జాలదని హృదయ కవాటం తెరచి భగవంతునికి అర్పించి సంకీర్తనం చేయడమే ముఖ్యమని ఉపదేశించాడు. తత్ప్రకారం వ్యాసమహర్షి భక్తి తుందిల చిత్తంతో సంపూర్ణుడైన సర్వేశ్వరుని ధ్యానించి భాగవతామ్నాయం రచించాడు.

మానవుడు ఎంతటి తపోధనుడైనా, యోగి అయినా దైవభక్తి విరహితుడైతే ఎట్టి శాంతిని పొందజాలడని పై రెండు కథల ఆంతర్యం. బౌద్ధికమైన అవగాహన మాత్రమే మానవుని హృదయాన్ని సంతృప్తి పరచజాలదు. ''మన భావాలకూ ఉద్వేగాలకూ స్థానమైన హృదయం బుద్ధి కంటె ముఖ్యం. హృదయం సంతృప్తి పొందక పోతే, మానవుడు, సుఖంగా వుండలేడు. బుద్ధి ఒక్కటే మనస్సుకు శాంతి కలిగింపజాలదు''. అని అంటారు స్వామి అమలానంద.

ఈ విధంగా భగవంతుని మనోబుద్ధులతో కాక హృదయంతో చూడడమే భక్తి. డాక్టర్ రాధాక్రిష్ణన్ అన్నట్లు ''మానవుడు ఈ భక్తి ద్వారా తనకు భగవంతుని తోగల సంబంధాన్ని విశదాతి విశదంగా గ్రహించి చివర ఆపరమాత్మకు శరణాగతుడవుతాడు.

శ్రీమద్భాగవతం విష్ణుభక్తిని ప్రబోధించి, మానవుని హృదయాన్ని పరిపక్వం చేసే గ్రంథం. దీనిని ఆంధ్రీకరించినవాడు పోతన. ఆంధ్రభాగవత విశిష్టతను వివిధ కోణాల్లో డాక్టర్ రాజేశ్వరి గారు సమగ్రంగా పరిశోధించి పోతనను అతని కృతులను అతని కవితా వైభవముతో పరిశోధించి ఈసిద్ధాంత గ్రంధాన్ని ఆంధ్రావళికి అందజేసి మహోపకారం చేసేరు.

పదిహేను ప్రకరణాల ఈ సిద్ధాంత గ్రంథం, సత్యైక దృష్టితో వివిధ ప్రమాణాల ఆధారంతో మధుర గంభీరశైలిలో కొనసాగింది. పోతన ఆంధ్రీకరణ విధానాన్ని వివరించే ప్రకరణం అద్వితీయ మని నేను భావిస్తున్నాను.

పోతన శ్రీమద్భాగవతాంధ్రీకరణం నేటి పరిస్థితులలో ఎంత వరకూ ప్రయోజన కరం? నేటికల్లోలిత ప్రపంచానికి శాంతిని ప్రసాదించడంలో పోతన అనువాదం సమర్థమా? అన్న ప్రశ్నలకు డాక్టర్ రాజేశ్వరి గారు ''భాగవత తత్వము - ఆంధ్రలోకమునకు పోతన ఇచ్చిన సందేశము'' అనే ప్రకరణంలో సమాధాన మిచ్చేరు. శ్రీమద్భాగవతం పురాణాలన్నిటిలోను శ్రేష్ఠమైనది. గరుడ మత్స్యస్కాంధాది పురాణాలు దీని ప్రాశస్త్యాన్ని ఘోషించేయి. ఇది బ్రహ్మసూత్రాలకు భాష్యంవంటిదని భారతార్థాలను నిర్ణయించేదని గాయత్రీ భాష్యరూపమనీ భక్తిజ్ఞాన వైరాగ్య బోధకమునీ వేద రహస్యాలను ప్రజా సామాన్యానికి బోధించి, వారిని విజ్ఞానవంతులను, భాగవద్భక్తి యుతులను చేసే ఈ గ్రంధానికున్న వ్యాఖ్యలు ముప్పైకి పైచిలుకుగా గోచరిస్తున్నాయి. పోతన, శ్రీధరీయాది వ్యాఖ్యల సారాన్ని కూడా సమయోచితంగా తన

అనువాదంలో స్వీకరించాడు. భాగవత గ్రంధ రహస్యాలు తెలిపే స్వతంత్రగ్రంధాలు కూడా చాల ఉన్నాయి. ఈ ప్రకరణంలో డాక్టర్ రాజేశ్వరి గారు పోతన ఆంధ్రీకరణోద్దేశాన్ని విపుల సుందరంగా చర్చించి పోతన సందేశాన్ని ఇలా క్లుప్తీకరించారు. ''భాగవత తత్వమే లోకమునకు పోతన యిచ్చిన సందేశము. ఇట కొందరిట్లు ప్రశ్నింపవచ్చును భాగవతము వ్యాస ప్రోక్తము కదా! సందేశమును పోతన యిచ్చుటేమి? ఈ ప్రశ్నకు సమాధానముగా ఇంకొక ప్రశ్న యడుగ వలసి యున్నది. భాగవత ప్రతిపాదిత మగు తత్వము వ్యాసోపజ్ఞమా? కాదు. సమస్త తత్వములకును మూలము వేదమే కావున ఆదృష్టితో చూచినచో ఎవ్వరెవ్వరి కిచ్చిన సందేశమును లేదు. ఇక పోతన సందేశమేమనగా తత్సందేశము పోతన మూలమున ఆంధ్రలోకమున కందిన దనుట ఆతత్వమును తొలుదొల్త పోతనయే కనుగొనెనని యర్థము కాదు''

''చేతులారంగ శివుని పూజింపరేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువరేని
కలుగనేటికి తల్లుల కడుపు చేటు''

అని మహాభక్తుడు హరిహర భేదము లేనివాడు దయాళువు సత్యవ్రత పరాయణుడు అయిన పోతన చెప్పినాడు. శ్రీమద్భాగవతావతరణమే భక్తితో హృదయ పరిపాకం కోసమని మొదట్లోనే చెప్పెను. దయా సత్యశౌచాది గుణోప బృంహిత మైన భక్తినే పోతన ఆంధ్రావళికిచ్చిన సందేశము.

మరొక బహుమూల్యమైన ప్రకరణం'' పోతనామాత్యుని కృతులలోని యితర విశేషములు'' అనేది. దీనిలో పోతన కాలం నాటి సాంఘికాచారాది విశేషములు విశదీకరించ బడినాయి. వివిధ కందుక క్రీడా ప్రక్రియలు రాచక్రీడలు, గర్భిణీ హితచర్య కౌమార భృత్యం, వైవాహికాచారం, గడియారం, జాతీయాలు నుడికారాలు పలుకుబళ్లు అలంకారాలు వివిధ విషయాల చర్చ రంజకంగా సాగింది. డాక్టర్ రాజేశ్వరిగారి ఈ చక్కని ప్రామాణిక మైన సిద్ధాంత గ్రంధానికి ఉత్తమ సిద్ధాంత గ్రంధంగా ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి సువర్ణ పతకం రావడం ఆశ్చర్య మేమీకాదు.

ఈ సిద్ధాంత గ్రంధం ఆంధ్రావళికి డాక్టర్ రాజేశ్వరి గారి గొప్ప ఈవి. దీనివల్ల ఆంధ్రావళి ఎన్నో అపూర్వ విషయాలు తెలుసుకోగలదని విశ్వశిస్తున్నాను.

కళాప్రపూర్ణ చర్ల గణపతి శాస్త్రి
33 కిర్లంపూడి - టి.పి.టి. లే-ఔటు, విశాఖ

మహాకవి భక్తుడు అయిన శ్రీ పోతన మీద ఆభక్తుని కృతుల మీద తెలుగులో పి.హెచ్.డి. డిగ్రీ కోసము ఆంధ్రా యూనివర్సిటీ వారికి శ్రీమతి యన్. రాజేశ్వరి ఎమ్.ఏ (ఆనర్సు) గారు వ్రాసి సమర్పించిన సిద్ధాంత గ్రంథమిది.

ఇందులో పోతన కాలము నివాస స్థలము గ్రంథ పాతములు భాగవతాంధ్రీకరణ విధానము పోతన మీద పూర్వ కవుల ప్రభావము వీరభద్ర విజయ భోగినీ దండక నారాయణ శతకముల కర్తృత్వము తత్కృతులలోని రసవత్తర సన్నివేశ కల్పనలు సాంఘికాచారాది విశేషములు మొదలైన విషయములను సహేతుకముగ సోదాహరణముగ విమర్శించి చూపిరి.

వీరు ప్రధానముగ పోతనార్యుని భాగవతాంధ్రీకరణ విధానము నాతని కవితారీతులపై విశేషించి మూలముతోను శ్రీధరీయ వీరరాఘవీయ వ్యాఖ్యలతో గూడ సరిపోల్చి ఎక్కడెక్కడ ఏవ్యాఖ్యననుసరించిరో, ఎక్కడెక్కడ వ్యాఖ్యానాపేక్ష లేకుండ మూలమునే అనుసరించిరో ఎక్కడ వ్యాఖ్యలలో లేని విషయములు వ్రాసిరోయవి అన్నియు నిందు వివరించి చూపినారు.

అను వాద కర్త మూల గ్రంథ కర్తల రచనకు ఏవిధముగను తీసిపోక వ్యాఖ్యానము వలెగాక స్వతంత్ర రచన యోయను నట్లు తీర్చి దిద్దవలయును. డాక్టర్ రాజేశ్వరి గారు భాగవతాంధ్రీకరణ విధానమును పరిశీలించునపుడు పై యంశమును కూడ దృష్టియందుంచు కొన్నట్లు తోచుచున్నది.

''యతోనకశ్చితే క్వచ కుత్ర విద్యాన్
దీనస్స్వ మాత్మాన మలం సమర్థః
విమోచితుంకామదృశాం విహార
క్రీడా మృగోయన్నిగళో విసర్గః''

ఇట్లున్న మూలభావమునకు మెరుగులు దిద్ది స్వతంత్ర సుందరముగ పోతన రచన ఎట్లున్నదో వీరు చూపించిరి.

''హాలాపాన విజృంభమాణ మదగర్వాతీత దేహోల్లసద్
బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముడై లేశమున్
వేలానిస్సరణంబుగానక మహావిద్వాంసుడుం గామినీ
హేలాకృష్ణ కురంగ శాబకమగున్ హీన స్థితిన్ గంటిరే''

ఈ పద్యములో నున్నంతటి భావము మూలములో ఉన్నదా అని మన కనిపించు నట్లున్నది. శ్రీమతి రాజేశ్వరి ఇటువంటి ఉదాహరణములెన్నియో మనకండ్లకు గట్టి నట్లు చూపి మహోపకారము గావించిరి.

ఈ గ్రంధ పఠనానంతరము శ్రీమతి రాజేశ్వరి గారు-తమ పరిశోధనకు పోతన భాగవతమునే విషయముగా ఎన్నుకొని మంచిపని చేసిరనిపించినది. పోతన గారి పవిత్ర జీవనమును అతని భక్తి మకరంద మాధుర్యమును సవిమర్శనముగా అందజేయుటయే గాక మనలను మరల ఆభక్తిలహరిలో ముంచి వేసిరి.

ఇది, సిద్ధాంత వ్యాసముగానేగాక జీవిత సిద్ధాంత సరణికి కూడ ఉపకరించు గ్రంధముగా కూడ నున్న దన్న అతిశయోక్తి కాదు.

# నిత్యస్మరణీయులు

"నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమ విక్రియా" అన్న ఆలంకారిక నిర్వచన ప్రకారం నాహృదయంలో మొట్టమొదట సాహిత్యాంశను (బీజరూపంలో) నిక్షిప్తం చేసిన నాప్రథమ గురువులు డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు గారికి

ఈ పరిశోధనకు మార్గ దర్శకులై పరిశోధనా పద్ధతులన్నిటినీ ఓర్పుతో పర్యవేక్షించిన శ్రీమద్గురువర్యులు డాక్టర్ కాకర్ల వెంకటరామనరసింహం గారికి - పోతనామాత్యుడి స్థలకాల నిరూపణాది విషయాల్లో నాకు కలిగిన సందేహాలని, తీర్చడమే కాక పరిశోధనావసరంలో తటస్థించిన అవాంతరాలకి నా ఉత్సాహం సడల కుండ సంజీవని వంటి ధైర్యాన్నిచ్చిన పూజ్య శ్రీమల్లం పల్లి సోమశేఖర శర్మగారికి ప్రత్యేకమైన కృతజ్ఞతాంజలులు.

ఈ గ్రంధ రచనానంతరం నేను రాష్ట్రేతరాల్లోను దేశాంతరాల్లోను ఉండిపోవలసి వచ్చుట చేత గ్రంధముద్రణ నాకొక గడ్డు సమస్యగా పరిణమించింది. ఆసమస్యా పరిష్కారంలో ఇతోధికంగా పనిచేసి ఆద్యంతాలు నాకు అండగా నిలిచిన వ్యక్తులు ఇద్దరు. మొదటి వారు శ్రీ ముక్కవిల్లి సత్యనారాయణ గారు యం.ఫార్మ్., డి.యమ్.యస్.యమ్. వీరు ముఖ్యంగా నాకు బాల్య స్నేహితులు. విశేషించి సాహితీ బాంధవులు. ఆబాల్య స్నేహంలో వుండే సాంద్రతనీ, సాహిత్యంలో సంతరించుకొన్న ఔన్నత్యాన్నీ పురస్కరించుకుని గ్రంధముద్రణ విషయంలో తాను చేయకల్గిన సహాయం గురించి నాకు ఇదివరకే మాట యిచ్చేరు. ఇప్పుడు దాన్ని నూటికినూరుపాళ్లు కార్యరూపంలో చూపించి తన మహనీయతని నిరూపించుకున్నారు.

రెండవ వారు నాబావమరదులైన శ్రీ బి. సీతారామ శాస్త్రి గారు (ఎలక్ట్రికల్ ఇంజనీరు) ఈ నాగ్రంధ ముద్రణ కార్యమంతా శ్రీకారం చుట్టింది మొదలు శ్రీరామరక్ష వరకూ ఆయన సహకారంతో వారింట్లోనే జరిగింది. ఆసందర్భంలో నా సోదరి బి.యస్. లక్ష్మి చేసిన సేవ చూపించిన అదరణ మరవరానివి. దీనికంతటికి ముఖ్యమైన కారణం ఆదంపతులకి మాయందుండే గౌరవాభిమానాలే కాని బాంధవ్యం ఎంత మాత్రం కాదని చెప్పక తప్పదు. పై ముగ్గురి గురించి, నేను చెప్పదలచింది ఒకే ఒక వాక్యం. దాన్ని - ఆత్మ శుద్ధి భక్తి వేదాంత సమన్వయత్వం కల్గిన పోతనార్యుడి మాటల్లో నేచెప్పి ముగిస్తున్నాను.

"దీనికిఁ బ్రత్యుపకృతిఁ గావింప నేనేర నం
జలిగావించెద........ సద్బుంధు చింతామణీ"

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ ముద్రణ విషయంలో చాలా ప్రోత్సాహమిచ్చిన డాక్టర్ యస్. రామమూర్తి గారికి

సందేహ నివృత్తికోసం నాకు కావలసినపుడల్లా వస్తుసామగ్రిని సమకూర్చి అమితమైన సౌజన్యాన్ని చూపించిన స్నేహశీలీ విదుషీమణీ అయిన డాక్టర్ మలయ వాసిని గారికి

గ్రంథ రచనావసరంలో ఆర్థిక సహాయాన్ని ముద్రణావసరంలో కొన్ని ముఖ్యమైన సలహాలను ఇచ్చిన నా సోదరుడు డాక్టర్ ఆర్. జగన్నాదరావుకి

నేను కోరిన వెంటనే ఈ గ్రంథం గురించి తమ అభిప్రాయాలని రాసిన శ్రీ ఆచార్య తిరుమల రామచంద్ర గారికి కళాప్రపూర్ణ శ్రీ చర్ల గణపతి శాస్త్రి గారికి

ఉగ్గు పాలతో విద్యా బుద్ధులు నేర్పి పెంచి పెద్ద చేసిన, పూజ్యశ్రీ మాతండ్రి గారికి

నా సాహిత్యస్రవంతి ఇంకిపోకుండ నాకుతూహలానుసారం స్వేచ్ఛ నిచ్చి ప్రోత్సహించిన మా శ్రీవారు శ్రీ యస్. ఎల్. శంకరం గారికి

ఈ గ్రంధాన్ని సుందరంగా ముద్రించిన వంశీ ఆర్ట్ ప్రింటర్స్ శ్రీ నీలకంఠేశ్వరరావు గారికి

# విషయసూచిక

# పోతనామాత్యుని కాల నిర్ణయము

పోతనామాత్యుని కాలమును నిర్ణయించుటకు ముఖ్యముగా రెండాధారములు గన్పట్టుచున్నవి. ౧. పేరయమంత్రికాలము :- (పేరయమంత్రి దాక్షాయణీ పరిణయకృతి పతియగు మల్లన సోమయాజి సంతతివాఁడు. దాక్షాయణీ పరిణయ కర్తలు కేసయమల్లయ కవులు పోతన సంతతివారు.) ౨. భోగినీ దండకమునందుఁ బేర్కొనఁబడిన సర్వజ్ఞసింగ భూపాలుని కాలము.

పోతనామాత్యుని జననకాలమును గాని, మరణకాలమునుగాని నిశ్చితముగాఁ దెల్పునాధారము లెవ్వియు నింతవఱకు లభించియుండలేదు. పోతన, తిక్కనయజ్వనుఁ బూర్వకవిగా స్తుతించెను. కావు నీతఁడు తిక్కన తరువాతివాఁడు కావలెను. రామాభ్యుదయ కర్తయగు నయ్యలరాజు రామభద్రుఁడీతనినిఁ బూర్వకవిగా బేర్కొనినాఁడు. కావున నీతఁడు రామభద్రునకుఁ బూర్వుఁడు కావలెను. అనగా క్రీ.శ. ౧౩౪౦. క్రీ.వ. ౧౫౩౦ సంవత్సరములకు మధ్యకాలము పోతనామాత్యుని కాలమని చెప్పవచ్చును.

భోగినీ దండకమునందుఁ బ్రసక్తుఁడైన సర్వజ్ఞసింగమనీఁడు రేచర్ల వంశజుఁడు. ఈ రేచర్ల వంజులే తరువాతఁ గొంతకాలమునకు వెలుగోటి వారని ప్రసిద్ధివహించిరి. ఈ రేచర్లవంశోద్భవుండైన దాచానాయని సంతతివారు, తెలంగాణములోని రాచకొండ దేవరకొండ దుర్గములు రాజధానిగా క్రీ.శ. ౧౩-౧౪ శతాబ్దములలోఁ బాలించుచు వచ్చిరి. ఈ రేచర్ల వంశజుల చరిత్రము, జటప్రోలు సంస్థాన పండితులైన శ్రీ వెల్లా సదాశివ శాస్త్రిగారి చేతను, శ్రీ అవధానము శేష శాస్త్రిగారి చేతను వ్రాయఁబడినది. దీనికే వెలుగోటివారి వంశ చరిత్రమను నామాంతరము. తత్కర్తలీవంశ చరిత్రమును రచించుటకుఁ బ్రధానముగా వెలుగోటి వారి వంశావళియను[౧] నొక సంకలన పద్య గ్రంధమును, రేచర్ల భూవరుల శాసనములను నాధారముగా గ్రహించిరి. పై శాసనములను వారు గ్రంధమున ననుబంధములుగా నిచ్చినారు. ఇవి శిలల మీది శాసనములను జూచి వ్రాసిన ప్రతులేకాని ప్రతిబింబములు తీసి పాఠ పరిష్కారము చేసి ప్రకటించిన నిర్దుష్ట శాసన ప్రతులుకావు.

---

౧. వెలుగోటి వారి వంశావళియన్నది రేచర్ల వంశమందలి ప్రతి తరము రాజుల మీదను, వారి వారి కాలములలో నుండిన కవులు, భట్టాజులు మొ. వారి పౌరుష పరాక్రమాదికృత్యములనభివర్ణించుచు వ్రాసిన పద్యముల సంపుటీకరణము.

వెలుగోటి వారి వంశ చరిత్రమునసుసరించి యా వంశజులకు చెవిరెడ్డియను చేతిరెడ్డి కూటస్థుఁడు. ఎఱదాచానాయఁడను దాచానాయఁడు నాల్గవ తరమువాఁడు. ఇతని తనయుఁడు సింగమనాయఁడును, పౌత్రుఁడనమోతానేడను, ప్రపౌత్రుడు రెండవసింగమనీఁడును, ఇతని పుత్రుఁడు కుమారాన్నపోతానేడను పిన అన్నమనేడును ౫, ౬, ౭, ౮ తరముల వారగుచున్నారు. అనంతనాయకుఁడను సంస్కృత నామమునకే యన్నమనాయకుఁడని యనవోతానాయకుఁడనియు నామాంతరములు. ౮వ తరపు అనవోతానాయని కైదుగురనుజులు గలరు. వీరిలో వేదగిరి నాయఁడొకడు. అతనికి వంశ చరిత్రమునసుసరించి సింగనాయఁడను నామాంతరము గలదు. ఈ చిన సింగమనేని కుమారుఁడు తొమ్మిదవ తరపు అనవోతానేడు. ఇతని కుమారుఁడు పదియవతరపు సింగమనాయఁడు. పైన జెప్పిన దానినిబట్టి రేచర్ల వంశమునందు ౬,౮,౯ తరములలో మ్గురనవోతానాయకులు గోచరింతురు. అట్లే ౫,౭,౧౦ తరములలో ముగ్గురు సింగమ నాయకులు కూడ కలరు. [౧]వంశచరిత్ర ప్రకారము సర్వజ్ఞ బిరుదము ౭, ౧౦ తరముల వారికే గలదు.

శ్రీనాథుడు సర్వజ్ఞసింగమనేని దర్శించినట్లాతని చాటువులవలనను, పోతన సర్వజ్ఞసింగమనేని గూర్చి దండకము రచించినట్లాతనిచే వ్రాయఁబడిన దండకాంతమునందలి :–

"పండిత కీర్తనీయుఁడగు బమ్మెర పోతన యా సుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదా నవిహర్తకురావు సింగ భూ
మండల భర్తకున్ విమత మానవ నాథ మదావహర్తకున్"

---

౧.

| | | | |
|---|---|---|---|
| ౧. | చెవిరెడ్డి లేక భేతాళనాయకుడు | | |
| ౨. | మాదా నాయకుఁడు | | |
| ౩. | వెన్నమనాయకుఁడు | | |
| ౪. | ఎఱదాచానాయకుఁడు | | |
| ౫. | సింగమనాయకుఁడు | | |
| ౬. | అనవోతా నాయకుఁడు –మాదా నాయకుడు | | |
| ౭. | సర్వజ్ఞసింగమనాయకుఁడు | | |
| ౮. | అనవోతా నాయకుడు | వేదగిరి లేక చినసింగన | ఇతరులు |
| ౯. | | అనవోతా నాయకుఁడు | |
| ౧౦. | | సర్వజ్ఞ సింగము నాయకుఁడు | |

అను పద్యమును బట్టియుఁ దెలియవచ్చుటయే గాక, పరంపరాగతముగ వచ్చు జనుశ్రుతికూడ గలదు. పై రీతిని శ్రీనాథ పోతనల కిరువురకును బ్రసక్తుఁడైన సర్వజ్ఞసింగమనీఁడొక్కఁడేనా! లేక భిన్న వ్యక్తులా ! యను విషయమై వాఙ్మయ చరిత్రకారులలో భిన్నాభిప్రాయములున్నవి. సర్వజ్ఞ బిరుదాంచితులైన సింగమ నామధేయులిరువురిలో మొదటి యనవోతానాయని కుమారుఁడే 'రసార్ణవ సుధాకర కర్త' యను విషయములో నెవరికిని నభిప్రాయ భేదము లేదు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మాత్రమీతనికి సర్వజ్ఞ బిరుదము లేదనియుఁ బదవ తరపు సింగనకే గలదనియుఁ జెప్పినాఁరు. శ్రీ వీరేశలింగము పంతులుగారు కొందఱు కాదనుచున్నను, రసార్ణవ సుధాకరకర్త సర్వజ్ఞ బిరుదాంచితుఁడే యని యంగీకరించుచు సర్వజ్ఞ బిరుదము పదియవతరము వానికి కూడ నుండవచ్చుననిరి.

పోతన సమకాలికుఁడగు సర్వజ్ఞ సింగమనేని గూర్చి చర్చించిన ప్రముఖులలో శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ చాగంటి శేషయ్యగారు ముఖ్యులు.

అందెవరెవరేయే పద్ధతుల నవలంబించి, పోతనాకలమును, నతనికి సమకాలికుఁడైన సర్వజ్ఞసింగమనేని కాలమును, నిర్ణయించినదియు నీదిగువ సంగ్రహముగా నీయఁబడినది.

## ౧. శ్రీ కందుకూరి వీరేశలింగము గారి వాద సారాంశము : –

శ్రీ వీరేశలింగము పంతులుగారు 'శ్రీనాథుడు తాను కనకాభిషేకమును పొందినది కర్ణాటాధీశ్వరుఁడైన ప్రౌఢదేవ రాయల చేతననియు, నీరాయలు క్రీ.శ. ౧౪౨౩ మొదలుకొని క్రీ.వ. ౧౪౪౭ వరకు రాజ్యముచేసెననియు. నాతనిచే సన్మానము పొందిన తరువాతనే శ్రీనాథుఁడు దేశసంచారము చేయుచు సర్వజ్ఞసింగమనేని దర్శించెననియు, నీ సింగమనేడు ౭ వ తరము వాఁడైన రసార్ణవ సుధాకర కర్త కాఁజాలఁడనియుఁ జెప్పి యిట్లు వ్రాసిరి. "శ్రీనాథ పోతన లిరువురు నీ యేడవ తరము సింగమనేని కాలమువారు కాపోవుటయు, నందుచే వారాతని యాస్థానమునందు లేకపోవుటయు నిశ్చయమే. అంతమాత్రము చేత ౧౦వ తరము వాఁడైన సింగమనాయఁడు విద్వాంసుఁడును సర్వజ్ఞ బిరుదాంచితుఁడును కాఁడన్న సిద్ధాంతమేర్పడదు. ఇద్దరును విద్వాంసులు కావచ్చును. ఇద్దరును సర్వజ్ఞ బిరుదాంచితులు కావచ్చును. ఇద్దరును గ్రంథ కర్తలు కావచ్చును ఇద్దరును కృతిపతులు కావచ్చును..................౧౦ వ తరము వాఁడైన సింగమనాయఁడును సర్వజ్ఞ బిరుదాంచితుఁడే. ప్రౌఢదేవరాయని కాలములో నుండిన యీ సర్వజ్ఞ సింగమనేని

యాస్థానమునకే శ్రీనాథ పోతనలు పోయి దర్శించి బహుమానములు వడసిరి." అని వ్రాసిరి.

పోతానార్యుని ప్రపౌత్రులు కేసయ మల్లయ కవులు. వారు రచించిన దాక్షాయణీ పరిణయమును గృతినందినవాఁడు మల్లన సోమయాజి. అతని మనుమని మనుమఁడైన గురిజాల పేరయ మంత్రికి పోడూరి పెదరామకవి దాక్షాయణీ పరిణయ ప్రతివ్రాసి యిచ్చిన కాలము క్రీ.శ. ౧౭౫౬ సంవత్సరము. దాని నాధారముగా గైకొని శ్రీ పంతులుగారు పోతనకాలము నీ దిగువ రీతిని నిర్ణయించిరి.

"క్రీ.శ. ౧౭౫౬ వ సంవత్సరము నందుండిన గురిజాల పేరమంత్రికిని బమ్మెర పోతనామాత్యునకును నడుమ నేడు పురుషాంతరములు గడచినందున నొక్కొక్క తరమునకు నలువది సంవత్సరములు చొప్పున చూచినచో ఏడు నలువదు లిన్నూట యెనుఁబది సంవత్సరములు క్రీ.శ. ౧౭౫౬ నుండి తీసివేయఁగా క్రీ.శ. ౧౪౭౬ వ సంవత్సరము వఱకును బోతనామాత్యుఁడు జీవించి యుండవలెను. ఇందుండి పదిపదునేను వత్సరములు త్రోసి వేసినను పోతన క్రీ.శ. ౧౪౬౦ సం. వఱకైనను జీవించి యుండవలెను. అతఁడఱువది సంవత్సరములు జీవించి యుండెనను కొన్నచోఁ బోతనార్యుని జన్మకాలము క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతమై యుండును."

పోతన శ్రీనాథుని కంటె నిరువది ముప్పదేండ్లు చిన్నవాఁడై యుండుననియు. నీతఁడు తన భాగవతము నంకిత మిచ్చుటకు నిరాకరించెనని చెప్పఁబడు సర్వజ్ఞ సింగమనేనికథ కూడ పయి కాలమును స్థాపించుచున్నదనియు పంతులుగారి యభిప్రాయము.

దీనివలన శ్రీనాథ పోతనలు దర్శించిన సర్వజ్ఞసింగమయొక్కఁడే యనియు నతఁడు పదవతరమువాఁడును, భోగినీ దండకము నందుఁ బ్రవక్తుఁడైన వసంతావనీ నాథుని సోదరుఁడును నగు సింగమయే యనియు విశదమగుచున్నది.

౨. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు పోతన కాలమును గురించి ప్రత్యేకముగాఁ బరిశోధనలు చేసి యుండలేదు. "ఏకశిలానగర మోరు గల్లే" యను విషయమును వ్రాయుచు దానికిఁ బ్రవక్తమైనంత వఱకు స్థూలముగాఁ బోతనకాలమును నిర్ణయించిరి. కవిస్తుతిని బట్టి తిక్కన అయ్యలరాజు రామభద్రులకు నడుమ అనఁగా క్రీ.శ. ౧౩౦౦ ౧౫౦౦ లకు మధ్య పోతనామాత్యుఁడుండుటచేతను వాఙ్మయ చరిత్రకారులు కూడ పోతన కాలమును క్రీ.శ. పదునాల్గవ శతాబ్దము యొక్క యుత్తరార్థమునను, క్రీ.శ. పదునేనవ

శతాబ్దు యొక్క పూర్వార్ధమునను, అనఁగా క్రీ.శ. ౧౩౭౬ – ౧౪౬౦ సంవత్సరముల మధ్యకాలమని నిర్ణయించుట చేతను వీరు కూడ నాకాలమునే గ్రహించినారు.

భోగినీ దండకమునందుఁ బ్రసక్తుఁడైన సర్వజ్ఞసింగమనేని గూర్చి చర్చించుచు ౭,౯, ౧౦ తరములలో ముగ్గురు సింగములున్నట్లును, నందు ౭, ౧౦ తరముల వారికి సర్వజ్ఞత్వ బిరుదమున్నట్లును వీరంగీకరించిరి. 'దండకమునందలి సింగమును గుర్తించుటకు వీరీ దిగువ నాల్గు గుర్తులు చెప్పిరి.

౧. దండకము నందలి సింగమ తాత సింగము

౨. తండ్రి కుమారాన్నపోతావనీశుఁడు

౩. తల్లి పోచమాంబ

౪. ఇతఁడు వసంతావనీశునిచే సేవింపఁబడినవాఁడు.

[౧]ఈ సందర్భమున శ్రీ లక్ష్మణరావుగారి వాదమిది. ౯ వ తరము సింగమకు నిందలి యొక్క లక్షణమును బట్టదనియు ౭ వ తరము సింగమ క్రీ.శ. ౧౪౨౭ లో నున్నట్లు శాసనముల వలనఁ దెలియుచున్నదనియు నిది శ్రీనాథుని కాలమునకును బోతనకాలమునకును సరిపోవుననియుఁ జెప్పి ౭, ౧౦ తరముల సింగములకు దండకమునందలి లక్షణములు సరిపోవుచున్నవనియునిట్లు వ్రాసిరి.

"౭వ తరము సింగమ తండ్రి యనపోతన కుమార శబ్దములేనందున మనము సంశయింప నక్కఱలేదు. ఏకనామము గలవారిద్దరున్న యెడల తరమునందుగాని వయసునందుఁ గాని చిన్నగానున్న కుమార శబ్దముతోఁ బిలుచుట సహజము. ఇఁక నీతని తాత సింగమయే. వసంతావనీశుఁడు కొండవీటి కుమారగిరిరెడ్డి యని తలచిన యెడల నీతనికి సమకాలికుఁడే. ఇట్లు దండకమునందలి మూఁడు లక్షణము లీతనికి సరిపోవుచున్నవి."

ఇఁక నాల్గవ లక్షణమగు నాతని తల్లిపేరు, పోచమాంబయు, సింగభూపాలీయమున, నన్నమ యనియు నుండుటచేత సరిపడుట లేదు. అయినను పోచమనునది యన్నమ యొక్క నామాంతరము కావచ్చునియుఁ బూర్వోక్త కారణముల వలన నేడవ తరము

---

౧. శ్రీ లలక్ష్మణరావుగారు వెలుగోటి వంశ చరిత్రను నాధారముగాఁజేసికొని పై విధమున వ్రాసినను వారికి సందేహము లేకపోలేదు. ఈ తరములు వెలుగోటి వారి చరిత్రము వ్రాసినవారే యాధారమును బట్టి వ్రాసినదియుఁ జెప్పియుండలేదు. "మాకుఁ జూడ ౧౦వ తరమునను న్న యనపోతన కుమారుఁడు ౬వ తరమువాఁడనియుఁ దోఁచుచున్నది." అని వారే వ్రాసిరి. (లక్ష్మణరాయ వ్యాసావళి. పుట. ౯౬.)

సింగమ, దండమునకు నాయకుఁడు కావచ్చుననుటలో విరుద్ధము లేదనవారి యభిప్రాయము. అయినను నీతని మునిమనుమఁడగు ౧౦ వ తరము సింగమ నాయనిఁ గూర్చి కూడఁ గొంత విచారణము చేసిరి.

సింగభూపాలీయ కర్తయగు నేడవ తరము సింగమ క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతము వాఁడనుకొన్నచో నాతనికిని నాతని మునిమనుమఁడైన ౧౦ వ తరము సింగనకును నడుమ రెండు తరములుండుట వలన తరమునకు ౨౦ సంవత్సరముల చొప్పున[౧] లెక్కించిన నీ సింగమనేని కాలము క్రీ.శ. ౧౪౪౧ ప్రాంతమగుచుండుటచేత నిదియుఁ బోతనకాలమే యని చెప్పి యీ సింగమనేని తాత సింగమనేడనియు తండ్రి యనపోతన యనియుఁ దల్లిపేరు తెలియ దనియు, దమ్ముఁడు వసంతరాయఁడనియు, సమన్వయించి దండకములోని సింగమ యీతఁడైనను గావచ్చుననిరి. ఈ నిర్ణయానుసారము పోతన పెదసింగమ సమకాలికుఁడైనయెడల క్రీ.శ. ౧౪౦౦ లకు బూర్వమును, రెండవ వాని కాలము వాఁడనుకొన్నచో క్రీ. శ. ౧౪౦౦ లకుఁ దరువాతను జన్మించి యుండవలెనని వారి యభిప్రాయముగా స్పష్ట పడినది.

తిక్కన - రామభద్రులకు మధ్యకాలమగు క్రీ.శ. ౧౩౦౦ క్రీ.శ. ౧౪౦౦ లకు నడుమ నిశ్చయముగఁ బోతన యున్నవాఁడుగాన, నప్పటికి లక్ష్మణరావుగారు వ్రాసిన నాటికి వాఙ్మయ చరిత్రకారులు సుమారుగా నంగీకరించిన క్రీ.శ. ౧౩౭౦ క్రీ.శ. ౧౪౬౦ ప్రాంతము బోతన కాలమని వీరంగీకరించి పోతన కృతభోగినీ దండకమందలి నాలుగు లక్షణములను ౭వ ౧౦వ తరముల సింగములకు సమన్వయించి యా యిరువురు సింగమలలో నెవరైననుఁ బోతన సమకాలికుఁడు కావచ్చుననిరి.

౩. వేటూరి -పభాకరశాస్త్రిగారి వాదసారాంశము : -

శృంగార శ్రీనాథమను గ్రంథమున వీరు శ్రీనాథుడు దర్శించిన సర్వజ్ఞ సింగమను గూర్చి చర్చించిరి. వీరు వెలుగోటి వారి వంశ చరిత్ర ప్రకారమేర్పడు వంశ వృక్షమును కాదని సింగభూపాలకృత రసార్ణవ సుధాకరము నందలి వంశ వృక్షము నంగీకరించిరి.

---

౧. "తరమునకు ౨౦ సం.రముల చొప్పున లెక్కించుట తక్కువయని కొందఱందురు; కాని రేచర్ల వారి చరిత్రమును బట్టి చూడ నింతకంటె నెక్కువ సంఖ్య తరమునకు వేయనక్కర లేదని తోచెడిని. వెలుగోటి వారి వంశ చరిత్రమునందే ౪ తరములకు ౫౩ సం.రములీయఁబడినవి. (పుట౬౬. వె.వం.చ.) అప్పుడు తరమునకు ౧౩ సం.రములు పడ్డవి. ఇదియుఁగాక తరమునకు ౨౦ యేండ్లు ప్రభుత్వకాలముగాని వయస్సుకాదు. (లక్ష్మణరాయ వ్యాసావళి పుట. ౭౭).

రసార్ణవ సుధాకర కారుని తండ్రియైన యనవోతానాయని శాసనము క్రీ.శ. ౧౩౦౦ శా.శ. ౧౩౦౨ నాటిదియు, రసార్ణవ సుధాకరకారుని యాఱుగురు కొడుకులలో (గడగొట్టు వా(డైన మాధవుని భార్య నాగాంబిక శాసనము క్రీ.వ. ౧౪౨౬ నాటిదియు(, గనిపించుటచేత రసార్ణవ సుధాకర కర్త క్రీ.శ. ౧౩౮౭ శా.శ. ౧౩౦౨ క్రీ.శ. ౧౪౦౩ శా.శ. ౧౩౨౫ వఱకు నున్నవా(డని శాస్త్రిగారి యభిప్రాయము.

వెలుగోటి వంశమునంగీకరించి వెలుగోటి వారి వంశ చరిత్రమునందీయ(బడిన తరములలో నొక తరమధికముగా( గల్పింపబడి తప్పుగా నీయ(బడినదనియు నా తప్పునకు( గారణము వంశావళియందలి యీ దిగువ నున్న : -

సీ. వీరాగ్రగణ్యుండు వెన్నభూపాలుండు
ఖ్యాతిసేరాజు ముత్తాతతాత
వెఱిపాండ్యగజసింహు(డెఱదాచ భూపతి
ధాత్రినేరాజు ముత్తాతతండ్రి
సంగరాభంగుండు సింగభూనాధుండు
తనరంగసేరాజు తాత తాత
యాదిగర్భేశ్వరుండనవోత భూపతి
తర్కింపనేరాజు తాత తండ్రి
చిరకీర్తియగు రావు సింగవనీశుండు
ధట్టింప నేరాజు తండ్రి తండ్రి
బిరుదభీకరు(డైన పిన సింగనరపతి
చెన్నొంద నేరాజు గన్న తండ్రి
తే. శూరు(డారాజ దైతేయ శోషణుండు
సారసీస్వాంత సేవా విశాలు(డైన
యన్నమాంబాతనూజాతు(డనఘుమూర్తి
రాయరావన్నవోత ధరాధిపుండు"

---

(వెలు(గోటి వంశావళి పుటలు ౫౭ ౬ ౫౮)

అను పద్యము కావచ్చుననియు, రసార్ణవ సుధాకరకర్త తనయుఁడైన కుమారాన్న పోతానాయని తనూజుఁడగు సింగమకు మాత్రమే సర్వజ్ఞ బిరుదము గలదనియుఁ జెప్పి శ్రీ శాస్త్రిగారిట్లు వ్రాసిరి.

ఈ సింగ భూపతికి అనఁగా రసార్ణవసుధాకరకర్తకు సర్వజ్ఞ బిరుదము కానరాదు. రసార్ణవ సుధాకరములో లేదు. చమత్కార చంద్రికలో లేదు. [౧]పై గ్రంథముల ప్రాత వ్రాత ప్రతులలో నెక్కడను లేదు, కాని వెలుగోటి వారి వంశ చరిత్రమున నీతఁడు మొదటి సర్వజ్ఞ సింగ భూపతిగాను, శ్రీనాథుఁడు వర్ణించినవాఁడు రెండవ సర్వజ్ఞ సింగ బూపతిగాను, వ్రాయఁబడినది. ఆ వ్రాత యసంగతము. శ్రీనాథునిచే వర్ణింపఁబడిన సింగ భూపతికే సర్వజ్ఞ బిరుదము గలదు . . . . . . . రసార్ణవ సుధాకర కర్తయగు సింగ భూపతియు శ్రీనాథాదులచే దర్శింపఁబడిన సింగభూతియు భిన్నులు. మొదటి వానికి సర్వజ్ఞ బిరుదము లేదు. వారిరువురునుఁ దాత మనుమలు. తాత క్రీ.వ. ౧౩౬౮ శా.శ. ౧౩౦౨ ప్రాంతముననను, మనుమఁడు క్రీ.వ. ౧౪౪౮ శా.శ. ౧౩౭౦ ప్రాంతముననను నున్నవారు. మల్లినాథుఁడు శ్రీనాథుఁడు పోతరాజు సర్వజ్ఞసింగ భూపాలుని దర్శించిరి."

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు శ్రీనాథ పోతనలు దర్శించినది సర్వజ్ఞ బిరుదము గల సింగమనే యని చెప్పి వెలుగోటి వారి వంశ చరిత్రము నందలి తరములను సరిచేసి రసార్ణవ సుధాకర కర్త మనుమఁడైన తొమ్మిదవ తరము సింగమకే సర్వజ్ఞ బిరుదము కలదనియు, నాతఁడే శ్రీనాథ పోతనలకుఁ బ్రసక్తుఁడనియుఁ దేల్చిరి.

౪. కవితరంగిణికారులు, శ్రీ చాగంటి శేషయ్యగారి పద్ధతి : –

శ్రీ చాగంటి శేషయ్యగారు శ్రీనాథునకును బోతనకును సమకాలికుఁడనఁబడు సింగమకాలమును, నిర్ణయించుటకు రేచెర్ల వంశజుల కొన్ని శాసనముల నాధారముగాఁ గైకొనిరి. వారి గ్రంథమునందుఁ జెప్పఁబడినట్లాఱవతరము అనవోతానాయని శాసనములు క్రీ.శ. ౧౩౬౫ వ.శ. ౧౨౮౭ క్రీ.వ. ౧౩౬౯ శా.శ. ౧౨౯౧ నాఁటివి దొరకినవి. ఈతని తమ్ముఁడైన మాదానాయని శాసనము. క్రీ.శ. ౧౩౭౬ శా.శ. ౧౩౯౮ నాఁటిదొకటి గలదు. ఏడవ తరము సింగమనేని శాసనము క్రీ.శ. ౧౩౮౭ శా.శ. ౧౩౦౯ నాఁటిదొకటి సింహాచలములో నున్నది. ఇతని కనిష్ఠపుత్రుఁడైన మాథవ నృపాలుని (మాదానాయని) తామ్రశాసనము క్రీ.శ. ౧౪౨౨ శా.వ. ౧౩౪౩ నాఁటి దొకటి దొరకినది. వీనిననుసరించి

౧. చమత్కార చంద్రిక లమర వ్యాఖ్యానకర్తలు సుధాకర కారుని యాస్థానములో నుండినవారు.

కవితరంగిణికారులాఱవ తరము నాటి మొదటి యనవోతానాయఁడు క్రీ.శ. ౧౩౧౫ లో జన్మించి క్రీ.శ. ౧౩౮౫ వరకు జీవించియుండెననియు, నితని కుమారుఁడన యేడవ తరపు సింగమ నాయఁడు క్రీ.శ. ౧౩౪౫ ప్రాంతమున జన్మించి దాదాపు డెబ్బది సంవత్సరముల వఱకు అనఁగా క్రీ.శ. ౧౪౧౨ వఱకు నుండుటలో విరుద్ధమేదియు లేదనియు, నీతనినే శ్రీనాథుఁడు క్రీ.శ. ౧౪౦౨ లోనో, లేక యొకటి రెండేడ్ల తరువాతనో సందర్శించి సన్మానితుడై యుండెననియుఁ జెప్పి, శ్రీనాథుని గౌరవించినది యేడవ తరములోని సర్వజ్ఞుడే కాని వంశ చరిత్రము నందుఁ జెప్పినట్లు పదవతరములోని వాఁడు కాఁడని నిర్ణయించినారు. (పుటలు ౧౨౧)

శ్రీనాథుడు సందర్శించిన సర్వజ్ఞ సింగమనాయఁ డెవ్వరను విషయము మనకిట నప్రస్తుతము. పోతన కృతభోగినీ దండకము నందలి సర్వజ్ఞ సింగభూపాలుఁడెవ్వరనునదియే మనము నిశ్చయింపవలసియున్నది. ఇది వంశ చరిత్రకారులొక తరమును తప్పుగాఁ జేర్చిరా, లేదా, యన్నది నిర్ణయమైనగాని తేలదు.

ఇఁక వెలుగోటివారి వంశ చరిత్రలోఁ జెప్పినతరముల విషయమై చర్చించుచు కంచిలోని యనవోతానాయని కుమారుఁడును, సింగమనాయని సోదరుఁడును నైన దేచర్ల వసంతరాయని తండ్రియైన యనవోతానాయఁ డెనిమిదవ తరమువాఁడే యని నిశ్చయించి ప్రభాకర శాస్త్రిగారూహించినట్లే వెలుగోటి వారి వంశ చరిత్రలో నొక తరము తప్పుగాఁ గల్పింపఁబడినదని తొమ్మిదవ తరమును విడచిరి.

ఈ నిర్ణయము ననుసరించి వారు భోగినీ దండకమునందలి సింగమ నాయఁడేడవ తరపు సర్వజ్ఞసింగమకాఁడనియు, రెండవ సింగ భూపాలుని జననము క్రీ.శ.౧౪౦౦ ల ప్రాంతమనియు, పుట ౧౨౨ - ౧౨౮ పోతనామాత్యుని జననము క్రీ.శ. ౧౪౫౦ ప్రాంతమనియు, వారు నిశ్చయించుకొనుట చేత నీ దండకము పోతన కృతము కాదని తేల్చిరి.

ఇఁక పోతన జనన కాలము క్రీ.శ. ౧౪౫౦ యని వారు నిర్ణయించుట కాధారము దాక్షాయణీ పరిణయ కృతికిఁ బ్రతి పుట్టిన కాలమగు క్రీ.శ. ౧౭౫౬ ... పోతనామాత్యుని ప్రపౌత్రులు దాక్షాయణీ పర్ణియమను మల్లన సోమయాజి వంశజుఁడగు గురిజాల పేరన మంత్రికి పోడూరి పెదరామా మాత్యుఁడా కావ్యమును క్రీ.శ.౧౭౫౬ లో ప్రతివ్రాసియిచ్చెను. ఆ ప్రతి వ్రాసి యిచ్చునాఁటికి గురిజాలపేరమంత్రికేఁబది యాఱు సంవత్సరములైన

నుండి యుండునని యూహించి, జనన కాలము క్రీ.శ.౧౭౦౦ లగునని చెప్పి శతాబ్దికి మూఁడు తరముల చొప్పున లెక్కించి వారు పోతన జనన కాలము క్రీ.శ. ౧౪౫౦ ప్రాంతముగ నిర్ణయించిరి.

ఈ విధముగఁ బయి నలువురును బోతన కాలమును నిర్ణయించుటకై భిన్న మార్గముల నవలంబించి క్రీస్తు శకము పదునేనవ శతాబ్దమునఁ బోతన జనన కాలమును వేర్వేరుగ నిర్ణయించినను,మొత్తముపై నందరి నిర్ణయమును బదునేనవ శతాబ్దమే యైనది. ఇంచుమించుగాఁ జూచినచో నీ నిర్ణయము సరియైనదే.

ఇఁక పై వారి చర్చలనుఁ బరిశీలించి పయియాధారములతోనే పోతన కాలమును నిర్ణయింపఁ బ్రయత్నింతము.

పోతనామాత్యుని కాలనిర్ణయ సందర్భమున శ్రీ వీరేశ లింగముగారి పరిగణనమును ప్రస్తావించి ఖండించిన వారాంధ్రకవి తరంగిణీ కారులొక్కరే. వారు శ్రీ పంతుల గారి న్నియములో రెండు పొరపాట్లను సూచించిరి. ౧. పోతనకును బేరన మంత్రికిని నడుమ నాఱు తరములై యుండఁగా నేడు తరములనుట. ౨. తరమునకు 30 లేక 33 సంవత్సరములు లెక్కింపవలసియుండఁగా ౪౦ సంవత్సరముల చొప్పున లెక్కించుట, కాని సూక్ష్మముగా బరిశీలించినచో నివి పొరపాట్లు కావని తెలియఁ గలదు.

పోడూరి పెదరామామాత్యుఁడు దాక్షాయణీ పరిణయ ప్రతి వ్రాసి యిచ్చిన నాఁటికిఁ బేరయమంత్రి షోడశ మహాదానములను, సప్త సంతానములును జేసి యున్నాఁడని కవితరంగిణి కారులే చెప్పియున్నారు. అందుచే క్రీ.శ.౧౭౫౬ నాఁటికిఁ బేరమంత్రి వయోవృద్ధుఁడై యుండును, గాన శ్రీ పంతులు గారాకాలము నాతని చివరి కాలముగా గ్రహించినారు. అందుచేతనే పంతులుగారేడు తరములు లెక్కించి పోతన యంత్యకాలము క్రీ.శ. ౧౪౭౬ అని నిర్ణయించి యున్నారు. వారి ప్రకార మాతఁడు డెబ్బది సంవత్సరములు బ్రదికి యున్నాఁడను కొన్నచోఁ బోతన జనన కాలము క్రీ.శ. ౧౪౦౬ అగును.

పేరయమంత్రి జననకాలము కవితరంగిణి కారులు చెప్పినట్లు క్రీ.శ.౧౭౦౦ గనే యంగీకరించిన యెడల పేర మంత్రికిని బోతనకును నడుమనున్న తరములాఱగుచున్నవి. పంతులుగారి ప్రకారము తరమునకు ౪౦ సంవత్సరముల చొప్పున ౨౪౦ సంవత్సరములు క్రీ.శ. ౧౭౦౦ లలో నుండి తీసి వేసినచోఁ బోతన చివరికాలము క్రీ.శ.౧౪౬౦ అగుచున్నది. పదునాఱు సంవత్సరములు వ్యత్యాసము కల్గుటకుఁ గారణము ౧౪౭౬ - ౧౪౬౦

పేరయమంత్రి తరమునకుఁ గూడ వంతులుగారు నలువది సంత్సరములు వేయుటయే.

కవితరంగిణి కారులన్న దొక వేళ శతాబ్దికి మూఁడు తరములు చొప్పున లెక్కింపవలెనన్న చోనీ సందర్భమున నొక నిశ్చితమైన పద్ధతి యేదియు లేదు. రాజవంశ పరిగణనమున సాధారణముగాఁ దరమునకు ౨౫ సంవత్సరముల చొప్పున కట్టుదురు. దానిని వారి జీవిత కాలముగా కాక ప్రభుత్వము నెఱపిన కాలముగాఁ బరిగణింతురు. పాలకులు కానివారి విషయమున నెటువంటి నిశ్చిత పద్ధతియును లేదు. సాధారణముగా తరమునకు ౩౦, ౩౫, ౪౦ సంవత్సరములు కూడ వేయుదురు. అందు ౪౦ సంవత్సరముల చొప్పున గ్రహించుట తప్పు కాదు; కాని తరమునకుఁ జూచినచో సగటున హెచ్చు సంవత్సరము లిచ్చినట్లగును. అందువలన ముప్పదికి నలువదికి మధ్య ముప్పయైదు సంవత్సరములు గ్రహించుట సముచితమైన పద్ధతి. ఈ పద్ధతి ప్రకారము చూచినచో క్రీ.శ. ౧౭౦౦ లలో నాఱు తరములకు మొత్తము మీ ౨౧౦ సంవత్సరములు తీసివేసినచో క్రీ.శ. ౧౪౯౦ ప్రాంతము పోతన చివరికాలమగును. అతఁడు డెబ్బది యైగు సంవత్సములు జీవించెనన్నచో నతని జనన కాలము క్రీ.శ. ౧౪౧౫ అగుచున్నది. ఏ విధముగఁ జూచినను బోతన సమకాలీకుఁడైన సర్వజ్ఞసింగ భూపతి మొదటి సర్వజ్ఞసింగ భూపతిగాక రెండవ వాఁడే యగుచున్నాఁడు.

శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి కాలము నాఁటికి రేచర్ల గోత్రులైన రాచకొండ, దేవరకొండ ప్రభువుల శాసనములు వేంకటగిరివారి చరిత్రములోఁ బ్రకటితమైనవి, ఇదివరలో నుడివినట్లు ప్రామాణిక పద్ధతిని బరిష్కృతములైనవి కావు. రేచర్లవారి చరిత్ర, వెలుగోటివారి చరిత్ర, వెలుగోటివారి వంశావళి ప్రకటితమైన పిదపనే కొంతవఱకు విశదమగుచున్నది. ఇటీవల వారి క్రొత్త శాసనములు కూడ కొన్ని లభ్యమైనవి.

లక్ష్మణరావుగారు క్రీ.శ. ౧౪౨౭ నాఁటి మాదానాయఁడు మొదటి సింగమనేని కుమారుఁడును నవహోతానాయని సోదరుఁడను నయిన మాదానాయఁడని వ్రాసిరి కాని యది సరి కాదు. అతఁడు రసార్ణవ సుధాకర కారుఁడైన మొదటి సర్వజ్ఞసింగమనేడు క్రీ.శ. ౧౪౨౭నకుఁ బూర్వము క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతమునందుండవలెను. ఈతని శాసనము సింహాచలములో క్రీ.శ. ౧౩౮౭ నాటిది కలదు. అందువలన నేడవతరపు సింగ భూపతి క్రీ.శ. ౧౪౦౦ వఱకు నుండెనన్నను, బోతనకు సమకాలికుఁడును సమతరము వాఁడును నగు సింగమనేడు రసార్ణవ సుధాకర కర్తమాత్రము కాఁడు. లక్ష్మణరావుగారు దండకమును బట్టి చెప్పిన నాలుగు లక్షణములును రసార్ణవ సుధాకరకర్తకు సరిపడవు. తల్లి పేరెట్టును

సరిపడదు. దండకమును బట్టి సింగము తల్లి పోచమాంబ, సింగభూపాలీయమును బట్టి యన్నమాంబ. ఈతనిని సేవించిన వసంతావనీ నాథుఁడు లక్ష్మణరావుగారనుకొన్నట్లు కుమారగిరి రెడ్డికాఁడు. కుమారగిరి రెడ్డికిఁ గర్పూరవసంతరాయఁడనియు వసంత భూపాలుఁడనియు బిరుదములున్న మాట యథార్థమే. అయినను నాతఁడు రేచర్లవారికి గప్పము కట్టుచుండిన సామంతుడై నట్లాధారములు లేవు. అదియుఁగాక కొండవీటి రెడ్డిరాజులకును, రాచకొండ వెలమలకును బద్ధవైరము. అందువలన నాలక్షణమీ సింగభూపాలునకుఁ బట్టదు. ఇఁక మిగిలిన లక్షణములలో సరిపోవునవి తండ్రితాతల నామములే. యేడవ తరము సింగభూపాలునకెంత వర్తించునో పదవతరము వానికిని నంతవర్తించును. ఈ చర్చ వలన బోతన దర్శించినది రసార్ణవసుధాకర కర్తయైన సింగభూపాలుండు కాదని మాత్రము తేలుచున్నది.

ఇఁక పోతన దండకమునందుఁ జెప్పిన సర్వజ్ఞసింగము పదవ తరము సింగభూపాలుఁడై నను కావచ్చునని లక్ష్మణరావుగారు చెప్పిరి. ఈ సింగ భూపాలుఁడు పదవతరము వాఁడు కాక తొమ్మిదవతరము వాఁడే కావచ్చునని వీరే సందేహించిరి. అదియే న్యాయమైన పద్ధతి. ఈ విషయము ముందు వివరింపఁబడును.

ఇఁక ప్రభాకర శాస్త్రిగారి నిర్ణయముననుసరించి శ్రీనాథ పోతనలు రెండవ సర్వజ్ఞ సింగ భూపాలుని నాఁటివారు. వంశ చరిత్రకారులొక తరమధికముగఁ గల్పించి తప్పుగా నిచ్చిరని వారు చెప్పిన విషయము రేచర్ల వంశజుల శాసనముల వలననే ఋజువగుచున్నది. కుమారాన్నపోతా నాయని వఱకుఁ గల రేచర్లవారి వంశ వృక్షమునకు రసార్ణవ సుధాకరమే ప్రమాణము. ఇఁక రెండవ సర్వజ్ఞసింగము యేడవ తరము రసార్ణవ సుధాకర కర్త సింగ భూపాలుని తనూభవుఁడగు ననపోతా (కుమారాన్నపోతా) నాయకునికిఁ తరువాతి తొమ్మిదవ తరమువాఁడో, వంశ చరిత్రకారులొకతరము నధికముగాఁ జేర్చి తప్పుగా నిచ్చినారో (లేదో) తేల్చవలసియున్నది. ప్రభాకర శాస్త్రిగారు 'వీరాగ్రగణ్యుఁడు' అను పద్యమునందుఁజెప్పిన పితృపితామహాదిక్రమము సరిగాలేదని చెప్పి రెండవ సర్వజ్ఞసింగము తొమ్మిదవతరము వాఁడే. "అతఁడు కుమారానపోతానేని పిన అన్నమనాయకుని తనయుఁడే రసార్ణవ సుధాకర కర్త పౌత్రుఁడే" యని నిర్ధారించి యున్నారు. వారి యీ నిర్ణయమెంతవఱకు సమర్థనీయమో చూతము.

ఇటీవల రేచర్ల వంశజుఁడైన రావుధర్మానాయని శాస క్రీ.శ.౧౪౬౪ శా.శ. ౧౩౮౬

నాఁటిది శాయంపేటలో దొరకినది.[౧] ఇందు ధర్మానాయకుఁడు తన పూర్వులను మూఁడు తరముల వఱకుఁ బేర్కొనినాఁడు. ఇతఁడు పిన యన్నమనాయక సింగమాంబలకుమారుఁడు. ఇతని తాత పెద సింగము నాయకుడు. ముత్తాత పెదయన్నమనాయక సింగమాంబల కుమారుఁడు. క్రీ.శ. ౧౪౩౭ నాఁటి వసంతరాయని కంచి శాసనమును శ్రీ శేషయ్య గారిదివఱకే యుదాహరించినారు. ఈ శాసనము ప్రకారము వసంతరాయఁడనవోతానాయని కుమారుఁడు. సింగభూపాలుని సోదరుఁడు. ఈ వసంత రాయనికి భోగినీ దండకములోని లక్షణములు సరి పడియుండుటచేత నుభయులు నొక్కరే యగుటలో సందియము లేదు. అట్లయిన, శాసనమునందుఁ జెప్పిన యీతని తండ్రి పిన యన్నమ నాయకుఁడు గుమారాన్నవోతానేడే యగును. అందువలన నీవసంత భూపాలుఁడును ధర్మా నాయకుఁడు సవతి సోదరులు. క్రీ.శ.౧౪౨౯ శా.శ.౧౩౫౧ నాఁటి నాగాంబిక శాసనము రేచర్ల వంశ వృక్షము నామెభర్తయైన మాధవాయని వఱకు నిచ్చుచున్నది. దీనిని బట్టి చూడఁగా రెండవ సింగము నాయకుఁడే రసార్ణవ సుధాకర కర్త యగుచున్నాఁడు.

రసార్ణవ సుధాకరము వలనను, శాసనముల వలనను దెలియవచ్చుచున్న రేచర్ల వంశజుల వంశావతార క్రమమునీదిగువఁజూపఁబబడినది.[౧]

పైనఁ జూపిన వానిని బరిశీలించినచో ధర్మానాయకుని ప్రపితామహుఁడైన పెదయనవోతానాయకుఁడును దాచ(ఎఱదాచ) భూపతి పౌత్రుఁడైన యనవోతానాయకుఁడు నొక్కరే యనియు ధర్మా నాయకుని పితామహుడైన పెద సింగము నాయఁకుడును,

---

౧ రసార్ణవ సుధాకరము | | శాసనములు | | 
--- | --- | --- | --- | ---

| తరము | రసార్ణవసుధాకరము ప్రకారము | నాగాంబిక శాసనము | శాయంపేట శాసనము | కంచిశాసనము |
|---|---|---|---|---|
| ౪ | ధాచభూపతి | ౪ ఎఱదాచన | | |
| ౫ | సింగమనాయకుఁడు | ౫ సింగమనా | | |
| ౬ | అనవోత భూపతి | ౬ అనవోతనా | ౬ పెదఅనవోత | |
| ౭ | సింగభూపాలుఁడు రసార్ణవ సుధాకరకర్త | ౭ సింగభూ | ౭ పెదసింగము | |
| ౮ | అనవోతదాచ వల్లభ వేదగిరి మాధవ | ౮ మాధవ (నాగింబిక) (క్రీ.శ. 1429) | ౮ పినఅన్నమ (సింగమాంబ) ధర్మనాయక క్రీ.శ. 1464 | ౮ అనవోత |

౧. చూడు పుట 28

రసార్ణవ సుధాకర కర్తయైన సింగభూపాలుఁడును, నొక్కఁడేయనియు, ధర్మానాయకుని తండ్రియైన పిన యన్నమనాయకుఁడును, కంచి శాసనమునందలి సింగభూపాల వసంతరాయల తండ్రియైన యనవోతానాయకుఁడను, నొక్కఁరేయనియునాగాంబిక భర్తయైన మాధవ భూపాలుఁడు రసార్ణవ సుధాకరకారుఁడైన సింగభూపాలుని తనయులలో నొకఁడైన మాధవ(మాదా)నాయకుఁడే యనియు విస్పష్టము కాఁగలదు. పిన యన్నమకుమారాన్నవోతా నాయకుని కుమారులే సింగమనాయక, వసంత భూపాల, ధర్మానాయకులు. వీరిలో సింగమనాయక వసంత భూపతులు బోగినీ దండకప్రకారము పోచమాంబ తనయులు. ధర్మానాయకుని శాసనము ననుసరించి యాతని తల్లి సింగమాంబ. ఇందువలనఁ గుమారాన్నవోతానాయనకిరువురు కుమారులుండిరనియు, సింగమ వసంత నాయకులును, ధర్మానాయఁడును సవతి సోదరులనియు నెంచవలసియున్నది. వీరిలో వసంత భూపాలుని సోదరుఁడు సింగమనేడే రెండవ సర్వజ్ఞ భూవరుఁడు. ఇతఁడు తొమ్మిదవతరము వాఁడేకాని వంశచరిత్రప్రకారము చెప్పినట్లు పదవతరమువాఁడు కాడని పై విషయములను అనుసరించి నిర్ధారితమగుచుండుటచేత వంశ చరిత్రకారులొక తరమెకముగాఁ గల్పించి తప్పుగ నిచ్చిరను విషయము ధ్రువపడుచున్నది.

ఇఁక శాస్త్రిగారి ప్రకారము చూడవలసిన మొదటి యంశము. శ్రీనాధపోతనలు దర్శించినది తొమ్మిదవతరము వాఁడైన సర్వజ్ఞసింగ భూపాలుఁడనుట.

వారి వాదమునందలి రెండవ యంశమేడవ తరములోని రసార్ణవ సుధాకరములో కాని చమత్కార చంద్రికలోఁగాని యాతనికి సర్వజ్ఞ బిరుదమున్నట్లు కానరాక పోవుటయే కారణమనిరి. కాని చమత్కార మంజరి రచించిన విశ్వేశ్వరకవియు సమరకోశ్యాఖ్య రచించిన యప్పయార్యుఁడును సింగమనేని యాస్థానము నందుండి వారి కృతులలోఁ దమ పోషకుని సర్వజ్ఞత్వమును బ్రస్తుతించియే యున్నారు. ఈ విషయమును శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారీ దిగువ నుదాహృతములైన శ్లోకములననుసరించి యిట్లు వివరించిరి.[౧]

" విద్యాదైవత తాతతావకగురో సర్వజ్ఞ చూడామణే
స్తోతవ్యోఽసి మనీషిణాత్వమధునా మద్యోజవాకైరలం
ఇత్థం సింగమహీపతిమ్ గురుజనో ప్యాభాషతేదో - వాన్
తత్త్వత్పద్ధతి ధర్మమర్మణి పరిచ్ఛేదావి సంవాదికమ్." విశ్వేశ్వర కవి

౧. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటము ౩౦ సంచిక ౧ వృష సం.రము చైత్రవైశాఖ మాసములు చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు

ఇందుఁజెప్పబడిన 'సర్వజ్ఞ చూడామణే' యను సంబోధనము ప్రథమా విభక్త్యంతమై యతని సర్వజ్ఞత్వమును ధృవపఱచు చున్నది.

శ్లో. "జైవాతృకంబుధగురుం నిలయం కలానాం
సర్వజ్ఞమూర్ధమణి మాశ్రితశుద్ధ పక్షమ్
శ్రీ బొమ్మకంట్యుప పదాంకి తమ ప్పయార్యమ్
సర్వేష్టితోషితసుతం ద్విజరాజమాహుః"

అప్పయార్యుఁడు

ఇట్లే పై యప్పయార్యుని యమర పద పారిజాత శ్లోకమునందు 'జైవాతృకం', 'బుధగురుం, మొదలగు విశేషణములన్నింటి వలెనే 'సర్వజ్ఞమూర్ధమణిః' యనునది కూడ శ్లేషార్థమున వాడఁబడినదనియు, నప్పయార్యుని పక్షమున 'సర్వజ్ఞమూర్ధమణిః యస్యతం' యను వ్యుత్పత్తిచే సర్వజ్ఞబిరుదాంచితుఁడైన సింగభూపతి ప్రామాణిక శిరోమణిఁగాగలవాడు. అను నర్థము సిద్ధించు చున్నదనియు శ్రీ పాపయ్య శాస్త్రిగారు వ్రాసిరి. అప్పయార్యవిరచితమైన శ్లోకమునందు శ్లేషకే ప్రాధాన్యమిచ్చి దానిని త్రోసి వేసినను విశ్వేశ్వర కవికృతమైన మొదటి శ్లోకమునందలి 'సర్వజ్ఞ చూడామణే' యను సంబోధనమును బట్టి యీ సింగభూపతికి సర్వజ్ఞ బిరుదమున్నట్లు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

౪. కవితరంగిణికారులు : శ్రీ చాగంటి శేషయ్యగారి వాద పరిశీలనము :

రసార్ణవ సుధాకరకర్త సింగము నాయకునికి మనుమఁడైన రెండవ సర్వజ్ఞ సింగమనేని జననకాలము క్రీ.శ. ౧౪౦౪ ప్రాంతమనియు, (సంపుటి ౪ ౬ పుట ౧౨౨) పోతన జనన కాలము క్రీ.శ. ౧౪౪౦ అనియుఁ గవితరంగిణికారుల యభిప్రాయమైనట్లిదివఱకే తెలుపఁబడినది. ఇందువలనఁబోతన మొదటి సర్వజ్ఞ సింగము కాలములో నుండెనుట కవకాశమే లేదనియు, నిఁక రెండవ సర్వజ్ఞ సింగము, కవిపండిత పోషకుఁడై పేరెన్నికఁ గన్ననాటికి అనగా క్రీ.శ. ౧౪౪౦ నాటికి పోతన పిన్నవాఁడనియు, వయోవృద్ధుఁడగు సింగభూపాలుఁడు తనకుఁ గల వేశ్యాలౌల్యమునుఁ బిన్నవాఁడైన పోతనచేఁ జెప్పించుకొనెననుట యసంగతమనియుఁ జెప్పి, (వాల్యుము ౪ ౬ పుట ౧౮౪) భోగినీ దండక కర్త పోతన కాఁడనియు, నిర్ణయించిరి. కాని యాదండకములోఁ బ్రసక్తుఁడైన సర్వజ్ఞ సింగ భూపతి మాత్రమీ రెండవ యాతఁడేయని యంగీకరించి యున్నాడు. (వాల్యుమ్ '౬ - పుట.౧౮౪)

ఇ(క పోతన రెండవ సర్వజ్ఞ సింగబూపాలుని వేశ్యను గూర్చి భోగినీ దండకమును రచించుట కవకాశమున్నదో, (లేదో) పరిశీలింతము. గురిజాల పేరమంత్రి దాక్షాయణీ పరిణయ కృతికిఁ బ్రతివ్రాయించు కొనిన నాఁటికి ౪౬ సంవత్సరముల వయసువాఁడై యుండునని కవితరంగిణి కారులే చెప్పి పేరమంత్రి జననము క్రీ.శ. ౧౭౦౦ గా నిర్ణయించిరి. (వాల్యుమ్ ౬ – పుట. ౧౭౩) ఇది పేరమంత్రి తండ్రియైన పార్వతీశ్వరుని కడపటి కాలము. పేరమంత్రికినిఁ బోతనామాత్యునకును నడుమనున్న తరము లాఱు. వీరు చెప్పినట్లే శతాబ్దికి మూఁడు తరముల చొప్పున లెక్కించుకొన్ననుఁ బోతన చివరి కాలము క్రీ.శ. ౧౪౦౦ అగుచున్నది. అయినను వీరు క్రీ.శ. ౧౪౫౦ యని నిర్ణయించి యున్నారు. అజ్జరపు పేరలింగకవి పోతన మనుమఁడైన ప్రౌఢ సరస్వతి కూఁతురగు నెల్లమనుఁ బరిణయమాడెననియు, నతని తండ్రియైన కొండమంత్రియో లేక యాతని తాతకుఁ దాతయైన కొండుభట్లో యెవరో యొకరొకగజపతి చేత నజ్జరమను గ్రామము నగ్రహారముగాఁ బడసెననియు నొడయనంబి విలాసమునందుఁ జెప్పఁబడియున్నది.౧ ఈ విషయములను బురస్కరించుకొని యాగజ పతి కాలము ననుసరించి తమ వాదమును బలపఱుప యత్నించిరి.

గజపతులలో మొదటివాఁడైన కపిలేశ్వరుఁడు క్రీ.శ. ౧౪౫౦ తరువాత గాని గోదావరీ ప్రాంతమును జయించి యుండలేదు. ఈ కపిలేశ్వరుని కాలములోనే క్రీ.శ. ౧౪౫౦ ప్రాంతమున గొండుభట్లు తనయేఁబదవ యేట నగ్రహారమును బడసెనని తరంగిణి కారుల యభిప్రాయము. (వాల్యూమ్ ౬ – పుట ౧౭౪) అప్పటికతని మనుమఁడైన హరిమంత్రి పుట్టియుండఁడనియుఁ బుట్టినను నొకటి రెండు సంవత్సరములకంటె నాతని కెక్కువ వయసుండదనియు, నతఁడును హరిమంత్రికి బోతనకు సమకాలికులగుట చేతఁ బోతనామాత్యుని జననకాలము కూడ క్రీ.శ.౧౪౫౦ప్రాంతము కావలెననియు వారి యూహ. ఈవిధముగాఁ దరంగిణి కారులు సందిగ్ధములైన యాధారములను బురస్కరించుకొని

---

౧. బమ్మెర వంశమందునను ప్రౌఢ సరస్వతి పద్దుఁగాంచి దా
నెమ్మిఁదలిర్ప కేసనుకవీశ్వరులప్పుడు నాదు సాధ్వియం
దిమ్మహి కూర్మి గన్నసుత యెల్లమయందున పేరయాఖ్యుఁడన్
సమ్మతిఁగంటి వీరనరసమ్మను గంగను మంత్రి యుగ్మమున్"

(ఒడయనంది విలాసము) పీఠిక

పై పద్యమును సవరించి యాంధ్రకవిచరిత్రకారులు – ఈ దిగువ రీతిని వ్రాసినట్లు శ్రీ చాగంటి శేషయ్యగారు చెప్పిరి.

ఉ. బమ్మెరవంశమందునను ప్రౌఢ సరస్వతి పద్దుఁ గాంచి తా

మొత్తము మీదనేదో యొక విధముగాఁ బోతన జననకాలము క్రీ.శ. ౧౪౫౦ యని చెప్పినప్పటికిని నది కేవల మహోహమే యనక తప్పదు. ఒడయనంబి విలాసమున నజ్జరమును అగ్రహారముగా సంపాదించిన కొండుభట్లు దానిని ఏ గజపతి యొద్దనుండి సంపాదించెనో తెలియదు. ఆ గ్రంథకర్తయైన పేరయలింగ కవి భార్యయైన యెల్లమ్మ బమ్మెరవారి యాఁడుఁబడుచు. ఈ విషయమును గూర్చి తెలుపు పద్యము దోష భూయిష్ఠముగ నుండుటచే దానినాధారముగాఁ జేసికొని కేసన మల్లన కవుల తండ్రియైన ప్రౌఢ సరస్వతి కేసన యను పేరుండెనని కాని, యతని కుమారుఁడైన కేసనకుఁ గూడ "ప్రౌఢ సరస్వతి" యను బిరదమున్నదని కాని, సుస్పష్టముగ నిర్ణయించలేము. అందుచేత నొడయనంబి విలాసము పోతన కాలమును స్థూలముగ నిర్ణయించుటకైనను నుపకరింపదు.

పోతన కాలనిర్ణయమునకు రెండే ముఖ్యాధారములు గలవు. ౧. దాక్షాయణీ పరిణయ కృతికిఁ బ్రతి వ్రాసిన కాలము. ౨. భోగినీ దండకము. ఈ రెండింటిని వదలినచో అనఁగా భోగినీ దండకము పోతన కృతము కాదనినచో నాతని కాలమును సూటిగా నిర్ణయించుటకుఁదగిన యితరాధారము లెవ్వియును లేవు. అప్పుడు పోతన కృష్ణదేవరాయల నాఁటి కవులకుఁ బూర్వుఁడని మాత్రమే చెప్పఁగలము. భోగినీ దండకము పోతన కృతమేయని విశ్వసించినచో[౧] నాతని కాలమును నిర్ణయించుటకిన్ని డొంక తిరుగుడు పద్ధతుల నవలంబించ వలసిన యవసరము లేదు. మున్ముందు భోగినీ దండకము పోతన కృతమే యని నిర్ధారితమగుచున్నది. కనుక, ప్రకృతము పోతన కుమారాన్నపోతానాయకుని కుమారుఁడును వసంతావనీ నాథుని సోదరుఁడును నగు తొమ్మిదవతరము సర్వజ్ఞసింగ భూపాలుని సమకాలికుఁడనుటకు సందియపడ నవసరము లేదు. వసంతావనీ నాథుని సోదరుఁడును నగు తొమ్మిదవతరము సర్వజ్ఞసింగ భూపాలుని సమకాలికుఁడనుటకు సందియపడ నవసరము లేదు. వసంత భూపాలుఁడు క్రీ.శ. ౧౪౩౭ లోను నతని సోదరుఁడు ధర్మానాయకుఁడు క్రీ.శ. ౧౪౬౪లోను నుండుట చేత రెండవ సర్వజ్ఞ సింగ భూపతికూడ నా ప్రాంతమునందే యుండి యుండవలెను. బహమనీ సుల్తానైన యహమ్మదు షా

నెమ్మదలిర్పఁ గేసనసుకవీశ్వరులప్పమనామ సాధ్వియం
దిమ్మహిఁ గూర్మిఁ గన్నసుత యెల్లమయందును బేరయాఖ్యుడన్
సమ్మతిఁ గంటి వీరనరసమ్మను గంగన మంత్రియుగ్మమున్."
(ఆంధ్రకవితరంగిణి వాల్యూమ్ ౨ పుటలు ౧౦౩/౧౦౩)

౧, పై ప్రకరణములలో భోగినీ దండకము పోతన కృతమే యని దండకాంత విషయములను బట్టి నిరూపింపఁబడును.

తెలంగాణాపై క్రీ.శ. ౧౪౩౩లో దండెత్తి వచ్చి దానిని జయించెనని మహమ్మదీయ చరిత్రకారులు చెప్పుచున్నారు.[౧] అంతటితో రేచర్ల వెలమ రాజ్యము పరరాజాక్రాంతమైనది. అటు పిదప క్రీ.శ. ౧౪౩౫ లో నా సుల్తాను తన యిరువురు కుమారులలో నొకఁడైన దావూద్ ఖానునకు రాజాచలమును, దాని కణకువయైన ప్రదేశమును నిచ్చివేసినట్లు కూడ నా మహమ్మదీయ చరిత్రము వలననే తెలయుచున్నది.[౧] రాజాచలమనఁగా రేచర్ల సింగమనాయని రాజధానియైన రాచకొండయే. అహమ్మదుషాకు సమకాలికుఁడైన సింగభూపాలుఁడు రెండవ సర్వజ్ఞ సింగభూపాలుఁడే. మహమ్మదీయ చరిత్రము ననుసరించి ఈతఁడు క్రీ.శ. ౧౪౩౫ లో రాజ్యపదచ్యుతుఁడయ్యెననుట నిశ్చయము.

రాజాచలాధిపతి కుమారాన్నపోతానాయకుని కుమారుఁడు ధర్మానాయకుఁడును, దేవరకొండ రాజ్యాధిపతి మాదయ లింగ భూపాలుఁడును[౨] ప్రాయికముగ బహమనీ సుల్తానుచే నోటువడి కాందిశీకులైనను కపిలేంద్ర గజపతి సాయము నర్థించి మరల తమ రాజ్యమును బడయుటకుఁ బ్రయత్నించుచు వచ్చిరి. రెండవ సర్వజ్ఞ భూపాలుఁడును నాతని సోదరుఁడు వసంతరాయలును తరువాత తెలంగాణము విడచి వెడలిపోయినట్లూహింప నవకాశము గలదు.

ఈ రాచకొండ వెలమ వీరులలోఁ గొందఱు తమ రాజ్యము మహమ్మదీయుల వశమైన పిమ్మట తెలంగాణమును విడచి కృష్ణాతుంగభద్రా నదులను దాటి కర్నూలు మండలమునందలి వెలుగోడను గ్రామము స్థిరనివాసముగాఁ జేసికొనినట్లు తెలియుచున్నది. ఈ కారణముననే వీరికి వెలుగోటివారని పేరు కలిగినది.

సర్వజ్ఞసింగభూపాలుని సోదరుఁడైన వసంత భూపాలుని శాసనము క్రీ.శ. ౧౪౩౭ నాఁటిది కంచిలోఁ గాన వచ్చుచున్నది. ఈ కంచి చెంగల్పట్టు జిల్లాలోనిది. ఈ జిల్లాలోనిదే యగు 'ఇరుగుంద్రప్పల్లి' యను గ్రామమున వెలుగోటి సింగము నాయకరయ్య శాసన మొకటి దుర్మతి సంవత్సరము నాఁటిది కలదు.[౧] ఇందు శాలివాహన శకమీయఁబడలేదు. ఈ వెలుగోటి సింగము నాయకరయ్య వసంతావనీ నాథుని సోదరుఁడైన సర్వజ్ఞ సింగ భూపతియే యగుచో శాసనము నందలి దుర్మతి సంవత్సరమునకు సరియైన శాలివాహనశకము ౧౩౬౩

---

౧. వెలుగోటి వారి వంశావళి ౩౮, ౩౯

౨. వెలుగోటి వారి వంశావళి ౪౧, ౪౨

అనఁగా క్రీ.శ. ౧౪౪౧ అగును. ఈ "ఇరుగుద్రప్పల్లి" శాసనములోని వెలుగోటి సింగమ నాయకరయ్య రెండవ సర్వజ్ఞ సింగభూపతియే యైనచో నప్పటికే వీరు వెలుగోడు గ్రామమును తమ నివాసము చేసికొని యుండవలెను. ఒకవేళ "ఇరుగుద్రప్పల్లి" శాసన మీ రెండవ సర్వజ్ఞసింగ భూపతి దైనను కాకపోయినను నాతఁడు తన రాజ్యమును గోల్పోక పూర్వమే క్రీ.శ. ౧౪౩౫ ప్రాంతమున జరిగియుండవలెను. ఈ దండకమును జెప్పిన నాటికిఁ బోతన సుమారిరువది యేండ్ల వాఁడనుకొన్నచో నతని జనన కాలమించు మించుగా క్రీ.శ. ౧౪౪౫ ప్రాంతమగును. ఈతఁడు డెబ్బది యైదు సంవత్సరములు జీవించి యుండెనను కొనినచో నీతని యంత్యకాలము క్రీ.వ. ౧౪౯౦ అగును. అట్లయినచో నీతని ప్రపౌత్రులును దాక్షాయణీ పరిణయ కర్తలును నయిన కేసన మల్లన కవుల జనన కాలము క్రీ. శ. ౧౫౫౫ ప్రాంతమగుచున్నది. దాక్షాయణీ పరిణయ రచనావసరమునకు వారు నలువది సంవత్సరముల ప్రాయము వారనుకొన్ననుఁ దద్రచనా కాలము క్రీ.శ. ౧౫౯౫ ప్రాంతమగును. ఇదియే తత్కృతిపతియైన చిన మల్లన సోమయాజి కాలము.

ఇఁక దాక్షాయణీ పరిణయమునకుఁ బ్రతిద్రాయించుకొనునాటికిఁ బేర మంత్రి ౫౬ సంవత్సరముల వయసువాఁడను కొన్నచో నాతనికిని మల్లన సోమయాజికిని నడుమ మూఁడు తరములుండుటచే, నిదివఱకు వలెఁ దరమునకు ముప్పది యైదు సంవత్సరముల చొప్పున లెక్కించినచో మల్లన సోమయాజి చివరి కాలము క్రీ.శ. ౧౫౯౫ అగును.

తరంగిణి కారులు చెప్పిన చొప్పున శతాబ్దికి మూఁడు తరముల వంతున లెక్కించి చూచినను (౧౭౦౦-౧౦౦) చినమల్లన సోమయాజి కాలము క్రీ.శ. ౧౬౦౦లే యగుచున్నది. అందువలన యెట్లుచూచినను, బోతనామాత్యుఁడు క్రీ.శ. ౧౪౧౫, ౧౪౯౦ ప్రాంతము వాఁడగును. అంతియే కాదు పోతన సర్వజ్ఞ సింగ భూపాలుని గూర్చి దండకము చెప్పి యుండెననుటకుఁ గూడ సమంజసమగు నవకాశమున్నది. శ్రీనాథునకీతఁడు సమకాలికుఁడే యైనను నతని కంటె వయసునఁ జిన్నవాఁడు. కృష్ణరాయల యాస్థానమందలి కవులీతనిని స్తుతింపకుండుటకుఁ గారణము కూడ నీతఁడప్పటి కాధునికుఁడగుటయే యగును.

# 3. పోతనామాత్యుని నివాస స్థలము

పోతనామాత్యుని యింటి పేరైన బమ్మెర గ్రామము, అతఁడు భాగవతము రచించినట్లు చెప్పిన యేక శిలానగరము, ఈ రెండింటిని గూర్చి కొంతకాలము క్రిందట విమర్శక ప్రపంచమున గొప్పగాలి దుమారము రేఁగినది. ౨౦వ శతాబ్దము పూర్వభాగమున రేఁగిన ముఖ్యములగు సాహిత్య చర్చా వివాదములలో నిది యొకటి. ప్రసిద్ధులైన దిగ్దంతులవంటి పండితులును సాహిత్యాభిమానులును ఈ వివాదములోఁ బాల్గొనిరి. క్రమ క్రమముగానే తత్ స్థల చర్చలలోఁ బ్రథానమగు సత్యము మీఁద దృష్టి కొంత మందగించి, యావేశములు పట్టుదలలు పెఱిగి, వాది ప్రతివాదుల పరస్పరస్థలాభిమానములకు దారితీసినది. పోతన భాగవత రచనారంభమున నిట్లు చెప్పియున్నాఁడు. "శ్రీమన్నారాయణ కథా ప్రపంచనకు - తూహలుండనై యొక్కరాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకంగని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్రసముత్తుంగ భంగయగు గంగకుఁజని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ గించి దున్మీలితలోచనుండనై యున్న యెడ. (భా. ౧ - ౧౫)

సీ. మెఱుఁగు చెంగటనున్న మేఘంబుకైవడి
  నువిద చెంగట నుండ నొప్పువాఁడు

\- - - - - - - - - - - - - - - - - -

  కన్నుఁగవకు నెదురఁ గానఁ బడియె ॥ (౧ - ౧౬)

చంద్రమండల సుధాసారంబు పోలికి
  ముఖమున చిఱునవ్వు మొలచు వాఁడు
వల్లీయుతతమాల వసుమతీజము భంగి
  బలువిల్లు మూఁపునఁబరఁగువాఁడు
నీలనగాగ్ర సన్నిహిత భానుని భంగి
  ఘన కిరీటము దలఁగలుగువాఁడు

ఆ. పుండరీక యుగముఁ బోలు కన్నుల వాఁడు
వెడఁదయురము వాఁడు విపుల భద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁడొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదరుఁగానఁబడియె." (౧ - ౧౬)

అట్లు రామభద్రుఁడు కానఁబడి, తన్నామాంకితముగా శ్రీమహా భాగవతమును దెనుఁగు సేయుమని యానతిచ్చి తిరోహితుండైనట్లును, "పరికరుణా విశేషంబునఁ గృతార్థత్వము సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మఱలి కొన్ని దినంబులకు నేక శిలానగరంబునకుఁ జనుదెంచి" యందు గురువృద్ధ బంధు జనానుజ్ఞాతుఁడై తాను భాగవతమును రచించినట్లును, జెప్పికొనినాఁడు. ఆయన తన వంశము నభివర్ణించుచుఁ దన యన్నతిప్పనయుఁ దానును, గేసనలక్కసానులకు జన్మించినట్లు చెప్పుకొనిన సందర్భమునఁ దన యింటిపేరు 'బమ్మెర' యని సుస్పష్టముగ జెప్పుకొనినాడు.[౧]

'బమ్మెర', 'ఏక శిలానగరము' అనునవి యెక్కడివన్న విషయమును గుఱించియే, పైనఁజెప్పిన వాద ప్రతివాదములు చర్చలు జరిగినవి. ఏకశిలానగరము క్రీ.శ. ౧౦ వ శతాబ్దము నుండి ౧౪వ శతాబ్దము వఱకుఁ దెలంగాణ సహితమైన యాంధ్ర దేశము నంతను బరిపాలించిన కాకతీయ ధరావల్లభుల రాజధాని యనునది చరిత్ర ప్రసిద్ధ విషయము. ఏక శిలానగరమునకే ఓరుగల్లనియు వాడుకలో నోరంగల్లనియుఁ బర్యాయ నామములు గలవు. దీనిని బురస్కరించుకొని చాల కాలము వఱకు బమ్మెర కూడ నేక శిలానగర ప్రాంతమునఁ దెలంగాణమునందే యుండవలయుననియుఁ బోతన సోమోపరాగంబున నేగిన గంగ గోదావరి యగుననియు, సాహిత్య విమర్శకులు సాహిత్య వేత్తలును భావించుచు వచ్చిరి. కాని రాయలసీమలో కడప జిల్లాయందు ఒంటి మిట్టయను గ్రామ మొకటి కలదు. అందువలన నీ వాద మింకొక రూపమును దాల్చినది. ఏక శిలానగరమనునది కాకతీయుల రాజధాని యగునోరుగల్లునకు సంస్కృతీకరణ రూపమా లేక, కడప జిల్లా యందలి ఒంటి మిట్టయను గ్రామమునకు సంస్కృతీకరణ రూపమా, యనునది వివాదగ్రస్త విషయము. ఈ సందర్భమునఁ బోతన నివాసస్థలమగు బమ్మెర తెలంగాణములోని బమ్మెర కాదనియు సోమోపరాగంబునఁ బోతన స్నానార్థమేగినట్లు చెప్పఁబడిన గంగ, గోదావరి కానేరదనియు వివాదమతిశయించినది. పైనఁ జెప్పిన వివాద మీకారణము వలన 'ఓరుగల్లు ఒంటిమిట్టవాద' మని ప్రఖ్యాతమైనది. ఈ చర్చకు ఫలితముగా ననేకములయిన క్రొత్త విషయములుభయ పక్షముల వారును వెల్లడించిరి. కాని స్థలాభిమాన ప్రాధాన్యము గల యీ వివాదము, భాగవత

---

౧. ఉ. మానినులీడు గారు బహుమాన నివారిత దీన మానస
గ్లానికి దాన ధర్మనుతి గౌరవ మంజులతా గభీరతా
స్థానికి ముద్దుసానికి సదాశివ పాదయుగార్చనాను కం
పానయ వాగ్వి... మా యమ్మ లక్కసానికిన్. భా. ౧-౨౬



రచనా స్థానమును ఇదమిత్థమని నిర్ణయింపఁ జాలక పోయినది. ఇప్పటికిని బోతన కవి ఒంటిమిట్టవాఁడనియు భాగవతము నచ్చటనే రచించెననియు రాయలసీమ వారిలోఁ గొందఱనుచున్నారు. ఇందుకు వ్యతిరేకముగాఁ గొందఱు భాగవత రచనము ఓరుగంటిలోనే జరిగినదనియుఁ బోతన తెలంగాణము వాఁడనియుఁ జెప్పుచున్నారు.

ఇందలి సత్యమును నిర్ణయించుటకు జన శ్రుతియు స్థల గాథలును కనిష్ఠ ప్రమాణములుగనే గైకొనవలసియున్నది. శాసనములున్నచో వానిని పరమ ప్రమాణములుగా గ్రహింపవచ్చును గాని దురదృష్టవశమునఁ బోతన గారి స్థల కాలాదులను నిర్ణయించుట కట్టి సాధన సంపత్తి యేదియు నింతవఱకు లభింపలేదు. నాకుఁ జూడఁగా నీ నిర్ణయమునకు ముఖ్యాధారములుగా గైకొనవలసినవి ఈ దిగువ విషయములు మాత్రమే.

౧. ఏక శిలానగరము

౨. బమ్మెర

౩. భాగవతమును బూరించిన యితర కవుల యిండ్ల పేర్లున్న గ్రామములు.

౪. పోతరాజునకు సమకాలికుఁడైన సర్వజ్ఞ సింగ భూపాలుఁడు.

బమ్మెరను గూర్చియు, ఏకశిలానగరమును గూర్చియు వాదోపవాదములనేకములు జరిగినవి. వాని బలాబలములను నిష్పాక్షికముగా నిర్ణయించుటయే ప్రస్తుత కర్తవ్యము.

ఏకశిలానగరము : –

తెలుఁగు దేశమును అవిచ్ఛిన్నముగ ౩౦౦ సంవత్సరములు పరిపాలించిన కాకతీయుల రాజధాని యేకశిలానగరము. వీరు మొదట పశ్చిమ చాళుక్యులకు సామంతులుగానుండిరి. అప్పుడు అనుమకొండ వీరి ప్రధాన నగరము. కాకతి రెండవ ప్రోలరాజకుమారుఁడైన రుద్ర దేవుని కాలమువఱకు ననుమకొండయే వీరి రాజధాని. చిన్న సంస్థానముగ నుండిన కాకతీయ రాజ్యమును మొట్టమొదటి మారు విస్తరింపఁ జేసినఖ్యాతి రుద్ర దేవరాజుది. ఇతని రాజ్యపాలనము కట్టకడపటి సంవత్సరములలోనే యేకశిలా నగరము కాకతీయుల ముఖ్యనగరములలో నొకటి. ఈతని సోదర పుత్రుఁడైన గణపతి దేవ మహారాజు కాలము నుండియు నీనగరము కాకతీయుల రాజధానియైనది. అప్పటినుండియు కాకతీయ శాసనములలో నిది 'ఏకశిలాపురి' యని 'ఏక శిలాభిధాననగరి' యని 'ఓరుంగల్లని' 'ఓరుగల్లని' వ్యవహృతమైనది.

ఉదా :- ౧. కాకతీయ రుద్రదేవ మహారాజులు ఓరుగంటను పృథ్వీరాజ్యంబు యుచుండంగాను". ౨. "కాకతీయగణపతి మహారాజులు ఓరుంగల్లు మొదటి పట్టణంబుగా సుఖ సంకథా వినోదంబులం బృథ్వీరాజ్యంబు సేయు చుండంగాను."

3. "జగత్సువసుధాభాతి తస్యా మేకశిలాపురీ

కాకతీయన్వయస్తత్ర తస్మిన్ రుద్రనరేశ్వరః" ప్ర.రు

౪. "ఇల బహుసైన్యముల్ గొలువ నేక శిలాపురి తూర్పు దిక్కునన్"

శివయోగసారము

ఈ విధముగాఁ గాకతీయరాజధాని యైన యేక శిలానగరమునకే 'ఓరుంగల్లె'నియు, 'ఓరుగల్లె'నియు, జనవ్యవహారమున 'ఒరంగల్లని'యుఁ బేరులుండినట్లు స్పష్టపడుచున్నది. కాని యొకే శాసనమున ఏకశిలా నగరము, ఓరుగల్లు అనునవి పర్యాయనామములుగాఁ బేర్కొనఁబడలేదు. ఈ కొఱఁతను కొఱవిగోపరాజుకృతమైన సింహాసన ద్వాత్రింశిక తీర్చుచున్నది. అందు కాకతీయ రాజధానియైన యేకశిలానగరమే యోరుగల్లని యీ క్రింద నుదాహృతములైన పద్యముల వలన విస్పష్టమగుచున్నది.

ఉ. ఆకడ నీతి శాస్త్రవిదుఁడై గురు వీడ్కొనియేఁగె వేడ్కతోఁ
గాకతి మూల శక్తిగనిగా నొనరించినపైఁడి చట్టునా
నేక శిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోననే
పోకలఁ బోనియట్టిసిరి పుట్టినయింటికి నోరుగంటికిన్. (సింహాసన ద్వాత్రింశక)

ఉ. చందనగంధులు న్విటులు జాణలు దాన వినోమలుం బ్రభా
సుందర మూర్తులుం గవులు శూరులు బెద్దలు నుల్లసిల్ల నం
క్రందన వైభవాఢ్యుఁడగు కాకతి భూపతి రాజ్యలక్ష్మి బెం
పొందెడు నప్పురంబున మహోత్సవ లీలలనుండె నేర్పునన్ (సింహాసన ద్వాత్రింశక)

---

౧. I.T.D. No. 50 Bothpur Inscription

౨. I.T.D. No. 52 Bothpur Inscription

గోదావరికి, గౌతమి, గంగ యను రెండు పర్యాయ పదములుగ వాడబడినవి.

క. అతఁడు త్ర్యంబక శిఖరో
దూ్భతను విఖ్యాతఁ బరమ పూతత్రిలోకీ
మాత మహా పాతక సం
ఘాతాను యాతఁ గనియెన్ గంగన్. (సింహా. ద్వా)

ఈ పద్యమున గంగ త్ర్యంబక శిఖోద్భూత యని వర్ణితయగుటచేనిది గోదావరియనుట నిశ్శంశయము. గోదావరి త్ర్యంబకమునఁ బుట్టుచున్నదను విషయము భూగోళ శాస్త్రజ్ఞుల కెల్ల విదితమే.

ఏకశిలానగరము ఒంటిమిట్టయేల కాకూడదని కొందఱు ప్రశ్నింపవచ్చును. కాని యది ప్రాచీన కాలమున, అధమము పోతన కాలము నాఁటికైనను, అంత ప్రసిద్ధమైనది కాదని యూహించుట కవకాశము గలదు. ఒంటిమిట్ట విజయనగర రాజ్య కాలముననే, అందును ముఖ్యముగా తుళువ వంశము వారి రాజ్యపాలనముననే ప్రసిద్ధికి వచ్చినట్లు కన్పట్టును. ఒంటిమిట్టలోనింత వఱకు నతి ప్రాచీన శాసనములేవియు దొరకలేదు. అచ్చటఁగానవచ్చు కొలఁది శాసనములు సదాశివ రాయల కాలము నాఁటివి. అనఁగాఁ బదునాఱవ శతాబ్దము నాఁటివి. తెలుఁగు నందున్న యీ శాసనములలో, నీగ్రామము, ఏకశిలానగరమనిగాని ఓరుగల్లని గాని గాక 'ఒంటిమిట్ట' యనియే పేర్కొనఁబడినది. ఓరుగల్లు ఏకశిలానగరము అనునది కాకతీయ రాజధానికే క్రీ.శ. ౧౧వ శతాబ్దమునుండి యిప్పటి వఱకు ప్రసిద్ధములును రూఢములును నై యుండగా ఒంటిమిట్టయేక శిలానగరమనుట యంత సముచితముగా గానరాకున్నది. పోతన స్నానార్థము చంద్ర గ్రహణ కాలమున గోదావరికి వెడలి, యచ్చటి పులినతలమున ధ్యానమగ్నుడై యున్నప్పుడే, యాతనికి శ్రీరామభద్రుఁడు ప్రత్యక్షమై శ్రీమద్భాగవతమును రచింపుమని యానతి యిచ్చెను. తరువాత నాతఁడేకశిలా నగరమునకుఁ దిరిగి వచ్చి యచట రచన ప్రారంభించెను. కాకతీయుల కాలమునుండి పోతన కాలము వఱకు ఓరుగల్లు తన ప్రాముఖ్యమును గోలుపోనే లేదు. బహమనీ సుల్తానుల కాలములోఁ గూడ రేచర్ల గోత్రులైన రాచకొండ భూపతులకును నిది ప్రధాన నగరముగ నుండెను. ఈ విషయములు చరిత్రవలననే రూఢమగుచున్నవి మరొక ముఖ్య విషయము. **ఓరుగల్లునకే యేకశిలయను సంస్కృతీకరణము సరిపడును. ఒంటిమిట్టకుఁ గాదు.**

**బమ్మెర :** ఏకశిలా నగరము కాకతీయుల రాజధానియగు నోరుగల్లైనపుడు బమ్మెర గ్రామము కూడ ఆ ప్రాంతముదే.యగుట సముచితము. అనఁగా తెలంగాణమునందలిదే యైయుండవలయుననుట. ఇప్పటికిని ఆ గ్రామము ఓరుగంటికిఁ గొలఁది యామడల

దూరమున నున్నది. ఓరుగల్లు, వరంగల్లు, వొరంగల్లు అయినట్లే జన వ్యవహారమున బమ్మెర బొమ్మెరయైనది. ఇప్పటికి నా గ్రామమును బమ్మెరయని బొమ్మెరయని వ్యవహరించు వారును వ్రాయువారును గూడఁ గలరు. బమ్మెర ప్రాథమిక రూపము. బొమ్మెర, తరువాత జనుల వాడుకలో వచ్చిన రూపాంతరము. బొమ్మెరయనియు, బమ్మెరయనియు పేర్లలో కించిద్భేదము గలిగినంత మాత్రమున నా గ్రామములొకటి కావనుట పొసఁగదు. ప్రాచీన గ్రామనామములనేకములు, జన వ్యవహారమున భ్రష్టములై, వికృతిని బొందినవి. వీని కుదాహరణము లెన్ని యేని చూపవచ్చును. **ఏకశిలానగరము, ఒంటి మిట్ట కానట్లే, బమ్మెర యుఁగడప మండల మండలములోనిది కానేరదు.** బమ్మెర యని కాని బొమ్మెర యని గాని పేరుగల గ్రామమా ప్రాంతమున లేనే లేదు.

ఆంధ్ర భాగవతము ఏకారణముననో పోతన కృతముగనే గాక యితర కవికృతముగఁ గూడ కాన వచ్చుచున్నది. ఈ మహా భాగవతము నందలి పంచమ షష్ఠస్కంధములు, ఏకాదశ ద్వాదశ స్కంధములు మాత్రము పోతన కృతములు కావు. పంచమ స్కంధమును రచించిన కవి బొప్పనామాత్య కుమారుఁడైన గంగయ. షష్ఠ స్కంధ రచయిత యేర్చూరి కనవయ కుమారుండైన **సింగయ.** ఏకాదశద్వాదశ స్కంధములకుఁ గర్త పోతనామాత్య శిష్యుండైన **వెలిగందల నారయ.** ఈ విధముగా నాంధ్ర మహా భాగవతము ఇప్పుడున్న రీతిని ఏకకర్తృకముగా గాక బహుకర్తృకముగాఁ గన్పించుచున్నది. ఇందుకుఁ గారణములు వేఱొక యెడఁ బ్రస్తావింపఁబడి యున్నవి.

పోతనామాత్యుఁడు భాగవతమునంతయు నాంధ్రీకరించెననియు, అందుఁ గొన్ని భాగములుత్పన్నములు కాఁగా గంగయ, సింగయ, నారయలు వానిని పూరించి రనియుఁ జెప్పుదురు. వీరిలో గంగయ యెచ్చటివాఁడో తెలియదు. మిగిలిన సింగయ నారయల యింటి పేర్లను బట్టి చూడ వారు ఏర్చూరు, వెలిగందల వాస్తవ్యులని తెలియవచ్చుచున్నది. పోతనామాత్యుఁడు తెలంగాణములోని వాఁడని నిశ్చయింప నవకాశమున్నందున, సింగయ నారయలు కూడ తెలంగాణము వారే యని యూహించుట సమంజసము. పోతనామాత్యుని యింటిపేరైన బమ్మెర గ్రామము తెలంగాణమునందే యుండుట చేత సింగయనారయల యింటి పేరి గ్రామములగు, ఏర్చూరు, వెలిగందలలు కూడ నా దేశములోనివేయైయుండవలెను. ఈ పేరి గ్రామములు తెలంగాణేతర మగు నాంధ్ర దేశము నందుండుట ఒకవేళ సంభవమని యంగీకరించనప్పటికిని నారయ పోతన శిష్యుఁడే యగుట చేతనాఁతడు కూడ తెలంగాణములోని వెలిగిందల గ్రామ వాసియై యుండవచ్చుననుట సాధువాదము. సింగన కూడ తత్ప్రాంతీయుఁడే యనుటకు ఏర్చూరు గ్రామము కూడ తెలంగాణములోనే

యుండుట ప్రబలాధారము. ఈ కారణముల వలన నాంధ్ర మహాభాగవతమునందలి యుత్పన్నములైన భాగములను పూరించిన ముగ్గురు కవులలో నిద్దరి యింటి పేర్లయిన గ్రామములు తెలంగాణమునందే యుండుట వలన సమగ్రాంధ్ర భాగవత రచనము తెలంగాణమునందే జరిగియుండునని యూహించుట కెక్కువ యవకాశము గలదు.

పోతనామాత్యుని స్థలనిర్ణయమునకు సహాయకారియైన మఱియొక విషయము భోగినీ దండకములోని సర్వజ్ఞ సింగ భూపాలుని ప్రస్తావము. భోగినీదండకము పోతనామాత్యకృతమగునా కాదా యను విషయము వేఱే చర్చింపఁబడును. అది పోతన కృతమను నిర్ణయము మీఁదనే పోతనామాత్యస్థల నిరూపణమునకు సింగభూపాల విషయమాధారమగుచున్నది.

సింగభూపాలుఁడు రాచకొండ రాజధానిగాఁ బరిపాలించిన రేచర్ల గోత్రుఁడు. రేచర్ల గోత్రులైన రాచకొండ రాజగిరి పరిపాలకులలో సింగన నామాంచితులు ముగ్గురు గలరు. వీరిలో మొదటి సింగ భూపాలునకు సర్వజ్ఞబిరుదము లేదు. మిగిలిన యుభయులును సర్వజ్ఞ బిరుదాంకితులే. మొదటి సర్వజ్ఞ సింగభూపాలునికి, కుమారాన్నపోత భూపాలుఁడు మనుమఁడు. ఈ రెండవ సర్వజ్ఞ సింగమనేనికి వసంత భూపాలుఁడు సోదరుఁడు.

రాచకొండ రాజ్యమునకుఁ బునాది వేసిన వాఁడు మొదటి సింగభూపాలుఁడైనను, చుట్టుపట్లనుండు భూనాథులను జయించి యోరుగల్లనఁబడు నేకశిలానగరమును గూడఁ దన యధికారము క్రిందికిఁ దీసికొని వచ్చి, రాచకొండ రాజ్యమును విస్తరింపఁజేసిన వారు. అతని తనయులైన అనవోత మాదానాయకులు. తండ్రి మరణానంతరము అనవోతానాయకుఁడు సింహాసనమధిష్ఠించి రాజ్యమును బరిపాలించుచు, దక్షిణపు సీమను శత్రువుల బారినుండి కాపాడుటకుఁ దన సోదరుఁడగు మాదానాయకుని దేవర కొండ యందుఁ దన ప్రతినిధిగ నియమించెను. నాఁటినుండి మాదానాయకుని సంతతివారు దేవరకొండలోను, అనవోతానాయని సంతతివారు రాజ్యమునకుఁ బ్రధాన నగరమగు రాచకొండలోను బరిపాలించుచు వచ్చిరి. బహ్మనీ సుల్తానులఒత్తిడి యెక్కువగుచు వచ్చిన కాలఁది యనవోతానాయని సంతతివారు, దేవరకొండను ఓరుగంటిని గూడ ముఖ్యపట్టణముగాఁ జేసికొనిరి. రాజగిరి రాజ్యాధిపతి తన సోదరుల నోరుగంటి ప్రాంత పరిపాలనకు నియమించుచు వచ్చెను. అనవోతానాయని పుత్రులును, పౌత్రులును, ప్రపౌత్రులును గూడ రాచకొండనేలిన వారే. ఈ వంశమునందలి కడపటి రాజుల కాలములో బహ్మనీ సుల్తానులకును రేచెర్ల వారికిని గల మైత్రి చెడినది. అప్పటినుండి రేచెర్లవారు అవకాశము దొరకినపుడు కర్ణాటాధీశ్వరులతోఁ గలసి బహ్మనీ సుల్తానులపై తిరుగుబాటు చేయుచుఁ

బరిస్థితులను కూలింపనపుడు వారికి లొంగిపోయి కప్పములు కట్టుచు గొంతకాలము గడపిరి. ఉభయులు నొండొరులకు గర్భశత్రువులైరి. బహ్మనీ సుల్తానులకును రాచకొండ రాజ్యాధిపతులకును బెక్కు సంగ్రామములు జరిగినవి. తుదకు బహ్మనీ సుల్తానులు రాచకొండ భూవరులను నిర్జించి వారి రాచకొండ, యోరుగల్లు రాజ్యములను పూర్తిగా నాక్రమించుకొనిరి. రాజ్యభ్రష్టులైన రెండవ సర్వజ్ఞసింగ వసంతావనీ నాథులు చేయునది లేక కృష్ణాతుంగ భద్రలను దాఁటి విజయనగర రాజ్యమును జేరిరి. అప్పుడు కూడ సింగ భూపాలుని సవతి సోదరుఁడును మాదానాయని సంతతివాఁడునునగు లింగమనేడును కటకము గజపతుల సాయముగైకొని తమ రాజ్యము సంపాదించుకొనుటకుఁ బ్రయత్నించుచు వచ్చి కొంతవఱకుఁ గృతకృత్యుఁడాయెను. కాని వారి ప్రధాన నగరమగు రాచకొండ మాత్రము చేయి దాటిపోయెను.

ఒకవేళ రెండవ సర్వజ్ఞసింగ భూపాలుని మీఁద పోతన భోగినీ దండకమును జెప్పెనన్నచో నది సింగ భూపాలుఁడు రాజ్యభ్రష్టుఁడు కాకపూర్వమే, పోతనామాత్యుఁడాతని యాశ్రయమున నుండి నప్పుడే, జరిగియుండవలెను. తనకే నిలువ నీడలేక పర రాజాశ్రయము వెదకికొనుచు దేశాంతరగతుఁడైన వసంతావనీ నాథ సోదరుఁడు రెండవ సర్వజ్ఞ సింగ భూపాలుఁడు, పోతన నట్టి కోరిక కోరుట హాస్యాస్పదము, నసంభవము నగును.

అందువలన భోగినీ దండక రచనము రాచకొండ, ఓరుగల్లులు తురుష్కాక్రాంతములు కాకమునుపే, సింగభూపాలుఁడు రాజ్యభ్రష్టుఁడు కాక పూర్వమే, జరిగియుండవలెను.

ఈ విధముగాఁ జూచినను బోతనామాత్యుఁడు తెలంగాణమువాఁడే యనియు, నతనిస్వస్థలము, బమ్మెర, తెలంగాణములోనిదేయనియు నిశ్చయింపవచ్చును.

# 4. భాగవత గ్రంథ పాతములు

హైందవుల కందఱకు, భారత భాగవత రామాయణములు పరమ పూజ్యములగు గ్రంథములు. ఆంధ్రమున నా మూఁడు గ్రంథములలో నేదియు నేక కవి కృతము కాదు. (ఈ మాట నేఁటి యాంధ్రీకరణముల విషయమునఁ జెప్పినదికాదు. రంగనాథ రామాయణమేకకవికృతమను కొనవచ్చును.) కాని యా గ్రంథ విషయమున నసలుకే మోసము వచ్చును నేఁటి ముద్రిత ప్రతులను బట్టి భాగవత కర్తలుగా నలుగురు కవులు తేలుచున్నారు.

౧. పోతన : - ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ స్కంధములు సప్తమాష్టమ నవమ దశమ స్కంధములు. ద్వితీయ స్కంధమున ౯౩వ పద్యమునుండియు, "అట్టి యనంత శక్తి జగదాత్ముని "వరకు " దశమ స్కంధమున "కాటుక నెఱయంగఁ గన్నీరు వరదలై" అను పద్యము నుండియు, వెలిగిందల నారయ కవిత్వమని చెప్పఁబడియున్నది.

౨. వెలిగందల నారయ : ఏకాదశ ద్వాదశ స్కంధములు

౩. గంగయ బొప్పరాజు : పంచమ స్కంధము

౪. ఏర్చూరి సింగయ : షష్ఠ స్కంధము

ముద్రిత ప్రతులయందిట్లున్నను, సమ్యక్పరిశీలనానంతరము మీఁది విషయములను యథాతథముగా నంగీకరించుట కవకాశము చాలకున్నది. ఇతర కవులు రచించినట్లున్న భాగము లందుఁ గూడఁబోతన కవితారీతులు గాన వచ్చుచున్నవి. షష్ఠ స్కంధమందలి యజామీళ చిత్ర కేతూపాఖ్యానములను గాని దశమస్కంధోత్తర భాగమందలి యుషాపరిణయ కుచేలోపాఖ్యానములను గాని పరిశీలించిన వారి కీయంశము విస్పష్టము కాకపోదు. ఈ భాగములందుఁ బోతనవనిపించు నంత్యాను ప్రాసములు, సాంస్కృతిక దీర్ఘ సమాసములు మొదలగు రచనా విశేషములు పెక్కులు గలవు. మఱియుఁ బోతన కృతములని చెప్పఁబడు భాగములందుఁ గూడ నీ పద్యములమ్మహాకవియే రచించెనా యను సందియమును గలిగించునవియు నచ్చటచ్చటఁ గన్పట్టును. కావుననే భాగవతమున గ్రంథ పాతములు గలవని పలువురభిప్రాయపడుచున్నారు. ఈ విషయమునఁ గల వాదములను స్థూలముగ నిట్లు చెప్ప వచ్చును.

౧. భాగవతమును బోతన సమగ్రముగ నాంధ్రీకరించెను. దానిని సర్వజ్ఞసింగ భూపాలుఁడు తన కంకితమిమ్మని కోరెను. పోతన యద్దానికంగీకరింపలేదు. అంతట సింగమనీడు పోతనపై నలిగి తత్కృత భాగవతమును బాతిపెట్టించెను. అందువలన నా గ్రంథము నందలి కొన్ని భాగములు శిథిలములయ్యెను. ఆ శిథిల భాగములను, నారయ సింగన గంగనలు పూరించిరి. ఇదియొక వాదము. దీనినిఁ బ్రప్రథమముగా గ్రంథస్థముగావించినవాఁడు కూచిమంచి తిమ్మకవి.

ఈ వాద మింకొక విధముగా కూడ నున్నది. పోతన భాగవతము నాంధ్రీకరించి యద్దానిని తన దేవతార్చన పెట్టెలో నుంచి పూజించుచుండెడివాఁడట. పోతన చనిపోయిన తరువాత నాతని కొడుకా గ్రంథమును దీసి చూడఁగా నయ్యది యచ్చటచ్చట శిథిలమై యుండెనఁట. అందులకాతఁడు విచారించు చుండఁగా బోతన యాతని కలలోఁ గనఁబడి యా శిథిల భాగములను తన ప్రియ శిష్యుఁడగు వెలిగందల నారయ పూరించుననియు నాతనికా గ్రంథము నిచ్చి వేయుమనియుఁ జెప్పెనట.

౨. రెండవ వాద సారమిది. భాగవతము నీ నలువురు కవులు నేక కాలముననే రచించిరి. ఆ గ్రంథము శిథిలము కాలేదు. ఆ కవులలోఁ బోతన సుప్రసిద్ధుఁడు గావున నాతని పేరనే యా గ్రంథము వెలసినది. పోతన రచించిన భాగములందచ్చటచ్చట నీరసములగు రచనలు గన్పట్టుటకుఁ గారణమా వస్తుతత్త్వమే గాని శైథిల్యము గాదు.

ఇందును అవాంతర భేదము గలదు. ఈ వాదమును మీఁది రెండు వాదముల సమన్వయమని చెప్పవచ్చును. ఈ వాద సారమిది: పోతన బ్రదికి యున్నప్పుడే నారయ యేకాదశ ద్వాదశ స్కంధములను రచించి గ్రంథమును బూర్తి చేసెనని కొందరి యభిప్రాయము. ఏమైనను బరమార్థమొకటే. పోతన యేకాదశ ద్వాదశ స్కంధముల నాంధ్రీకరింపనే లేదు. పంచమ షష్ఠ స్కంధములు మాత్రము క్రిమి దష్టములు కాఁగా గంగన సింగనలు పూరించిరి. కారణ మెద్దియైనను క్రిమిదష్టమైనదని మాత్రము వీరంగీకరింతురు.

ఇఁకఁ బై వాదముల సామంజస్యమును బరిశీలింతము. ఈ పరిశీలనకుఁ బూర్వము మనము ముఖ్యముగ గమనింపవలసిన విషయ మొకటి కలదు. ఏకాదశ ద్వాదశ స్కంధములను షష్ఠస్కంధమును మత్స్యవరాహ పురాణ గ్రంధ కర్తయగు హరి భట్టారకుఁడు నాంధ్రీకరించి యున్నాడు. కవుల షష్టము షష్ఠ స్కంధము నాంధ్రీకరించియున్నారు. అది యిప్పుడు లభ్యము కాదు. హరిభట్టారకుని గ్రంథము మాత్రము మనకు లభ్యమగుచున్నది. ఇదియముద్రితము.

మొదటఁ దిమ్మ కవి చెప్పిన యంశములను బరామర్శింతము. ఈతని పై నించుమించుగా నాధునికులందఱును దాడి తీసిరి. వారి వాద సారాంశమంతయు నొక్క వాక్యములోఁ జెప్ప వచ్చును. కవి పండిత పోషకుఁడును, రసార్ణవ సుధాకర గ్రంథ కర్తయు నగు సర్వజ్ఞ సింగభూపాలుఁడిట్టి యకృత్యమును గావించునా! ఇది వీరి సంశయము; కాని కవి పండిత పోషకుఁడు, రసార్ణవ సుధాకరాద్యనేక గ్రంథ కర్తయునగు సింగమనీడు పోతన సమకాలికుఁడు కానేకాఁడు. ఇది వీరి ఖండనమునందలి ప్రథమ దోషము. పోనిండు. తరువాతి సింగమనీడు మాత్రమిట్టి యకృత్యమును గావించునా! అని వీరు ప్రశ్నింపవచ్చును. ఏల సేయ రాదు? ఇట్టి యకృత్యములు గావించిన రాజులెందఱు లేరు. సాళువ నృసింహ రాయలు, పరమ భక్తాగ్రేసరుఁడగు నన్నమాచార్యులను తనపైఁ గీర్తనలు సెప్ప నిరాకరించినందులకు శిక్షింపలేదా! రాజులు ధన మదాంధులను విషయము సర్వజన విదితము. అనుగ్రహము గలిగిన నందల మెక్కింతురు. ఆగ్రహము గలిగిన పాతి పెట్టింతురు. కావున నిదియొక యాక్షేపము కాఁజాలదు. ఆగ్రహము గలిగినఁబాతి పెట్టింపనేల? కాల్పింపలేఁడా? అని యొక రడిగిరి. నిజమే. కాల్పింప వచ్చునుగాని యప్పుడుమొదలికే మోసము వచ్చును గదా! పాతిపెట్టించిన యెడలఁ కవితానిన్ని నాళ్లుశ్రమించి రచించిన గ్రంథము నశించుటకోర్వలేక తుదకంకితమిచ్చుట కంగీకరించునేమో యని రాజాసించి యుండవచ్చును. కాల్చివేసిన మనసు మార్చుకొని మాత్రము కవియేమి సేయఁ గలఁడు. కావునఁ బాతిపెట్టింపనేల? తగులఁ బెట్టింపరాదా! యను ప్రశ్నము సమంజసము కాదు. ఇంత మాత్రమున నీ వాదమంగీకార్యమని నా యభిప్రాయము కాదు. ఈ వాదమందు వీరు చూపు దోషములు సరియైనవి కావనియే నా యభిప్రాయము. ఇందు నిజమైన దోషమిది కానే కాదు. అసలు పోతన భాగవతము నాంధ్రీకరించు కాలమునకు సింగమనీఁడు – (ఆతఁడే సింగమయైనను సరే) – బ్రదికి యేలేఁడు. ఇఁక నా గ్రంధము నాతఁడెట్లు పాతి పెట్టించును? భోగినీ దండక రచనా కాలముననకే యాతఁడు వయసు చెల్లిన వాఁడు. భోగినీ దండక భాగవత రచనలకు మధ్య ముప్పది యేండ్ల కాల వ్యవధి యుండును. కావున భాగవత రచనా కాలమునకు సింగమనీడు కాలధర్మమునందెనని చెప్పుట సత్య దూరము కాదు. కొందఱు కూచిమంచి తిమ్మకవి యీ యపప్రథ కల్పించినాడని తిట్టిపోయుచున్నారు. కాని తిమ్మకవికి సింగము నీనిపైఁ బగయా! అతఁడీ కథనేల కల్పించును? జనశ్రుతినే యాతఁడంగీకరించి యుండును. లోకమున లేని గాధలను, ఇట్టి విషయములందుఁ గవులు కల్పింపరు. ఉన్న విషయములనే గైకొందురు, కాని యాగాధల యందలి సత్యాసత్యములను బరామర్శింప కుండుట వారి దోషమే యనవచ్చును. కాని యిదియు నొక విధముగా యోజించినచో దోషము కాఁజాలదు. ఇట్టి కథలను వారు కూడ నమ్మియే యుందురు. దానికిఁ గారణము వారికి

సమగ్రముగు చారిత్రక పరిజ్ఞానము లేక పోవుటయే. మఱియు నిట తిమ్మన చెప్పఁ దలఁచిన ముఖ్య విషయమేమి? భాగవత గ్రంధమెట్లు శిథిలమయ్యెననియా? కాదు. పోతన కూడ లాక్షణికులంగీకరింపఁదగిన కవియని స్థాపించుటయే యాతని ముఖ్యోద్దేశము. అయిన నీగాధను అప్పక వ్యాదులు ఏల చెప్పరై రని యొక ప్రశ్నముదయించును. కాని పోతన రేఫ, శకట రేఫ మైత్రిని పాటించినాడనియే అప్పకవి మతము కాని యట్టి మైత్రి పోతన వంటి మహాకవి చేయునది కాదనియు అది తద్గ్రంధమును బూర్తి చేసిన యితర కవుల దనియుఁ జెప్పవలసిన యావశ్యకత యప్పకవికి లేదు. అట్టి యజ్ఞత పోతనకుఁ గూడ గలదనియే యప్పకవి విశ్వాసము. అందులకే యతఁడా గాధ నెత్తికొన లేదు. అంత మాత్రమున ఆనాఁటికా గాథ లేదని చెప్పవలను గాదు. కావుననీ గాథ కూచి మంచి తిమ్మకవి కల్పించినది కాదు. జనశ్రుతినే యాతఁడంగీకరించినాఁడు. పోతన కూడ నన్నయ తిక్కన వంటి లాక్షణికుఁడగు కవి యని స్థాపించుటయే యాతని ప్రయోజనము. అయిన యీ జనశ్రుతికిఁ గారణమేమి? అని మరల ప్రశ్న. దీనికిఁ గారణము దురూహ్యముగాదు. భోగినీ దండక రచన వలనఁ బోతనకును సర్వజ్ఞ సింగమనీనికిని గొంత యనుబంధమున్నది. ఆ సంబంధమును బురస్కరించుకొనియే యీ కట్టు కథ పుట్టి యుండును. ఆధార రహితముగ జన శ్రుతియును గలుగదు. కాని యయ్యది యొకప్పుడూహాపోహలకు లోనై వికృత రూపమును దాల్చును. అట్లేగాకున్న నీ కథ సర్వజ్ఞ సింగమనీనికి సంబంధించియే యేలపుట్టవలెను? మఱొక ప్రభువునకు సంబంధించి యేల పుట్టలేదు? సర్వజ్ఞునకును బోతనకును గొంత సంబంధము గలదు కావుననే యీ గాధ పుట్టినది. ఈ గాధ లోకమునఁ గలదు కావుననే తిమ్మకవి గ్రహించినాఁడు. కావున నీ విషయమునఁ దిమ్మకవి దోషమేమియును లేదు.

ఇఁక నాధునికుల సిద్ధాంతములను బరిశీలింతము. పోతన జీవించి యుండఁగనే నారయ యేకాదశ ద్వాదశ స్కంధములను రచించెనని యొక వాదము. ముద్రిత ప్రతులను బట్టి చూచినచో నీ వాదము సమంజసముగాఁ గన్పట్టదు. పోతన భాగవతము నద్వైత పరముగా నాంధ్రీకరించి యున్నాఁడు. ఏకాదశ ద్వాదశ స్కంధములు విశిష్టాద్వైత పరముగ నున్నవి. పోతన జీవించి యున్నప్పుడే యీ స్కంధములు రచింపఁబడి యున్నచో నీ మతద్వైవిధ్యమున కాతఁడంగీకరించునా? రెండవది : పోతన యాంధ్రీకరణ విధానము స్థూలముగ విపులీకరణమని చెప్పవచ్చును. ఏకాదశ ద్వాదశ స్కంధములు చాల సంక్షేపముగ నాంధ్రీకరింపఁబడియున్నవి. మూలము నందలి వేదాంత ఘట్టములనేకములు సూచనా మాత్రముగ మాత్రమే చెప్పఁబడినవి. ఇందులకు శ్రీకృష్ణుఁడుద్ధవునకుపదేశించిన గీతలొక ప్రబలోదాహరణము. పోతన వేదాంత ఘట్టములను గొన్ని యెడల విపులీకరించెను.

కొన్ని యెడల యథతథముగా నాంధ్రీకరించెను. గాని యెచ్చటను విడిచి యుండలేదు. అతఁడీ విషయమును జూచియే యున్నచో నందులకంగీకరించునా? కావునఁ బోతన జీవించి యుండఁగనే నారయ యేకాదశ ద్వాదశ స్కంధముల రచించుట పొసఁగదు. మఱియుఁ బోతనకు శ్రీరాముఁడిచ్చిన యాజ్ఞ "మన్నామాంకితంబుగ భాగవతమును రచియింపు" మనియే కాని, రచియింపఁ జేయుమని కాదుగదా! అట్టి యెడఁ బరమ భక్తాగ్రేసరుఁడగు పోతన భగవదాజ్ఞను ధిక్కరించెనని చెప్పఁ గలమా? కావునఁ బోతన జీవితకాలముననే నారయ యేకాదశ ద్వాదశ స్కంధములను రచించుట కవకాశము లేదు. అతని నిర్యాణానంతరమే నారయ దీనిని బూరించుట గాని, స్వయముగ రచించుట గాని, చేసియుండును ఇట ప్రప్రథమమునఁ జెప్పఁబడిన యంశముల నొక పరి స్మరింతము. ఏకాదశ ద్వాదశ స్కందములను, షష్ఠ స్కంధమును హరిభట్టు కూడ రచించియున్నాడు. హరిభట్టు మహాకవి. మత్స్యవరాహ పురాణముల నాంధ్రీకరించిన మేటి. అట్టి మహాకవి భాగవతమునందలి చివరి రెండు స్కంధములను మధ్య నొక స్కంధమునేల యాంధ్రీకరించెను? చేయఁదలఁచుకొనినచో భాగవతమును సంపూర్ణముగా నాతఁడాంధ్రీకరింపఁ గలఁడు. అది పోతనకై తవలె నుండునా! లేదా! యను విషయము వేరు. అతఁడీ స్కంధములనే గైకొనుటను బట్టి చూడఁగా నిట్టి యూహకవకాశము గల్గుచున్నది. శిథిల భాగములను బూరించుటకు నారయాదులును బ్రయత్నించిరి. ఈతఁడును బ్రయత్నించియున్నాఁడు. ఏకాదశ ద్వాదశ స్కంధములు పోతన రచించియే యుండినచో నవి చాలదనుక శిథిలములై యుండును. లేదా దశమ స్కంధ రచనానంతరము పోతన మరణింపఁగా నారయయు, హరిభట్టును, ఎవరికి వారే వానిని బూర్తి చేయుటకు యత్నించి యుందురు. కొందఱు, నారయ గ్రంథము సందును హరిభట్టు గ్రంథమునందును పద్య సామ్యము గన్పట్టుచున్నవి కావున నిందెవ్వరో యొకరు గ్రంథ చౌర్యమునకుఁ బాల్పడియుందురనుచున్నారు. కాని యది సరి కాదు. నారయ హరిభట్టునకుఁ బూర్వుఁడు. కావున నాతఁడు చౌర్యము చేయుట కవకాశమే లేదు. హరిభట్టు బహుపురాణాంధ్రీకర్త. మఱియు నారయ గద్యములుగా వ్రాసిన యనేక భాగముల నీతఁడు పద్యములలో వ్రాసియున్నాఁడు. అట్టి మహాకవి నారయ పద్యముల కాసపడెననుట సమంజసము కాదు. ఈ సామ్యమునకు రెండే కారణములు కన్పట్టుచున్నవి. ౧. పోతన గ్రంథము శిథిలము కాఁగా వీరిర్వురుఁ బూర్తి చేసినచో నందు మిగిలిన పోతన గద్యపద్యములను వీరిర్వురు నట్లే యుంచి యుందురు. అందువలన సామ్యమేర్పడి యుండును. లేదా, యిది వ్రాయసకాండ్ర లోపమైయుండును. అనఁగా హరిభట్టు రచించిన పద్యములను నారయ గ్రంథమునఁ జేర్చి యచ్చటి వచన భాగములను మార్చి యుందురనుట.

ఇఁకఁ బంచమషష్ఠ స్కంధముల విషయము :-

పంచమ స్కంధమును బొప్పరాజు గంగన మాత్రమే యాంధ్రీకరించెను. దీనినింకొక రాంధ్రీకరించినట్లు కానరాదు. ఇందుఁ బోతన పోకడలంతగాఁ గానరావు. ఇది రెండాశ్వాసములుగ విభజింపఁబడియున్నది. శ్రీకృష్ణ నకంకితము. ఈ కవి తనకులగోత్రాదులను జెప్పలేదు. షష్ఠ్యంత్యంములును లేవు. ఇందు సింగన తన కులగోత్రాదులను జెప్పుకొని యున్నాడు. ఈతఁడు నొక స్వప్న గాధను జెప్పి, తానాశువుగ శ్రీకృష్ణ పరముగఁ జెప్పిన యొక శ్లోకమును వాగ్దేవత మెచ్చినదని నుడివి యున్నాఁడు. ఇందుఁ దిక్కనకు నీతనికిఁ గొంత సామ్యము గలదు. ఈ స్కంధములు శిథిలములగుటచేతనే వీరు పూర్తిగావించి యుందురు. నడుమనున్న యీ స్కంధముల నాంధ్రీకరింపక పోతన యేల విడచును?

పోతన భాగవతము శిథిలమగుటకుఁ గారణమేమి? అనుమొదటి ప్రశ్నకు మనము మఱల రావలసియున్నది. భాగవతము నాంధ్రీకరించి యాతఁడెవ్వరికిని జూపక పెట్టెలో నుంచి పూజించుచుండెనని యొక వాదము. ఈ వాదము కంటె నీ రసవాద మింకొకటి యుండదు. నీరసమే కాదు. అసందర్భము కూడ. "జగద్ధితముగ" భాగవతము నాంధ్రీకరించిన పోతన యాగ్రంధము నెవ్వరికిని జూపక యొక పేటికలో దాచి యుంచెనా? అట్లైన నమ్మహా గ్రంధము నాంధ్రీకరింపనేల? దీనిని బట్టి చూచినచోఁ బోతన వంటి స్వార్థపరుఁడును, మహా మూర్ఖుఁడు నింకొకఁడుండునా? ఈ వాదము కేవల జల్పము. దీని నంగీకరించు టమ్మహాకవి యెడ మపచారమును గావించుటయే. ఈ వాదము నందలి తక్కిన విషయములు గూడ కట్టు కథల వలెనే యున్నవి.

ఇఁక భాగవత గ్రంధము శిథిలమగుట కొక్కటే కారణము గన్పట్టుచున్నది. ఇదియుఁ గేవలము సత్యమని చెప్పఁజాలము. ఇదియు నొక యూహయే. పోతన తన భాగవత గ్రంధమును భగవదంకితము చేసియున్నాఁడు. రాజాంకితములైన గ్రంధములకుండు ప్రాచుర్యముదీని కుండుట కవకాశము లేదు. తమకంకితములైన గ్రంధములకుఁ బెక్కుప్రతులను వ్రాయించి యా గ్రంధ ప్రచారమునకై రాజులు సర్వధా ప్రయత్నింతురు. అట్టి సదవకాశము భాగవత గ్రంధమునకుఁ గలిగి యుండదు. ఇట నొక శంక కవకాశము గలదు. తిక్కన తన భారతమును హరిహరాంకితము గావించెను గదా! దానికెట్లు ప్రాచుర్యము వచ్చినదను ప్రశ్న జనింపవచ్చును. కాని తిక్కనకు రాజావలంబనము గలదు. పోతన కది లేదు. కావున నట్టి శంక కిట నవకాశము లేదు. పోతన కాలమున మహమ్మదీయులప్పుడప్పుడు విజృంభించి యాంధ్రపాంతములకు దాడి వెడలు చుండిరను విషయము చరిత్ర ప్రసిద్ధము. వారు మధ్యే మార్గమునఁ బల్లెలఁ బట్టణములఁ దగులఁబెట్టుచుండెడివారు. అట్టి యెడఁ బోతన గ్రంధమగ్ని ప్రమాదమునకు గురియై యుండును. అదియే గ్రంధ పాతములకుఁ గారణమై యుండనోపును.

# 5. శ్రీమదాంధ్ర భాగవతము

## ఆంధ్రీకరణ విధానము

ఆంధ్రీకరణ విధానము స్థూలముగా రెండు విధములు. ౧. యథామాతృకము, ౨. యథేచ్ఛము. యథామాతృకానువాదమును బూర్వమహాకవులాదరించినట్లు కానరాదు. ఆధునిక యుగముననే దానికిఁ బ్రాచుర్యము లభించినది. మాతృకయందున్నది యున్నట్లుగా నాంధ్రీకరించుట యథామాతృకము. మూలము నాధారముగాఁ గొని స్వతంత్రముగాఁ బెంచికాని కుదించికాని వ్రాయుట యథేచ్ఛానువాదము. దీనినే స్వేచ్ఛానువాదమని కొందఱును స్వతంత్ర పద్ధతియని కొందఱు ననుచున్నారు. యథామాతృకమున కస్వతంత్ర పద్ధతి యనియు వాడుక గలదు. ఈ రెండునుగాక స్వతంత్రాస్వతంత్ర పద్ధతి యనునదింకొకటి గలదు.[౧] ఇది పురాణేతిహాసముల నాంధ్రీకరించిన వారవలంబించిన విధానము కాదు. కావున మనకిచ్చట నిద్దానిని గూర్చి ప్రసంగించుట యనావశ్యకము. ఇఁక స్వేచ్ఛాను వాదము. స్వేచ్ఛయనునది బహుముఖములుగా నుండవచ్చును. కథాగతి, పాత్రచిత్రణము, సన్నివేశకల్పనము మొదలగు వానిలో నెద్దానియందు మార్పు తీసికొని వచ్చినను, నయ్యది స్వేచ్ఛానువాదమే యగును.

భారతకవులది స్వేచ్ఛానువాదమే. కాని వారు మీది వానిలో నెద్దాని యందును జెప్పఁదగిన మార్పు తీసికొనిరాలేదు. కాని మూలమును యథా తథముగాఁ గూడ నాంధ్రీకరింపలేదు. మాతృకయందలి ప్రతిపదమును దెనుఁగునకు రాలేదు.. కావున నది స్వేచ్ఛానువాదమే యగుచున్నది. మూలమును బెంచినను గుదించినను నది స్వేచ్ఛానువాదమే.

పురాణేతిహాసముల నాంధ్రీకరించు పట్టునఁ బూర్వమహాకవు లందఱు నించుమించుగా నొకే మార్గము నవలంబించిరని చెప్పవచ్చును. స్థూలముగా నా మార్గమిది – ౧. రసపద్ఘట్ట ములను విపులీకరించుట, ౨. నీరస ఘట్టములను సంక్షేపించుట – సుదీర్ఘములుగానిచో నొకానొకప్పుడీ నీరస ఘట్టములను గూడ యథా మాతృకముగా నాంధ్రీకరించుటయుఁ గలదు. విపులీకరణము మాత్ర మిట్టి యెడల నదృష్టపూర్వకమనుట తథ్యము.

ఇఁక విపులీకరణవిషయము – ఇదియు రెండు విధములుగా నుండ వచ్చును.

---

౧. నైషధాంధ్రీకరణమున శ్రీనాథుఁడిద్దాని నవలంబించెను. ఇయ్యది కేవలము మహాకావ్యాంధ్రీకరణమునకే నియతము.

౧. ఈషన్మూలకము. ౨. అమూలకము. మూలమున సంగ్రహముగానున్న దానిని విపులీకరించి వ్రాయుట యీషన్మూలకము. మూలమున ననశే లేని విషయములను వ్రాయుట యమూలకము.

పోతన తన భాగవతమును సర్వసాధారణముగ విపులీకరించియే వ్రాసియున్నాఁడు. సంక్షిప్తములగు భాగములు లేవనియే చెప్పవచ్చును. విపులీకరింపనిచోట యథామాత్రృకముగా నాంధ్రీకరించి యున్నాఁడు. అందులకే యాంధ్ర భాగవతము మూలము కంటె హెచ్చుగా నెనిమిది వేల గ్రంథము కానవచ్చుచున్నది. గ్రంథమనఁగా ముప్పది రెండక్షరములకుఁ బరిమితము. సంస్కృత భాగవతమునఁ బదునెననిమిది వేల గ్రంథములను బండ్రెండు స్కంధములును గలవని బహుపురాణ ప్రసిద్ధి.

"యత్రాధికృత్య గాయత్రీం. వర్ణ్యతే ధర్మ విస్తరః

వృత్రానురవధోపేతం తదాగ్భవత మిష్యతే

అష్టాదశ సహస్రం తత్పురాణం పరికీర్తితమ్."

(మత్స్యపురాణము)

"గ్రంథో ష్టాదశ సాహస్రో ద్వాదశ స్కంధ సమ్మితః

హయగ్రీవ బ్రహ్మ విద్యా యత్ర వృత్రవధస్తథా

గాయత్ర్యా చ సమారంభః తద్వై భాగవతం విదుః

స్కాందపురాణము

ఇప్పుడు మనకు లభించుచున్న భాగవతమున సంస్కృతము స్కంధ సంఖ్య సమానముగనే యున్నదిగాని గ్రంథ సంఖ్య మారినది. ఇప్పటి శ్రీమద్భాగవతమున నిరువది రెండు వేల గ్రంథము గలదని పండిత విమర్శకాభిప్రాయము. ఇఁక నాంధ్రమున నిది దాదాపు ముప్పది వేలకుఁ బెరిగినది. అనఁగా మూలమునందు కంటె నించుమించుగా నెనిమిది వేల గ్రంథము పెరిగినదనుట. దీనిని బట్టి పోతన యాంధ్రీకరణ విధానము విపులీకరణ మనుట స్పష్టము. ఈ విపులీకరణమునకుఁ గారణములెవ్వి?

ఈ ప్రశ్నకు సమాధానము నిట్లు క్లుప్తముగాఁ జెప్పనగును. బ్రహ్మో ద్యష్టాదశ పురాణములలో భాగవత ముత్తమోత్తమము, బహురహస్యార్థ ప్రతిపాదకము, పరమ వేదాంత

ప్రతిపాద్య భగవద్గుణ గణా పాదకము కావున రహస్యార్థములను వివరించు పట్లను వేదాంత ఘట్టములను విశదీకరించు పట్లను, విపులీకరణ మావశ్యకమాయెను. ఇట్టి ఘట్టములందే తఱచుగాఁ బోతన శ్రీధరీయము ననుసరించెను. పరతత్త్వప్రతిపాదకములుగాని చోటులందుఁ గూడ బోతన శ్రీధరీయము ననుసరించుటగలదు. అవి ముమ్ముందు వివరింపఁబడును. పోతన మహాభక్తుఁడు. భగవద్గుణగణములను వర్ణించుచో నాతఁడు భక్త్యావేశము నకులోనై మూలమును బహుధా విపులీకరించును. ఒక్కొక్కప్పుడు కేవల స్వకపోలకల్పనలనే చేయును.

భాగవత గాథలనేకములు విష్ణుపురాణ హరివంశాదులందుఁ గలవు. ఒక్కొక్కప్పు డాగ్రంథములందుఁగల కథాంశములను భాగవతమునందు చేర్చును.

పై కారణములను బట్టి పోతన యాంధ్రీకరణ విధానము నీక్రింది విధముగాఁ జెప్పవచ్చును.

౧. సమూలకము, ౨. ఈషన్మూలకము, ౩. అమూలకము.

సమూలకము నిజముగా విపులీకరణమున చేరదు. కాని పోతన యిందు కూడా విపులీకరణమున కవకాశమును గల్పించుకొనినాఁడు. శ్రీధర వ్యాఖ్య ననుసరించి దీనిని గూడఁ గొన్నియెడలఁ బెంచియున్నాఁడు. కావున సమూలకమును వ్యాఖ్యాసాపేక్ష వ్యాఖ్యానిరపేక్షములని ద్విధా విభజింపవచ్చును. ఈషన్మూకా మూలకము లొక్కొక్కటి నాలుగు విధములు. ౧.

౧. భక్తి కొఱకు విపులీకరణము.

౨. సమగ్రవస్తు సాక్షాత్కారము కొఱకు విపులీకరణము.

౩. రసోద్దీపనము కొఱకు విపులీకరణము.

౪. పురాణాంతర కథాసంగ్రహణములను విపులీకరించుట.

పై యంశములనుబట్టి పరిశీలించిన పోతన యాంధ్రీకరణ విధానమంతయుఁ బది విధములుగాఁ గన్పట్టును.

సమూలకము ౧. వ్యాఖ్యా సాపేక్షము

౨. వ్యాఖ్యా నిరపేక్షము

ఈషన్మూలకము ౩. భక్తి

౪. సమగ్రవస్తు సాక్షాత్కారము

౫. రసోద్దీపనము

౬. పురాణాంతర కథా సంగ్రహణము.

అమూలకము ౭. భక్తి

౮. సమగ్ర వస్తు సాక్షాత్కారము

౯. రసోద్దీపనము

౧౦. పురాణాంతర కథా సంగ్రహణము.

ఒకే ఘట్టమున నీ పది మార్గములు నుండవచ్చును. కావున నేఘట్టమున కాఘట్టమే ప్రత్యేకముగ విమర్శింపఁబడియున్నది. ఆయా ఘట్టములందుఁ దద్విపులీకరణ కారణములు గూడఁ జాలవఱకు నిరూపింపఁ బడినవి.

భాగవతాంధ్రీకరణ విషయమున ముఖ్యముగా మనము గమనింప వలసిన విషయ మింకొకటి గలదు. పురాణములలో సంస్కృత భాగవతమునకుఁగల ప్రాశస్త్యమనితర సాధారణము. అధ్యాత్మ విద్యా విషయమున సంస్కృత భాగవతముపనిషత్తుల్యము. వల్లభ చైతన్యాది మతప్రవక్తలును మధుసూదన సరస్వత్యాదిమత ప్రచారకులును నిద్దానిని ప్రస్థానత్రయముతోఁ దుల్యముగాఁ బరిగణించియున్నారు. దీనికి ద్వైతాద్వైత విశిష్టా ద్వైతపరములుగ వ్యాఖ్యానములున్నవి. కావున భాగవతాంధ్రీకర్త తన యాంధ్రీకరణ విధానమును ద్వైతాద్వైత విశిష్టాద్వైత వ్యాఖ్యానములలో నెద్దాని కనుగుణముగఁ గొనసాగించె నను విషయము పర్యాలోచింపవలసియున్నది.

భాగవతమున కద్వైతపరముగ శ్రీధరీయ వ్యాఖ్యయున్నది. పోతన తన భాగవతమును శ్రీధర వ్యాఖ్య ననుసరించి వ్రాసియున్నాఁడు. శ్రీధరస్వామి యద్వైతియయ్యుఁ బోతనవలెనే మహా భక్తుఁడు. అందును సగుణారాధనమును సర్వదా అంగీకరించినవాఁడు. అందులకే పోతన సర్వత్ర శ్రీధర వ్యాఖ్యనే యనుసరించియున్నాఁడు. కాని మఱొక్క విషయము గమనింపవలసి యున్నది. పోతన శ్రీధరీయము ననుసరించెనను మాట వాస్తవమే కాని ఆయనుసరణ యందెట్టి వ్యవస్థయుఁగానరాదు. ఆధ్యాత్మికములగు

ఘట్టములు వివరించినపుడెల్ల శ్రీధరీయమునునుసరించి పోతన తన గ్రంథమును విపులీకరించి వ్రాసియున్నాఁడని కొందఱి మతము. కాని యిది సర్వత్ర సత్యముకాదు. కొన్ని కొన్ని ఘట్టములందు విపులీకరించెననుట నిజమే. కాని యన్ని యెడల నట్లు చేయలేదు. గూఢార్ధ ప్రతిపాదకములగు కపిలదేవహూతీ సంవాదము మున్నగు వానియందుఁ గూడఁ బోతన శ్రీధరీయము ననుసరించి వ్రాయలేదు. కొన్ని పదములను వ్యాఖ్యానుసారముగ నాంధ్రీకరించియుఁ గొన్నింటిని యథాతథముగనే వాడినాఁడు. అందలి పదములన్నియు వ్యాఖ్యాసాపేక్షములే. అన్నింటికిని, అనగా క్లిష్టములగు వాటి నన్నింటికిని శ్రీధర వ్యాఖ్యగలదు. కాని పోతన కొన్నింటినిగైకొనెను, కొన్నింటిని వదలెను. వ్యాఖ్యానమక్కరలేని సామాన్య విషయముల నొక్కొక్కప్పుడు విపులీకరించును. పై యంశములన్నియు ముందుదాహరణ పూర్వకముగ నిరూపింపఁబడును.

భాగవత ప్రథమ శ్లోకాంధ్రీకరణమునందే పోతనకుఁగల యద్వైతసిద్ధాంతపరత్వము సువ్యక్తమగుచున్నది.

"జన్మాద్యస్య యతో<sup></sup> స్వయాదితరత శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మహృదాయ ఆదికవియే, ముహ్యంతి య త్సూరయః
తేజోవారిమృదాం యథావినిమయో యత్రత్రిసర్గో మృషా
ధామ్నాస్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి."

ఆంధ్రీకరణము

"విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని
        వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనము నఁగార్యములందభిజ్ఞుఁడై
        తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి
వేదంబులజునకు విదితముల్ గావించె
        నెవ్వఁడు, బుధులు మోహింతురెవ్వ
నికి నెండమావుల నీళ్లఁ గాచాదుల
        నన్యోన్య బుద్ధిదానడరునట్లు
త్రిగుణ సృష్టి యెందు దీపించి సత్యము

భంగిఁదోఁచు స్వప్రభా నిరస్త
కుహకుఁడై వ్వఁడతనిఁ గోరిచింతించెద
ననఘు సత్యుఁ బరుని ననుదినంబు."

స్కం. ౧. పద్యము. ౩౪

ఇది భాగవత ప్రథమ శ్లోకమున కాంధ్రీకరణము. భాగవతార్థ మంతయుఁ దత్ప్రథమ శ్లోకమునందే పిండీకృతమై యున్నది. కాని యాయర్థ వివరణము మనకిట నప్రస్తుతము. భాగవత తత్త్వమును గూర్చి వ్రాయుఁబడు ప్రకరణమున నయ్యది సంపూర్ణముగ వ్యాఖ్యానింపఁబడును. ఇట మనకు ముఖ్యమగునది "అన్వయాదితరశ్చ" యనునది మాత్రమే. దీనిని బోతన "అనువర్తనమున వ్యావర్తనమున" నని యాంధ్రీకరించి యున్నాఁడు. ఇది కేవలమద్వైతపరమగు నర్థము. ఈ విషయమున శ్రీధర వ్యాఖ్య యిట్లున్నది.

"యద్వా - అన్వయ శబ్దేనానువృత్తిః ఇతర శబ్దేన వ్యావృ
త్తిః అనువృత్తత్వాత్సద్రూపం బ్రహ్మ కారణం మృత్సువర్ణాది
వత్. వ్యావృత్త త్వాద్విశ్వం కార్యం ఘటకుండలాదివదిత్యర్థః"

అనువృత్తి పదమువలనఁ గారణరూపమగు బ్రహ్మము చెప్పఁబడుచున్నది. వ్యావృత్తి పదమువలనఁ గార్యరూపమగు విశ్వము చెప్పఁబడుచున్నది. మృత్సువర్ణాదులు కారణములు. ఘట కుండలాదులు కార్యములు. ఘటము మృద్రూపము. కుండలము సువర్ణ రూపము. ఇట్లయ్యు నామరూపకల్పనచే ఘట కుండలములు మృత్సువర్ణములకంటె వేఱుగా భావింపఁబడుచున్నవి. అట్లే సద్రూపమగు బ్రహ్మను నామరూపకల్పనచే విశ్వరూపమున నానాప్రకారముల భాసించుచున్నది. ఇట్టివే మఱికొన్ని యుదాహరణములు.

౧"ఏకాయనోఽసౌ ద్విఫలస్త్రిమూల
శ్చ తూరసః పంచశిఖ షడాత్మా
------- స్మిన్నః ద్విఖగః"

అను నీ శ్లోకమునకు శ్రీధరీయ వ్యాఖ్యను దిలకించునది.
"లోకాదిరూపం ద్వైతం చ సర్వం తద్వ్యతిరేకేణ నాస్తీతి వక్తుం

౧. భాగ. దశ. స్క. అధ్యా. ౨. శ్లో. ౨౭

ద్వైత ప్రపంచం వృక్షరూపేణ నిరూపయంతి – ఏకాయన ఇతి.
అస్యాప్రపంచః అదివృక్షః, వృశ్చ్యత ఇతి వృక్షః సమష్టివ్య
------- ద్వౌ జీవేశ్వరౌఖగౌయస్మిన్ సః"

దీనికిఁ బోతన యాంధ్రీకరణము –

"ప్రకృతి యొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖ
ములు రెండు గుణములు మూఁడు వేళ్లు
తగురసంబులు నాల్గు ధర్మార్థ ముఖరంబు
లెఱిఁగెడి విధములై దింద్రియంబు
లాఱు స్వభావంబు లా శోకమోహాదు
లూర్మలు ధాతువులొక్క యేడు
పై పొరలెనిమిది ప్రంగలు భూతంబు
లై దుబుద్ధియు మనో హం కృతులును
రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు ప్రాణ
పత్ర దశకంబు జీవేశ పక్షి యుగముఁ
గలుగు సంసార వృక్షంబు గలుగఁ జేయ
గావనడఁగింప రాజవొక్కరుఁడవీవ."

మీఁది యాంధ్రీకరణమున ముఖ్యముగా గమనింపవలసిన యంశములు కొన్ని గలవు. "ఏకాయనః" అను దానికి శ్రీధరీయ మందు "ఏకా ప్రకృతిః అయనం ఆశ్రయో యస్యసః" అని వ్యాఖ్యయున్నది. అనఁగా నిట 'ఏకా' యను మాటకు ప్రకృతి యను మాత్రమే వివరణము గలదనుట. ఇఁక వీరరాఘవీయ వ్యాఖ్యయందిట్లు కలదు.

౧."ఏకం ప్రకృతి తత్త్వం పరబ్రహ్మతత్త్వం వా" పోతన యాంధ్రీకరణమునఁ బ్రకృతి మాత్రమే చెప్పఁబడినది, పరబ్రహ్మ ప్రసక్తియేలేదు. పోతన శ్రీధరీయమునే యనుసరించెననుట కిది యింకొక నిదర్శనము. తద్వ్యాఖ్యాను సారముగ విపులీకరించెననుటకుఁ గూడ నిదర్శనము.

---

౧. చూ. భాగ. దశ. స్కం. వావిళ్ల ముద్రణము రెండవ సం. ౧౮౦ పుట. ప్రచురణ – ౧౯౨౭.

ఇఁక నాంధ్రీకరణమున వ్యాఖ్యానమందలి విషయములన్నియుఁ గొన్నియెడలఁ బేర్కొనఁబడలేదు. "షడాత్మా" యనుదానికి వ్యాఖ్యయందుబుభుక్షా పిపాసా శోకమోహజరామృతి రూపషడూర్మి వివరణము గలదు. ఆంధ్రీకరణమున శోకమోహాదు" లని సంక్షేపముగాఁ జెప్పఁబడినది. మఱియు నాధ్రమున "ధాతువులు" అని మాత్రమే యున్నది. వ్యాఖ్యయందు త్వగ్రుధిరమాంసాదిసప్తధాతువులును బేర్కొనఁబడినవి.

"నైమిశేఽనిమిషక్షేత్రే మునయశ్శౌనకాదయః
సత్రం స్వర్గాయ లోకాయ సహస్రసమమాసత"

ఇందు "స్వర్గాయ లోకాయ" యను మాటలకర్థము, సర్వ సాధారణముగా "స్వర్గలోకము కొఱకు" కని చెప్పుటయే సహజము. వీరరాఘవీయమునందట్లే కలదు.[1] కాని శ్రీధరులకీ యర్థము రుచింపలేదు. సహస్రవర్షములు సత్రయాగము గావించుటకేవల స్వర్గ భోగముల కొఱకా? అది సరికాదు. భాగవత ప్రతిపాదితార్థమునది కాదు. కావున నిందలి స్వర్గ పదమున కన్యథా గతిఁ గల్పింపవలయును. "[2]స్వర్లోకగీయమానుఁడగు హరి స్వర్గుండనంబడు, ఆ హరియే భక్తులకు నివాస స్థానమగు లోకము, అట్టి లోకమును బొందుటకు" అని శ్రీధరులు వ్యాఖ్యానించిరి. ఇట్లే అనిమిషక్షేత్రమను దానికిఁ గూడ నసాధారణమగు నర్థమునే కల్పించిరి. సర్వ సాధారణముగా ననిమిషులనఁగా దేవతలనియే యర్థము కదా! తద్భిన్నముగా శ్రీధరులు "అనిమిష" శబ్దమునకు విష్ణువను నర్థమును జెప్పిరి. [3]అలుప్తమగు దృష్టి కలవాఁడగుట మహావిష్ణు "వనిమిష" శబ్ద వాచ్యుఁడని యాయన యభిప్రాయము. దీనికిఁ బోతన యాంధ్రీకరణమును దిలకింపుఁడు.

'నైమిశారణ్యంబను శ్రీవిష్ణు క్షేత్రంబునందు శౌనకాది మహామునులు స్వర్లోకగీయమానుండగు హరింజేరు కొఱకు" ఈ యాంధ్రీకరణము శ్రీధరుల భావార్థ దీపిక కనుకరణమనుట నిరాక్షేపణీయముగదా!

శ్రీ శుకుఁడు పరీక్షితునకు ముక్తిమార్గముఁ దెలుపు ఘట్టమున మూలమున నిట్లున్నది.

[4]"అండకోశే శరీరేస్మిన్ సప్తావరణ సంయుతే" దీనికి భావార్థ దీపిక

---

౧. స్వర్గాయ లోకాయ స్వర్గో నిరతిశయానందః తాద్రూపోలోకః

౨. స్వః స్వర్గే గీయతే ఇతి స్వర్గాయో హరిః, స ఏవ లోకః భక్తానాం నివాసస్థానం, తస్మై తత్ప్రాప్త్య యిత్యర్థః

3. అనిమిషః శ్రీవిష్ణుః అలుప్తదృష్టిత్వాత్.

౪. భాగ. ద్వి. స్క. అధ్యా. ౧. శ్లో - ౨౫

౧"అండకోశ ఇతిః అండకోశే అండకోశాంతర్వర్తినికటాహేవ, పృథివ్యావరణం తతః అప్తే జోవాయ్వాకాశాహంకార మహత్తత్వాదీని సప్త".

దీనికిఁ బోతన యాంధ్రీకరణము "విలోక్యమానంబగు ధరణీ నలిల తేజస్సమీరణ గగనాహంకార మహత్తత్త్వంబులనియెడి సప్తావరణంబులచేత".

సూతుఁడు నారాయణ కథా ప్రశంస సేయు ఘట్టమున మూలముననిట్లున్నది.

౨"యః స్వానుభావమఖిలశ్రుతిసారమేక

మధ్యాత్మ దీపమతి తీరవతాం తమో స్థమ్

సంసారిణాంకరుణయాహ పురాణ గుహ్యం

తం వ్యాససూనుముపయామి గురుంమునీనామ్."

ఇందు "అధ్యాత్మదీప" మ్మను దానికి శ్రీధర వ్యాఖ్య -

౩"అత్మానం కార్యకారణ సంఘాతమధికృత్యవర్తమానం

అధ్యాత్మం అత్మతత్త్వం తస్య దీపం సాక్షాత్ప్రకాశకం."

పోతన యాంధ్రీకరణము "కార్యవర్గంబును గారణ సంఘంబు నధికరించి చరించు నాత్మ తత్త్వ మధ్యాత్మ మనఁబడునట్టి యధ్యాత్మమ్ముఁ దెలియఁ జేయఁగఁ జాలుదీపమగుచు", మూలమున 'ఏక'మ్మను నొక్క పదమే యున్నను వ్యాఖ్యానానుసారముగ "ఏకమై యసాధారణమగు ప్రభావరాజకంబైన" అని యాంధ్రీకరించియున్నాఁడు.

కాళీయపత్నులు శ్రీకృష్ణుని స్తుతిచేయుట మూలమున నిట్లున్నది -

"నమో సంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే

నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే.

నమః ప్రమాణ మూలాయ కవయే శాస్త్రయోనయే"

---

౧: చూ. వావిళ్ల వారి ప్రతి సం.౧. పుట. ౧౪౯

౨. సం. భాగ. ప్రథ. స్క. అధ్యా. ౨. శ్లో. ౩.

౩. చూ. వావిళ్ల ప్రతి. సం. ౧. పుట. ౧౯

దీనికి శ్రీధరీయ వ్యాఖ్య

"అనంతాయ అహంకారపరిచ్ఛేదాత్, అతః సూ
క్ష్మాయ అదృశ్యత్వాత్, అత ఏవ కూటస్థాయ, ఉ
పాధి కృతవికారాభావాత్, అత ఏవ విపశ్చితే, సర్వ
జ్ఞాయ నానేతి - నానావాదానురోధాయ, అస్తి, నాస్తి
సర్వజ్ఞః, కించిజ్ఞ, బద్ధః, ముక్తః, ఏకః, అనే
కః ఇత్యాదీన్ నానావాదాన్ అనురుణద్ధి - మాయ
యా అనువర్తతే యః, తస్మై, వాచ్యవాచక శక్తయే,
అభిధానాభిధేయ శక్తి భేదాదపి నానాత్వే ప్రతీ
యమానాయ. నమఇతి - ప్రమాణ మూలాయ, చక్షు
రాదీనాం చక్షురాదిరూపాయ, అతఏవ కవయే స్వ
యం తన్నిరపేక్ష జ్ఞానాయ, కుతః? శాస్త్రయోనయే
వేదాత్మకవిశ్వాసాయ".

దీనిఁ బోతన యాంధ్రీకరణము -

"------------- మూఁడహంకృతులచే ముసుగువడక
నెఱిననంతుఁడవై దర్శనీయ రుచివి
గాక సూక్ష్ముఁడవై నిర్వికార మహిమఁ
దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు
నీకుమొక్కెదనాలింపు నిర్మలాత్మ".

మఱియుఁగలండు, లేఁడు, సర్వంబు నెఱుంగు, నించుక యెఱుంగు, బద్ధుండు, విముక్తుండు, ఒకండ, నేకుండు ననునిమొదలుగాఁగల వాదంబులు మాయవలన నను రోధింపుదువుగావున, నానావాదానురోధ కుండవయ్యును నభిధానాభిధేయ శక్తి భేదంబులవలన బహు ప్రభావ ప్రతీతుండ డవయ్యును జక్షురాదిరూపంబులవలనఁ బ్రమాణ రూపకుండవయ్యు వేదమయ విస్వాసత్వంబువలన శాస్త్రయోనియ్యు"౧

---

౧. దశ. స్కం. పూ, భా. ౬౮౧, ౬౮౨

మూలమునఁగపిల దేవహూతి సంవాద ఘట్టమున నిట్లున్నది.

౧"యేషామహంప్రియ ఆత్మాసుతశ్చ

సఖా గురుస్సుహృదోదైవమిష్టమ్."

దీనికి శ్రీధరీయము –

"సుతఇతస్నేహవిషయః, సఖేవ విశ్వాసాస్పదం, గురు

రివహితోపదేష్టా, సుహృదివహితకారీ, ఇష్టం దైవమి

వపూజ్యః".

దీనికిఁ బోతన యాంధ్రీకరణము –

"నముఁడై స్నేహముచే సుతత్వమును విశ్వాసంబుచేతన్ సఖి

త్వముఁ జలన్ హితవృత్తి చేతను సుహృత్త్వంబున్ సుమంత్రోపదే

శముచేతన్నిజదేశికుండనఁగ నిచ్చల్ పూజ్యుఁడౌ నిష్టదై

వమునై వారికిఁగాలచక్ర భయముల్ వారింపుదున్ గావునన్."

ఇట్లు మూలమును విపులీకరించి శ్రీధరీయ వ్యాఖ్యానానుసారము పలుతావులందు రచించియుఁ గొన్నియెడల మూలముననున్నది. యున్నట్లు గనే యాంధ్రీకరించెను.

ఇందులకుఁ గొన్ని యుదాహరణములు –

౨"సత్వం రజస్తమ ఇతి ప్రకృతేర్గుణాస్తైః

యుక్తః పరః పురుష ఏక ఇహాస్య ధత్తే

స్థిత్యాదయే హరివిరించిహరేతి సంజ్ఞాః

శ్రీ యాంసి తత్రఖలు సత్వ తనోర్నృణాం స్యుః

౧. చూ. వావిళ్ల సం. భాగ. స్క.౩, అధ్యా, ౨౫. శ్లో, ౩౮.

౨. స్కం.౧. అధ్యా. ౨. శ్లో. ౨౪.

దీనికిఁ బోతన యాంధ్రీకరణము -

[౧]"పరమ పూరుషుఁడొక్కఁడాఢ్యుఁడు
పాలనోద్భవ నాశముల్
సొరిదిఁ జేయముకుంద పద్మజ
శూలిసంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురిత సత్త్వ రజస్తమంబుల
బొందునందు శుభస్థితుల్
హరిచరాచర కోటికిచ్చున
నంత సత్త్వ నిరూఢుఁడై"

[౨]"భూయాననుగ్రహ అహోభవతాకృతోమే
దండస్త్వయామయి భృతోయదపి ప్రలబ్ధః
న బ్రహ్మ బంధుషుచవాం భగవన్నవజ్ఞా
తుభ్యం హరేశ్చ కుతఏవ ధృతవ్రతేషు."

[3]"విద్యాతపోవ్రతపరాఙ్ముఖతస్తు విప్రాన్
బ్రహ్మాత్మ తత్త్వ మవితుం ప్రథమంత్వమస్రాక్
తద్బ్రాహ్మణాన్ పరమ సర్వవిపత్సుపాసి
పాలః పశూనివ విభో! ప్రగృహీతదండః"

దీనికిఁ బోతన యాంధ్రీకరణము -

[౪]"వినునీకపరాధుఁడనగు
ననుదండించుటిది దండనముగాదు మదిన్

౧. స్కం. ౧. పద్యము. ౬౦
౨. స్కం. ౪. అ, ౭. శ్లో, ౧౨.
3. స్కం. ౪. అ, ౭, శ్లో. ౧౪.
౪. స్కం. ౪. ప. ౧౫౫

నను రక్షించుటఁగా మన
మునఁ దీలఁతును దేవ! యభవ! పురహర! రుద్రా!

[1]"అనఘాత్మ! తగ నీవునబ్జనాభుండును
బరికింప బ్రాహ్మణా భాసులయిన
వారల యెడల నెవ్వలనను పేక్షింప
రఁట దృఢవ్రత చర్యులైన వారి
యెడ నీకు పేక్ష యెక్కడిది? సర్గాదిని
నామ్నాయ సంప్రదాయ ప్రవర్త
నము నెఱింగించుటకమర విద్యాతపో
వ్రతపరాయణులైన బ్రహ్మణులకు
నరుసఁబుట్టించితివికాన వారినెపుడుఁ
గేలదండంబుఁ బూని గోపాలకుండు
బలసి గోవుల రక్షించు పగిది నీవు
నరసి రక్షించుచుందుగదయ్య! రుద్ర!

శ్రీధరీయ వ్యాఖ్య తనకు రుచింపనప్పుడు స్వతంత్రించి పోయిన ఘట్టములును గలవు.

[2]"యస్యభాసా సర్వమిదం విభాతిసచరాచరమ్

[3]"తతో తి కుతుకో ద్వ్యుత్వస్తిమితైకాదశేంద్రియః,
త్థమ్నాభూదజస్తూష్ణీం పూర్దేవ్యంతీవ పుత్రికా"

"పూర్దేవ్యంతీవపుత్రికా" యను నీ శ్లోక పాదమున కర్థమును వ్రాయునెడ శ్రీధరులలోఁ గొంత స్పష్టత లోపించినదనియే చెప్పనగును. వారి వ్యాఖ్యయిట్లున్నది.

---

౧. స్కం. ४. పద్య, ౧౬౦
౨. స్కం, ౧౧, అధ్యా, ౧౩, శ్లో, ౫౫, ౨. స్కం, ౧౦. అధ్యా, ౧౩. శ్లో, ౫౬.
౩. చూ. వావిళ్ల సం.

[1]"అత్ర దృష్టాంతః పూర్వేద్వీ ప్రజాధిష్ఠాత్రీ కాచిద్దేవతా, తస్యాః,

అంతి సమీపే పుత్రికా, చతుర్ముఖీ కనకప్రతిమేవ"

ఈ దృష్టాంత సామంజస్యమావ్యాస భట్టారకునకే తెలియవలెను. ప్రజాధిష్ఠాత్రియగు నొక దేవతముందర జతుర్ముఖి యగు బ్రహ్మ కనక ప్రతిమవలె (విష్ణు తేజము ముందర) స్తిమిత సర్వేంద్రియుఁడై తూష్ణీ భావమున నిశ్చలుఁడై యుండెనఁట! ఇందు సమానోపమేయములకు లింగైక్యము లేదు. ఈ గజిబిజి యంతయుఁ బోతనకు రుచింపలేదు. అందులకే యాయుపమను జారవిడిచి యెట్లు స్వతంత్రించి వ్రాసినాఁడో చూడుఁడు.

[2]"ఏ పరమేశు తేజమున నీ సచరాచరమైన లోకము
ద్దీపితమయ్యెనట్టి విభుతేజము కన్నులఁజక్కఁజూడఁగా
నోపకపారవశ్యమును నొందుచు సంస్తి మితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మైమఱచెనప్పుడు చిత్రపురూపుకైవడిన్"

హిరణ్యాక్షవధానంతరము హిరణ్యకశిపుఁడు తల్లి నూరార్చు ఘట్టము మూలము.

[3]"అంబాంబ! హేవధూః పుత్రా వీరంమార్హథ శోచితుమ్".

"రిపోరభిముఖే శ్లాఘ్యశ్శూరాణాం వధ ఈప్సితః"

"భూతానామిహసంవాదః ప్రపాయామివసువ్రతే
దైవేనైకత్రనీతానామున్నీతానాం స్వకర్మభిః"

ఈ శ్లోకములను యథాతథముగా నాంధ్రీకరించెను.

[4]"నీరాగార నివిష్ట పాంథులక్రియన్నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు గూడి విత్తురు సదాసంగంబు లేదొక్కచో

---

౧. చూ. వావిళ్ల సం, భాగ. దశమస్కం. పుట. ౨౪౫.

౨. స్కం, ౧౦. పూ.భా. ౫౩౬.

౩. స్కం, ౭. అధ్యా, ౨. శ్లో, ౨౧, ౨౨.

౪. స్కం. ౭. పద్య. ౩౮.

ఘూరుల్ పోయెడి త్రోవఁ బోయెను భవత్పూనుండు తల్లీ! మహా
ఘూరుండాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీకేటికిన్.

కొన్ని యెడల మూల శ్లోకార్థమును యథాతథముగా గ్రహించి శయ్యాసైగనిగ్యముచే దానికి మెఱుఁగులు వెట్టును. ఇందులకొక యుదాహరణము.

౧"యతోన కశ్చిత్క్వచకుత్ర విద్వాన్
దీనస్స్వమాత్మానమలం సమర్థః
విమోచితుంకామదృశాం విహార
క్రీడామృగోయన్నిగళో విసర్గః"

ఆంధ్రీకరణమునందలి శయ్యాసౌభాగ్యమును దిలకించునది

"హాలాపానవిజృంభమాణ మదగర్వాతీత దేహాల్లన
ద్బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముఁడై లేశమున్
వేలానిస్సరణంబు గానక మహా విద్వాంసుడుం గామినీ
హేలా కృష్ణ కురంగ శాబకమగున్ హీనస్థితిన్ వింటిరే"

స్కం. ౭. పద్య. ౨౧౫

ఇట్లు యథాతథముగా నర్థమును గ్రహించుటయేకాక కొన్ని యెడల మూలమునందలి సంస్కృత శ్లోకములనే యున్నది యున్నట్లుగఁ దెనుఁగు పద్యములలోనిముడ్చుటయుఁ గలదు. అనఁగాఁ దెనుగు విభక్తి ప్రత్యయములు చేర్పకయే సంస్కృత పదములను యథాతథముగా గ్రహించుటయుఁగలదని భావము.

ప్రచేతసులకు రుద్రుఁడు యోగాదేశమను స్తోత్రమును దెలుపుట మూలమున నిట్లున్నది.

"నమః పంకజనాభాయ భూతసూక్ష్మేంద్రియాత్మనే
వాసుదేవాయ శాంతాయ కూటస్థాయ స్వరోచిషే
సంకర్షణాయ సూక్ష్మాయ దురంతాయాంతకాయ చ

---

౧. స్కం. ౭. అధ్యా. ౬. శ్లో. ౨౫.

----------- వాచో విభూతయే"

స్కం. ४. అధ్యా - 8 శ్లో ३४ - ४३

దీనికిఁ బోతన యాంధ్రీకరణమున పదములను యథాతథముగ వాడినను క్రమమేమియు పాటించి యుండలేదు.

"పంకజనాభాయ సంకర్షణాయ శాన్తాయ విశ్వప్రబోధాయ భూత

------ విభృతాత్మనే నమోస్తు"

ఈ స్తోత్రము నందలి పదములు చాలవఱకు వ్యాఖ్యాసాపేక్షములు. శ్రీధరీయమున వీనియర్థము విపులముగా వ్రాయఁబడియున్నది. అట్లయ్యుఁ బోతన వాని నాంధ్రీకరింపలేదు. మఱియు నియ్యవి విష్ణుతత్త్వ ప్రతిపాదకములు. పోతన యద్వైతియగు విష్ణు భక్తుఁడు. అట్లయ్యు వీని యర్థమును విపులీకరింపలేదు. ఇటుఁ బోతన శ్రీధర వ్యాఖ్యను జూడలేదనుటకును వీలులేదు. "కూటస్థాయ" యను దానికి శ్రీధరులు "నిర్వికారాయ" యని యర్థమును వ్రాసిరి. పోతన నిర్వికారాయ యను పదమునే గ్రహించెను. "ఆపాటి యర్థము పోతనకు మాత్రము తెలియదా" యనిఁగాదు. "చాతుర్హోత్రాయ తంతవే" యను దానికి శ్రీధరులు "చతుర్హోత్రం కర్మ ......... తంతవే తద్విస్తారకాయ" అని వ్యాఖ్య వ్రాసిరి. పోతనయు నావ్యాఖ్యను సారముగనే "కర్మ విస్తారకాయ" యని వ్రాసి యున్నాఁడు. కావున శ్రీధర వ్యాఖ్య నిటఁగూడఁ బోతన చూచియేయుండెను. కాని యిట వ్యాఖ్యానుసారముగ నాంధ్రీకరింపలేదు కాని యొక్క విషయము. భాగవతము నాంధ్రీకరించునప్పుడే పోతన మొట్ట మొదటిసారిగా శ్రీధర వ్యాఖ్యను జూచెనని కాని యప్పటికప్పుడే వ్యాఖ్యానమును దిరుగవేయుచు నేశ్లోకమున కాశ్లోకమే పోతన యాంధ్రీకరించెనని కాని నాయభిప్రాయము కాదు. భాగవతాంధ్రీకరణమునకుఁ బూర్వమే పోతన బహువారములు భాగవతమును శ్రీధరీయ సహితముగఁ జదివియుండును. కాని కొందఱనుకొనుచున్నట్లు వేదాంత ఘట్టములు వచ్చినప్పుడెల్లఁ బోతన శ్రీధరీయ వ్యాఖ్యానుసారముగ భాగవతము నాంధ్రీకరింపలేదు, విపులీకరించుటయును లేదు. అసలావిషయమున నాయనకొక నియమమున్నట్లు కానరాదు. కొన్ని యెడల వేదాంతఘట్టములను వ్యాఖ్యానుసారము తెనిఁగించి విపులీకరించి యున్నాఁడు. కొన్నియెడల నాంధ్రీకరణమేలేదు. పద్యము మాత్రమే తెలుఁగు పద్యము. పదములన్నియు సంస్కృతపదములే. కొన్ని యెడల సామాన్య విషయములు గూడ విపులీకరింపఁ బడియున్నవి.

మూలమున శుకుఁడు పరీక్షిత్తునకు ముక్తి మార్గమును దెల్పునవసరమున నుదాహరణము నకై ఖట్వాంగుఁడను నరపతిని గూర్చి ప్రసంగించి యున్నాఁడు. అది మూలమునఁ జాలస్వల్పముగాఁ గలదు.

౧"ఖట్వాంగో నామ రాజర్షి ర్జాత్వేయత్తా మిహాయుషః

ముహూర్తా త్సర్వముత్సృజ్య గతవా సభయం హరిమ్"

దీనికి బోతన బహుగా విపులీకరించెను

"కౌరవేశ్వర తొల్లి ఖట్వాంగుడను విభుం

డిలనేడుదీవులు నేలుచుండి"

--------- మానవేశ్వరుండు మహికివచ్చి"

స్క.౨.పద్య, ౯

"గిరులంబోలెడి కరులను" స్క.౨.పద్య, ౧౦

"గోవింద నామ కీర్తన" స్క.౨.పద్య, ౧౧

మూలమునందున్న "సర్వముత్సృజ్య" అను వాక్య పదమును గైకొని "గిరులబోలెడుకరులను" అను పద్యమును మూలమునకు వ్యాఖ్యాప్రాయముగ వ్రాసియున్నాఁడు.

మూలమునందలి కొన్ని శ్లోకముల కపార్థమును గొన్నియెడలఁ గావింపఁబడినది. సూతుఁడు శౌనకాదులకు విష్ణుని యేక వింశత్యవతారములఁ గూర్చి చెప్పు ఘట్టము -

"అవతారాహ్యసంఖ్యేయా హరే స్సత్త్వనిధే ర్ద్విజాః

యథా విదాసినఃకుల్యా సరస స్స్యుః సహస్రశః"

ఇందు "అవిదాసినః" అను పదమునకు శ్రీధరీయమున "అవిదాసినః అపక్షయ

---

౧. స్కం. ౨. అధ్యా. ౧. శ్లో. ౧౩.

౨. స్క. ౨. పద్య, ౯, ౧౦, ౧౧.

షూన్యాత్" అని వ్రాయఁబడి యున్నది. ఊటయుడుగని సరస్సునకాలువలమాడ్కినని యర్థము. ఇటఁ బోతన ¹"సరసిం బాసినఁ బాఱు కాలువలయోజన్" అని యాంధ్రీకరించియున్నాఁడు. తెనుఁగున మూలము నందలి యర్థము రాలేదు. సరికదా తద్వ్యతిరిక్తమగు నర్థము వచ్చినది. మూలమున "సత్త్వ నిధేః" అను పదము చాల ముఖ్యమైనది. సత్త్వ నిధియగు హరి యూటయుడుగని సరసితో సరిపోల్పఁబడియున్నాఁడు. ఎన్ని కాల్వలు బయటికిఁ బోయినను ఊట లూరుచున్న సరసి యింకదు. అట్లే యెన్ని యవతారము లెత్తినను సత్త్వ నిధియగు హరి సత్త్వమును, క్షీణింపదు. ఈ పదమును బోతన ¹విడుచుట వలన మూలమునందలి యర్థ సౌందర్యము తెనుఁగున మఱుఁగుపడినది. "విష్ణునందైన శ్రీకర నానాప్రకటావతారము" అని మాత్రము చెప్పఁబడినది. ఇందు "శ్రీకర" యను విశేషణమవతారముల కన్వయించునుగాని విష్ణువునకుఁగాదు. మఱియు శ్రీకరత్వము వేఱు, సత్త్వము వేఱు. ఇది యెట్లున్నను "అవిదాసినః సరసః" అను భావము తెనుఁగున రాలేదనుట స్పష్టము.

కొన్నియెడల మూల శ్లోకము లాంధ్రీకరింపఁబడనే లేదు. భాగవత ప్రథమ స్కంధమునఁ గుంతి శ్రీకృష్ణుని స్తుతిసేయు ఘట్టము. మూలము.

²"సుయోధననిసృష్టో నః శాపయామర్షణోమునిః

పత్రైశ్చాత్రృప్యత సహ త్రిలోక్యై శ్చరతాం వనే."

(పాండవులరణ్యావాసము సేయుచుండఁగా దుర్యోధన ప్రేరితుఁడై దుర్వాసుఁడకాలమునఁ బాండవుల కతిథియై వచ్చెను. అప్పుడర్ధరాత్రమగుటచే ద్రోపది భాండములనన్నిటిని శుద్ధిచేసి యుంచినది. వంటకములెవ్వియును లేవు. దుర్వాసుని కోపము జగద్విదితము. అతిథి సపర్య సేయనిచో నాతఁడలిగి పాండవులనందర శపించును. కింకర్తవ్యతామూఢయై ద్రౌపది విచారించుచుండఁగా సర్వవ్యాపి యగు శ్రీకృష్ణుఁ డచ్చట నామెకు సాక్షాత్కరించి తనకుఁ దినుటకేమైనఁ బెట్టుమనియెను. "భాండములన్నియు శుద్ధిచేసితిని, వంటకము లింకెవ్వియును లే"వని ద్రౌపది యాతనికి బదులు చెప్పెను. "అయినను భాండముల

---

౧ సరసింబాసినఁ బాఱుకాలువలయోజన్ విష్ణునందైన శ్రీ
కర నానాప్రకటావతారము లసంఖ్యాతంబులుర్వీశులన్
సురలున్ బ్రాహ్మణ సంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్
హరికృష్ణుండు బలానుజన్ముఁడెడలేదా విష్ణుఁడౌ నేర్పడన్".

౨. స్క. ౧. అధ్యా. ౮. శ్లో, ౨౫.

కంటుకొనీ యేమైననుండునేమో, వెదకి చూడు" యని శ్రీకృష్ణుఁడామెను నిర్బంధించెను. "భాండ శుద్ధి గావించుటలోఁ దనంతది లే"దని గర్వించు ద్రౌపది మొదటనందుల కంగీకరింపక పోయినను దరువాత నిర్బంధముపై నంగీకరించి భాండములఁ దడవి చూడఁగా నొకదాని యడుగున నాకొకక్కటి గానఁబడెను. ఆయాకునే భుజించి "యక్షయ" మని శ్రీకృష్ణుఁడంతర్హితుఁడాయెను. భాండములన్నియుఁ బంచభక్ష్యపరమాన్నములతో నిండిపోయెను. వానితో నాయమ దుర్వాసాదులఁ దృప్తులఁ గావించెను. ఈ కథ యిట ననుసంధేయము.)

ఈ శ్లోకమును బోతన యాంధ్రీకరింప లేదు. కారణము దురూహము.

కొన్నియెడల ముందు శ్లోకము వెనుకను, వెనుక శ్లోకము ముందుగను దెనుఁగు సేయఁబడియున్నది. ఈ క్రింది శ్లోకములు మూలమున నిట్లున్నవి -

౧"యథా హృషీకేశ ఖలేన దేవకీ

----------- ర్విపద్గణాత్"

స్క౦. ౧. అధ్యా. ౮ శ్లో. ౨౩

"విషాన్మహాగ్నేః పురుషాదదర్శనా

--------- హరేభిరక్షితాః" శ్లో. ౨౪

ఈ శ్లోకములకుఁ బోతన తెలుఁగుసేఁతః

సీ॥ ౨"తనయులతోడ నేదహ్యమానంబగు

జతుగృహంబునయందుఁ జావకుండః

--------- వర్ణింతునీరజాక్ష" స్క౦.౧. పద్య. ౧౮౮

"బల్లిదుండగు కంసుచేతను

బాధనొందుచునున్న మీ

---

౧. స్క౦. ౧. అధ్యా. ౮. శ్లో. ౨౩, ౨౪. ౨. స్క౦.౧. పద్య, ౧౮౮, ౧౮౯

---------- జగత్పతీ"

స్క. ౧. పద్య. ౧౮౯

ఇందు రెండవ పద్యము మూలము నందలి మొదటి శ్లోకమునకును మొదటి పద్యము రెండవ శ్లోకమునకు ననువాదములు. ఇట్లేలయనువదింప వలసి వచ్చెనో చెప్పఁ జాలము. కాని యొక విధముగా నన్వయింపవచ్చును. ప్రప్రథమముగాఁ దమ్మాతఁడేయే కష్టములనుండి రక్షించెనో చెప్పి, యనంతరము కంసుని బారినుండి మీ తల్లిని రక్షించినట్లే రక్షించితివని చెప్పుట సమంజసమని పోతన భావించెనేమో! అనఁగాఁ బ్రత్యేక విషయములనుండి సామాన్య విషయములకేగుట యిట ముఖ్యముగా ననుసరింపఁబడిన మార్గమని భావము. ఇందుఁ గొంత పెంపుగూడఁ గలదు. "అనేక మహారథాస్త్రతః" అను దానికి గాంగేయ కుంభజ కర్ణాది ఘనులచే" నని యాంధ్రీకరణము. మూలార్థమిటఁ గొంత స్పష్టీకరింపఁబడినది.

కొన్నియెడల మరల నీకుంతీ స్తోత్రమునందే శ్రీధరీయ వ్యాఖ్యాను సారముగ నాంధ్రీకరింపఁబడిన శ్లోకములు గలవు. అందే వివరణ మావశ్యకమై యున్న కొన్ని పదములు యథాతథములుగ గ్రహింపఁబడినవియుఁ గలవు. మూలమునా "నివృత్త గుణ వృత్తయే" అనుపదము కలదు. దానికి శ్రీధరీయమునా "నివృత్తాః గుణ వృత్తయో ధర్మార్థకామ విషయాః యస్మాత్తస్మై" అని కలదు. దీనిని బోతన "నివృత్త ధర్మార్థ కామ విషయుండును" అనియాంధ్రీకరించియున్నాఁడు. అట్లే మూలమున –

"జన్మ కర్మ చ విశ్వాత్మ న్నస్యాకర్తు రాత్మనః

తిర్యఙ్నౄర్షి యాదస్సు తదత్యంతవిడంబనయ్."

దీనిని శ్రీధరులిట్లు వ్యాఖ్యానించియున్నారు. "అజస్య జన్మ, అకర్తుః కర్మ, తిర్యక్షు వరాహాదిరూపేణ, ఋషు వామనాదిరూపేణ, యాదస్సు మత్స్యాది రూపేణ" దీనికిఁ బోతన యాంధ్రీకరణముః "జన్మకర్మ శూన్యుండవయిన నీవు తిర్యగాది జీవులయందు వరాహాదిరూపంబులను, మనుష్యుల యందు రామాది రూపంబులను ఋషుల యందు వామనాది రూపంబులను జలచరంబులయందు మత్స్యాది రూపంబులను నవతరించుట లోకవిడంబనార్థంబు గాని జన్మకర్మ సహితుండవగుటంగాదు."

---

౧. స్క.౧.౧. అధ్యాః ౮. శ్లో. ౨౮. ౨. చూ. వావిళ్ల. స్క.౧. పుట. ౯౯

౩. స్క. ౧. అధ్యా. ౮, శ్లో. ౩౦. ౪. చూ. వావిళ్ల స్క. ౧. పుట. ౭౦

౫. స్క. ౧. వచనము. ౧౯౧.

ఆంధ్రీకరణమున వ్యాఖ్యయందులేని రామావతారము చేర్పఁబడినది. మూలమునందలి నరశబ్దమును శ్రీధరులు వ్యాఖ్యానింపలేదు. అందులకే పోతన రామావతారమును గ్రహించియుండును. పోతన రామభక్తి గూడ నిందులకుఁగారణమై యుండునా?

మూలమున ధర్మజ విలాపము :-

౧"పారక్యస్యైవ దేహస్య బహ్వ్యో మే క్షోహిణీర్హతాః"

దీనికి శ్రీధర వ్యాఖ్య -

౨"పారక్యస్యైవ శ్వ సృగాలాద్యాహారస్యైవ దేహస్యార్థే"

కుక్కలకు నక్కలకు నాహారమగు శరీరము నిమిత్తము అని మీది వ్యాఖ్యకర్థముకదా! దీనికిఁ బోతన తెనుఁగు సేఁతచూడుఁడు.

౩"తన దేహంబునకై యనేక మృగ సంతానంబుఁ జంపించుదుర్జను భంగిన్"

ఆంధ్రీకరణమున మూలార్థము రాలేదు. కాని యీ యర్థము గూడ సమంజసముగానే యున్నది.

కొన్నియెడల మూలమునకు విరుద్ధముగా నాంధ్రీకరణము గలదు. అట్టి మార్పును బోతన యేల కావించెనో చెప్పఁజాలము.

తీర్థయాత్రల గావించివచ్చిన విదురుని ధర్మజుఁడు కొన్ని ప్రశ్నలడుగును. వానికన్నిటికిని విదురుఁడు సమాధానవిచ్చును. కాని యాదవ కుల నాశనమును గూర్చి మాత్రము చెప్పఁడు. అట్లు చెప్పకపోవుటకుఁ గారణ మాతఁడు దయాళువగుటయేయని మూలమునఁ గలదు. యాదవక్షయమును వినినంతనే ధర్మ రాజాదులు బహుధా దుఃఖింపకమానరు. అద్దానిని విదురుఁడు కరుణాళువు గావునఁ జూడఁ జాలఁడు. (మూలము)

౧"ఇత్యుక్తో ధర్మరాజేన తత్సర్వం నమవర్ణయత్

యథాను భూతం క్రమశో వినా యదుకులక్షయమ్

నన్వప్రియం దుర్విషహం నృణాం స్వయం ముపస్థితమ్

---

౧. స్క. ౧. అధా. ౮. శ్లో, ౪౮ ౨. స్క. ౧. వావిళ్ల, పుట, ౨౩. ౩. స్క.౧.

నావేదయత్స్వకరుణో దుఃఖితాన్ ద్రష్టు మక్షమః"

దుఃఖితులగు ధర్మరాజాదులఁ జూడనక్షముడయి విదురుఁడు యాదవక్షయమును గూర్చి చెప్పలేదని మూలముననున్నది. పోతన యీ క్రింది విధముగా దీని నాంధ్రీకరించి యున్నాఁడు.

"అనవిని ధర్మరాజునకు నావిదురుండు సమస్తలోక వ

ర్తనముఁగ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి యదుక్షయంబు సె

ప్పిన నతఁడుఁగ్రశోకమున బెగ్గిలి కుందెడినంచు నేమియున్

వినుమనిచెప్పఁడయ్యె యదువీరుల నాశము భారతోత్తమా!"

ఇంతదనుక బాగుగనే యున్నది. మూలార్థము సమగ్రముగ సవ్యముగ నాంధ్రమునకు వచ్చినది. అంతతో నూరకొనిన బాగుండెడిది. కాని పోతన మీఁది పద్యము తరువాతనే యింకొక పద్యమును వ్రాసి యున్నాఁడు.

౧"మేలు సెప్పెనేని మేలంద్రు లోకులు

చెట్టయంద్రు కీడు సెప్పె నేని

నంతమీద శూద్రుఁడైన కతంబున

శిష్టమరణమతఁడు సెప్పఁడయ్యె"

ఈ పద్యమునకు మూలమెద్దియుఁ గానరాదు. విదురుఁడు శూద్రుండు. అనఁగా శూద్రయోని సంజాతుఁడు. కావున శిష్టులగు యాదవుల మరణ వృత్తాంతమును. జెప్పఁ జాలక పోయెననఁట. విదురుఁడు శూద్రుఁడేయగుఁగాక! యాదవులు శిష్టులేయగుదురుగాక! అయినను మరణ వృత్తాంతమును గూడఁ జెప్పుట కాంతఁడనర్హుడా? వార్తావహుఁడు గూడ ద్విజుఁడే కావలయునా? ఇదియెక్కడి ధర్మ శాస్త్రము? పోతన యిట్టి పద్యముల నేల వ్రాసెను? అసలు మూల శ్లోకార్థము ముందే వివరింపఁ బడినదికదా! విదురుఁడేల యాదవ వినాశనమును గూర్చి ధర్మజునకుఁ జెప్పలేదో ముందే వివరింపఁబడినది. ఇఁక నీ పద్యమేల

---

౧. స్క. ౧. అధ్యా. ౧౩. శ్లో, ౧౨, ౧౩. ౨. స్క. ౧. పద్య. ౩౦౫

౧. స్క. ౧. ప. ౩౦౬.

వ్రాయవలసి వచ్చినది? ఒకే ప్రశ్నకుఁ బరస్పర విరుద్ధములగు రెండు సమాధానములు నేల యీయవలసి వచ్చెను? పై యంశములనన్నిటిని బాగుగఁ బర్యాలోచన చేసిచూడఁగ నీ పద్యము ప్రక్షిప్తమేమో యని సందేహించుట కవకాశము గలదు. అటులీ పద్యమును వదలించుకొనుట చాల సుకరము. కాని యది స్థూల దృష్టికి మాత్రమే సమంజసముగఁ దోఁచును. కొంచెమాలోచించిన నీ పద్యము ప్రక్షిప్తమనుట కవకాశము చాలదు. మూలమునఁ గూడ విదురుని శూద్రత్వ ప్రసక్తి గలదు. కాని యది యన్య విషయమును గూర్చి ప్రసంగాంతరమునఁ జెప్పఁబడినది. విదురుఁడు యాదవ నాశనమును గూర్చి ధర్మజునకుఁ జెప్పక పోవుట కాతని దయార్ద్రహృదయత్వమే కారణము. [1]ధర్మజునితోఁ బ్రసంగించిన తరువాత విదురుఁడు పాండవులకడ గొంత కాలముండెను. అక్కాలముననాతఁడు ధృతరాష్ట్రునకుఁ దత్త్వోపదేశముచేయుచుండెను. [2]తత్త్వముపదేశింప శూద్రున కర్హతగలదాయని శంకచేసి యద్దానికి సమాధానముగా మూలగ్రంధకర్త "విదురుఁడిప్పుడు శూద్రయోని సంజాతుఁడయ్యు నిహజన్మమునకుఁ బూర్వము యముఁడు గావునఁ దత్త్వోపదేశమున కర్హుఁడే" యని వ్రాసెను. అప్పుడీ యముఁడు శూద్రుఁడై పుట్టుటకుఁ గారణము మాండవ్యమహాముని శాపమనియుఁ జెప్పఁబడియున్నది. మూలమందలి మాండవ్య శాపవృత్తాంతము దెనుఁగునఁ గూడఁ గలదు. "అదియెట్లనిన మాండవ్యమహాముని శాపంబునందొల్లి యముఁడు శూద్రయోని యందు విదురుఁడై జన్మించియున్న నూఱువత్సరంబులయ్యు ముందు యథా క్రమంబునఁ బాపకర్ముల దండించె".

ఇచ్చటనే పోతన భ్రాంతికి లోనై యుండును. మూలమున శూద్రుఁడగు విదురునకుఁదత్త్వోపదేశార్హత కలదా? లేదా? యను ప్రశ్నకు సమాధానముగా మాండవ్యుని శాపవృత్తాంతము చెప్పఁ బడినది. అద్దానిని స్మరించుటలోఁ బోతన కొంత పొరపడియుండును. కావుననే విదురుఁడు మాండవ్యుని శాపము వలన శూద్రుఁడై జన్మించిన యముఁడనియుఁ దాను శూద్రుఁడగుటచేతనే శిష్టులను యాదవుల మరణ వృత్తాంతమును ధర్మజునకుఁ జెప్ప లేదనియుఁ బోతన వ్రాసియుండును. శూద్రయోని సంజాతుఁడైనను విదురునకుఁ దొలుత

---

౧. స్క, ౧. అధ్యా, ౧౩. శ్లో. ౧౪. "కంచిత్కాల మథావాత్సీత్సత్కృతో దేవవత్సుఖైః, భ్రాతుర్జ్యేష్ఠస్య శ్రేయస్కృత్సర్వేషాం ప్రీతిమావహన్, అబిభ్రదర్యమా దండు యథాఘమఘకారిషు, యావద్ద ధార శూద్రత్వం శాపా ద్వర్షశతం యమః

౨. భారతమున నిందులకు వ్యతిరేకముగాఁ గలదు. ధృతరాష్ట్రుఁడు దనకు నధ్యాత్మ విషయములు చెప్పుమన విదురుఁడు దాను శూద్రుఁడగుట నట్టివి చెప్పరాదని నిరాకరించును. చూ. భాగవతము, ఉద్యోగ పర్వము. సనత్సుజాతీయమునకుఁ బూర్వము. సనత్సుజాతీయమును తిక్కన తెనుఁగు సేయలేదు.

యముఁడగుటఁ దత్త్వోపదేశార్హత గలదని మూలముననుండఁగాఁ దెనుఁగున శూద్రుఁడగుట విదురునకు మరణ వృత్తాంతము గూడఁ జెప్పనర్హతలేదని వ్రాయఁబడియున్నది. ఈ మార్పుగల పద్యము ప్రక్షిప్తమనుట కంటె భ్రాంతి మూలకమనుటయే యొక్కుడు సమంజసము.

పోతన శ్రీధరీయ వ్యాఖ్యనే యనుసరించెననుట కొక చక్కని యుదాహరణము. శ్రీకృష్ణుఁడంతః పురకాంతలను జూడఁ బోవు ఘట్టము. మూలము.

[1]"ఉద్దామ భావ పిశునామల వల్గుహాస

వ్రీడావలోక నిహతో మదనోపి యాసామ్

సమ్ముహ్య చాప మజహాత్ప్రమదోత్తమా స్తా

యస్యేంద్రియం విమథితుం కుహకై ర్నశేకుః".

ఈ శ్లోకమును శ్రీధరుల్గి వ్యాఖ్యానించియున్నారు.

[2]"ఉద్దామేతి యాసా ముద్దామో గంభీరో భావో భిప్రాయః

తస్య పిశునః సూచకః అమలో వల్గుః మందహాసః వ్రీడాలోకశ్చ

తాభ్యాం నిహతః అమదనః మహాదేవో పి సమ్ముహ్య లజ్జ

యా చాప పినాక మజహాతీ ఏవం ప్రభావాః స్త్రియః ఇత్యేతావద్వి

వక్షితం యద్వా భగవతమోహి నీరూపేణ మహేశో పి మోహిత

ఏవ ఏతాశ్చలాః దృగ్విలాసా ఏవేతి తథోక్తమ్. తాః కుహకైః క

పటైః విభ్రమైః యస్యేంద్రియం విమథితుం క్షోభయితుం నశక్తాః"

ఈ వ్యాఖ్యానమొక వింతమార్గమున నడచినది. "వ్రీడావలోక నిహతోమదనోపి యాసామ్" అనుచోట శ్రీధరులు "అమదనః మహాదేవో పి" అని వ్యాఖ్యానించియున్నారు.

---

౧. స్కం, ౧. అధ్యా, ౧౧. శ్లో ౩౬.

౨. చూడు, వావిళ్ల, స్కం. ౧. అధ్యా, ౧౧. పుట ౯౫, ౯౬.

సామాన్యముగా నిట "మదనోపి" యనఁగా మన్మధుఁడే యర్థమగును. దీనికిఁ దార్కాణము వీరరాఘవీయ వ్యాఖ్యాయే. అందు మన్మధుఁడనియే యర్థము వ్రాయఁబడియున్నది.

వీరరాఘవీయమున స్పష్టముగా మదనుఁడనియే చెప్పఁబడియున్నద్ది. ఇందీశ్వర ప్రసక్తియే లేదు. పోతన శ్రీధరవ్యాఖ్యననుసరించెను గావుననే యిట్లు తెనుఁగుచేసియున్నాఁడు.

"పంచబాణుని నీఱు చేసిన
భర్గునిందన విల్లు వ
ర్జించి మూర్ఛిలఁ జేయఁజాలు వి
శేషహాస విలోకనో
దంచితాకృతులయ్యుఁ గాంతలు
దంభచేష్టల మాధవుం
జంచలింపఁగఁ జేయనేమియు
జాలరైరి బుధోత్తమా."

ఈ శ్లోక విషయమున శ్రీధరవ్యాఖ్యయందొక మెఱుఁగున్నది. దానినే యనుకరించుటచేఁ బోతన యాంధ్రీకరణమునకు నా మెఱుఁగువచ్చినది. మన్మధుని ముగ్ధునిఁగావించిన వారైనను స్త్రీలు భగవంతుఁడగు శ్రీకృష్ణుని వంచింపలేకపోవుటలో నంతగా నాశ్చర్యపడవలసిన విషయములేదు. మన్మధుఁడు సకల లోకసమ్మోహనకరుఁడయ్యు భగవదాజ్ఞానువర్తియేకదా! అసలింద్రియ నిగ్రహ విషయమున మన్మథుఁడు పేరుగన్నవాఁడుగాఁడు. అతఁడు లోకమును సమ్మోహింపఁజేయుననుమాట సత్యమేకాని యాతఁడే విలాసిని హావభావ విలాసములకును లొంగఁడను విషయమెచ్చటను జెప్పఁబడలేదు. కావునఁ దమ విలాస చేష్టలచే నంతఃపురస్త్రీలాతని వివశునిఁగాఁ జేసినఁ జేయవచ్చును. కాని మహేశ్వర విషయమట్టిదిగాదు. జితేంద్రియత్వమున కాతఁడాదర్శము. అందులకే కవికుల గురుఁడగు కాళిదాసును "జితేంద్రియే శూలిని" యని తన కుమార సంభవమున వ్రాసియున్నాఁడు. లోకమోహనకరుఁడు మన్మథుఁడు, అట్టివానినిఁ గూడ దహించిన

---

౧. చూ, వావిళ్ల స్కం, ౧. అధ్యా, ౧౧. పుట ౯౫, ౯౬.

మహోగ్రుఁడు మహేశ్వరుఁడు. అట్టి మహేశ్వరునిఁ గూడ వివశునిఁగావింపఁ గల శక్తి యాకాంతలకుఁ గలదు. మఱియు శివకేశవులొండొరులకుఁ దీసిపోవువారుగారు. కాని మాయానటనమున మహేశ్వరుండు మాధవునకుఁ దీసిపోవునను విషయము పురాణప్రసిద్ధము. అందులకే శ్రీధరులు జగన్మోహినీ ప్రసంగమును దెచ్చిరి. అనఁగా జితేంద్రియుఁడయ్యు శూలి యప్పుడప్పుడు చలించుట గలదు. కావుననే ద్వారకానగరకాంతలు హావభావవిలాసుల నాతనిఁ గూడ వివశునిగావింపగలరని చెప్పఁబడినది. అట్టి సౌందర్యవతులు గూడఁ దమ విలాస చేష్టలచే శ్రీకృష్ణుని వివశేంద్రియునిఁగావింపలేకపోయిరనుట మనోజ్ఞతరము. మన్మథుఁడని యర్థము చెప్పునప్పుడును మనోజ్ఞమే కాని మహేశ్వరపరముగాఁ జెప్పుట మనోజ్ఞతరము.

కొన్నియెడల సామాన్య శ్లోకములకుఁ గూడ నాంధ్రీకరణము మూలమునకు భిన్నముగా నున్నది. అట్టియెడఁ బోతన శ్రీధరీయమును గూడఁ బాటించినట్లు కానరాదు. పరీక్షిజ్జననఘట్టము మూలము.

౧"సఏష లోకే విఖ్యాతః పరీక్షిదితి యత్ప్రభుః

గర్భదృష్ట మభిధ్యాయన్ పరీక్షేత నరేష్విహ"

ఇట నర్థము విస్పష్టముగదా! పరీక్షిత్తు గర్భముననుండఁగా శ్రీహరి రూపమును జూచెను. పుట్టినతరువాత నచ్చట ననేకులు గన్పట్టిరి. తానుమును జూచిన పురుషుఁడిందెవఁడాయని పరీక్షించిచూచుటచే నాతఁడు "పరీక్షిత్తు" అని లోకమునఁ బ్రసిద్ధిగాంచెను. ఇది మూల శ్లోకార్థము. శ్రీధరులునీయర్థమునే చెప్పిరి. పోతన మాత్రము తద్భిన్నముగా నిట్లు వ్రాసెను.

౨"తన తల్లి కడుపు లోపల

మును సూచిన విభుఁడు విశ్వముననెల్లఁగలం

డనుచుఁబరీక్షింపఁగ జను

లనఘఁ బరీక్షిన్నరేంద్రుఁడండ్రు మునీంద్రా!"

---

౧. స్క-౧. అధ్యా, ౧౩, శ్లో, ౩౦, ౩౧

౨. చూడు, వావిళ్ల స్క-౧, ౧. అధ్యా, ౧౩ పుట. ౧౦౦

తన తల్లి కడుపులోఁ దాను జూచినపురుషుడు విశ్వవ్యాపియగు భగవంతుఁడని యాశిశువునకేమి తెలుయును?

బాలఘాతియగు నశ్వత్థామ యర్జునునిచేఁ దరుమబడుచున్న ఘట్టము, మూలము.

[౨]"యావద్గమం రుద్రభయా ద్యధా కః"

దీనికి శ్రీధరీయమునఁ బాఠాంతరము సూచింపఁబడినది - "యథార్కః" కావున వ్యాఖ్య రెండు విధములుగా నడచినది.

[3]"యావద్గమం యావద్గంతుం శక్యం తావదుర్వ్యాం --- విఖ్యాత్ జాతః"

స్క.౧. అధ్యా ౭ శ్లో ౧౮

అనుదానిలో రెండు విధముల వ్యాఖ్యయున్నను పోతన "యథాకః" అను పాదమునే గైకొని యిట్లు వ్రాసియున్నాఁడు.

[౪]"మున్నాబ్రహ్మ మృగాకృతిందనయకున్మోహించి క్రీడింపనా

సన్నుండా హడుఁజూచిపాఱుపగిదిన్"

మూలమున "రుద్రభయాద్యధాకః" అని మాత్రమే కలదు. శ్రీధరవ్యాఖ్యననుసరించి పోతన యాంధ్రీకరణ మున్నదనుట స్పష్టము.

అశ్వత్థామను గట్టి యర్జునుడు ద్రౌపదికడకుఁ గొనితెచ్చును. కరుణార్ద్ర హృదయయునగు ద్రౌపది యాతనిని విడువుఁడని చెప్పును. అందులకు భీముఁడు దక్కనందఱు సంగీకరింతురు. భీముఁడు మాత్రమశ్వత్థామను సంహరింపనుద్యుక్తుఁడగును. ఈ ఘట్టముమాతృకలో నిట్లున్నది.

[౫]"నిశమ్య భీమగదితం ద్రౌపద్యాశ్చ చతుర్భుజః

ఆలోక్య వదనం సఖ్యు రిదమాహ హసన్నివ"

---

౧. స్క.౧. ౧. ప. ౨౯౬, ౨. స్క, ౧. అధ్యా, ౭. శ్లో. ౧౮.

3. చూ. వావిళ్ల, సం. ౧. అధ్యా ౭. పుట. ౫౯ ౪. స్క.౧. ప. ౧౪౫

౫. స్క.౧. ౧. అధ్యా, ౭. శ్లో, ౫౨.

ఇందలి "చతుర్భుజః" అను పదము సార్థకమని శ్రీధరుల యభిప్రాయము. సామాన్యముగాఁ జతుర్భుజుఁడనగా విష్ణువని యర్థముగదా! ఇటనిట్లు గాదనియు నాలుగు భుజములు గలవాఁడనియే యర్థము చెప్పవలెననియు నట్లు చతుర్భుజములు ధరింపవలసినయావశ్యకత కృష్ణునకప్పుడు గలిగినదనియు రెండు చేతుల భీముని మఱి రెండు చేతుల ద్రౌపదిని వారించెననియు వారి యభిప్రాయము. అందులకే వారిట్లు వ్యాఖ్యానించిరి.

[౧]"చతుర్భుజఇత్యుక్తే రయం భావః భీమే తం హంతుం

ప్రవృత్తే ద్రౌపద్యాంచ అనిచ్ఛన్త్యాం సహసా తన్నివారణే

ప్రవృత్తాయాం ఉభయో స్సన్నివారణా యావిష్కృతచ

తుర్భుజః"

ఈ యర్థమునే పోతన తన యాంధ్రీకరణమున గైకొని యిట్లు వ్రాసియున్నాఁడు.

[౨]"భీముని సంరంభంబునూచి హరి చతుర్భుజుండయి రెండు చేతుల భీముని వారించి కడమరెంటను ద్రుపద పుత్రికను దలఁగించి నగుచు భీమున కిట్లనియె"

ఇట భీమునితో శ్రీకృష్ణుఁడు మాటాడినట్లు మూలమునలేదు. "సఖ్యురర్జునస్య" అనియే శ్రీధరులను వ్యాఖ్యానించియున్నారు. ఈ క్రింది శ్లోకములర్జునునితో శ్రీకృష్ణుఁడు పల్కినట్లే మూలముననున్నది.

[౩]"బ్రహ్మబంధు ర్నహం తవ్య అతతాయీ వధార్హణః

మయైవోభయమామ్నాతం పరిపాహ్యనుశాసనమ్."

పై మాటలుభీమునితో నన్నట్లు పోతన వ్రాసియున్నాఁడు.

[౪]"అవ్యుఁడుగాఁడు వీఁడు శిశు

హంతదుర్మాకుఁడాతతాయి హం

---

౧. స్కం, ౧. అధ్యా, ౮. చూడు, వావిళ్ల, పుట. ౬౪

౨. స్కం, ౧. వచ. ౧౬౯, ౩. చూ, వావిళ్ల, స్కం, ౧. అధ్యా, ౮ శ్లో, ౫౩.

౪. స్కం,౧. పద్యం, ౧౭౦, వ. ౧౭౧.

తవ్యుఁడు బ్రహ్మ బంధుఁడగు

దప్పదు నిక్కము బ్రాహ్మణోనహ

న్తవ్యయటంచు వేదము శ్రు

తంబగుఁ గావున ధర్మ దృష్టిఁగ

ర్తవ్యము వీనిఁగాచుట య

ధాస్థితిఁ జూడుము పాండవోత్తమా!"

అని సరసాలాపంబులాడి పవననందను నొడంబఱచి యర్జునుం జూచి ద్రౌపదికి నాకు భీమసేనునకు సమ్మతంబుగమున్ను నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నా పంపుసేయుమని నారాయణుండానతిచ్చిన......"

ఈ మార్పును బోతన యేలకావించెను? మాతృకలో నీ విషయము స్పష్టముగనే యున్నది. అచట "సఖ్యుః" అను పదమంత స్పష్టముగా లేదను కొన్నను శ్రీధరవ్యాఖ్య యందదియు స్పష్టీకరింపఁబడియే యున్నది. "సఖ్యురర్జునస్య" అని శ్రీధరులు వ్యాఖ్యానించియున్నారు. పోతన శ్రీధర వ్యాఖ్యానమును జూడలేదనిఁ గాదు. ముందు దాహృతములైన చతుర్భుజాది పదముల కడఁ బోతన శ్రీధర వ్యాఖ్యను సర్వథా అనుకరించియున్నాఁడు. కావున నిటనీ మార్పు కేవలముద్దేశ పూర్వకముగనే కావింపఁబడి యున్నదని యూహింపనగును. ఉద్దేశపూర్వకముగనే యీ మార్పుగావింపఁబడెనేని దీనివలనఁబోతన సాధించిన ప్రయోజనమేమి? అను ప్రశ్నకు సమాధానమును జూడవలయును.

ఈ ఘట్టమున ముఖ్యముగా యోజింపఁదగినవారు ముువ్వురు. భీమార్జునులు, ద్రౌపది. శ్రీకృష్ణుఁడీ మాటలనీమువ్వురిలో నెవ్వరితో ననవలయును? అనఁగా వివరణ మెవ్వరికాసమయమున నావశ్యయకము? అని భావము. మాతృకలో నర్జునునితో ననిసట్లు గలదు. కాని యాతనితో నీ మాటలనేల శ్రీకృష్ణుఁడు పలుకవలయును? అర్జునుఁడశ్వత్థామను జంపుటకు మొదటినుండియు విముఖుఁడేకదా! శ్రీకృష్ణునిచేఁ బ్రబోధింపఁబడియు నాతఁ డశ్వత్థామను జంపనియ్యకొనలేదు. ఇఁక ద్రౌపది. అమె యశ్వత్థామను విడువుఁడని యప్పుడేకదా! చెప్పుచున్నది! అట్టి యెడ వారిర్వురకు నశ్వత్థామ వధ్యుఁడనికాని, కాఁడని కాని చెప్పవలసిన యావశ్యకతయేలేదు. ఇఁక భీమునకు మాత్రము ధర్మవిచికిత్సయున్నదా? అతనికిని లేదు. అశ్వత్థామ వధ్యుఁడనియే యాతని యభిప్రాయము. ఇఁక నెవ్వరికీ ధర్మ

సందేహముగలదు? ఎవ్వరి నుద్దేశించి భగవానుఁడీ ధర్మోపన్యాసముఁ గావించినాఁడు? ఈ ధర్మ సందేహముగలవారు లోకులు. లోకులనుద్దేశించియే యీధర్మోపన్యాసమును శ్రీకృష్ణుఁడు గావించినాఁడు. ఇది గ్రంథము గావున నందున్న పాత్రలలో నొక్కరితో సంభాషించినట్లు కవి వ్రాసియున్నాఁడు. అచ్చటనున్నవారిలో నెవ్వరితో నీ మాటలాడుట సముచితము! క్రుద్ధోద్ధతుఁడగు భీమునితోఁ బల్కుటయే సముచితమని పోతన యభిప్రాయము. భీముడుద్రిక్త స్వభావుఁడు. అతఁడాసమయమున నశ్వత్థామను జంపినఁ జంపును. గురుపుత్రవధ ద్రౌపది కిష్టము లేదు. అర్జునునకు మొదటేయిష్టము లేదు. అట్టి యెడ భీముఁడే సాంత్వనవచనముల ననునయింపఁదగినవాఁడు. ఆ యనునయములలోఁ గూడ మొదట నాతనిపక్షమే మాటాడవలయువ. లేకున్న నాతఁడు మఱియుఁ గుపితుఁడగును. కావుననే శ్రీకృష్ణుఁడు తొలుత నశ్వత్థామ వధ్యుఁడనియే చెప్పెను. ఇట సాంత్వనవచనములు భీమునకే యవసరము గావున నాతనితోఁ బల్కినట్లే పోతన వ్రాసియున్నాఁడు. అయిన వ్యాసభట్టారకుఁడమార్గమునఁ బోయెనాయని శంకింపరాదు. ఇట గర్తవ్యమును నిర్వహించువాఁడర్జునుండే కావున నాతనికిఁ జెప్పుటయే సముచితమని వ్యాసుని యాశయము. ఇది యీ యిర్వురు కవుల దృష్టి భేదమును మాత్రమే సూచించును. మనకు రెండును సముచితములే. పోతన యీ మార్పేల చేసెననుదానికి సమాధానముగ నింత వ్రాయవలసి వచ్చినది.

ఇట్టిదే యింకొకమార్పు - మూలమున నీ ఘట్టమందు ద్రౌపది యశ్వత్థామతో మాటాడినట్లెచ్చటను లేదు. బద్ధుఁడై యున్న యశ్వత్థామను జూచి ద్రౌపది దయార్ద్రహృదయ గావున గురుపుత్త్రుని విడువలెనని యర్జునునిఁ గోరును. కాని యాంధ్రీకరణమున ద్రౌపది యశ్వత్థామ తోడనే తొలుత మాటాడినట్లు గలదు. మూలము -

> "తథా హృతం పశువత్పాశబద్ధ
>
> మవాఙ్ముఖం కర్మ జుగుప్సితేన -------- శుచార్పితమ్"
>
> స్క. ౧. అధ్యా, ౭. శ్లో, ౪౨ - ౪౩

దీనికిఁ బోతన యాంధ్రీకరణము -

> ²"ఇట్లర్జునుండు దెచ్చిచూపిన, బాలవధజనిత లజ్జాపరాఙ్ముఖుండైన కృపికొడుకుం

---

౧. ఆతతాయిన మాయాంత మపి వేదాంతపారగమ్, జిఘాం సంతం జిఘాంసీయా న్నతేన బ్రహ్మహా భవేత్. "బ్రహ్మణో నహంతవ్యః". ౨. స్కం, ౧. వచన, ౧౫౫ - పద్య. ౧౬౬

జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె"

"పరఁగన్మామగవారలందఱును మున్బాణప్రయోగోప సం

హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసించిరి"

"అక్కట పుత్త్రశోక జని

తాకుల భారవిపణ్ణచిత్తయై"

"అని కృష్ణార్జునులం జూచి

"ద్రోణునితో శిఖింబడక

ద్రోణకుటుంబిని యున్నదింటన

క్షీణ తనూజ శోకవివ

శీకృతనై విలపించుభంగి నీ

ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు

దైన్యమునందుచు నెంత పొక్కునో

ప్రాణవిముక్తుఁడైన సతి

పాపము బ్రాహ్మణ హింసమానరే".

"భూపాలకులకు విప్రులు

గోపింపజేయఁదగదు".

ఇందుఁ బోతన చేసిన ముఖ్యమగు మార్పశ్వత్థామతోఁ దొలుత ద్రౌపది మాటలాడుట మూలమున నశ్వత్థామతో మాటలాడినట్లే లేదు. ఈ మార్పును బోతన యేల చేసెను? ఇందలి యౌచిత్యమేమి?

ద్రౌపదీ పాత్ర విషయమునఁ బోతనకుఁ గల యభిప్రాయములను సమగ్రముగా నర్థము చేసికొననిదే యిటఁ బోతన గావించిన మార్పునందలి యౌచిత్యము మనకుఁ

బూర్తిగా బోధపడదు. అసలు మూలమును బట్టియే భారత ద్రౌపదికిని భాగవత ద్రౌపదికిని గొంతభేదముగలదని మనమూహింప వచ్చును. భారతమున ద్రౌపది ప్రతీకారవాంఛా దందహ్యమాన మానస. "అక్కొ సతాల్మితోఁ జిచ్చొడిఁగట్టిన యట్లు" పరాభవానలమును హృదయమున నిక్షిప్తముగావించుకొనిన ధీర. తనతల వెంద్రుకలు వట్టి యీడ్చిన దుస్ససేనుని తనువు తుత్తునియలుగాకున్నఁ దనకోపాగ్ని లేశమును శాంతింపదని పతుల యెదుట శ్రీకృష్ణునితోఁ జెప్పిన దిట్ట. "కట్టి విక్రమంబుఁగాల్పనే" యని యీనడించి నిర్భయముగాఁ బల్కిన ధైర్యశాలిని. కాని భాగవత కాలమునకా కోపాగ్ని చల్లారిపోయినది. అయిడుకంతరించినది. ఆ వెతనశించినది. ఆమె మనోరథము సిద్ధించినది. దుస్ససేను తను వింతవింతలై రణరంగమునఁ గా కగృధ్రంబులకెఱయైనది. తన్ను నిండు కొలువునఁ గ్రొవ్వియవమానించిన దుర్యోధనుఁడు దొడలు విఱిగి సంగరభూమిఁ బడియున్నాఁడు. అతనికిఁ గూర్చువారు కర్ణాదులు నిహతులైరి. తమ్ములందఱు మడిసిరి. పాండవులు జయలక్ష్మిని జేకొనిరి. అంతతో ద్రౌపది కోపము తీరిపోయినది. ప్రతీకార వాంఛ తీరినంతనే ప్రశాంత చిత్తయగు నమె స్త్రీ సహజమగు మార్దవమును బొందియున్నది. అట్టియెడ నశ్వత్థామ మరల నామె హృదయమునఁ జిచ్చు పెట్టినాఁడు. అప్పుడామె హృదయము మరలఁ గ్రోధ వివశముగా వలసినదే. కాని యిట జాలిగొనినది. కారణము ద్రౌణి గురుపుత్త్రుఁడు, బ్రాహ్మణుఁడు. కావున నీతనియెడ నామె ప్రవర్తనకును దుర్యోధనాదుల యెడ నామె ప్రవర్తనకును గొంత భేదముండక తప్పదు. దుర్యోధనాదులు జ్ఞాతులు. మఱియు క్షాత్రమగు తేజము క్షాత్రమగు నన్యతేజమును సహింపదు. ఇఁక ద్రౌణి చేసిన యపరాధమునకును దుర్యోధనాదులు చేసిన యపరాధమునకును గొంత భేదము గలదు. మదాంధులై ధార్తరాష్ట్రులామె కొప్పుపట్టి యీడ్చి నిండు సభలో నవమానించిరి. అందు వారి యౌద్ధత్యము గోచరించును. అది రాచపుట్టువు సహింపఁ జాలదు. అశ్వత్థామ చోరుని వలెఁ బాండవసేనావారములఁ జొచ్చి, నికృష్టమును శూరజనగర్హితమునగు హత్యాకాండను నిర్వహించినాఁడు. ప్రాణభీతిని బర్వులు వెట్టినాఁడు. తుదకు నిర్వీర్యుఁడై పట్టువడినాఁడు. ధార్తరాష్ట్రుల కృత్యముద్ధతము, గర్వ భూయిష్ఠము. ద్రౌణి కృత్యము నీచము, నికృష్టము. ఉద్ధతులయెడ క్షాత్రము విజృంభించును, ప్రకోపించును. నీచులయెడ జాలిపడును, ఆర్ద్రమగును.

ఇట ముఖ్యముగా గమనింపఁదగు విషయములు : భారత యుద్ధమునకుఁ బూర్వమున్న ద్రౌపది మనస్తత్త్వమునకును యుద్ధానంతరమున్న ద్రౌపది మనస్తత్త్వమునకును జాలభేదముగలదు. అశ్వత్థామ చేసిన యపరాధమునకును ధార్తరాష్ట్రులు చేసిన యపరాధమునకును జాల భేదముగలదు. రెండు నపరాధములే యయ్యు నవ్వానిని

గావించిన వారియంతరువులను బట్టియు వారి యాశయములను బట్టియు నయ్యపరాధతత్త్వము మారుచున్నది. గురుపుత్త్రుఁడగు నశ్వత్థామ నికృష్ట కర్మాచరణమున నింద్యుఁడయ్యుఁ బాండవులకుఁ బూజ్యుఁడే.

ద్రౌపది మహా భారతమునందువలెఁ గాక యిట నార్ద్ర స్వభావ యగుటకుఁ గారణము చెప్పఁ బడినది. ఇఁక నశ్వత్థామతో నామెయేల ముందు మాటలాడెనను నంశము చర్చనీయము. ఇట ద్రౌపది కేవలము స్త్రీస్వభావమునకు లోనై నదని చెప్పక తప్పదు. నిద్రితులై యున్న తన కొడుకుల నందఱ నిష్కారణముగాఁ బొట్టపెట్టుకొన్న కుత్సితవ్రతునిఁగట్టెదుటఁ గాంచిన యేవనిత యూరకుండఁ గలదు. ఒక్క మాటైన ననకుండ నూరకుండుట స్త్రీ సహజమగు ధర్మము కాదు. కావుననే యామెయశ్వత్థామను నిందించినది. కాని యానిందా వాక్యము లెంత మృదులములు! "అసుర కృత్యంబు ధర్మమగునే తండ్రీ" యని యామె నిందాలాపము. "తండ్రీ" యను సంబుద్ధియందున్న మార్దవము వర్ణనాతీతము. అసలు "భూసురుఁడవు" మొదలగు పద్యమంతయు నిట్టిదే. ఇట్లు మార్చుటలోఁ బోతన యుద్దేశము ముఖ్యముగా నిదియై యుండును. ద్రౌపది ధర్మ పరతంత్రయే యగుఁగాక! మృదుల స్వభావయే యగుఁగాక! అమె ముఖ్యముగా స్త్రీ. స్త్రీనై జమగుబేల తనమామెను వదలఁ జాలదు. ఆమె కడుపునఁ జిచ్చు పెట్టిన యాపాపినిరెండు మాటలైన నాడనిచో నామె హృదయమునకు శాంతి యుండదు. కావుననే యామె యశ్వత్థామను నిందించి మాటలాడినది. కాని కరుణార్ద్ర హృదయ గావున మృదులముగా మాటాడినది.

ఈ సంభాషణ యందుఁ బోతన చేసిన పెంపు చాలఁ గలదు.

ఇందు "భూసురుఁడవు; బుద్ధిదయా భానురుఁడ" వను పద్యమును "ఉద్రేకంబున రారు శస్త్రధరులై" యను పద్యమును గేవలమమూలకములే. మూలమునఁ గృపిఁగూర్చి చెప్పునపుడు "వీరసూః" వీరునిగన్నది అనినాఁడు. ఇందు వీరశబ్దమే "శుద్ధ వీరభట సందోహా గ్రేసరుఁడన" ను పెంపునకు మూలమై యుండును. ఇదికాక, యశ్వత్థామ వీరత్వమును సూచించు పదములెవ్వియు మూలమునలేవు. "ఉద్రేకంబున" నను పద్యమునఁ గేవలము ద్రౌపద్యాక్రందనమే వ్యక్తము. "అకటా! నీ చేతులెట్లాడెనో" యనునది స్త్రీ సహజమగు మాట. తెనుఁగు జాతీయము కూడ "పరగన్ మామగ వారలందఱును" అను పద్యమున "పుత్త్రాకృతినున్న ద్రోణుఁడవు" అను భాగము "సరహస్యోధనుర్వేదః" అను శ్లోకము మొదలు "ప్రజారూపేణ వర్తతే" యను దాని వఱకుఁ గల భాగమున కాంధ్రీకరణము. "నీ చిత్తంబులో లేశమున్ గరుణాసంగము లేక శిష్య సుతులన్ ఖండింపఁగాఁ బాడియే" అనునదిస్వకపోలకల్పనమే. "తస్యాత్మనోర్థం" అను శ్లోకమున సూచనా మాత్రముగ నున్న

విషయము "అక్కటా! పుత్త్ర శోక" అను అద్యమున విపులీకరింపఁబడియున్నది. "మారోదీత్తస్యజననీ" యను శ్లోకమునకు "ద్రోణునితో శిఖింబడక" అను పద్యమనువాదము. "ద్రోణునితో శిఖింబడక" అనునది మాత్రము "నాస్వగాత్త్"ను మూలమున కాంధ్రీకరణము. "భూకంపముగాన్" అనునది కేవలము స్వకపోల్పనమే.

తరువాత భీముఁడన్నటుల మూలమున నిట్లు గలదు.

[1]"తత్రాహామర్షితో భీమః తస్య శ్రేయాన్ పథః స్మృతః

నభర్తు రాత్మనశ్చార్థే యో హన్ సుప్తాన్ శిశూన్ వృథా"

దీనికిఁ దెనుఁగు -

[2]"కొడుకులఁబట్టి చంపెనని

కోపమునందదు బాలఘాతకున్

విడువుమటంచుఁ జెప్పెడిని

వెఱ్ఱిది ద్రౌపది వీఁడు విప్రుఁడే

విడువఁగ నేల చంపుఁడిటు

వీనిని మీరలు చంపరేని నా

పిడికిటి పోటునన్ శిరము

భిన్నము సేసెదఁజూడుఁ డిందఱున్".

ఆంధ్రీకమున మూలము నందలి "నభర్తురాత్మ న శ్చార్థే" అను భావము రాలేదు. "సుప్తాన్ – వృథా" యను పదముల యర్థమును రాలేదు. "తస్య శ్రేయాన్ పథః స్మృతః" అను వాక్యమున నొక గంభీరార్థము గలదు. దీనికి శ్రీధరు లిట్లు వ్యాఖ్యానించి యున్నారు.

[1]"తస్య తథావిధస్య ద్రౌణేః వధఏవ శ్రేష్ఠః, అన్యథా అస్య

నరకపతీ ప్రసంగాత్" అశ్వత్థామ సుప్తులగు బాలుర

---

౧. ,చూడు, వావిళ్ల స్కం. ౧. అధ్యా, ౭, శ్లో. ౫౧.   ౨. స్కం, ౧. పద్య. ౧౬౭

సంహరించెను[౧] ఆ సంహారము దుర్యోధనుని కొఱకుఁగాదు తన కొఱకుఁ గాదు. సుప్త శిశువధమున నెవ్వరికిని లాభముండదుగధా! అట్టి పాతకమున కొడిగట్టిన వానిని సంహరించుటయే ధర్మము. రాజదండనము నొందని పాతకి నరకమునఁబడును. ఆశ్వత్థామకు నరకప్రాప్తిలేకుండఁగాచుటకైన నాతని సంహరించుట కర్తవ్యమని భీముని యభిప్రాయము ఈ యభిప్రాయమునే వ్యాఖ్యాత లిర్వురును వ్యక్తీకరించిరి[౨]. పోతన యాంధ్రీకరణమున నీ విషయము స్మరింపఁబడలేదు. "పిడికిటిపోటునన్" అనుపదము "అమర్షితః" అను పదమునకు వ్యాఖ్యాప్రాయమగు ననువాదమైయుండును. మూలమున భీముఁడశ్వత్థామను వధించుటయే మంచిదని చెప్పెను. కాని తానే వధింతునని యనలేదు. తెనుఁగునఁ దానే వధింతునని యనినట్లు గలదు. మూలమున "అమర్షితః" అని మాత్రమే యున్నది. ఈ కోపమెందులకో సుస్పష్టముగాఁ జెప్పలేదు. సుప్తులగు శిశువులఁ జంపిన యశ్వత్థామపైఁ గోపమా? లేక యట్టి వానిని విడువుఁడని చెప్పుచున్నద్రోపదిపైఁ గోపమా? లేక ధర్మ సమ్మతములగు ద్రౌపదీ వాక్యములకు విని హర్షించుచున్న తనయన్నదమ్ములపైఁ గోపమా? ఆంధ్రీకరణమునఁ "గొడుకులఁ బట్టి చంపెనని కోపము నందదు బాలఘాతకున్ విడువుమటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది" యను వాక్యమున నీయంశము సుస్పష్టము చేయఁబడినది. "వెఱ్ఱిది ద్రౌపది" యనునది కేవలము స్వకపోల కల్పితము. భావము సహృదయైకవేద్యము.

[౩]"అర్జున స్సహసా జ్ఞాయ హరేర్హార్దమథాసినా

మణిం జహార మూర్ధన్యం ద్విజస్య సహమూర్ధజమ్

విముచ్య రశనాబంధం బాలహత్యా హతప్రభమ్

తేజసా మణినాహీనం శిబిరా న్నిరయాపయత్"

దీనికిఁ దెనుఁగు –

[౪]"విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహా

---

౧. చూడు, వావిళ్ల స్క. ౧. అధ్యా. ౭, పుట. ౬౪

౨. భర్తుః దుర్యోధనస్యార్థే పి తత్ప్రీత్యర్థమపి నామన్. అత్మనో ర్థే పి నాహన్. సుప్త శిశువధే కస్యాపి ప్రయోజనా భావాత్. తస్య తాదృశసుప్త బాలఘ్నస్య వధఏవ శ్రేయానితి స్మృతః ధర్మశాస్త్రసమ్మతః "వీరరాఘవీయము.

౩. చూ, వావిళ్ల స్కం, ౧. అధ్యా, ౭, శ్లో ౫౫. ౫౬ ౪. స్కం, ౧. పద్య. ౧౭౨

వీరుండు ఘోరాసిచే

నశ్వత్థామ శిరోజముల్ దఱిఁగి చూ

డాంతన్మహారత్నమున్

శశ్వత్కీర్తి వెలుంగఁబుచ్చికొని పా

శ వ్రాత బంధంబులన్

విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరో

ర్వీభాగముంబాసిపోన్".

ఈ పద్యమున "విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు" అను విశేషణముల మూలకములు, మఱియు ననావశ్యకములు. "శశ్వత్కీర్తి వెలుంగ" ననునదియు నమూలకమే. అనావశ్యకము గూడ. "విశ్వాసంబున నూర్చి"యను దాని భావమేమో? మొత్తమున కీ పద్యము పోతనకృతమా కాదా యనునంతటి సందేహమున కవకాశమిచ్చుచున్నది.

శ్రీధర వ్యాఖ్యానమును సర్వదా సర్వత్ర పోతన యనుసరింపలేదనుట కింకొక యుదాహరణము.

మూలము [౧]"నారాయణస్త్వం నహి సర్వదేహి నా

మాత్మా స్యధీశో ఖిల లోకసాక్షీ

నారాయణో ఽంగం నరభూజలాయ నా

త్తచ్చాపిసత్యం న తవైవ మాయయా"

ఇది దశమస్కంధమున బ్రహ్మ శ్రీకృష్ణునిస్తవము చేయుఘట్టము లోనిది.

దీనికి శ్రీధర వ్యాఖ్య.

[౨]"తర్హి నారాయణపుత్రస్య మమ కిమాయాతం తత్రాహ

-------- తచ్చాపి సత్యం నేతి"

---

౧. చూడు వావిళ్ల, స్కం, ౧౦, శ్లో, ౧౩, ౧౪. ౨. చూ.వావి, స్కం, ౧౦. పుట ౨౫౧.

పై శ్లోకమునకు బోతన యాంధ్రీకరణము –

"నలినాక్ష నీవాదినారాయణుండవు

జలమునారము జీవచయము నార

మందు నీవుంటనీయందివి యుంటను

నారాయణుండను నామమయ్యె". స్కం, ౧౦. పద్య, ౫౬౦

మూల శ్లోకమున "సర్వదేహినా మాత్మాసి, అధీశో సి" అని యున్నది. దీనికి శ్రీధరులు "అధీశః ప్రవర్తకః నారమయసే జానాసి" అనియు "నరాదుద్భూతా యే అర్థాః చతుర్వింశతి తత్త్వాని, తథా నరాజ్జాతం యజ్జలం, తదయనా ద్వా నారాయణః" అనియు ననేకవిధముల వ్యాఖ్యానించియున్నారు. పోతన శ్రీధర వ్యాఖ్యను సరిగా ననుసరింపలేదు. "నరభూజలాయనాత్" అను మూలమును మాత్రమేయనువదించెను. "నారం జీవసమూహః, అయన మాశ్రయో యస్య" అను దానిని "అపో నారా ఇతిప్రోక్తాః" అను దానిని శ్రీధరులనుండి గ్రహించినట్లూహింపనగును.

మూలమునఁ దర్కకర్కశములగు శ్లోకములు కొన్ని గలవు. అట్టి వానిని శ్రీధరు సర్వంకషముగా వ్యాఖ్యానించియున్నారు. వీరరాఘవీయము గూడ నిట్టి పట్టుల సత్యంతము విపులముగనే యున్నది. వ్యాఖ్యల యందును యాయుక్తి ప్రత్యుక్తుల వంకఁబోక పోతన మూల శ్లోకము నందలి ముఖ్య భావమును మాత్రము సరళమగు భాషలో వ్యక్తీకరించియున్నాఁడు సామాన్యులకిది సరళమగు విధానమనుటకు సందియములేదు. కాని మూల శ్లోకమందలి సమగ్ర భావము నెఱుంగఁగోరువారికిది సముచితమార్గము కాదు. అది యట్లుండె. మనకుఁ బ్రస్తుత విషయము శ్రీధర వ్యాఖ్యను సర్వత్ర పోతన యనుకరించెనా లేదా యనునది మాత్రమే. సర్వత్ర యనుకరింపలేదనుట కిది యింకొక యుదహరణము. అందును నీ శ్లోకమునకు వ్యాఖ్య యెంతేని యావశ్యకము. అట్టి యెడఁ గూడ నాతఁడు వ్యాఖ్యానముననుసరింప లేదు. కావున మూల శ్లోకములు కఠినములై యున్నప్పుడెల్ల పోతన శ్రీధర వ్యాఖ్యననుసరించి యాంధ్రీకరించెనను మాటయు సత్యముకాదు.

"పురేహ భూమన్ బహవో పి యోగినః

-------- ప్రపేదిరే భో త్యుత తేగతింపరామ్"

స్కం, ౧౦. అధ్యా, ౧౪. శ్లో, ౫, ౬.

"తాపి భూమన్ మహిమా గుణస్య తే

[౧]బోద్ధు మర్హ త్యమలాంతరాత్మభిః

అవిక్రియా త్స్వానుభవ దరూపతో

హ్యనన్య బోధ్యాత్మతయా నచాన్యథా"

ఈ శ్లోకములకు శ్రీధర వాఖ్య -

"హేభూమన్? ఇహలోకే పూర్వం యోగినో పి

----------- ఉక్తార్థమే వై తత్"

చూ. వావిళ్ల, స్కం, ౧౦, పుట ౨౪౮, ౨౪౯

దీనికి వీరరాఘవీయము -

"భక్తేర్భగవత్ప్రాప్తిసాధనత్వే వృద్ధాచారం ప్రమాణయతి

--------------- తవ భక్త్యాది సులభత్వేపి"

మీది శ్లోకములకుఁ బోతన యాంధ్రీకరణము

"విక్రియాశూన్యమై విషయత్వమునులేని

దగుచునాత్మాకారమై తనర్చు

నంతః కరణమొక్క యధిక సాక్షాత్కార

విజ్ఞానమునఁబట్టి వేఱొరులకు

నెఱుఁగంగరానిదై యేసారియుండుటఁ

జేసి నీనిర్గుణ శ్రీవిభూతి

౧. స్కం, ౧౦. పూర్వభాగ, పద్య. ౫౫౩

విక్రియ యనఁగా విశేషాకరము. అది లేకపోవుటయే అవిక్రియ. అనగా విశేషపరిత్యాగవే అత్మాకారతయనియర్థము. సంకోచాది వికారరాహిత్యమే యవిక్రియయని వీరరాఘవీయము.

బహి రంగవీధులఁ బాఱక తిరములై

యములంబులగునింద్రియములచేత

నెట్టకేలకైన నెఱుఁగంగఁదగుఁగాని

గుణవిలాసివగుచుఁ గొమరుమిగులు

నీగుణప్రజంబు నేరరాదెఱుఁగంగ

నొక్కమితములేకయుంటనీశ"

ఈ పద్యమున "విక్రియాశూన్యము" అను పదమునకు వ్యాఖ్య యావశ్యకము. శ్రీధరులు "విక్రియా విశేషాకరః తద్రహితాత్ విశేషపరిత్యాగ ఏవాత్మాకారతా ఇత్యర్థః". అని వ్యాఖ్యానించియున్నారు. ఈ పదమున కర్థము సరిగాఁ దెలియనిచోఁ దక్కిన పద్యమంతయు దురవగాహమే యగుచున్నది. ఎందులకనఁగా నీ పద్యమున భగవత్సాక్షాత్కార సంబంధి విషయములను బ్రస్తావించుచున్నాఁడు. భగవంతుఁడు సగుణుఁడని కొందఱందురు. నిర్గుణుఁడని కొందఱు. భాగవతకర్త యీ రెండు వాదములనంగీకరించును. కానియిట నొకప్రశ్న – సగుణ బ్రహ్మ సాక్షాత్కారము సులభమా? నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారము సులభమా? సాధారణముగా నిర్గుణమును దెలిసి కొనుటయే కష్టమని యందఱు నంగీకరింతురు. భాగవతకర్తకిది యంగీకార్యముకాదు. నిర్గుణునిఁ దలిసికొనుటకంటె సగుణునిఁ దలిసికొనుటయే కష్టతరమని యాతని యభిప్రాయము. అందులకే శ్రీధరులు "గుణాత్ తస్యజ్ఞానం కథంచిద్భవేత్, సతుసగుణస్యతవ అచింత్యానంతగుణత్వాత్" ఎట్లో గుణాతీతునిఁ దెలిసికొనవచ్చును. సగుణునట్లు తెలిసికొనలేము. ఎందులకనఁగా నాతని గుణములచింత్యములు అని వ్యాఖ్యలో వ్రాసియున్నారు. ప్రత్యాహృతేంద్రియులగు వారు అగుణుని ఎట్లు దెలిసికొనఁగలరు ? స్వానుభవముచేత. ఆ స్వానుభవమెట్టిది? అవిక్రియస్వానుభవశబ్దమునకు శ్రీధరులు ఆత్మాకారాంతః కరణవృత్తి సాక్షాత్కారమని వ్యాఖ్యానించి యున్నారు. దీనినే పోతన "ఆత్మాకారమై తనర్చు నంతః కరణమొక్క యధిక

---

నిర్గుణోపాసన కష్టమని గీతాశాస్త్రమును జెప్పుచున్నది.

"క్లేశో ధికతర స్తేషా మవ్యక్తా సక్తచేత సామ్

అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భిరవాప్యతే."

ఇదియుపాసనా విషయమునఁ జెప్పఁబడినది. సాక్షాత్కార విషయమునఁ గూడ నిద్దాని నన్వయింపవచ్చును.

సాక్షాత్కార విజ్ఞానమునఁ బట్టి" యని యాంధ్రీకరించెను. కాని యీ యాంధ్రీకరణమునకు వివరణ మవసరము. శ్రీధరులు వ్యాఖ్యయందదానిని వివరించియున్నారు. దానిని మాత్రము పోతన గ్రహింపలేదు. గ్రహింపక పోవుటచేఁ బై పదముల యర్థమును సరిగాఁ దెలియదు. శ్రీధరులు స్వానుభవ పదమునకు ఆత్మాకారాంతః కరణవృత్తి సాక్షాత్కారమని యర్థమును వ్రాసియున్నారుగదా? అయన యంతతో నూరకొనలేదు. [౧]అంతఃకరణము గూడ నవికారమునే వ్యక్తీకరించునుగదా! అట్టియెడ దానికి నాత్మాకారత యనగా నెట్టిది?" అని యాకాంక్షచేసి "విశేష పరిత్యాగ ఏవాత్మాకారతా" విశేషపరిత్యాగమే యాత్మాకారత యనఁగా నర్థమని సమాధానమును జెప్పి యున్నారు. కాని యింతమాత్రమున సందేహము తీరినదా? లేదు. ఆత్మాకారతయనఁగా నిట్టిది యని చెప్పితివి. కాని యంతఃకరణ సాక్షాత్కార విషయత్వముచే అనాత్మత్వ ప్రసంగమురాదా? అని ప్రశ్న. దీనికి సమాధానముగనే మూలమున "అరూపతః" అని చెప్పఁబడియున్నది. రూపమనఁగా విషయము. దీనినే పోతన "విషయిత్వమున లేనిదగుచు" అని యాంధ్రీకరించెను. కాని యీ విశేషమేల యావశ్యకయెనో వ్యాఖ్యయందు స్పష్టము. ఆంధ్రీకరణమున నస్పష్టము. దీనికిఁ గొంత వివరణమావశ్యకము. స్వానుభవమునఁగా ఆత్మాకారాంతః కరణవృత్తి సాక్షాత్కారమని చెప్పఁబడినది. సవికారమునే బోధించునంతః కరణమునకు నాత్మాకారమెట్లు సిద్ధించునని ప్రశ్న. దీనికి సమాధానముగా విక్రియా శూన్యత్వమే యీ యాత్మాకారతయని చెప్పఁబడినది. కాని సాక్షాత్కారమనుమాటలో సరూపత యిమిడియున్నది కదా! ఆత్మకు రూపములేదు. అట్టి యెడ సరూపమనిన యెడల ననాత్మత్వ ప్రసంగమురాదు యని మఱల ప్రశ్న. రాదని సమాధానము. ఎందువలన? అది అరూపమగుట వలన. [౩]అట్లయిన ననగా అరూపమైన యెడలనది యెట్లు తెలియును? స్వప్రకాశత్వముచేతనే యని సమాధానము. [౪]ఎందులకనఁగా నది మఱియొక దానిచేఁ దెలియునది కాదు. దానిచేతనే యది తెలియుట యనఁగా నర్థమేమి? ఇదియే యదియనుట. ఈ చివరి మాటయందే శ్రీధరవ్యాఖ్యాసారమంతయునున్నది. ఇదియే అది "అనునదియే యద్వైత భావన. ఇట్టి ముఖ్య విషయములెవ్వియు నాంధ్రీకరణమునఁ జూపట్టవు. పోతన వ్యాఖ్యను జూడకుండ మూలమును మాత్రమే యాంధ్రీకరించు స్వభావము గలవాఁడైనచో నదియొకమాట. కాని యతని యాంధ్రీకరణము వ్యాఖ్యననుసరించి

---

ఆత్మాకారాంతః కరణవృత్తి సాక్షాత్కారాత్"

౧. నన్వంతః కరణమపి సవికారమేవ విషయీకరోతి. కథమాత్మాకారతా తస్య?

౨. నన్వంతః కరణ సాక్షాత్కార విషయత్వే నానాత్మత్వ ప్రసంగ స్స్యాత్

౩. కథం తర్హి స్ఫూర్తిః?

౪. అనన్యబోధ్యా తయా స్వప్రకాశత్వేనైవ, సత్వన్యథా.

కొన్ని యెడల విపులీకరింపబడినదనుట తథ్యము. ఇందుగూడ "సానుభవాత్, అరూపతః" అను మూల పదములను వ్యాఖ్యాత్రప్రాయానుసారముగ నెట్లాంధ్రీకరించి యున్నాఁడో ముందే వివరింపఁబడియున్నది. కాని పోతన వ్యాఖ్యను సరిగ సంపూర్ణముగ ననుసరింపలేదు. కొంత గ్రహించి కొంత విడిచియున్నాఁడు. వ్యాఖ్య యందలి ముఖ్య విషయములు కొన్ని విడువఁబడినవి. అంతమాత్రమునఁ బోతన యాంధ్రీకరణములోపభూయిష్టని యభిప్రాయ పడరాదు. అతఁడు శ్రీధర వ్యాఖ్యను వేదాంత ఘట్టములందుఁ గూడ సర్వదా యనుకరించెనను మాట వాస్తవము కాదనుటకే యీ విషయమింతగా విపులీకరింపఁబడినది. మఱియుఁ బోతన యాంధ్రీకరణమున మూలమునందలి ముఖ్యార్థమొక్కటి విడువఁబడియున్నది. [1]శ్రీధరీయ, [2]వీరరాఘవీయ వ్యాఖ్యలు రెండింటి యందు నా యర్థము విడిచినను విడువవచ్చుననిగాదు. లక్ష్మీదేవియు యథాతథముగా గ్రహింపఁజాలదను భావము మూల శ్లోకమునఁ గలదు. అది యాంధ్రమున రాలేదు. [3]ఇట నాంధ్రమసమర్థము గావున నాభావము విడువఁ బడినదని చెప్పుటకు వవీలులేదు. ఇదియొక ప్రత్యేక భావము. దీనినిఁ బ్రత్యేకముగాఁ జెప్పనగును.

కథలోఁ బోతన చేసిన చిన్న మార్పులు ౧. గజేంద్ర మోక్షకథ, ౨. నరకాసురవధ.

మూలమున గజేంద్రుని రక్షణకై విష్ణువు వెడలినవుడు అతని వెంటలక్ష్మి వెడలినట్లు [4]లేదు. మఱియు నా సమయమున విష్ణువేస్థితియందున్నదియు మూలమునఁ జెప్పఁబడియుండలేదు.

మూలాము :

"తం తద్వదార్తముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః
ఛందోమయేన గరుడేన స ఊహ్యమానః
చక్రాయుధో హ్యగమ దాశు యతో గజేంద్రః"

---

౧. మా లక్ష్మీరపి యథా యాదృగ్వస్తు తథా తేనరూపేణ విబోద్ధుం నార్హత్యేవేత్యర్థః శ్రీధ.

౨. మా లక్ష్మీరపి అమలాంతాత్మభిః నిత్యశుద్ధస్వరూపైస్సనకాదిభిస్సహ ఇత్యర్థః వీరరాఘవీయము

౩. సలం కామయతే, న లంకామ్ అయతే. నైషధీయచరితము. ఇట్టి వాంధ్రమునకనువదించుట కష్టము. మీఁది విషయమట్టిది కాదు. వేరే చెప్పవచ్చును.

౪. స్కం. ౮. అధ్యా ౩. శ్లో ౩౦ - ౩౩.

“సోంతస్సరస్యురుబలేన గృహీతార్తో
దృష్ట్వా గరుత్మతి హరిం ఖపాత్తచక్రమ్
ఉత్క్షిప్యసాంబుజకరం గిరమాహ కృచ్ఛ్రాత్
నారాయణాఖిలగురో భగవ న్నమస్తే”.

“తం వీక్ష్య పీడిత మజస్సహసావతీర్య
సగ్రాహ మాశు సరసః కృపయోజ్జహార
గ్రాహో ద్విపాటితముఖా దరిణా గజేంద్రం
సంపశ్యతాం హరి దమూముచ దుస్రియాణామ్.”

[1]ఈ మూఁడు శ్లోకముల నిరువది యొక్క పద్యములలో పెంచి వ్రాసియున్నాఁడు.

ఈ పెంపేల పోతన చేసెను? దీనికి ముఖ్యముగా మూఁడు కారణములు గన్పట్టుచున్నవి. మొదటిది పోతనకుఁగల భక్త్యావేశము. దీనిని గూర్చి విపులముగా వ్రాయనక్కరలేదు. పోతన భాగవతమంతయు భక్తి భావ భరితమే. విష్ణు సంబంధిగాథలను వివరించునప్పుడాతఁడు “శివమరులు” గొన్నవాఁడు వోలె వర్ణనలంబెంచి వ్రాయును. ఇదియునట్టి ఘట్టమే కావునఁ బోతనపెంచి వ్రాసియుండును. రెండవది, భగవంతుని భక్తత్రాణ పరాయణత్వమును వ్యక్తీకరింపఁ బోతనకుఁగల తీవ్రాభిలాష. దీనిని స్పష్టీకరించుటకై పోతన కొన్ని మార్పులు చేసియున్నాఁడు. మూలమున “ఛందోమయేన గరుడేన సఊహ్యమానః” అని యున్నది. “ఛందోమయేన” అని యేల చెప్పవలసి వచ్చె? దీనికి శ్రీధరులు సమాధానము నిచ్చియున్నారు. “ఛందోమయే నేత్యతి శైఘ్ర్యాయోక్తమ్” అతిశీఘ్రతను దెలుపుటకై “ఛందోమయేన” యను విశేషణమును మాతృకాకారుఁడు వాడియున్నాఁడు మఱియు నట్టి గరుడుని వేగము గూడ భగవంతునకుఁ జాలినది కాదు. కావుననే మూలమున “సహసావతీర్య” గరుడోఽపి మందగతిరితి తత స్సహసావతీర్య” అని వ్యాఖ్యానించియున్నారు. కావున మూల గ్రంథకర్తయు భక్త రక్షణ విషయమున భగవంతునకుఁగల యాతురతను వ్యక్తీకరించుటకే యత్నించి యున్నాఁడు. కాని యీ మార్గము పోతనకురుచింపలేదు. అటు భక్తుఁడు ప్రాణ సంకటావస్థయందుకుయ్యిడుచుండఁగా నిట ఆర్తరక్షణపరాయణుఁడగు

---

[1] చూడు. అనుబంధము.

భగవంతునకు గరుడు సధిరోహించుటకు గాని చక్రమును ధరించుటకుఁగాని తీరిక యుండునా? అసలంతదనుక మనసు పోవునా? భక్తుని యార్తనాదము వినుటయేమి? మందువెనుక లాలోచింపక దిగ్గన లేచి భగవంతుఁడేగుటేమి? రెండును నొక్కసారి కావలసినవే. అందులకే పోతన యీ క్రింది పద్యమును వ్రాసియున్నాఁడు -

"సిరికింజెప్పఁడు శంఖ చక్రయుగముంజేదోయి సంధింపఁడే

పరివారంబును జీరఁడభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం

తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో

పరిచేలాంచలమైన వీడఁడు గజ ప్రాణావ నోత్సాహి యై".

ఈ పద్య సారస్యమును వివరించుటనావశ్యకము. దీని విషయముననే శ్రీనాథ పోతనలకువివాదము గల్గెనను కింవదంతియుఁగలదు. ఇట్టి యాతురత భక్తరక్షణావసరమున భగవంతునకుఁ బరిపాటియేయని పోతన యభిప్రాయము. అందులకే "తనవేంచేయు పదంబు పేర్కొనఁడు" మొదలగు పద్యములను వ్రాసియున్నాఁడు. అనాథస్త్రీజనాలాపమును విన్నప్పుడు వేదములను ముచ్చులు ముచ్చిలించినప్పుడును దానవులు దేవతానగరిపై దండెత్తినప్పుడును భగవంతుఁడిట్టి సంరంభమునే చూపునని పోతన యభిప్రాయము. మఱి యిట్టి విపత్కాలములయందుఁ జక్రాద్యాయుధములు ధరింపక విష్ణువు వచ్చి నేమిచేయఁ దలఁచెను? సర్వశక్తియగు నీశ్వరున కీయాయుధాదుల నావశ్యకమని పోతన యభిప్రాయము.

ఇంతదనుక బాగుగనే యున్నది. ఇఁక నిందుఁ జేయఁబడిన లక్ష్మీ వర్ణనము మొదలగు వాని యౌచిత్యమేమి యని ప్రశ్న. అసలు మొట్టమొదటి పద్యము అలవైకుంఠపురంబులో మాత్రమేల చెప్పవలసి వచ్చెను? భగవంతుని భక్తరక్షణ పరాయణత్వమునకును వైకుంఠనగర వాసమునకును గల సంబంధమేమి? అను ప్రశ్నలుదయింపక తప్పదు. దీనికి సమాధాన మొక్కటియే కన్పట్టు చున్నది. అది పోతనకుఁ గల వర్ణనా కౌతుకము. ఆతఁడే వస్తువు నైనను దనివి దీరవర్ణించును. సూచనా మాత్రములగు వర్ణనలాతనికి రుచింపవు. ఎయ్యేది వివరింపఁబూనునో అయ్యది మనమనో నేత్రమునకుఁ జిత్తరువు నందు వోలెఁ గన్పట్టవలయును. రూపరేఖలను దీర్చి దిద్ది సమ్యగ్వ్యక్తీకరణముగావించుటలోఁ బోతన సిద్ధహస్తుఁడు. అతనిది ముఖ్యముగాఁ ప్రబంధధోరణి. అందులకే యీ విపుల వర్ణనలు. అలవైకుంఠపురంబులో యను పద్యమునందలి రూపచిత్రణ మనుపమానము లోకము వేయు ప్రశ్న కిది సమాధానము గూడ. భగవంతుఁడు సర్వవ్యాపి గావున గజేంద్రుని మొఱాలకించినంతనే

యక్కడనే యావిర్భవించెనని మూలము. కాని యది సామాన్యులకుఁ దృష్టిగాదు. ఒకప్పుడు తెలియదు గూడ. తెలిసినవారికిఁ గూడ హాయిలేదు. అనందము, లేదు. కావుననే పోతన దీనిని మార్చినాఁడు. ఒక మనోజ్ఞరూపకల్పన చేసి లోకమును మురిపించినాఁడు.

కొందఱీ పద్యమనౌచిత్యదోష దూషితమని యధిక్షేపించుచున్నారు. మకరమును సంహరించిన తరువాత విష్ణువు లక్ష్మీదేవితోఁ బల్కిన పల్కులు :

"బాలా! నా వెనువెంటను

హేలన్వినువీధినుండియే తెంచుచు నీ

చేలాంచలమును బట్టుట

కాలోనేమంటినన్ను సంభోజముఖీ."

ఇట్లు మరల ప్రశ్న చేయుటలో నున్నయౌచిత్యమేమని వారి ప్రశ్న. దీనికి సమాధానమొక్కటియే గలదు. సహజముగాఁ బోతన శృంగార ప్రియుఁడే కాని యాశృంగారము భగవదర్పితమై జగత్పవిత్రమైనది. పోతన శృంగార ప్రియత్వమును జూపుటకు భాగవతమున ననేకోదాహరణములు గలవు. కాని యవియన్నియు భగవదర్పితములే. అధ్యాత్మిక శక్తి సంపన్నములే. కావున నిట్టి పట్టులందు భావుకుఁడగువాడు భౌతిక విషయములపైఁ జూపు నిల్పరాదు. జయదేవుని గీతగోవిందమునందలి శృంగారము రాధాకృష్ణ పరమగుటచేతనే సకల భక్త జనశిరోధార్యమగుచున్నది. మఱొక విషయము. ఆర్త రక్షణార్థము భగవంతుఁడాతురతతోనే తెంచుచుండెను. ఆ సంరంభములో నాతనికి సిరిగూడ మఱపువచ్చినది. బద్ధ చేలాంచలము గూడ స్మృతిపథమునఁ బడలేదు. గజ రక్షణమైనది. ధర్మమును జరిగినది. ఆతురత యుఁడీరినది. అట్టియెడ భగవంతుఁడు తనకు నిత్యానపాయిని యగు శ్రీదేవి నిట్లు ప్రశ్నించుట తప్పా? ఆమెయుఁ దన భక్తకోటిలోఁ జేరినదేకదా! మఱియుఁ దత్కుచోపరిచేలాంచలమును గూడ వీడక యాతఁడేగుచుండెను. అట్టియెడ సహజలజ్జావినయాన్విత నామె మనసు నొచ్చినదేమో! అట్టియెడ నామె నాశ్వాసించుట యాతనికర్తవ్యముకాదా! ఇంతకు సమ్పృత కలశమున నలుసువెదకుట రసిక లక్షణముగాదు.

---

౧. ఏవం గజేంద్ర ముపవర్ణిత నిర్విశేషం, బ్రహ్మాదయో వివిధలింగ భిదాభిమానాః నై తే యదోపసస్రుపు ర్నిఖిలాత్మకత్వా త్తత్రాఖి లామరమయో హరి రావిరాసీత్. స్కం, ౮. అధ్యా. ౩. శ్లో. ౨౯

ఇంక రెండవది నరకాసుర వధ : ఇందుఁ గొంతమార్పు గలదు. మూలమున శ్రీకృష్ణుఁడు సత్యాసమేతుఁడై యుద్ధమునకేగినట్లు కలదుగాని సత్యభామ యుద్ధము చేసినట్లు లేదు. పోతన, సత్యభామ నరకునితోయుద్ధము చేసినట్లు వ్రాసియున్నాఁడు.

[1]మూలము :-

"సభార్యో గరుడా రూఢః ప్రాగ్జ్యోతిషపురం యయౌ"

"తద్విసర్గా త్పూర్వమేవ నరకస్య శిరో హరిః

అపాహరద్గజస్థస్య చక్రేణ క్షురనేమినా".

ఈ ఘట్టమునఁ బ్రప్రథమమునుండియుఁ బోతన మార్గము వేఱుగనే యున్నది. మూలమున నరకుని దుశ్చేష్టల నింద్రునివలన విని హరి సత్యభామా సమేతుఁడై ప్రాగ్జ్యోతిషపురమున కేగినట్లు గలదు. అందఱు భార్యలుండఁగా సత్యభామనే యేల తీసికొని శ్రీకృష్ణుఁడాహవమున కేగెనను ప్రశ్నకు సమాధానముగా౨ శ్రీధరులు గొంత వ్యాఖ్యానించి యున్నారు. ఆ విషయములను బోతన యాంధ్రీకరింపలేదు. అప్రస్తుతమని యూర కొనెనేమో! శ్రీధర వ్యాఖ్యను జూచినచో నవి యప్రస్తుతములుగాఁ దోఁపవు. నరకుఁడు యజ్ఞవరాహరూపియగు విష్ణువునకు భూదేవివలన జనించినవాఁడు. అప్పుడు. భగవంతుఁడు భూదేవికి నీ కొడుకును నీ యనుమతి లేనిదే చంపనని వరమిచ్చియుండెను. ఆ వరమును సత్యము గావించుటకై సత్యభామతో బయలుదేరెను. సత్యభామ భూమ్యంశమున జనించినది. ఇంక రెండవది పారిజాత వృత్తాంతము. నారదుఁడు పారిజాత కుసుమమును దెచ్చి శ్రీకృష్ణున కిచ్చెను. అప్పుడు కృష్ణుఁడు రుక్మిణి యింటనుండుటచే నాకుసుమమును నామె కిచ్చెను. అది విని శీఘ్రము కోపనయగు సత్యభామ యలిగినది. ఆమె నోదార్చుటకై శ్రీకృష్ణుఁడామెకుఁ బారిజాత వృక్షమునే తెచ్చి యిత్తుననెను. ఇప్పుడు నరకుఁడపహరించిన యదితికుండలాదులను దిరిగి యింద్రాదులకిచ్చు మిషతో స్వర్గమునకేగి పారిజాతమును దరిలించుకొని రానగునని శ్రీకృష్ణుని యాశయము. ప్రాణ ప్రియయగు సత్య కుముదము గూర్ప నామెను గూడఁ గొనిపోయెను. పై యంశములిన్నియు శ్రీధర వ్యాఖ్యయందున్నవి. కాని వానిని బోతన స్పృశింపలేదు. మరియొక త్రోవఁ ద్రొక్కెను. గరుడు నధిరోహింపనున్న సమయంబున శ్రీకృష్ణునితో సత్యభామ యిట్లనుచున్నది.

---

౧. స్కం, ౧౦. అధ్యా. ౫౯. శ్లో, ౩, ౨౧

౨. సభార్య ఇతి. తదా తస్యాః కౌతుకాయ తయా భార్య
----- తదర్థం తాం నీతివానితి జ్ఞేయమ్॥

"దేవా! నీవు నిశాటసంఘములను

దీపించి చెండాడనీ

ప్రావీణ్యంబులు సూడ గోరుదుగదా

ప్రాణేశ మన్నించి న

న్నవెంటం గొనిపొమ్ము నేడు కరుణన్

నేఁ జూచియేతెంచి నీ

దేవీ సంతతి కెల్లఁ జెప్పుదుభవ

ద్దీప్త ప్రతాపోన్నతుల్"

అనినం బ్రాణవల్లభకు వల్లభుండిట్లనియె.

"సమదపుష్పంధయ ఝుంకారములు గావు

భీషణ కుంభీంద్ర బృంహితములు"

స్కం. ౧౦ - పద్య ౧౦-౩ బు॥వె

అనినం బ్రియునకుం బ్రియుంబు జనియింప దగ్గఱి,

"దానవులైననేమి మఱి

దైత్య సమూహములైన నేమి నీ

మానిత బహుదుర్గముల

మాటున నుండఁగ నేమి శంక నీ

తో నరుదెంతునంచుఁ గర

తోయజముల ముకుళించి మ్రొక్కిన

మ్మానిని దన్ను భర్త బహు

మానపురస్సర దృష్టిఁ జూడఁగన్."

ఈ పెంపు 'తస్యాః కౌతుకాయ' అను శ్రీధర వ్యాఖ్యకు వివరణమై యుండును.

తరువాతి సత్యభామా నరకాసురుల యుద్ధమంతయు సమూలకమే. "వేణిం జొల్లెము వెట్టి" అను పద్యముమొదలు "మగువ మగవారి ముందఱ" అను పద్యము వఱకు స్వకపోలకల్పనమే. ఇయ్యది నాచన సోముని యుత్తర హరివంశమున కనుకరణమను విషయము సర్వజన విదితము. ఈ పద్యములందు వీర శృంగార మూర్తి యగు సత్యభామ మనోజ్ఞ రూపము చిత్తరువు నందు వోలెఁ జూపట్టుచున్నది. "వీర శృంగార రౌద్ర విస్మయములు గలసి భామినియయ్యెనో" యని యామెను బోతనయే వర్ణించి యున్నాఁడు. ఈ క్రింది పద్యములోఁ బోతన యామెను వీర శృంగారమూర్తిగా చిత్రించియున్నాఁడు.

"రాకేందుబింబమై రవిబింబమై యొప్పు

నీరజాతేక్షణ నెమ్మొగంబు" స్కం. ౧౦ పద్య ౧౮౩ బు. ప్రతి

"పరుఁ జూచున్ వరుఁజూచు నొంప నలరిం

పన్ రోషరాగోదయా" స్కం. ౧౦ పద్య ౧౭౮ బు

ఈ ఘట్టమునందలి పద్యములన్నియు నాణిముత్తెములే. చూ. అను బంధము వానినన్నింటినిట నుదాహరించుట నావశ్యకము. కాని యిందు సత్యభామ యుద్ధమేల చేయవలసివచ్చెనో స్పష్టముగ లేదు. హరిచేఁ దన సైన్యము హతమగుటంగాంచి కోపించి నరకుఁడా హవరంగము నకేతెంచెను. అప్పుడు హరి "శుంభద్రాజబింబోపరిస్థల శంపాన్వితమేఘమో యన ఖగేంద్రస్కంధ పీఠంబుపై అలనారత్నముఁగూడి సంగర కథాలాపంబులం" జేయుచుండెను. అంతనరకుఁడు యుద్ధ సన్నద్ధుఁడాయెను. సత్యభామయు "దమకింపక విలోకించి, సంభ్రమంబున "వేణిం జాల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వఁగా, బాణింబయ్యెదఁ జక్కఁగాఁదుఱిమి, శుంభ ద్వీరసభయై, తన ప్రాణేశాగ్ర భాగంబున" నిల్చినదఁట! మొదట శ్రీకృష్ణుఁడామెను యుద్ధము మానుమనెను; కాని యామె ప్రత్యుత్తరము నపేక్షింపకయే "మాన వేని నీ విల్లంది కొ"మ్మని తన బాణాసనము నామె కిచ్చెను. ఆ విల్లందికొనినంతనే యామె కనంత బలము సేకూఱినది. ఆమె యుద్ధమందుఁజూపిన చాతుర్యముతయు శ్రీకృష్ణుని యనుగ్రహము వలనఁ గలిగినదే. ఈ యభిప్రాయమును బోతనయే సూచించియున్నాఁడు. "ఆ విల్లంది బలంబు నొంది తదగణ్యానంత తేజో విశేషా విర్భూత మహా ప్రతాపమున వీరాలోక దుర్లోకయై" యప్పుడు సత్యభామ యొప్పినదఁట. ఆమె యిషువుఁ దొడుగుటయుఁ

దివుచుటయు నేయుటయు నెఱుఁగ రాకుండ ననిసేసె"నఁట! ప్రత్యాలీఢపాదము నలిక స్వేద వికీర్ణ కాలకయు నాకర్ణికా నీతసల్లలిత జ్యానఖపుంఖ దీధితియు లక్ష్యావలోకయు వలయాకారధనుర్విముక్త విశిఖా వ్రాతాహతారాతియు" నగు నయ్యలినీలాలక చూడ నొప్పె యుండెనట. భీకర రణ క్రీడా నిమగ్న చిత్తయగు నమ్మానిని రూపము పోతన కచ్చెరువు గొల్పినది. మఱియు నీక్రింది నందియములు గూడఁ బొడసూపినవి.

"బొమ్మ పెండ్లిండ్లకుఁ బోనొల్లనను బాల

రణరగమున కెట్లు రాఁదలంచె? స్కం. ౧౦. పద్య ౧౮౦ బు

"వీణెఁ జక్కఁగఁ బట్ట వెరవెఱుంగని కొమ్మ

బాణాసనంబెట్లు పట్టనేర్చె" స్కం. ౧౦ పద్య ౧౮౧ బు

మీఁది పద్యములు నాచన సోముని యుత్తర హరివంశమున కనుకరణములేయయ్యు మనోజ్ఞములే. అనుకరణమునందుఁగూడ ననితర సాధారణమగు స్వాతంత్ర్యమును నైపుణ్యమును జూపినాఁడు మహాకవి. ఈ వర్ణనలతోఁ బోతనకుఁ దృప్తి కలుగలేదు. అతఁడు మహాభక్తుడు గదా! సత్యభామా సహితుఁడగు శ్రీకృష్ణపరమాత్మను గూడ వర్ణింపనిదేయాతనికి మనశ్శాంతి లేదు. కావున నీ క్రింది పద్యమావశ్యకమైనది.

"జ్యావల్లీ ధ్వని గర్జనంబుగ సురల్ సారంగయూథంబుగా

నావిల్లింద్రశరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగాఁ

దా విద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్నిమగ్నంబుగాఁ

బ్రావృట్కాలముచేసె బాణచయ మంచశ్శీకరశ్రేణిగాన్."

ఇందలి యుపమానములన్నియు నర్థవంతములు. శ్రీకృష్ణుఁడు మేఘముగాఁ జెప్పఁబడినాఁడు. మేఘము సౌఖ్యదము. సకల సస్యప్రవర్ధకము. అసురులు దావాగ్నిగాఁ జెప్పఁబడినారు. దావాగ్నిభయంకరము; సకలవృక్షనాశంకరము. వర్షామేఘము దావాగ్నినిఁ జల్లార్చును. అట్లే శ్రీకృష్ణుఁడు రాక్షస ప్రతాపమును జల్లార్చును. ఇఁక సత్యభామ విద్యుత్తుతో సరిపోల్పఁబడినది. విద్యుత్ప్రకాశము కొలఁది కాలమే యుండును. ఉన్నంత సేపు గన్నులు మిఱు మిట్లు గొలుపును. సత్యభామయుఁ గొలఁది సేపే యుద్ధముగావించినది. చేసినంత కాలమున ప్రతిహత తేజః పుంజమును వెదజల్లినది. దవదహనభంజకమే

యయ్యుఁ బ్రావృట్కాలము సకల జగదానంద సంధాయకముగదా! అ“మ్ముద్దరాలి బాణవృష్టి” నట్లు వర్ణించి వర్ణించి తనిసినాఁడు, మహాకవి పోతన.

వామనావతార ఘట్టమునఁ గథాగతి యందు మూలమునకు నాంధ్రీకరణమునకు భేదము లేదు గాని యొక్క విషయమున మాత్ర మాంధ్రీకరణము మూలమునకు భిన్నముగా నున్నది. మూలమున లేని యంశ మొకఁ డాంధ్రీకరణమునఁ జెప్పఁబడినది. వామనునకు దాన మీవలదని శుక్రుఁడు బలిని శాసించును. బలియందులకంగీకరింపఁడు. అంతటఁ గ్రుద్ధుఁడగు శుక్రుఁడు బలిని [1]శీఘ్రకాలమునఁ బదభ్రష్టుఁడవు గమ్మని శపించును. మూలమున నింతే యున్నది. ఆంధ్రీకరణమున మాత్రము :

“నీరధారబడగనీక యడ్డంబుగాఁ
గలశ రంధ్రమాపగాను దెలిసి
హరియుఁగావ్యునేత్రమటఁగుశాగ్రంబున
నడువనేకనేత్రుఁడయ్యె నతఁడు.”

అను పద్యముగాన వచ్చుచున్నది. ఈ పద్యముకే వలమమూలకను.

హాలాహల భక్షణ ఘట్టమునఁ గూడ నమూలకమగు విషయ మొండుగలదు. దేవతలు శివునిఁ బ్రార్థింతురు. శివుఁడు హాలాహలమును బానము సేసెదనని భవానితోఁ జెప్పును. భవాని యందుల కంగీకరించును. అంతట శివుఁడు హాలాహలమును భక్షించును. [2]ఇంతే మూలమున నున్న విషయము. ఆంధ్రీకరణమున నీక్రింది గద్య పద్యములు గలవు :

“అని చెప్పిన నరేంద్రుండిట్లనియె

అమరన్ లోకహితార్థమంచు నభవుం బ్రమింగుమని చెప్పవచ్చును.
కాని భవాని

---

౧. శుక్ర ఉవాచః “దృఢం పండితమాన్యజ్ఞ స్తబ్ధోప్య
స్మదుపేక్షయా, మచ్ఛాసనాతిగో యస్త్వ మచిరాద్భ్రశ్యసే శ్రియః
స్కం, ౮. అధ్యా ౨౦. శ్లో ౧౫. యజమాన స్వయం తస్య శ్రీమత్పా
దయుగం తదా, అవనిజ్యావహన్మూర్ధ్ని తదపో విశ్వపావనీః
స్కం. ౮ అధ్యా ౨౦, శ్లో. ౧౨.
౨. ఏవ మామంత్ర్య భగవాన్ భవానీం విశ్వభావనః
తద్విషం జగ్ధు మారేభే. తం భవాన్యన్వమోదత.

"మింగెడు వాఁడు విభుండని
మింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబునెంతమది నమ్మినదో?"

ఈ రెండు పద్యములును గేవలమమలకములు. అట్లయ్యును హృద్యములు. ఈ
సందేహము రాజునకుఁగల్గెనో లేదో చెప్పఁ జాలముగాని మనకు నిక్కముగాఁగల్గునదియే.
ప్రత్యుత్తరమునందలి సర్వమంగళా శబ్దము సార్థకము. మంగళ సూత్ర ప్రసంగము మధురాతి
మధురము. నిజమాలోచించినఁ బతులకుఁ బ్రాణ రక్షపత్నీమంగళ సూత్రవబలమే కదా!
అదియే హైందవ సంప్రదాయము. దానినే మహాకవియుద్ఘాటించినాఁడు.

మూలమున సూచనా మాత్రముగనైన లేని భావములు గొన్ని పోతన భాగవతమందుఁ
గన్నట్టుచున్న యవి. ఇందులకొక యుదాహరణము – శ్రీకృష్ణుని బాల్య క్రీడాభివర్ణనము.
గోపికలు శ్రీకృష్ణుని బాల్య క్రీడాభివర్ణనము. గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁ జేతల
యశోదతోఁ జెప్పు సందర్భమున మూలమందిట్లున్నది.

"కృష్ణస్య గోప్యో రుచిరం వీక్ష్య కౌమారచాపలమ్
శృణ్వంత్యాః కిల తన్మాతు రితిహోచు స్సమాగతాః
----------- స్వగృహాన్ సలజ్జాః

స్కం.౧౦. అధ్యా ౮. శ్లో. ౨౯ – ౩౩

స్పష్టార్థము మీఁది శ్లోకముల తాత్పర్యముః కృష్ణుని కౌమార చాపలమ్ము నరసి
గోపకాంతులు యశోదకడ కేగి యిట్లునిరి. "అకాలమున దూడలను విడుచును.
వానికాక్రోశించినఁ దానునవ్వును. అనేకములగు వెరవులు వన్ని వెన్న పాలు మొదలగు
వానిని దొంగిలించి కొంత దాను దినును. తక్కుంగలదానిని గోతులకుఁ బంచి పెట్టును.
దధ్యాది భాండములు దనకుఁ గాన్పింపకుండ దాపఁబడియుండునేని యింటి వారిపై నలిగి
బాలుర నేడిపించును మేమింటి పనులు చేసికొనుచుండియే మఱి, యుండునెడ మెల్లఁగా
రుదెంచును. ఉట్టియందకపోయినఁ బీఁటలు ఱోలు మ్రాఁకు నెత్తుగ నమ్చు యెక్కి
పాలు, పెరుగు, వెన్న, న్న మొదలగు పదార్థములున్న బానల నరి సందు వోడిచి వానిని
గొనును. ఆ బానలు చీఁకటింట దాపఁబడునెడ నిజాభరణ మణి కిరణ జాలముల వలనఁ

గలుగు వెలుఁగున భాండములంగని యందున్న వానిం బరిగ్రహించును. ఇంటివారు చూచి [౧]యోరీ! చోరా యని యదల్చినచో నేను చోరుడను గాను గృహస్వామిని నీవ చోరుఁడవని ప్రగల్భ వచనములు పల్కును. గృహాంతరమున మూత్రపురీషములు విడుచును. ఇంతలు సేసియు నిచ్చట నీవు సూడనేమియు నెఱుంగని సాధువు వోలెఁ గన్పట్టును. ఇట్లు గోపికలా బాలుని భయ చకిత నయన విలసిత వదనమును గనుఁగొనుచు బాల కృష్ణుని ధూర్తత్వమును వివరించి చెప్పినను యశోద ప్రహసితవదనయైూల నదలింప నిచ్ఛగింపకుండెను. మఱియు నొక్కతఱి నమ్మాయా మానవకుమారుఁ డందఱి మందిరంబుల నేకాకారంబులైన భిన్న రూపం బులం జొచ్చి ధూర్తత్వంబు నెఱపిన నందఱును దమతమ యిండ్లలోఁ గన్నపట్టు కృష్ణునిఁ బట్టి యశోద కడకుఁ దెచ్చిరి. కాని యశోదకడఁ జిన్ని కృష్ణుఁడుండెను. తాము తోడ్తెచ్చిన కృష్ణులు గానరారైరి. అంత నాగోపిక లేమియును జెప్పఁ జాలక సిగ్గున స్వగృహముల కేగిరి.

పోతన భాగవతము.

| | |
|---|---|
| "బాలురకుఁ బాలు లేవని" | స్కం ౧౦ పద్య ౩౦౭ |
| "పడతీ! నీ బిడ్డఁడు మా" | పద్య ౩౦౮ |
| "మీ పాపఁడు మా గృహముల" | పద్య ౩౦౯ |
| "పుట్టిపుట్టఁడు నేఁడు దొంగిలఁ<br>బోయి మాయిలు సొచ్చితా | పద్య ౩౧౦ |
| "ఆడం జని వీరల పెరు గోడక" | పద్య ౩౧౧ |
| "వారిల్లు సొచ్చి కడవల<br>దోరంబుగు నెయ్యి ద్రావి, తుది నాకడవల్<br>వీరింట నీసుతుండిడ<br>వారికి వీరికిని దొడ్డ వాదయ్యె సతీ! | పద్య ౩౧౨ |

---

౧. రేరే చోర ఇత్యాద్యుక్తః శ్రీకృష్ణః త్వమేవ చోరః అ
హం గృహ స్వామీత్యాదీని
జల్పతి. స్కం.౧౦. పుట. ౨౧౮

"వేలుపులఁటె నాకంటెను" పద్య ౩౧౩

"వెన్నఁ దినఁగఁ బొడఁగని మా" పద్య ౩౧౪

"ఇమ్మగువ దన్ను వాకిటఁ" పద్య ౩౧౫

"చేబంతి దప్పి పడెనని" పద్య ౩౧౬

"ఇచ్చెలువఁ జూచి ముచ్చిలి" పద్య ౩౧౭

"కొడుకులు లేరని యొకసతి" పద్య ౩౧౮

"తలఁగిన దానందల మనఁ" పద్య ౩౧౯

"వ్రాలఁగ వచ్చిన నీ సతి" పద్య ౩౨౦

"మగువా? నీ కొమరుఁడు మా" పద్య ౩౨౧

"నమ్మి నిదురవోవ నా పట్టి చుంచుమా" పద్య ౩౨౨

"నా పట్టి పొట్ట నిండఁగ" పద్య ౩౨౩

"తెఱవ యొకతె నిద్రింపఁగ" పద్య ౩౨౪

"నొడుకును నా కోడలు" పద్య ౩౨౫

"తరుణి యొకతె పెరుగుఁ ద్రచ్చుచోఁ దుదివంగి" పద్య ౩౨౬

"కలకంఠి మావాడ గరితలమెల్లనీ
పట్టి రాఁగలఁడని పాలు పెరుగు" పద్య ౩౨౭

"కడులచ్చి గలిగెనేని" పద్య ౩౨౮

"ఓయమ్మ? నీ కుమారుఁడు" పద్య ౩౨౯

పై పద్యములలో మొదటి నాలుగు పద్యములును దుది సీస పద్యమును దప్పఁ దక్కిన వన్నియు నించుమించుగా నమూలకములే. భిన్న రూపముల గోపికల యిండ్లఁ జరించు శ్రీకృష్ణుని గోపికలు యశోదకడకుఁ గొని వచ్చుటయు వచ్చి యందున్న

శ్రీకృష్ణునిఁ గాంచి యాశ్చర్యపడుటయు నంతలోనే వారిబంధనము నందున్న కుష్ణులంతర్హితులగుటయు విడువఁబడినది. సీనమున శ్రీకృష్ణుని మాయా బహురూపధారితము మాత్రము వ్యక్తము సేయఁబడినది. కొందఱు బుద్ధిమంతులీ పద్యములను గర్హింతురు. అశ్లీలములని నిరసింతురు. కాని వీరందఱకుఁ బోతన సమాధానమిచ్చియే యున్నాఁడు. "అనేక విధంబుల బాల కృష్ణుండు సేయు వినోదంబులు దమయందుఁ జేయు మహా ప్రసాదంబులని యెఱుంగక దూఱుచున్న గోపికలకు" – గోపికలకే కాదు. మనకును సమాధానమే. మఱొక ముఖ్య విషయము. భాగవత కర్తకు శ్రీ కృష్ణుఁడు కేవల పరబ్రహ్మము. మనుష్య రూపమున నున్న శుద్ధ బుద్ధముక్త చైతన్యము; సర్వాంతర్యామి; సర్వజ్ఞుఁడు; సర్వశక్తి. భాగవతమును సరిగా నర్థము చేసికొనవలెనన్న నా భావముతోడనే మనము దానిని బఠింప వలెను. లేకున్న శ్రీకృష్ణ లీలలన్నియు నశ్లీలములుగనే తోచును. మఱొక ముఖ్య విషయము. సరిగా నైదేండ్లు గూడ నిండని బాలుఁడు మగ పోడుములు సేయుటేమి? దీని వల్లనే తెలియుచున్నది గదా యవియన్నియు భగవల్లీలలని. ఈ విషయమును గూర్చి యింతకంటెఁ జర్చించుట మన కప్రస్తుతము; అనావశ్యకము.

ఈ భావములన్నియుఁ బోతన స్వకపోల కల్పనములనియే చెప్పవలెను. వీనికి మూలమిప్పటికి లభింప లేదు.

పోతన భాగవతమున సమూలకములగు వర్ణనలు గొన్ని కానవచ్చుచున్నవి. పోతన భాగవతమును సర్వ సాధారణముగాఁ బ్రబంధ శయ్యలో రచించుటయే కారణము. అట్లని భాగవతమునఁ బురాణశయ్యయే లేదనరాదు. కొన్నియెడల నదియును గానవచ్చును. రెండు శయ్యలకును గల ముఖ్య భేదము సంయమము. పురాణశయ్యకు సంయమ మావశ్యకము. పది మాటలలోఁ జెప్పు దాని నొక్కమాటలోఁ జెప్పుట పురాణ కవి లక్షణము. ఒక్క మాటలో నిముడు భావమును బది మాటలలోఁ జెప్పుట ప్రబంధ కవి లక్షణము. భావ ప్రపంచీకరణము ప్రబంధ కవితాలక్షణము. భావ సంయమము పురాణ కవితా లక్షణము. ప్రబంధ కవియను ప్రాసాది శబ్దాలం కారములకుఁ బ్రాధాన్యమిచ్చును. పురాణ కవి యట్టి శబ్ద ప్రాధాన్యము నంగీకరింపఁడు. ఈ గుణములను బట్టి చూచినచోఁ బోతనది ప్రబంధశయ్య యనియే చెప్పవలెను. అందులకే యతనికి నాచనసోముని కవిత యందంత గురుభావము. సంస్కృత మహాకవులలోఁ గాదంబరీ కర్త బాణుఁడు వర్ణనలకుఁ బేర్పడినవాఁడు. పోతన కాతఁడును బరోక్ష గురువే. కావుననే పోతన భాగవతమునఁ గాదంబరి ననుకరించిన భాగములును గలవు. ఉదాహరణకుఁ బ్రథమ స్కంధమునందలి నైమిశారణ్య వర్ణనమును గైకొనవచ్చును. మూలమున "నైమిశే నిమిషక్షేత్రే" యని మాత్రమే కలదు.

దీనినిఁ బోతన మిక్కిలి పెంచి వ్రాసెను. దీర్ఘ సమాస భూయిష్ఠమును బహు విధ శబ్దార్థాలంకార సహితమును నగునా గద్యము కాదంబర్యను కరణమనుటకెట్టి సందియమును లేదు.

"మధువైరి మందిరంబునుంబోలె మాధవ మన్మధ మహితంబై బ్రహ్మగేహంబునుం బోలె శారదాన్వితంబై నీల గ్గళ సభా నికేతనంబునుంబోలె వహ్నివరుణ సమీరణ చంద్రరుద్ర హైమవతీ కుబేర వృషభగాలవ శాండిల్య పాశుపత జటిపటల మండితంబై."

"చక్రధరఇవ కరకమలోపలక్ష్యమాణ శంఖచక్రలాం
ఛనః హరివ జితమన్మధః, గుహఇవా ప్రతిహత
శక్తిః కమలయోనిరివ విమానీకృత రాజహంసమం
డలః జలనిధిరివ లక్ష్మీప్రసూతిః గంగా ప్రవాహ
ఇవ భగీరథ పథప్రవృత్తః" -------- కాదంబరి.

వ్యాకుల చిత్తుండై సరస్వతీ తటంబున నాసీనుండై యున్న వేదవ్యాసుని కడకు నారదుఁడు వచ్చుట! మూలమున నిట్లున్నది.

"కృష్ణస్య నారదో భ్యాగాదాశ్రమం ప్రాగుదాహృతమ్"

దీనికిఁ బోతన యాంధ్రీకరణము :

"తనచేతి వల్లకీతంత్రీచయంబున
సతతనారాయణ శబ్దమెప్ప"

అనునీ వర్ణనము అమూలకము

మూలము :

"భగీరథోఽథ రాజర్షి ర్నిన్యే భువనపావనీమ్
యత్ర స్వపితౄణాం దేహా భస్మీ భూతాశ్చ శేరతే
రథేన వాయువేగేన ప్రయాంత మనుధావతీ
దేహాన్ పునంతీ నిర్దగ్ధా నసించ త్సగరాత్మజాన్"

స్కం. ౯. అధ్యా ౯ శ్లో, ౧౧, ౧౨

దీనికిఁ బోతన సుదీర్ఘమగు నొక గద్యమువ్రాసియున్నాఁడు. ఈ గద్యయందును గాదంబరీ చ్ఛాయలు గలవు. ఇందుమనోజ్ఞములగు నుపమలను వాడియున్నాడు. అయ్యమరగంగా స్రవంతి యెన్నిమెలికలు దిఱిగి, యెన్ని యొయ్యారపు నడకలఁ బోయినదో, అన్ని మెలికలునన్ని యొయ్యారములుఁ బోతన కవితా ప్రవాహమును జూపినది. "ఇట్లమ్మహానది పురారాతి జటాజూట రంగంబు వలన దిగంబడి నిరర్గళ ప్రవాహంబై, నేలకు జల్లించి, నెఱసి, నిండి పెల్లవెల్లి గొని, పెచ్చు పెరిగి, విచ్చల విడింగ్రేపు వెంబడి నుఱక క్రేళ్ళుఱుకు మిఱక ప్రాయంపుఁగా మధేనువు చందంబున ముందఱికి నిగుచు, ముద్దుఁ జందురుతోడి నెయ్యంబున గ్రయ్యనడరి, చొప్పు దప్పక సాఁగిచనుదెంచు సుధార్ణవంబుకై వడిఁ బెంపు గలిగి, --------శీకరంబులు నుంగలిగి" గద్య ౨౩౦

ఇంతదనుక నభిరామంబులగు ఉపమలు గన్పట్టుచున్నవి. అమ్మహాస్రవంతి యందలి వఱదలు, బుగ్గలు, వెలినురువులు, తరంగములు, శీకరములు మనోజ్ఞములగు నుపమలతో వ్యక్తీకరింపఁబడియున్నవి. కాని యటు పై నున్న గద్యము శ్లేషలతో జటిలమై కాదంబరి ననుకరించుచున్నది. "శ్రీకరంబు తెఱంగున విష్ణు పదంబు ముట్టి, విష్ణు పదంబు భాతినుల్లసితహంసరుచిరంబై, రుచిర పక్షంబు రీతి నతి శోభిత కువలయంబై కువలయంబు వెన్నున బహుజీవనంబై, జీవనంబు లాగున సుమనో వికాస ప్రధానంబై, ప్రథాన పర్వంబు పొలుపున నేకచక్ర బక భీమ మహాభంగ సుభద్రార్జున చరిత్రాభిరామంబై ---------"

ఇందు శ్లేషయే కాక ముక్త పదగ్రస్తమును సాధింపఁబడినది. ఇట్లు నడచి నడచి యొక్క మారొక మెలఁకువ చూపినది. "మానినియన లోఁతు సూపక, గరితయన నడిచప్పుడు సేయక, ముగుదయన బయలు పడక, ప్రమదయనఁ గ్రయ్యం బాఱుచుఁ బతివ్రతయన నిట్టట్టుచనక తల్లియన నెవ్వియైన లోఁగొనుచు, దైవంబున భక్త మనోరథంబు లిచ్చును నంతకతకు గ్రుఱిగడచి ----"

నృసింహావతార ఘట్టము : మూలము:

"ప్రతప్తచామీకర చండలోచనం

స్ఫురత్సటా కేసర జృంభితాననమ్

కరాళదంష్ట్రం కరవాళచంచల

క్షురాంత జిహ్వం భ్రుకుటీముఖోల్బణమ్.

స్తబ్ధోర్ధ్వ కర్ణం గిరికంధరాదుత్భం

వ్యాత్తాస్యనాను హనుభేద భీషణమ్

దివి స్పృశత్కాయ మదీర్ఘపీవర

గ్రీవోరువక్షస్థల మల్పమధ్యమమ్

దురాసదం సర్వనిజేతరాయుధ

ప్రవేకవిద్రావిత దైత్య దానవమ్"

స్కం. ౭. అధ్యా. ౮. శ్లో, ౨౧, ౨౨, ౨౩

స్పష్టార్థము దీని తాత్పర్యము :

మిక్కిలి తపింపఁబడిన బంగారమువలె ప్రచండములగు చూడ్కులును ప్రకాశించుచున్న సటాకేసరములచే జృంభించియున్న యాననమును భయంకరములగు కోరలకాంతులును ఖడ్గధారాతీక్ష్ణ జిహ్వయుఁ గుటిల భ్రుకుటీ ముఖోల్బణమును, స్తబ్ధోర్ధ్వ కర్ణములును గిరిగుహవోలె నత్యంత ఘోరములును గపోల ప్రాంత భేదమునఁ బరమ భీషణములును నగు వివృత వక్త్ర నాసావివరములును హ్రస్వపీవరకందమును, విశాలవక్షస్థలమును, సూక్ష్మ మధ్యమును జంద్రకిరణ ధవళములగు రోమములును నాయుధోపమములగు ఖరనఖరముల నొప్పి సర్వతోవ్యాప్తముగు భీమ భుజాసహస్రమునమర మిన్నొరయుచున్న మహాకాయంబు భయంకరంబై చూపట్టి నరకేసరి రూపంబు దాల్చి హరి నిజ చక్రగదాద్యాయుధంబు లొక్కయుమ్మడి దైత్యదానవ వీరులందఱిమీద యఱుముచుండ నెదురంగనుపట్టె.

పై శ్లోకములకుఁ బోతన యాంధ్రీకరణము :

"ప్రళయవేళాసంభూత సప్తస్కంధ బంధుర సమీర

ణ సంఘటితఘోర జోఘుష్యమాణ మహావలాహ

కవర్గ నిర్గత నిబిడ నిష్ఠురదుస్సహ నిర్ఘాత సంఘ

నిర్ఘోషనికాశంబులైన చటచ్చట స్ఫుటస్ఫుట ధ్వని ప్రముఖ భయంకరా రావపుంజంబులు జంజన్యమానంబులయి యెగసి, యాకాశ కుహరాంతరాళంబు నిరవకాశంబుసేసి, నిండినం బట్టునాలక దోధూయమాన హృదయంబులయి పరవశంబులైన పితామహ మహేంద్రవరుణ

వాయు శిఖి ప్రముఖ చరాచర జంతు మహాప్రభావుడునునైన శ్రీనృసింహుండావిర్భవించిన"

స్కం. ౭ గద్య ౨౮౫ వావిళ్ల

ఈ సుదీర్ఘ వచనమునందుఁ బోతన చూపిన మెఱుఁగు లనేకములు గలవు. స్థూలముగా నిద్దానిని ద్విధా పరిశీలింపనగును. మొదటిది భాష, రెండవది భావము. నిజమాలోచింపమొదట భావ విషయమును బరామర్శించి, తరువాత భాషను గూర్చి చర్చింపవలయును. భావానుగుణముగ భాషయున్నదా లేదా యనునది చర్చనీయమగు విషయము. కాని యీ వచనమును వినినంతనే మొదట హృదయమునకు హత్తుకొనునది భాషయే. కావున నదియే ముందు చర్చింపవలయును. ద్రాఘిష్ఠములగు సమాసములచే నోజోగుణ భూయిష్ఠ శయ్యాభావుక హృదయములనుల్లోల కల్లోలముల రేకెత్తించును. నృసింహావిర్భావము దైత్యదానవ శిక్షాదక్షము. దేవమనుష్యాది సకల లోకరక్షాదక్షము. పరిపంధి జన భయంకరము. శిష్ట భక్తజన శివంకరము. అందులకే పోతన "ప్రహ్లాద హిరణ్యకశిపురంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమానకరుణా వీరరస సంయుతుండును" అని నృసింహమూర్తిని వర్ణించియున్నాఁడు. ఇందుఁ బ్రహ్లాదుఁడు భక్త వర్గమునకుఁ బ్రతినిధి. హిరణ్యకశిపుఁడు దుష్టజన ప్రతినిధి. భక్తజన రంజనమునకును దుష్ట దానవభంజనమునకును నృసింహదేవుఁడావిర్భవించినాఁడు. అందులకే యాయన యంతర్మూర్తి కరుణా సంభరితము. బహిర్మూర్తి క్రోధ ఘూర్ణితము. ఈ గద్యమునఁ బోతన శైలియు రెండు విధములునే నడుచుచున్నది. ఒక యెడ మధురకోమల పద సంకలితమై సెలయేటి చిఱు తరగల యులిపు వోలెఁ గర్ణపేయమై మందమలయానిలము వోలె హృదయానంద సంజనకమైయుండును. ఇంకొకయెడ మూర్ధన్యాక్షర బహుళ దీర్ఘ సమాక్ష జటిలమై యిరుగెలకుల నొరసి పాఱు నదీమ తల్లి వోలె నానంద జనకమయ్యు ననభిగమ్యమై యుండును. ఇందు మొదటిది శ్రీనృసింహ దేవుని భక్త జన రంజకత్వమును కరుణాతరంగి తత్వమును సూచించును. రెండవది భగవంతుని దుష్టజననా శంకర వీరరస తరంగితత్వమును సూచించును.

ఇక నిందుపయోగింపఁబడిన పదములను దత్సంయోజనయందుఁగవి చూపించిన నైపుణ్యమును బరిశీలింతము. మొదటిది యిందలి "జోఘుష్య మాణ, జంజన్యమాన, దోధూయమాన, దేదీప్యమాన, రోరుధ్యమాన, తంతన్య మాన మొదలగు శబ్దముల ప్రయోగములోని యౌచిత్యము. ఇవి యఙ్ఞంతములు. క్రియార్థము మరల మరల జరుగుచో నివి యుపయోగింపఁబడును. "మరల మరల శబ్దించు" అను నర్థమున జోఘుష్యమాణ శబ్దము ప్రయుక్తమగును. పోతన యీ పదములను బ్రయోగించుటలో

నాతని యభిప్రాయ మేమైయుండును? నృసింహా విర్భావము క్షణికమును దాత్కాలికమునుగాధ నియు నయ్యావిర్భావావసరమున జనించిన ప్రళయ భయంకర చిహ్నములు గొంతకాలము నిలిచి యుండెననియుఁ బోతన యభిప్రాయము. లేనిచో నీ పదములు వ్యర్థములగును.

ఇంకఁ బద సంయోజనము, ఇందును గవి చూపిన నైపుణ్య మపారము గాని దానిని గూర్చి నవిస్తరముగాఁ జర్చించుట యిట నప్రస్తుతమగును. అది కేవలము శైలికి సంబంధించిన విషయము గావున సద్దానిని గూర్చి యా ప్రకరణమున విపులముగాఁ జెప్పఁబడును.

ఇఁక భావవిషయము : మూలమున నృసింహ దేవుని సర్వావయవములు వర్ణింపఁబడినవి. ఇవి యన్నియుఁ బోతన యాంధ్రీకరణమునందును వర్ణింపఁబడియున్నవి. కాని యా వర్ణనల యందుఁ గొంత భేదము గలదు. మూలమున లేని క్రమత యాంధ్రీకరణమునఁ గలదు. వఱియు దేవతల వర్ణించు నపుడు ఆచరణ శిరః పర్యంతము వర్ణింపవలెనను నియమమును బాటింపఁబడినది. మూలమున నా నియమమున్నట్లు గానరాదు. ఎందులకనఁగా మధ్యమును వర్ణించిన తరువాత భుజ వర్ణనమును గావించినాఁడు.

ఇందలి భావము లనేకముల మూలకములు. మూలమున ౧బ్రహ్మాండము బ్రద్దలగునట్లొక భయద నిస్స్వనము బయల్వెడలెనని మాత్రము చెప్పఁబడియున్నది. ఆ భయద స్వనముపలక్షించి బ్రహ్మాదులు దమలోకములకేమి ప్రమాదముగల్గునోయని భయపడిరి. మూలము నందలి యీ వర్ణనము పోతనకుఁ దృప్తి నీయలేదు. ఆ ధ్వని యెట్టిదో విస్పష్టము చేసి దాని భయంకరత్వమును విశదీకరింపఁ దలఁచెను. అందులకే "భంభణ్యమానంబగు నమ్మహాస్తంభంబు వలన" ని యుపక్రమించినాఁడు. ఆ స్తంభము విఱిగిన ధ్వని యొక్క మారు ధ్వనించి యూరకొనలేదు. మఱల మఱల ధ్వనించినది. కావుననే బంభజ్యమాన శబ్దము సార్థకము. ప్రళయ కాలమున సప్తస్కంధ బంధురమగు సమీరణము విజృంభించును. తద్వేగమునఁ బుష్కలావర్తకా ద్యంభోధంపాతము ధారాపాతముగ వర్షించును. అప్పుడు పిడుగులు పడును. అవి నిబిడ నిష్ఠుర దుస్సహ నిర్ఘాతములు. తన్నిర్ఘాత నిర్ఘోషము లాకాశకుహరాంతరాళమును నిరవకాశంబు సేసినవి. పట్టు సాలక విజృంభించు నా భయంకర ధ్వనికి బ్రహ్మేంద్రాదులు దోధూయ మానహృదయులైరి. ఇచట నీ భావముల వ్యక్తీకరింపఁ బోతన యవలంబించిన మార్గము

---

౧. తదైవ తస్మి న్నినదో తి భీషణో బభూవ యేనాండకటాహ మస్ఫుటత్, యంవై స్వధిష్ణ్యోపగతం త్వజాదయః శ్రుత్వా స్వధామవ్యయ మంగ మేనిరే. స్కం. ౭. అధ్యా. ౮. శ్లో. ౧౬

గమనార్హము. "ప్రళయవేళా సంభూత సప్త స్కంధ బంధుర సమీరణ సంఘటిత ఘోర జోఘుష్యమాణ మహావలాహక వర్గనిర్గత నిబిడనిష్ఠుర దుస్సహ నిర్ఘాత సంఘ నిర్ఘోష నికాశంబులైన" అని యొక దీర్ఘ సమాసము గూర్పఁబడినది. మఱియు అందలి పద సంయోజనయు నోజోగుణమున కొక నిదర్శనము. "స్కంధబంధుర, సమీరణ సంఘటిత, ఘోర జోఘుష్యమాణ, వర్గ నిర్గత, నిబిడ నిష్ఠుర, --------- భంజన రంజన నిమిత్తాంతరంగ బహిరంగ ॥ గద్యం ౨౩౦ - ప్ర॥ వావిళ్ల.

మీఁదఁ జూపిన యక్షర మైత్రి యీ గద్యమున కనుపమానమగు గీతిమాధుర్యమును సంపాదించుచున్నది. పోతన గద్యములన్నియు నించుమించుగ నిట్లే యుండును.

ఇఁక మూలమునందలి భాగము లెట్లు విపులీకరింపఁబడియున్నవో యించుక గమనింతము. మాతృకలో "నఖాయుధమ్" అని మాత్రమే గలదు. దీని నెంతగాఁ బోతన విపులీకరించి యున్నాఁడో చూడుఁడు :-

"దుర్జనదనుజభట ధైర్యలతికా లవిత్రాయమాణ,

రక్షోరాజ వక్షోభాగ విశంకటక్షేత్ర విలేఖన చుం

చు లాంగ లాయమాన, ప్రతాపజ్వలన జ్వాలా

యమాన శరణాగత నయనచకోర, చంద్రరేఖా

యమాణ, వజ్రాయుధప్రతిమాన భాసమునని

శాత ఖరతరముఖ నఖరుండును."

నఖములనింతగాఁ బ్రపంచించి వర్ణించుటకుఁ గారణమయ్యవి హిరణ్య కశిపు వధ కుపరించుటయే యని జెప్పనగును. అయ్యవి దుర్జనులగు దనుజ భటుల ధైర్యలతికలకుఁ గొడవలి వంటివి. హిరణ్యకశిపుని వక్షమను సుక్షేత్రమునకు నాగలివంటివి. ప్రతాపజ్వలనునకు జ్వాలవంటివి. శరణాగతుల నయన చకోరములకుఁ జంద్రరేఖల వంటివి. వజ్రాయుధముతో సమానములైనవి. ఇందును బ్రయోజన ద్వయమునుబోతన చూపియున్నాఁడు. ఆ నఖములు దుర్జన దైత్యభట ధైత్యభట ధైర్యలతికాలవిత్రాయమాణములే. కాని భక్త జనులను చకోరములకుఁ జంద్ర రేఖవలె నాచరించుచున్నవి. నృసింహావిర్భావము దుష్టజన శిక్షణమునకును శిష్టజన రక్షకునేగదా! మఱియుఁ బ్రపుల పద్మయుగళ సంకాశేత్యాది

సమాసమును సమూలకములే. మొదటిది భగవంతుని చరణ యుగళ వర్ణనము. పోతన మహాభక్తుండు కావున భగవచ్చరణ పద్మ వర్ణనము సేయనిదే యాతని మనసూరకుండనా? భక్తులకు భగవచ్చరణ పద్మములేకదా నిత్య సంస్మరణీయములు! చరణ చంక్రమణేత్యాది సమాసము నృసింహుని క్రోధోద్ధత నీరవిక్రమ విహారమును సూచించును. కోపఘూర్ణితుఁడగు నృసింహ దేవుని చరణచంక్రమణ వేగ భారమును సహింపఁజాలక దిక్కుంభికుంభీనస కుంభినీధరకూర్మకుల శేఖరులు వినమితులైరి. విశ్వ విశ్వంభరాభార ధౌరేయత్వము నందులకుఁ బనికి వచ్చినది కాదు.

ఇట్లే గజేంద్రమోక్షణ ఘట్టమందున్న యీ యొక్క శ్లోకము బహుధా ప్రపంచింపఁబడినది.

"నియుధ్యతో రేవ మిభేంద్రనక్రయో

ర్వికర్షతో రంతంతో బహిర్మథః

సమాస్సహస్రం వ్యగమ న్మహీపతే

స ప్రాణయో శ్చిత్ర మమంసతామరాః

స్కం. ౮ అధ్యా, ౩. శ్లో. ౩౦

"భుగ భుగాయిత భూరి బద్బుదచ్ఛటలతో

గదలుచుదివికి భంగంబు లెగయ పద్య ౫౧ (బు)

"వడిఁ దప్పించి కరీంద్రుఁడు" పద్య ౫౨

"పదములఁ బట్టి సందలఁకుపాటొక యింతయు – లేక శూరత

పద్య ౫౩ (బు)

న్మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుతాంత ఘట్టనంజెదఱఁగఁ జిమ్మె నమ్మకరి చిప్పలు పాదులుదప్ప నొప్పరన్" వదలి జలగ్రహంబు కరివాలము మూలముఁ జీరె గోరులన్"

"కరిఁదిగుచు మకరి సరసికిఁ" పద్య ౫౪ (బు)

ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండంబులై "తలపడి నిఖిల లోకాలోకన భీకరంబులై యన్యోన్య విజయశ్రీ వశీకరంబులై, ------- ఘోరంబులై పోరుచున్న సమయంబున" వచ॥ ౨౫

"జవమును జలమును బలమును" పద్య ౨౬ (బు)

"ఆటోపమ్మునఁ జిమ్ము ఔమ్ముగలవ

క్రాభీల దంతంబులం" పద్య ౨౭

"అప్పుడు"

"మకరితోడఁ బోరు మాతంగ విభుని నా" పద్య ౨౯ (బు)

"అంత"

"జీవనంబు తనకు జీవనంబై యుంట"

"ఉఱుకుంగుంభయుగంబుపై హరి క్రియన్" పద్య ౬౦

"పాడగానంబడకుండ డాఁగు వెలికిం

బోవంగఁ దానడ్డమై" పద్య ౬౩ (బు)

"వ. ఇట్లు విస్మితనక్రచక్రంబయి నిర్వక్ర విక్రమంబున నల్ప హృదయ జ్ఞాన దీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునుం బోలెనంతకంతకు నుత్సాహకలహ సన్నాహ బహు విధ జలావ గాహంబయిన గ్రాహంబు మహా సాహసంబున."

"పాదద్వంద్వము నేలమోపి పవనున్" పద్య ౬౫

ఈ ప్రపంచీకరణమెందులకు ? దీనివలనఁ బోధింపఁదలఁచిన దేమి ? దాని నెంత దనుక సాధించెను? ఈ ప్రశ్నలకు మనము తగిన సమాధాన మీయవలయును.

దీని వలనఁ బోతన సాధింపఁ దలఁచిన దానిలో బ్రప్రథమము వస్తు సాక్షాత్కారము. వర్ణ్యమానమగు వస్తువు మనకు స్పష్టముగా గోచరింప వలయును. అందులకు సూక్ష్మాతి సూక్ష్మములగు నంశములను గూడ సమగ్రముగ వర్ణింపవలయును. అట్లు ప్రపంచించి చెప్పుట ప్రబంధకవుల సొమ్ము. పోతన తన భాగవతమునంతయు నిట్టి వర్ణనలతోడనే

పెంచియున్నాఁడు. ఇక రెండవ ప్రయోజనము రసపోషణము. కరిమకరుల పోరాటములో సహస్ర వర్షములు గడచినవి. సహస్ర వర్షపరిమితమగు నిమ్మహాయుద్ధము నొక్క మాటలోఁ జెప్పుట పోతనవంటి మహాకవికి సమ్మతమగు విషయము గాదు. రసానుగుణమగు పదబంధముఁ బదబంధమున కనువగు ప్రపంచీ కరణమునున్ననేగాని పోతన సంతృప్తి నందువాఁడుగాఁడు. అందులకే తదనుగుణమగు శబ్దసంయోజనమును బోతన కావించినాఁడు. "భుగభుగా యిత భూరి బుద్బుదచ్ఛటలు" మొదలగు సమాసములతో మకరీంద్రుని సంరంభమును వర్ణించియున్నాఁడు. గజేంద్రునిఁగని నంతనే మకరి "సంభ్రమించి యుదరి కుప్పించి లంఘించి హుంకరించి" నదఁట మఱియు నమ్మహా యుద్ధ సంరంభమును సూచించునది వోలె నీ క్రింది పద్యమునఁ బదబంధము మున్నది. "కరి దిగుచు మకరి సరసికి" మొదలగు పదములలో నిది స్పష్టము. కందము త్వరితగతిగలది. అందును సర్వలఘు ఘటితమైన సద్ధ్వని భాసమిను మడింమను. సమాన బలపరాక్రమములుగల కరి మకరు లొండొంటి నెల్లు తిగుమకొనినవో చూపుటకీ పద్యమద్దము వంటిది. ఇట భావగతియు పదగతియు సమాన వేగమున నడచినది. తరువాతి రచన మంతయు సమాన వేగమున నడచినవి. తరువాతి రచనమంతయు నా పెనగులాటను చిత్రము నందువోలెఁ జూపుటకు నైవ్రాయఁబడియున్నది. అంత "జీవనంబుదనకు జీవనంబై యుంట నలవుఁ జలము నంతకంతకెక్కి, మకరమొప్పి"నది. మత్తేభము డస్సినది. తలుకుంగుంభయుగంబుపై హరి క్రియన్" అను పద్యమును "పాడగానంబడకుండ డాగు" నన పద్యమును మకరీంద్రుని విజృంభణమును దెలియఁ జేయుచున్నవి. అఖర్వ బల గర్వమున విక్రమించు నక్రమము నిటఁ బోతన మహామాయాంధకారముతోపోల్చియున్నాఁడు. కరి నల్పహృదయ జ్ఞాన దీపము తో సరిపోల్చియున్నాఁడు. అన్నిటి కంటె విచిత్రము మకరిని "నిష్ఠిద బ్రహ్మ పదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రునితో నుపమించుట. మఱియు "మహామోహలతా నిబ్ధ పదమున్ విడిపించు కొనంగ లేక సందేహముఁ బొరిదుదేహి క్రియ దీనదశన్ గజ" ముండెనఁట! ఎంతటి యర్థవంతములగు సపమానములు! బ్రహ్మ సాక్షాత్కారమగునప్పుడు యోగియనుభవించు నానందమునకు మేరలేదు. అట్టి యోగికిఁద్రిలోకముల నసాధ్యమగు కార్యమెద్దియునుండదు. దుర్వారవైరిగర్వ నిర్వాపణ సముత్థితమగు నానందము మకరికిటః గలదు. అది తాత్కాలితము ఐహికము అయినను అనుభోగ్యమందు యోగితుల్య మైనది. కావుననే అది యోగీంద్ర తుల్యము. సామాన్యములగు లతలు చుట్టుకొనిననే విడిపించుకొనుట కష్టము. మోహలత కష్టతరము, మహామోహలత అతి కష్టతమము. మహామోహలతా నిబద్ధపదుఁడగు జీవుని యవస్థ వర్ణనాతీతము కదా! అట్టి దీనావస్థయందే" భీషణ గ్రాహదురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్రశల్యు"డగు గజేంద్రుఁడున్నాఁడు.

తిక్కన మహాభయంకరములగు యుద్ధ రంగములను గూడ నతి మనోజ్ఞములగు కమలాకరాదులతో సుపమించును. ఘోరమగు కరిమకరుల పోరాటమును వర్ణించుతఱిఁ గూడఁ బోతన యించుక వేదాంతమును జని చూపించి కాని విడువఁడు.

మరియు నీ గజేంద్ర మోక్షణ ఘట్టమునందే గజ విహారమును వర్ణించు నేడు శ్లోకముల నిరువదియైదు పద్యములలోఁ బెంచి వ్రాసినాఁడు.

మూలము :

"తత్రైకదా తద్గిరికాననాశ్రయః"

"యద్గంధమాత్రా దర్ధయో గజేంద్రా"

"వృకా మాహా మహిపర్షశల్యా"

"సఘర్మతప్తః కరిభిః కరేణుభి"

"సరో నిలం పంకజరేణురూపితం"

"విగాహ్య తస్మి న్నమృతాంబునిర్మలం"

స్కం. ౮. అధ్యా. ౨. శ్లో. ౨౦-౨౬

ఈ శ్లోకముల కాంధ్రీకరణము చూడు అనుబంధము 3.

మూలమునందలి "అన్యత్ర క్షుద్రాహరిణాశ్శశాద యశ్చరంత్య భీతాయదనుగ్రహేణ" అనుదాని భావమాంధ్రీకరణమున విడువఁ బడినది. ఇందుఁ జాలభాగము స్వకపోలకల్పనమే.

"నిషేవ్యమాణో ళికులై ర్మదాశనై:" అను శ్లోకపాదము 5 పద్యముల వరకు పెంచినాడు. అందొకటి సుదీర్ఘమగుసీసము.

"మదగజదానా మోదము" మొదలగునవి.

"తేఁటియొకటి యొరుప్రియకు" అను నీ పద్యము

కాళిదాస కమార సంభవము నందలి వసంతర్తు వర్ణనలోనియొక శ్లోకమున కిది ఛాయా ప్రాయముగనున్నది. "మధు ద్విరేఫః కుసుమైకపాత్రేపపౌ ప్రియాం స్వామనువర్తమానః

"అంగీకృతరంగ న్మా"

"వల్లభలు వాఱి మునుపడ"

"వల్వలంబుల లేఁత పచ్చిక మచ్చికఁ జెలుల కందిచ్చు నచ్చికములేక" అను పద్యము కాళిదాసుని "దదౌ తసా త్పంకజరేణుగంధి గజాయ గండూషజలం కరేణుః" అను శ్లోకపాదమునకు విపులీకరణమువలెఁ దోచుచున్నది. కాళిదాసు కర్ణేణువు కరికిచ్చెనని చెప్పఁగా నిటఁగరి కరేణువున కిచ్చినట్లు చెప్పఁ బడినది. "మృదువుగాఁ గొమ్మల మెల్లనగళములు నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు" ఈ పద్యపాదము గూడ "శృంగేణ సంస్పర్శనిమీలితాక్షీం మృగీ మకండూయత కృష్ణసారః" అను కాళిదాస శ్లోకమునే స్మరణకుఁ దెచ్చుచున్నది పోతన సహజ శృంగార ప్రియుఁడు. కాని యా శృంగారము భగవదర్పితమై యాధ్యాత్మికమగు మహోన్నతినందుకొన్నది. ఈతని శృంగార ప్రియత్వమున కనేకోదాహరణములఁ జూపవచ్చును. గజేంద్ర మోక్షణ ఘట్టమునఁ గూడ నట్టివి కొన్ని గలవు. మచ్చున కొకటి రెండు గజేంద్ర విహారానంతరము సరోవరవర్ణనము.

"మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహార వ్యాకులిత నూతన లక్ష్మీ విభవయై, యనంగ విద్యా నిరూఢ పల్లవప్రబంధ వికంపిత శరీరాలంకారయగు కుసుమకోమలియునుం బోలె వ్యాకీర్ణ చికుర మత్త మధుకర నికరయు విగత రసపదకవలయు నిజస్థానచలిత కుచరథాంగయు గళయు లంపటిత జఘనపులినతలయునై యుండె".

ఇందలి భావము స్పష్టము. ఇట్లే గజేంద్రు నొప్పులకుప్పతో నుపమించి తన సహజ శృంగార పరత్వమును వ్యక్తము చేసికొని యున్నాఁడు.

ఇట్లే వామనావతారఘట్టము నందును నమూలకములగు వర్ణన లనేకములు గలవు. ఇది మాతృకలో రెండు వందల గ్రంథముగ నున్నది. దీనినిఁ బోతన యించుమించుగ నేడు వందల వఱకుఁ బెంచి వ్రాసినాఁడు. ఈ వర్ణనలలోఁ గొన్ని యమూలకములు. కొన్ని యీషన్మూలకములు.

ఈ క్రింది గద్యపద్యములు కేవల మమూలకములు.[౧]

---

౧. సో దిత్యాం వీర్యమాధత్త తపసా చిరసంభృతమ్
సమాహితమనా రాజన్ దారుణ్యగ్ని మివానలః అదిత్యా
దిష్ఠితం గర్భం భగవంతం సనాతనమ్. హిరణ్యగర్భో విజ్ఞాయ
సమీడే బ్రహ్మనామభిః" మూలమున నింతే గలదు. దేహ్వాదవర్ణనము లేదు.

"ఇట్లు కశ్యపచిరతర తపస్సంభృత వీర్య ప్రతిష్ఠ - తగర్భయై సురల తల్లి యుల్లంబు నునుల్లసిల్లు చునుండె, నంత

"చలచలనై పిద పిదనై"

"నెలఁతకుఁ జూలై నెల రెన్నెలలై"

"మహిత తరమేఘమాలా"

"తన కపున నొకయిరవున"

"నిలిపెన్ తొప్పల బ్రదిమన్ విశదిమన్

నేత్రంబులం జూచు కంబుల"

"పెట్టదురు నుదుట భూతిని"

"ఇవ్విధంబున"

"విశ్వగర్భుడు దన గర్భవివరమందుఁ"

ఈ క్రింది గద్యపద్యములు సమూలకములే. ౧

'అంత సర్విభుండు -------- వామన బాలకుండై తల్లి ముందఁ గుమార సముచితాలాపంబులాడుచుఁ గ్రీడించు సమయంబున నదితియుందన విలోకన పరిణామ పారవశ్యంబున

"నన్నుఁగన్న తండ్రి! పాలి దైవము!"

"అన్నా! రమ్మని డగ్గఱఁ"

గన్నారంజూచెఁ గన్న కడుపై యుంటన్"

"పురుడి బోటికి నిందిర"

"ఈ విపులీకరణమంతయుఁ గన్నతల్లి కడుపు తీపి నెఱింగించుటకే. ఇఁకఁ జివరి పద్యము దేవ మాత గొప్పఁ దనమును సూచించును. జగన్మంగళ కరుఁడగు సర్వేశ్వరునిఁ

౧. యత్తద్వపు ర్భాతి విభూషణాయుధై రవ్యక్తచి ద్వ్యక్త

బ్రతునిఁగన్న యాయమకి తరపురంధ్రులు సాటియగుదురా? జగన్మాతలగు లక్ష్మీ పార్వతులే యాయమకు సాటి.

మూలమున "శ్రుత్వాశ్వమేధై ర్య జమాన మూర్జితం బలిం భృగూణా ముపకల్పితై స్తతః" అని మాత్రము యున్నది. దీని నెట్లు విపులీ కరించి యున్నాఁడో చూడుఁడు.

"ఇట్లు కృతకృత్యుండైన మాయామాణవకుండు దేశాంతర సమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె."

"వత్తురె విప్రులు వేడఁగ"

అనిన సఖిల దేశీయులగు భూసురు లిట్లనిరి -

"కలరున్ దాతలు నిత్తురున్ ధనములున్

గామ్యార్థము ల్గోంచు వి"

సూక్ష్మాతి సూక్ష్మార్థములందుఁ గూడఁ గవికిఁ గల శ్రద్ధయే యీ విపులీకరణమునకుఁ గారణము "శ్రుత్వా" అని యున్నంత మాత్రమున మనకేమి తెలిసినది? వామనుఁడు విప్రుల నేయే విషయములఁ గూర్చి ప్రశ్నించెనో యాతని ప్రశ్నలకు వారేమి ప్రత్యుత్తర మిచ్చిరో మనకు మూలమును బట్టి తెలియదు కదా! అది గూడ విశదీకరింపవలయును. అందులకే యీ విపులీకరణము. కాని యంతటితో నూరకొనునా పోతన మనను! సాక్షాల్లక్ష్మీ నాథుఁడొక దనుజుని యాచించుటయా! ఔను. అ భిక్షాగమనము తన కొఱకుఁ గాదు. "ప్రక్షీణ దివిజ వల్లభ రక్షా పరతంత్ర" తయేయా భిక్షాగమనమునకుఁ గారణము. కావుననే

"హరి హరె సిరియురమునఁ గల

హరి హరిహయు కొఱకు దనుజు నడుగం జనియెన్

బరహి తరతమతి యుతులగు

దొరలకు నడుగుటయు నొడలి తొడవగుఁ బుడమిన్"

అని సమాధానము.

---

తో ర్దివ్యగతి ర్యథ నటః తం పటుం వామను దృష్ట్వా మోదమానా మహర్షయః, కర్మాణి కారయామానుః పురస్కృత్య ప్రజాపతిమ్" మూలమున నింతే కలదు.

"భారేణ గాం సన్నమయన్ పదే పదే" అని మూలము. కాని యది యెట్టి భారము? మూలమున నద్దానికి సమాధానము లేదు. వ్యాఖ్యా ప్రాయమ్ముగఁ బోతన యాంధ్రీకరణ మిట్లు నడచినది.

"సర్వ ప్రపంచ గురుభర
నిర్వాహకుఁ డగుటఁ జేసి, నెఱిఁ జనుదేరన్
ఖర్వుని వ్రేఁగు సహింపక
యుర్వీస్థలి గ్రుంగె; మ్రొగ్గె నురగేంద్రుండున్."

ఉరగేంద్రునిఁ బోతన చేర్చినాడు. నిజమేకాని "సర్వ ప్రపంచ గురుభర నిర్వాహకుఁడ"గు ఖర్వుని వ్రేఁగున కుర్వీస్థలిక్రుంగినది. అట్టి యవసరమున నురగేంద్రుఁడును మ్రొగ్గెను.

"తన్నర్మదాయాస్తట ఉత్తరే" అని మూలము. నర్మద కుత్తర తటమున బలి యజ్ఞవాటి గలదు. వటుండు నర్మదను దాటవలయునుగదా! అట్టి నర్మద కొక పద్యమైనఁ బ్రత్యేకింపవలదా? అందులకే యీ పద్యము.

"శర్మద యమదండక్షత
వర్మద, నతికఠిన ముక్తి వనితాచేతో
మర్మదనంబు నివారిత
దుర్మద నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుడున్"

ఆది వ్యాధులను గాయిక మానసిక సంక్షోభములను బాపునది నర్మద. "యమదండక్షత వర్మద" కావుననే శర్మద. ఆ సుఖము క్షణికము కాఁగూడదా? అట్లుగాదు. శాశ్వతము. ఎందువలన? అతి కఠినముక్తి వనితా చేతోమర్మద గావున ఇట్టి పద్యభాగము నందొక క్రమత కాన్పించు చున్నది. అంబు నివారిత దుర్మదత్వము తీర్థ భూతములగు సర్వనదులకునుగసామాన్య గుణమే.

ఈ క్రింది గద్యపద్యము లించుమించుగా నమూలకములే యనవచ్చును. చండాంశుఁడో వహ్నియో దంభాకారత వచ్చెఁగాక" అను దానికి మాత్రము మూలము గలదు. సనత్కుమారుఁడాంధ్రమునఁ గానరాఁడు.

"చంధ స్ఫూర్తి వటుండుగాంచె బహుదా"

"కనిదానవేంద్రుని హయమేధవాటిఁ దఱియం జొచ్చు నయ్యవసరంబున"

"శంభుడో హరియోవయోజభవుఁడో

చండాంశుఁడో వహ్నియో"

"గుజ గుజలువోవు వారును"

"చవులుగాఁ జెవులకు సామగానంబులు

చదువు నుద్గాతల చదువు వినుచు"

"వెఱచుచు వంగుచు వ్రాలుచు"

"కొందఱతో జర్చించును"

మఱియు ననేక విధంబుల నందఱకు నన్ని రూపులై వినోదించుచు"

వెడ వెడ నడకలు నడచుచు"

ఈ వివిపులీకరణ ప్రయోజనము స్పష్టమే. బలి యజ్ఞవాటికయందు వామనుఁడు ప్రవేశించెను. కాని యా యజ్ఞవాటియెట్టిది? ముల్లోకముల కధినాధుఁడగు బలియజ్ఞవాటి. ముప్పది యెకరముల పాలమైన లేని సోమ యాజుల యజ్ఞవాటిక వలెనుండదుగదా! కావున నద్దాని వర్ణన మత్యావశ్యకమే. అందులకే "చండ స్ఫూర్తి వటుండు గాంచె" నను పద్యము. ఇఁక వచ్చిన వామనుఁడు సామాన్య వటువు కాఁడు. సాక్షాత్సర్వలోకేశ్వరుఁడగుహరి రూపాంతరము నంగీకరించిన మాత్రమునఁ దేజమెక్కడికిఁ బోవును? కావుననే "శంభుండో? హరియో" యను పద్యము. ఇందుఁ ద్రిమూర్తులను జేర్చుట పోతన కల్పన. ఇదియనుచితమే. వచ్చిన వాఁడు నిజముగా హరియే కదా! వామనుఁడు హయమేధవాటినిఁ బ్రవేశించి యేమి చేసెను? పంచాంగ బ్రాహ్మణుని వలె మీన మేషముల లెక్కించుచుండెనా? ఈ ప్రశ్నలకు సమాధాన మావశ్యకము. సమాధాన మీకున్న సహృదయులకు హృదయంగమముగా నుండదు. ఎద్దియోవెలితి కథా కథానమున గోచరించును. అట్టిదానిఁ బరిహరించుటకే తరువాతి పెంపు. పొట్టి వడుగు బాపని రాకచే సభాస్థలి ప్రజలందఱును గజిబిజియై పోయిరి. గుజగుజలు వోయిరి. మొదట నుద్గాతల సామగానము వినిపించినది. హరి సామగాన లోలుండని ప్రతీతి. అందులకే ప్రప్రథముగా సామగానమును జెప్పుట. మఱియు నుద్గాతలుచ్చైస్స్వరమునఁ బాడుదురు. దూరస్థితులకుఁ గూడ వారి గాన రవము వినిపింపక తప్పదు. ఇంచుక డగ్గరినాఁడు. హెూతల మంత్ర తంత్రార్థ చర్చ నడుచుచున్నది. సామగానము వినిన సరిపోయినదా? చర్చలోఁ బాల్గొన వలదా! మఱియు డగ్గరినాఁడు.

త్రేతాగ్నులు గన్పట్టెను. వానిని వెలిగించు యాచకవితతియు దృగ్గోచరమైరి. ఇంత దనుక వినుటయుఁ జూచుటయు నైనది. ఇఁక సభ్యులతోఁ గలియవలయును. అందులకే "దక్షులై బహు విధాధ్వర విధానంబులు చెప్పెడి సభ్యులఁ జేరఁ జని"ననాడు. కాని వారు సామాన్యులు గారు. దక్షులు. కావుననే" వెఱచుచు, వంగుచు, వ్రాలుచు, నఱిముఱి గుబురులకుఁ జనుచు,హరి హరి యనుచున్, మఱుఁగుచు, నులుకుచు, దిఱ దిఱ గుఱు మట్టపుఁ బొట్టి వడుగు గొంత నటించి" నాఁడు. నటన యేల? అవును. నటనయే ఎంతటి దక్షులయ్యు నా సభ్యులు పరమేశ్వరుని కంటె దక్షులు కారుగదా! కావుననే ఆ వెఱచుటలు వంగుటలు వ్రాలుటలు, నటనయే యనినాఁడు కవి. తరువాతి పద్యము నందలి చర్చలు మొదలగునవి గూడ జగదీశ్వరునకు వినోదములే యని పోతన భావన. సభాప్రవేశమైనది. సభ్యులతోడి వినోదములునైనవి. ఇఁకమిగిలినది రాజునుఁ జేరుట. "వెడ వెడ నడకలతో బుడి బుడి నొడువులతోఁ జిముడి తడఁబడఁగ వడుగు "రాజును జేరినాఁడఁట. ఇట వామనుఁడు సామాన్య మానవుఁడు సార్వభౌమునిఁ జేరఁబోవు నపుడెట్లు ప్రవర్తించునో యట్లే ప్రవర్తంచి నాఁడు. సార్వభౌముని దఱికేగునపుడు కంపము జనించును. అందుకే వెడ వెడ నడకలు. మాట సరిగారాదు. అదులకే బుడి బుడి నొడువులు. కొంత సిగ్గును గలుగును. దాని వలనఁ దడఁబాటు తప్పదు. అందులకే "చిడి ముడితడఁబడగ" నని చెప్పినాఁడు కవి. ఇన్ని నటనలు నటించినను వామనుని విశ్వంభరత్వమెచటికిఁ బోవును? "సర్వ ప్రపంచ గురుభర నిర్వా హకుఁడా ఖర్వుఁ"ని ముందే చెప్పినాఁడు కదా! పై పై నెట్లు నటించినను అతఁడడు గిడు సరికి, ఇల యదరి దిగఁబడి పోవుట తప్పలేదు. వామనుఁడు రాజును జేరెను. చేరి యేమి చేసెను? బ్రాహ్మణులు రాజును జూచినంతనే యాశీర్వదించుట సహజము. [౧]అట్టిదేదియు మూలమునఁగానరాదు. అందులకే పోతన యీ క్రింది పద్యములను వ్రాసియున్నాఁడు.

"ఇతఁడే దానవ చక్రవర్తి సురలోకేంద్రాది కాలాది ది

క్పతి గర్వాపనయ ప్రవర్తి, గతలోభస్ఫూర్తి నానాముఖ

---

౧. మౌంజ్యామేఖలయా వీత ముపవీతాజినోత్తరమ్, జటి
లం వామనం విప్రం మాయామాణవకం హరిమ్, ప్రవిష్ట
వీక్ష్య భృగవ స్సశిష్యాస్తే సహాగ్ని భిః ప్రత్యగృహ్ణన్
సముత్థాయ సంక్షిప్తా స్తస్య తేజసా, యజమానః
ప్రముదితో దర్శనీయం మనోరమమ్ రూపాను రూ
పావయవం తస్మా ఆసన మహరత్" మూలమున నింతే కలదు.

వ్రత దానప్రవణానువర్తి, సుమనోరామామనో భేదనో
ద్ధత చంద్రాతపకీర్తి, సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి, దాన్"

"అనికుశపవిత్రాక్షత సంయుతంబగు దక్షిణ హస్తంబు సాఁచి యిట్లనియె"

"స్వస్తి జగత్త్రయీ భువన
శాసనకర్తకుహాస మాత్ర వి
ధ్వస్త నిలింప భర్తకును
దారపదవ్యవహర్త కున్మనీం
ద్రస్తుత మంగళాధ్వరవి
ధానవిహర్తకునిర్జరీగళ
న్యస్త సువర్ణ సూత్రపరి
హర్తకుదానవలోకభర్తకున్"

"అని దీవించి కర చరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుంబోలె"

[1]మూలమున బలి వామనుని "వడుగా! ఎవ్వరివాఁడ వెవ్వఁడవు! సంవాసస్థలంబెయ్యది?" అని ప్రశ్నించినట్లు లేదు. పోతన యీ ప్రశ్నలడి గించినాఁడు. వామనునిచే నిట్లు సమాధాన మిప్పించినాఁడు. హృద్యమగు నా సమాధానములో వేద్యమగు రెండవ యర్థమును జూపినాఁడు.

"ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు?
నొకచోటనక యందునుండనేర్తు";

---

౧. స్వాగతం తే నమస్తు భ్యం బ్రహ్మన్ కిం పరవాణి తే, బ్ర
హ్మర్షీణాం తవ సాక్షా న్మన్యే త్వారవపుర్ధరహ, అద్య నః పి
తర స్తృప్తా అద్య నః పావితం కులమ్, అద్య స్విష్టః క్రతుర
యం యద్భవా నాగతో గృహాన్"
స్క౦. ౮. అధ్యా. ౧౮. శ్లో. ౨౮, ౩౦

భగవంతుఁడు చెప్పవలసిన దాని కంటె హెచ్చుగనే చెప్పినాఁడు. ప్రశ్నమించిన ప్రత్యుత్తరము,మూలమున బలి "బ్రహ్మర్షీణాం తప స్సాక్షా న్మన్యేత్వార్య! వపుర్ధరమ్" (అర్య! నీవు రూపముధరించిన బ్రహ్మర్షుల తపస్సువని తలఁచుచున్నాను) అని తనలోఁ దానే సమాధానపడినట్లు గలదు. ఔచిత్యము చెడకుండ మూలమును విపులీకరించుటలోఁ బోతనకుఁ బోతనయే సాటి.

౧ఈ క్రింది పద్యము లీషన్మూలకములని చెప్ప వచ్చును

"ఉడుగని క్రతువుల వ్రతములఁ"

"అదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై"

"నిరయంబైన నిబంధమైన ధరణీ

నిర్మూలనంబైన దు"

"నొడివినంతవట్టును సలక యిచ్చుచో"

"మేరువు దలక్రిందైనను"

"ఎన్నఁడుం బరువేఁడఁ బోఁడఁట"

మీఁది పద్యములలో "అదిన్ శ్రీ సతి కొప్పుపై" నను ఉపమ కేవల మమూలకము. ఈ పద్యములన్నియు బలి ధైర్య స్థైర్యములను, పదాన్యత్వము సత్య పరతంత్రత్వమును, హరి భక్తి పరత్వమును విశదీకరించు చున్నవి. ఈ వాక్యము లాలించినంతనే తన యుపదేశమును వినలేదని శుక్రుఁడు బలిని శపించినాఁడు. కాని యప్పుడు గూడ బలి చలింపలేదు. బలి యచంచలత్వమునకుఁగవి ముగ్ధుఁడైనాఁడు. అందులకే యీ క్రింది పద్యమునమూలకమైనను వ్రాసినాఁడు.

---

౧. యజంతి యజ్ఞైః క్రతుభి ర్య మాదృతాః భ
వంత ఆమ్నాయ విధానకోవిదాః, సఏష విష్ణు ర్వరదో
స్తు నా పున ర్దాస్యామ్యముష్మై క్షితి మీప్సితాం మునే
యదప్యసా వధర్మేణ మాం బధ్నీయా దనాగసమ్, తథా
ప్యేనం సహింస్యే ధృతబ్రహ్మతనుం హరిమ్"

స్కం.౮. అధ్యా. ౨౦. శ్లో. ౧౧

మూలమున నింత మాత్రమే కలదు.

"బ్రదుక వచ్చుఁగాక బహుబంధనములైన

వచ్చుఁగాక, లేమి వచ్చుఁగాక

జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక

మాటఁ దిరుగలేరు మానధనులు"

బలిదాన మిచ్చుటయు వామనుఁడద్దానమును బరిగ్రహించుటయు నతి మనోజ్ఞముగ వర్ణింపఁ బడినది. [1]ఇందుఁ బెక్కు పద్యముల మూలకములే.

"రమ్మా! మాణవకోత్తమ"

ఇట్లు బలి ప్రార్థింపఁగా జగదీశ్వరుఁడుపాదములు సాచినాఁడుమేశ్వరుని పాదపద్మములను దనివిదీర వర్ణింపనిదే పోతన కాత్మ తృప్తి గలుగునా! అందులకే యీక్రింది పద్యములు.

"బలిదైత్యేంద్ర కరద్వయీ కృతజల ప్రక్షాళన వ్యాప్తికిన్

జలజాతాక్షుఁడు సాఁచె యోగి సుమనస్సంప్రార్థిత శ్రీదముం

గలితానమ్రమరమాలలాటపదవీ కస్తూరికాశాదమున్

నలినామోదము రత్ననూపురితనానావేదముంబాదమున్

ఈపద్యములందు బోతనకుఁగల వర్ణనా ప్రియత్వము ప్రస్ఫుటమగుచున్నది. కాని యిందు వర్ణనా ప్రియత్వము కంటె భక్తి పరవశత్వమే ప్రధాన స్థానము నాక్రమించుచున్నది. భక్తునకుఁ బరమేశ్వర పాదాభి వర్ణనముకంటెఁ బరమానంద మింకేమి యుండును.

వామనుని విజృంభణమును వర్ణించు పట్టునఁ గూడ నిట్లే అమూలకములగు మనోజ్ఞ వర్ణనలఁ గావించినాఁడు.

"ఇంతింతై వటుఁడింతై మఱియుఁ దానింతై, నభోవీధిపై నంతై"

---

౧. ఏవం శప్త స్స్వగుణా సత్యా నలితో మహాన్" స్కం. ౮. అధ్యా. ౧౦. శ్లో. ౧౬

౨. యజమాన స్స్వయం తస్య శ్రీమత్పాదయుగం తథా
అవనీ జ్యావహస్మూర్ధ్ని తదపో విశ్వపావనీః
స్కం. ౮. అధ్యా. ౨౦. శ్లో. ౧౮

"రవిబింబంబుగా మింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై

శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై

ఛవిమత్కంకణమై, కటిస్థలినుదంచద్ఘంటయై, నూపుర

ప్రవరంబై, పదపీఠమై వటుఁడు దాబ్రహ్మాండమున్నిండుచోన్"

"వామనాయ దదావేతా మర్చిత్వోదకపూర్వమ్" అను వాక్యము నాధారముగాఁగొని యీ క్రింది పద్యముల నతి మనోహరముగా వ్రాసి యుననాఁడు.

"ఇట్లు ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు సేసి,

వామపాదంబు గడిగి, తత్పాదజలంబు శిరంబునం జల్లుకొని

వార్చి దేశకాలాది పరిగణనంబు సేసి"

"విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే

దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి" యంచుంగ్రియాక్షిప్తుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాచి పూచించి "బ్రహ్మ ప్రీత" మ్మని ధారవోసె భువనంబాశ్చర్యముం బొందఁగన్"

"అంత"

"అమరారాతి కరాక్షతోజ్ఞిత పవిత్రంభః కణశ్రేణికిన్

కమలాధీశ్వరుఁడొడ్డె, ఖండిత దివౌకస్స్వామి జన్మస్తమున్"

"ముని జన నియమాధారను

జనితాసుర యువతి నేత్రజలకణధారన్

దనుజేంద్ర నిరాధారను

వనజాక్షుఁడు గొనియె బలి వివర్జితధారన్"

---

౧. తర్వా మనం రూప మవర్థతాద్భుతం హరే రనంతస్య"

బలిచక్రవర్తి ధారపోసెను. వామనుడు చెయ్యిసాచి గ్రంహిచెను. ఆధార ఎట్టిదో పోతన వివరించినాడు. భావ్యార్థసూచన మిందిమిడియున్నది. మరుక్షణములో జగత్రయాభువన శాసన కర్త నిరాధారుడయే ధారట, తరువాత స్రవించబోయే అసురయువతి నేత్ర కణధారట.

కమలాకర్షణేత్యాది సమానములు జగదీశ్వరుని శ్రీనివాసత్వమును దెల్పును. లక్ష్మీశ్వరుఁడు గూడ యాచించుచున్నాఁడు గావుననే యది కడుంగడు చిత్రము. ఇట్టి పద్యములలోనే పోతన పరమేశ్వరుని కరుణాళుత్వమును ఆర్తత్రాణ పరాయణత్వమును వ్యక్తము చేసియున్నాఁడు.

ఈ క్రింది పద్యలన్నియుఁ గేవలమమూలకములే. "నభూతో నభవిష్యతి" యని చెప్పఁదగిన బలి పదాన్యత నెంతపొగడినను గవికిఁ దృప్తి కలుగ లేదుగావలయు నందులకే యీ క్రింది పద్యము.

"కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు

నెఱిఁగి, శుక్రుమాట లెఱిఁగి నాశ

మెఱిఁగి పాత్రమనుచు నిచ్చె దానము బలి

మహి వదాన్యుఁడొకఁడు మఱియుఁగలడె!

తానొక్కఁడు పొగడిన సరిపోయినది కాదు. భూత పంచకమును ఉప్పొంగి పోయి "భళి భళి" యని పొగడినదట!

"బలిసేసిన దానమునకు"

కథ చెప్పిన తరువాత ఫలశ్రుతివంటిదీ క్రింది పద్యము.

"క్షితి దానమిచ్చు నతఁడును"

భూదానముభయతారకము. దాతయుఁ బ్రతిగ్రహీతయు స్వర్గ సౌఖ్యములఁబడ యఁగలరు.

ముందొక మారు వామనునిచే "మదాకాంక్షా మితంబైన మూఁడడుగుల్ మేరయత్రోవకిచ్చుటది బ్రహ్మాండంబు నాపాలికిన్" అని పలికించినాఁడు.

ఇప్పుడు గూడ

"ఇది యేమి వేడితని

మది వగవక ధారవోయుమా! సత్యము పెం

పొదవఁగఁ గోరిన యర్థం

బది యిచ్చుట ముజ్జగంబులిచ్చుట మాకున్"

అని మఱలఁ బలికించినాఁడు కవి.

ఈ మాటలవలనఁ దాను బద్రతయ మడుగుటలోని యర్థమును వామనుఁడు, బలికి సువ్యక్తము చేసినాఁడనియే చెప్పవలయును. "ఇదే నాకుఁ బది వేలు" మొదలగు తెలుఁగు నుడికారంపు సొంపులిందు గుబాళించుచున్నవి. మఱియు నిందుఁ బ్రతీయమానమగు నర్థాంతరము మనోజ్ఞము.

ఈ మాటలకు బలి హర్ష నిర్భర చేతస్కుఁడై నాఁడఁట! ఏల? కారణము సువిదితమే. అడుగుచున్నవాఁడు హరియని శుక్రుని యుపదేశము వలననే బలికిఁ దెలిసినది. వామనుని యీ మాటల వలన ధ్రువపడినది. సర్వేశ్వరునకు దానమిచ్చు సౌభాగ్యము సామాన్యులకు సాధ్యమగునా? కావుననే బలి హర్ష నిర్భర చేతస్కుఁడై నాడు. వాముని పల్కుల యందలి యర్థాంతరమును గ్రహించిన వాఁడు వోలెఁ దనలోఁ దానిట్లనుకొని నవ్వుకొనినాఁడు.

"పుట్టి నేర్చుకొనెనా? పుట్టక నేర్చెనో?

చిట్టిబుద్ధులిట్టిపొట్టి వడుగు

పొట్టనున్న వెల్ల బూమెలునని నవ్వి

యెలమి ధరణి దానమిచ్చెనపుడు"

బలి స్వర్లోకముపై దండెత్తిన ఘట్టమున నమరావతీ వర్ణనము మూలమునఁ బదునొకండు శ్లోకములలోఁ గలదు. స్కం.౮.అధ్యా ౧౫. శ్లో. ౧౨ - ౨౨

దానికి "కనియెన్ బుణ్యాజ గౌకము న్విగతరోగ స్వప్న పీడా॥ అనునొక సీస పద్యమును నించుమించుగా నాలుగు పుటల వచనమును వ్రాసి విపులీకరించియున్నాఁడు.

దీని యాంధ్రీకరణము -

కేవలము భక్తి కొఱకుఁ బ్రపంచించిన పట్టులనేకములు గలవు. మచ్చున కొకటి. ప్రహ్లాద హిరణ్య కశిపు సంవాదము. మూలము :

"హిరణ్యకశిపుః - ప్రహ్లాద ఉచ్యతాం తాత స్వధీతం కించి దుత్తమమ్

కాలేనై తావతా యుష్మన్ యదశిక్ష ద్గుర్బవాన్ ప్రహ్లాదః

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్

అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్

ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చేన్నవలక్షణా

క్రియతే భగవత్యద్ధా తన్మన్యే ధీతముత్తమమ్".

ఆంధ్రీకరణము -

"దానవేంద్రుండు దనకుఁ బ్రణామంబు సేసి నిలుచున్న కొడుకును దీవించి బాహదండంబు సాఁచి, దిగ్గనన్ డగ్గఱం దిగిచి, గాఢాలింగనంబు సేసి, తన తొడల మీఁదనిడుకొని, చుంచుదువ్వి, చుబుకుంబుఁబుడికి, చెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని, ప్రేమాతిరేక సంజనిత బాష్ప సలిల బిందు సందోహంబుల నతని వదనారవిందంబు దడుపుచు మంద మధురాలాపంబుల నిట్లనియె."

ఈ వచన మించుమించుగా మూలాను సారిగనే యున్నది. తరువాత విపులీకరణము గమనించ దగ్గది.

"విద్యాసారమెఱుంగఁ గోరెద భవ

ద్విజ్ఞాత శాస్త్రంబులో

బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ దా

త్పర్యంబు భాషింపుమా!"

"యన్నా! యెన్నఁడు నీవు నీతివిదుఁడౌ

దంచున్ మహా వాంఛతో

నున్నాఁడన్ ననుఁగన్న తండ్రి! భవదీ

యోత్కర్షముం జూపనే!"

"అనినం గన్న తండ్రికిం బ్రియనందనుండయిన ప్రహ్లాదుండిట్లనియె"

"చదివించిరి నను గురువులు

చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులు, నేఁ

జదివినవి గలవు పెక్కులు

చదువులలో మర్మమెల్లఁ జదివితిః దండ్రీ!"

"తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్

దాసత్వమున్ వందనా

ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్

సంకీర్తనల్ చింతనం

బను తొమ్మిది భక్తి మార్గముల స

ర్వాత్మున్ హరిన్ నమ్మి స

జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁదలతున్

సత్యంబుదైత్యోత్తమా!"

"అంధేందూదయముల్ మహాబధిర శం

ఖారావముల్ మూకస"

---

౧ ప్రణమంతం పదోర్భాలం ప్రతినంద్యాశిషా సురః
సరిష్వజ్య చిరం దోర్భ్యాం పరమాం ప్రాప నిర్వృతిమ్
ఆరోప్యాంక మవఘ్రాయ మూర్ధ న్యశ్రుకణాంబుభిః"
ఆసించ న్వికసద్వక్త్ర విదమాహ యుధిష్ఠిర!

"కమలాక్షునర్చించు కరములు కరములు

శ్రీనాధు వర్ణించు జిహ్వ జిహ్వ"

"కుంజాక్షునకుఁ గాని కాయంబుకాయమే

పవన గుంఫితచర్మ భస్త్రిగాక"

ఈ పద్దెములన్నియు నాణిముత్తెములు. ఇందుఁ బోతన భక్తి పారవశ్యమునఁ బ్రపంచముకు అమర సందేశమిచ్చుచున్నాఁడు. మఱి కొంతకాలము తరువాత బంగాళ ఉత్కళములకీ భక్తి సందేశమునే చైతన్య దేవుఁడు ప్రసాదించినాఁడు. ఇయ్యది యాంధ్ర లోకమునఁ బోతన నాఁడే పరవళ్ల ద్రొక్కి బహుముఖముల వ్యాపించినది.

ఒకే ఘట్టమునఁ గొన్నియెడల విపులీకరణమును గొన్నిఁడల మూల విధేయతయుఁ జూపట్టును. ఒకే శ్లోకము నాంధ్రీకరించునప్పుడు గూడ నిట్టి విధానమే కొన్ని భాగములందుఁ గన్పట్టు చున్నది. ఇందులకు భీష్మకృత శ్రీకృష్ణ స్తవమొకటి మంచి యుదాహరణము. మాతృకలో నీ స్తవము పంద్రెండు శ్లోకములలో నున్నది. తద్భాషాంతరీ కరణ విధానము నొకించుక పరిశీలింతము.

మూలము :

"త్రిభూవనకమనంతమాలవర్ణం

రవికర గౌరవరాంబరందధానే

వపురలకకులావృతాన నాబ్జే

విజయ సఖేరతిరస్తుమే నవద్యా"

ఆంధ్రీకరణము:

"త్రిజగన్మోహన నీలకాంతిఁ దనువు

ద్దీపింపఁ బ్రాభాత నీ"

ఇందుమూలము నందలి కొన్ని భావములకు మెఱుఁగులు పెట్టియున్నాఁడు. ఒక విధముగా నాంధ్రీకరణు మాతృకకు వ్యాఖ్యాప్రాయమైయున్నది. మాతృకలోని "యంబరము"

"రవికర గౌరము" మాత్రమే. ఆంధ్రీకరణమునఁ బ్రాభాత నీరజ బంధు ప్రభుము. రవి కరములన్ని వేళలందును బంగరు చాయల నీనవుకదా! ప్రభాత కాంతులకే పసిఁడి నిగ్గులు గలవు. శ్రీకృష్ణుఁడు పీతాంబరుఁడు. కావుననే పోతన వాడిన "ప్రాభాత" శబ్దమిట నావశ్యకము; మనోజ్ఞము కూడ, తెలుఁగున "గౌర" శబ్దము వాచ్యముగాలేదు. అట్లు లేకపోవుట గూడ నీ మనోజ్ఞత్వమునకు వన్నె పెట్టుచున్నది. "వన్నెకాఁడ" ను మాట యీ పద్యమున వరాలమూట

"యుధి తురగరజో విధూ మ్రవిష్వ
క్కచలులిత శ్రమవార్యలంకృతాస్యే
మమ నిశితశరై ర్విభిద్యమాన త్వచి
విలసత్కవ చేస్తు కృష్ణ ఆత్మా"

ఆంధ్రీకరణము

"హయరింఖా ముఖ ధూళి ధూస్సరపరి
న్యస్తాలకోపేతమై
రయజాత శ్రమతో యబిందుయుతమై
రాజిల్లు నెమ్మోముతో
జయముంబార్థున కిచ్చు వేడ్కననినా
శస్త్రాహతిం జాలనొ
చ్చియుఁ బోరించు మహాను భావుమదిలోఁ
జింతింతు నశ్రాంతమున్"

ఇప్పుడు భీష్మునకు తటస్థించినది తనచావు, తనఓటమి, రెండును భీష్మున కత్యంత ముదావహములే. భగవంతుచేతిలో తాను ఆత్మ త్యాగము చేయుట అదిచావు కాదు తాను భగవంతునిలో నైక్యమగుట,రెండవది – తానుస్థాపించిన ధర్మమునకు ప్రతీకగా, తనవాత్సల్య పాత్రము అను ఉగ్గుపాలతో గ్రోలిన పార్థుడు తన్ను గెలుచుట. అదియు తనకు ఓటమి కాదు

సరికదా దిగ్విజయమువంటిదని కూడ చెప్పవచ్చును. అందుచేతనే భీష్మునకు పాండవ పక్షపాతి యను బిరుదము సార్థకమైనది.

అల్లిక జిగియిరువురి యందును సమానముగనే యున్నది. "హయరింఖాముఖ ధూళిధూసర" యను సమాసము తీఁగ దీసినట్లు నడచినది. "యుధితురగరజోవిధూమ్ర" అనువానియందుఁ బదగతి కొంచెమెగుడు దిగుడుగా నున్నది. ఆంధ్రమునఁ గవచమంతరించినది. మాతృకలోని "విభిద్యమాన" శబ్ద మాంధ్ర కవికి నచ్చలేదు. అందలి కరుకుఁ దనమును దగ్గించి "చాల నొచ్చియు" నని మాత్రము చెప్పి "పోరించు" అను మాటఁ జేర్చి శ్రీకృష్ణుని మహోనతను ప్రదర్శించి యున్నాఁడు. చాల నొచ్చియుఁ బోరించుటకుఁ గారణము "జయముంపార్థున కిచ్చువేడ్క"లో సువ్యక్తము. "కచ" శబ్దమున "కలక"లను తెనిగింపు మనోజ్ఞము. "విష్వక్" శబ్దము వర్తమానార్థకము. "విష్వంతః ఇతస్తతశ్చలంతః" అని శ్రీధరవ్యాఖ్య. అనఁగా భీష్ముఁడు దర్శించు నపుడాయలకలు చలించుచున్న వన్న మాట ఆస్ఫూర్తి "పరిన్యస్తాలకోపేతమై" అనుదానిలో రాలేదు.

"సపది సఖివచో నిశమ్య మధ్యే

నిజపరయో ర్బలయో రథం ప్రవేశ్య

స్థితవతి పరసైనికాయురక్ష్ణా

హృతవతి పార్థసఖే రతి ర్మమాస్తు." అను శ్లోకమునకు

"నరుమాటల్విని నవ్వుతోనుభయ సే

నామధ్యమక్షోణిలోఁ

బరులీక్షింప రథంబునిప్పి పరభూ

పాలావళిం జూపుచుం

బరభూపాయువులెల్లఁ జూపుల నశుం

భత్కేళి వంచించు న

స్పరమేశుండు వెలుంగుచుండెడు సు

హృత్పద్మాసనాసీనుఁడై" అని తెలుగు సేత

మాతృకలో "వచోని శమ్య" అని మాత్రమే కలదు. తెనుఁగున వినుటతోఁ బాటు నవ్వుట కూడఁ జెప్పఁబడియున్నది. "పరులీక్షింప రథంబు నిల్పి" యనునది వర్ణితమైన సన్నివేశమున కింకను మెఱుఁగు. పర భూపాయువులను జూపులచే వంచించువాఁడు. పార్థ సఖుఁడనుటకంటెఁ బరమేశుఁడనుట యొప్పు. ఇఁకఁ బరమేశుని యునికి హృత్పద్మముననే కదా! కాని "స్థితవతి" పరస్సైనికాయు:రక్షాహృతవతి" యను మాతృకయందలి పదములలో సౌకు మార్యముతోడి శబ్ద శుద్ధిగలదు. అది తెనుఁగున అదృశ్యము.

"స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం'

"శితవిశిఖహతో విశీర్ణదంశః"

"క్షతజపరిప్లుత అతతాయినో మే

ప్రసభ మభిససార మద్వధార్థః

స భవతు మే భగవాన్ గతిర్ముకుందః"

ఈ రెండుశ్లోకముల నతిమనోహరముగ నొక సీసములో నాంధ్రీరించియున్నాఁడు:

"కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి

గగన భాగంబెల్లఁ గప్పికొనఁగ

నుఱికిన నోర్వక యుదరంబులో నున్న

జగములవ్రేఁగున జగతిగదల

చక్రంబు చేపట్టి చనుదెంచు రయమునఁ

బైనున్న పచ్చని పటము జాఱ

నమ్మితి నాలావు నగుబాటు సేయకు

మన్నింపుమని క్రీడి మఱలఁ దిగువఁ

గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి

నేఁడు భీష్మునిఁ జుదు నిన్నుఁ గాతు

విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ

దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు."

తెనుఁగునాఁట నీ పద్యము నోటికి రాని వారుండరనియే చెప్పవచ్చును. "అవప్లుతః" అను నొక్క మాటకు మొదటి పాదమంతయు నాంధ్రీకరణమే "అవప్లుత" యను మాట కంటెఁ "గుప్పించి యెగసిన" నను మాట నిండుగా నున్నది. కుప్పించి యెగసెను గావుననే కుండలములు చౌకళించినవి, వాటి కాంతులు గగన భాగమంతయు నలము కొనినవి. ఇది యంతయుఁ బోతన స్వకపోలకల్పనయే. "చలద్గుః" అను పదమునకాంధ్రీకరణము రెండవ పాదము. మూలమునందు భూమి చలించుటకుఁ గారణము కాన రాదు. శ్రీధరులా కొఱఁతను బూరించుటకై "ఉదరస్థ సర్వభువన భారేణ" అని వ్యాఖ్యానించిరి. ఆంధ్రమున నా వాఖ్యయే యవతరించినది. మాతృకలోని వట్టి యుత్తరీయముతెనుఁగునఁ బచ్చని పటముగా మారినది. పై నున్న పచ్చని పటమేల జాఱినది? దీనికి సమాధానము మూలమున స్పష్టముగా లేదు. దానిని శ్రీధరులు సమర్థింపవలసి వచ్చినది. "తేస్పైవ సంరంభేణ" అని శ్రీధరులు మెల మెల్లఁగాననిరి. దీనిని స్పష్టముగాఁ జెప్పవలసిన బాధ్యత పోతనపైఁ బడినది. శ్రీధరుల "సంరంభము" రెండవ పాదములో రానే వచ్చినది. మరలనిదియే చెప్పుట సరిగాదు. ఉభయ తారకముగాఁ బోతన చక్రమును జేపట్టించినాఁడు. ఇది "ధృతరథచరణః" అను దానికిఁ దెనుఁగు సేఁత. దీనికి "రయము"ను జేర్చి యా "రయము" ను బచ్చని పటము జాఱుటకుఁ గారణముగాఁ జెప్పినాఁడు. భూమి చలించుటకు "ప్రవేగు" హేతువు. పటము జాఱుటకు పరుగు కారణము. నాల్గవ పాదమంతయుఁ బోతన స్వకపోలకల్పనమే ఇట్టి విషమ పరిస్థితి యందర్జునుఁ డేమిచేయు చుండెను! మందుని వలె సూరక చూచుచుండెనా? ఈ ప్రశ్నలకు సమాధానమే నాల్గవ పాదము. "నేఁడు భీష్మునిఁ జంపుదు; నిన్నుఁగాతు; విడువు మర్జున" యను మాటలు పార్థుని విన్నపమునకు భగవంతుని జవాబు. "మత్ప్రతి జ్ఞామృత మధికర్తుం" అనునది మాత్రము తెనుఁగునకు రాలేదు. రెండవ శ్లోకము మొదటి దానిలోనే గతార్థము. కావుననే యాంధ్రీకరింపఁ బడలేదు.

"విజయరథకుటుంబ ఆత్తతోత్రే

ధృతహయరశ్మిని తచ్ఛ్రియే క్షణీయే

భగవతి రతిరస్తు మే ముమూర్షో

ర్యమిహ నిరీక్ష్య హతా గతా స్వరూపమ్".

"తనకున్ భృత్యుఁడు వీనిఁగాచుట మహో

ధర్మంబు వోమ్మంచు న

ర్జున సారథ్యము పూని పగ్గములు చేఁ

జోద్యంబుగాఁ బట్టుచున్

మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్

మోదించి తాడించుచున్

జనులన్ మోహమునందఁ జేయుపరమో

త్సాహం బ్రశంసించెదన్."

ఈ పద్యమునకును మూలమునకును జాల భేదము గలదు. "యమిహ నిరీక్ష్య హతాగతా స్వరూప" మ్మను దానిలోని సారూప్యముక్తి ప్రసక్తి యద్వైతి యగు పోతనకు రుచింప లేదేమో! దాని నాంధ్రీకరింపక విడిచినాఁడు "తచ్ఛ్రియేక్షణీయే" అనునదియుఁ దెనుఁగునకు రాలేదు.

సంస్కృతాంధ్రములు రెండింటియందును, శబ్దసౌందర్యము పరాకాష్ఠ నందినది. కాని మూలభావము వేరు, పోతన యాంధ్రీకరణము వేరు. లలితగమన విలాసములను సుందరమందహాసములను బ్రణయవీక్షణములను నా దేవదేవుని యెడ ననురాగంబు చేసి, మదనమదంబు నందనరియు నాతని లీలాకృత్యములననుకరించియు గోపకాంతలు తత్స్వరూపతంగాంచిరి. అట్టి మహనీయునియెడ నామనము నిలుకడఁ జెందుఁగాక! యని సంస్కృత శ్లోకార్థము. ఆంధ్రమునందలి యర్థము స్పష్టము.

"మునిగణ నృపవర్య సంకులే ంత

స్సదసి యుధిష్ఠిర రాజసూయ ఏషామ్

అర్హణముపపేద ఈక్షణీయో

మమదృశి గోచర ఏష అవిరాత్మా." మూలము.

"మునులు నృపులుఁ జూడ మునుధర్మజుని సభా

మందిరమున యాగమండపమునఁ

జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది

దేవుఁడమరు నాదు దృష్టియందు." అని తెలుగు సీత

ధర్మజ రాజసూయమున ముని గణ నృపవర్య సంకులమైన రాజ సభయందు దర్శనీయుఁడై ప్రథమ సత్కారమునందుకొనిన యాజగదాత్మస్వరూపుడు నా యెదుట సాక్షాత్కరించియున్నాఁడని మూల భావము. ఆంధ్రీకరణము నించుమించుగా మూలమునకు సరిపోయినది.

"క్షితిభర మవరోపితుం కురూణాం"

అనునీ శ్లోకమాంధ్రీకరింపబడలేదు. దీని యర్థమిది – 'వెదురుటడవి కగ్ని వలె భూ భారమును హరింపఁ గురువంశమున కక్ష ద్యూతమను నగ్నిని దరి కొల్పి తన పూనిన పని నెఱవేర్చిన భక్తార్తిహరచరణుండైన యిమ్మహాను భావుని మదిం దలంచుచునే నేనీమానవ దేహమును బరిత్యజింతును.

"తమిమమహమజం శరీరభాజాం

హృదిహృది ధిష్ఠిత మాత్మ కల్పితానామ్

ప్రతి దృశమివ నైకధార్క మేకం

సమధిగతోస్మి విధూత భేదమోహః"

"ఒక సూర్యుండు సమస్త జీవులకుఁ దా

నొక్కొక్కఁడై తోఁచు పో"

"సమధిగతోస్మి విధూత భేదమోహః" అను దాని భావము తెనుఁగున స్పష్టముగారాలేదు. "విధూతభేదమోహః" అనుదాని యందలి స్పష్టత "శుద్ధుండనై" యను పదమునఁ గానరాదు.

దశమస్కంధమునఁ బోతన చేసిన విపులీకరణము బహుముఖములఁ గన్పట్టును. ఒక విధముగ దశమస్కంధమంతయు విపులీకరణమనియే చెప్పవచ్చును. వాని నన్నిటిని

గూర్చి వివరించుట ప్రస్తుతమున కనావశ్యకము. ముఖ్యములగు కొన్ని ఘట్టములు మాత్రముదాహరింపఁబడును. ఇందు గ్రీష్మ వర్షాశరత్తులు వర్ణింపఁబడియున్నవి. దీనిని గూడఁ బోతన తగు స్వేచ్ఛను గైకొని యే యాంధ్రీకరించి యున్నాఁడు. గ్రీష్మమును వర్ణించుచుఁ బోతన వ్రాసిన యీ క్రింది పద్యములమూలకములు.

"దినములంతంతకు దీర్ఘంబులై యుండె

దిననాథుఁడుత్తర దిశఁ జరించె"

------------ గీలియ యడవులందు గేలిసలిపె"

"నాతిప్రేయాన్ శరీరిణా" మ్మను పదములే మీఁది విపులీకరణము నకు మూలము.

కాని యీ ఘట్టమునందే యించుమించుగా మూలమును యథాతథముగా ననుకరించిన భాగమును గలదు. బలరామకృష్ణులు గోపకులతోఁ గ్రీడించుట. మూలము :-

"క్రీడిష్యమాణ స్తత్కృష్ణో భగవాన్ బలసంయుతః

వేణుం విరణయన్ గోపై ర్గోధనై స్సంవృతో విశత్

---------- నద్యద్రిద్రోణ కుంజేషు కాననేషు సరస్సుచ"

స్కం. ౧౦ అద్యా ౧౮ శ్లో ౮ - ౧౬

ఆంధ్రీకరణము.

"ఇట్లామనికందువ తెఱంగుగల్గి, సుందరంబైన బృందావనంబునకు" బల కృష్ణులు గోవుల రొప్పికొనిదని, గోవకులుందారును నొండొరులతో నగుచుఁ నుత్సహించుచు మరియు ననేక విధం బులంగ్రీడించిరందు "అనువచనమును పదమూడు పంక్తులలో నిమిడ్చి వ్రాసినాడు."

తరువాతివగు

'మాపాలికి బలకృష్ణులు"

"గోవకులందఱు నాడుచు"

"ప్రీతివ్ గోవకులందఱు"

"జలజాక్షుండును రాముడున్ నటనముల్

సల్పంగ గోపాలమూ"

నీపద్యములందు కొంత పెంపు గలదుగాని యది యంతగాఁ బరిగణింపఁదగినది ాదు. ఎక్కడనో తప్ప మూలముననున్నది యున్నట్లుగా నాంధ్రీకరించుట పూర్వకవుల ార్గమేకాదు.

ఈ క్రింది శ్లోకము నెట్లు విపులీకరించి యున్నాఁడో చూడుఁడు -

"ఏవం విహారైః కౌమారైః కౌమరు జహతు వ్రజే

నీడాయనై స్సేతుబంధై ర్మర్కటప్లవనాదిభిః"

స్కం, ౧౦ అధ్యా, ౧౧. శ్లో. ౬౬.

సీ, "కపులమై జలరాశిఁ గట్టుదమాయని

కట్టుదు రడ్డంబు కాలువలకు

--------- కౌమరులను చరింపఁ గౌమరుమిగుల"

స్కం, ౧౦పూర్వభా - ౪౫౪

గోపబాలురు శ్రీకృష్ణునితోఁ గూడఁ జల్దు లారగించుట దశమ స్కంధమునందలి ునోజ్ఞ ఘట్టములలో నొకటి. ఈ ఘట్టము చాలఁ జిన్నది. అట్లయ్యు నందున్న సీస ద్యములాణిముత్తెములే. ఇది కేవలమమూలకము గాదు. కాని యిందుఁ బోతన ప్రజ్ఞావిషేషమును గన్పట్టకపోదు. అనల్ప కల్పనా చమత్కృతియుఁ గలదు.

ూలము :-

"సర్వే విథో దర్శయంతః స్వాం భోజ్యరుచిం పృథక్

హసంతో హాసయంతశ్చాభ్యవజహ్రు స్సహేశ్వరాః

--------------- యజ్ఞభు గ్బాలకేళిః

స్కం, ౧౦ అధ్యా ౧౩ శ్లో. ౧౦-౧౧

ఆంధ్రీకరణము :

"మాటి మాటికి వ్రేలు మడిచి యూరించుచు

నూరుఁ గాయలుది నుచుండు నొక్కఁ"

"తమ తమ భోజ్య రుచిని వేఱు వేఱుగాఁ బ్రదర్శించు కొనుచు, నవ్వుచు నవ్వించుచు," నని మాత్రమే మూలము. తెలుగు నందలి సీస పద్యము నందలి భావములన్నియు నించుమించుగ నమూలకములే. "నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు" - ఈ భావ మొక్కటియే మూలమునఁ గలదు.

"కడుపునఁ దిండుగాఁ గట్టిన వలువలో

లాలితవంశనాళంబు జొనిపి

విమల శృంగంబును వేత్రదండంబును

జారి రానీకడాచంక నిఱికి

మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది

ముద్ద డాపలి చేత మొనయ నునిచి

చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు

వ్రేళ్లనందులయందు వెలయ నిఱికి

సంగడీల నడుమఁ జక్కఁగఁగూర్చుండి

నర్మ భాషణముల నగవు నెఱపి

యాగభోక్త కృష్ణుఁడమరులు వెఱఁగంద

శైశవంబు మెఱసి చల్ది గుడిచె".

మూలము నందలి "మసృణకబళ" మాంధ్ర కవి చేతిలో" మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది ముద్ద" గా మారుటయుచితమే. "చెలరేగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు" మూలమునఁ గానరావు.

గోవబాలురు చల్దులారగించుచున్నారు. అంతలోఁ గ్రేపులటవీ వీధియందు సుదూరముపోయినవి. శ్రీకృష్ణుఁడు వానిని వెదకుచు బయలు దేరెను. ఈ ఘట్టమున మూలమునందు.

"ఇత్యుక్త్వాద్రి దరీ కుంజగహ్వరేష్వాత్మవత్సకాన్

విచిన్వన్ భగవాన్ కృష్ణః సపాణికబళో యయే.

అని మాత్రమే కలదు.

కాని యిట్టి సదవకాశమును బోతన గ్రహించి బాలకృష్ణుని మధుర మంజుల మనోజ్ఞరూపమును నోరార వర్ణించు కొనినాడు.

అందులకే యీ క్రింది పద్యము –

"కర్ణాలంబిత కాక పక్షములతో

గ్రైవేయహారాళితో"

ఇందు "ధృతాన్న కబళోత్ఫుల్లాబ్జహస్తంబుతో" ననుదానికి మాత్రమే మూలముగలదు. సపాణి కబళః

ఈ క్రింది పద్యములు రెండును "అద్రి దరీ కుంజ గహ్వరేష్వాత్మవత్సకాన్. విచిన్వన్" అను మూలమున కనువాదములు. వెదకుచునేగెను, ఎట్లు? అను ప్రశ్న ముదయించును. దానికి సమాధానమే యీ పద్యము.

"ఇచ్చోఁ బచ్చిక మేసిన"

"కంజదళాక్షుఁడు వెదకెను"

శ్రీకృష్ణుని సన్నిధికి గోపికలు వచ్చు సందర్భమునఁ గల శరత్పూర్ణిమా వర్ణనము నందలి పద్యములనేకములమూలకములే.

మూలము.

శ్రీ శుక ఉవాచ –

"భగవానపితా రాత్రీ శ్శరదోత్ఫుల్లమల్లికాః

వీక్ష్య రంతుం మనశ్చక్రే యోగమాయా ముపాశ్రితః

-------------------------------

జగౌకలం వామదృశాం మనోహరమ్" అనునంతవరకు

గలమూలమును

"కలువలయేలికందువలు

కామునికయ్యపుఁ బాళెముల్ విర"

"పతి దన కరములఁ గుంకుమ"

"విటుల సేనపై దండు వెడలెడు వలతేని

గొల్లెనపై కుంభ మనఁగఁ"

ఇట్లువోడిచి, నవకుంకుమాంకితరమాముఖమండలంబునుంబోలె సఖండంబైన చంద్రమండలంబుఁ బొడగని పుండరీకనయనుండు యమునా తటవనంబున జగన్మోహనంబుగా నాక్క గీతంబుఁ బాడిన విని -----" పై గద్యపద్యరీతులలో వివరింపబడినవి.

యాంధ్రీకరణమునఁ బెంపు చాల గలదు. అదికాక ముఖ్యముగా గమనింపవలసిన విషయమొండుగలదు. మూలమున "యోగ మాయాముపాశ్రితః" అని యున్నది. అది యాంధ్రమున విడువఁబడినది. ఇందువలన మూలమునందలి యర్థ గాంభీర్యము తెనుఁగునఁ గొంత సడలినది. మూలమున నీ మాట వ్యర్థముగాఁ బ్రయోగింపఁబడలేదు. పరదారా గమనము మహాపాతకముగదా! సాక్షాద్భగవంతుఁడగు శ్రీకృష్ణుండది యెట్లుగావించెనను ప్రశ్నకు సమాధానముగా మూలగ్రంథకర్త యీ పదమును వాడి యున్నాఁడు. ఇందులకు శ్రీధరు లిట్లు వ్యాఖ్యానించియున్నారు. "నను విపరీతమిదమ్; పరదారాది వినోదేనకందర్పజితత్వప్రతీతేః నైవమ్ యోగమాయా ముపాశ్రితః "ఆత్మన్యవరుద్ధసౌరత ఇత్యాదిషు స్వాతంత్ర్యాభిధానాత్. తస్మాద్రాసక్రీడావిడంబనం కామవిజయఖ్యాపనాయేత్యేవ తత్త్వమ్. కించ శృంగారకథోపదేశేన విషయతో నివృత్తి పరేయం పంచాధ్యాయ్యాం వ్యక్తీకరిష్యామః".

కావున నాంధ్రీకరణమున మూల మందలి ముఖ్యాతి ముఖ్యమగు పదము విడువఁ బడినదని చెప్పక తప్పదు.

ఈ క్రింది శ్లోకము నెట్లు విపులీకరించి యున్నాఁడో చూడుఁడు

"అస్వర్గ్య మయశస్యంచ ఫల్గు కృచ్ఛ్రం భయావహమ్"

జుగుప్సితంచ సర్వత్ర హ్యౌపత్యం కులస్త్రియః"

"ప్రాణేశుఁడెఱిఁగినఁ బ్రాణంబునకుఁ దెగు

దండించు నెఱిఁగిన ధరణి విభుఁడు.

---------- జారు జేరదగదు చారు ముఖులు"

కొంతదనుక గోపికలతోఁ గ్రీడించి శ్రీకృష్ణుండంతర్హితుండాయెను. అంతట గోపికలు శ్రీకృష్ణుని వెదకుచు వృక్షాదులనిట్లు ప్రశ్నించిరి.

"దృష్టోవః కచ్చి దశ్వత్థ అక్ష న్యగ్రోధ నోమనః

నందసూను ర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః"

-------- బిభ్రత్యుత్పల కాన్యహో

స్కం. ౧౦ అధ్యా ౩౦ శ్లో॥ ౮-౧౩

ఆంధ్రీకరణము :

"భూతములలోనవెలిఁ బ్ర

ఖ్యాతుండగునట్టి వానిఁ గాంతలు కాళిం

దీ తీరవనాంతరముల

బ్రాఁతిన్ వెదకంగఁ జనిరి పాడుచు నధిపా!

"పున్నాగ! కానవే పున్నాగ వందితుఁ,

దిలకంబకానవే తిలకనిటలు,"

"నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, కృపారసంబుపైఁ"

"అంగజునైనఁ జూడ హృద

యంగముఁడై కరగించు వాఁడు శ్రీ"

"మానినీ మన్మథు మాధవుఁ గానరే

నలితోఁదారవత్సకములార!"

"బాటలీ తరులార! పట్టరమ్మ!

హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని"

"హరి చరణములకుఁ బ్రియవై"

"పొగడఁ దగువానిఁ గానరే? పొగడలార!"

"తరుణీ కుచకుంకుమయుత"

"కిటియై గౌఁగిటఁ జేర్చెను"

స్కం. ౧౦. పూ.భా. పద్య. ౧౦౦౭ - ౧౦౧౭

పై పద్యములను బఠించు వారికిఁ బోతన మూలము నాంధ్రీకరించుటలోఁ గొన్నియెడల నెంతటి స్వాతంత్ర్యమును గైకొనెనో తెలియకపోదు. అతి మనోజ్ఞములగు నీ పద్యములత్యంతము స్వతంత్ర భావ ప్రపూర్ణములు. మూలమున వృక్ష జాతులు వరుసఁగాఁ జెప్పఁబడినవి. ఉదా - కురవకాశోక నాగ పున్నాగ చంపకాఁ ఇది పురాణ ధోరణి. పోతన దీనిని వీడి ప్రబంధ ధోరణి ననుసరించినాఁడు. కావుననే "పున్నాగ కానవే పున్నాగ వందితు" మొదలగు పద్యములను వ్రాసియున్నాఁడు. "మాలత్యదర్శినః కచ్చి న్మల్లికే జాతి యూథికే" అను శ్లోకము నందలి భావము "నల్లని వాఁడు పద్మనయనంబుల వాఁడ"ను పద్యమున నెట్లు ప్రపంచింపఁ బడినదో చూడుఁడు. అంగజునైన జూడ హృదయంగముడై, యనుపద్యమును, 'యానినీమన్మధు మాధవుఁ గానరే, "అంగజునైనఁ" యను పద్యమును "అదెనందనందు నుండంతర్హితుండయ్యె" నను పద్యమును నించుమించుగా స్వతంత్రములే. "మానినీ మన్మథు" నను పద్యమును గేవల ప్రబంధ ధోరణిలో వ్రాసి ముక్త పదగ్రస్తమును బాటించినాఁడు. "అదెనం దనందనుం" డను పద్యమున నాటకీయమగు శైలి గానవచ్చుచున్నది. తులసిని గూర్చి చెప్పునపుడు మూలమున భ్రమర ప్రసక్తి గలదు. సహత్వాళికులైర్బిభ్రత్ అది యాంధ్రీకరణమున లోపించినది. "తుమ్మెదల మొత్తముతో నిన్ను భరించు నచ్యుతుని" అను మాటలో శ్రీకృష్ణ వక్షస్థిత తులసిదామ నిత్యనూతన శోభా కరత్వము

స్ఫురించు చున్నది. ఆంధ్రమున నది పోయినది. ధరిత్రిని బ్రశ్నించిన విధమునందును గొంత మార్పు గలదు. మూలశ్లోకార్థమిది - ధరిత్రీ! నీవేమి తపస్సు చేసితివో? కేశవాంఘ్రి తలస్పర్శముచేఁ బులకితవై ప్రకాశించుచున్నావు. దీనికిఁ గారణమేమి? శ్రీకృష్ణ చరణ స్పర్శయా? లేక లీలావరాహరూపుఁడైన యమ్మహానుభావునియాలింగనమా? - ఈ మూఁడిట నేది కారణమని మూల శ్లోకము. ఈ మూడును గలుగుటకుఁ బూర్వ జన్మమున నీవాచరించిన తపమెట్టిదని యాంధ్రము. భావమునందంతగా భేదము లేకపోయినను భావ వ్యక్తీకరణమునఁ గొంత భేదము గలదు.

"బాహుం ప్రియాంస ఉపధాయ గృహీ తపద్మో"

అనుశ్లో॥ పూర్తిగావిడువబడినది.

ప్రేయసి భుజమునఁ దన భుజమూదిపెఱకేలఁ గమలముఁ బూని తులసి తావికి మూగు తేంట్లు వెంబడింపనడచుచు హరి ప్రణామమును బ్రణయ విలోకనముల మన్నించెనే? చెలులారా! యీలతలు వనస్పతి బాహువులఁగౌఁగిలించి బుండరీక దళలోచను నఖములఁదవిలి నిక్కముగా రోమాంచకంచుకితములయ్యె.

ఈ క్రింది పద్యమూలకము.

"లోకమెల్లఁ గుక్షిలోపలనున్నది"

గోపికలు శ్రీకృష్ణుని వెదకుచుండఁగా వారికంభోజ ధ్వజ వజ్రాంకుశాది శుభ లక్షణ లక్షితములైన యడుగు జాడలుగానుపించెను. అది శ్రీకృష్ణుని వేయని వారు నిశ్చయించుకుని యింకను వెదకుచుండిరి. అంతట మఱొక జాడ గోచరించినది. అది యొక స్త్రీయడుగుల జాడగా వారు తెలిసికొని యుమ్మలించిరి. మూలమున నిట్లే యున్నది.

"ఏవం కృష్ణం పృచ్ఛమానా బృందావనలతా తరూన్"

--------------- స్వముబ్రువన్"

మూలమున నిట్లుండఁగా నాంధ్రమున నింకొక రీతిగా నున్నది. స్త్రీ పద చిహ్నములను గోపికలు చూచినట్లు స్పష్టముగాలేదు. వారు "మనోహరంబులయిన హరిచరణంబుల చొప్పుఁ గని తప్పక చెప్పికొనుచుఁ దమలో" నిట్లనుకొనిరఁట!

"కొమ్మకుఁ బువ్వులు గోసినాఁడిక్కఁడ

మొనసి పాదాగ్రంబు మోపినాఁడు"

మూలమున స్త్రీ పద చిహ్నములను గూడ గోపికలు చూచినట్లు చెప్పఁ బడినది. కావున

"కస్యాః పదాని యాతాయాః పశ్యధ్వం నందసూనునా

అంసన్యస్తప్రకోష్ఠాయాః కరేణోః కరిణా యథా"

మొదలగు శ్లోకములుపపన్నములగు చున్నవి. ఆంధ్రమున నామెయడుగు జాడలు గోపికలు చూచినట్లే చెప్పఁబడలేదు. అట్టియెడ "కొమ్మకుఁ బువ్వులు" ఇత్యాది పద్యమునుప పన్నమగుచున్నది హఠాత్తుగా నీ కొమ్మ యెక్కడనుండి వచ్చి పడినదని యనిపింపకపోదు.

ఈ ఘట్టము నందలివే యీ క్రింది శ్లోకము లాంధ్రీకరింపఁబడలేదు.

"కస్యాః సదాని యాతాయాః పశ్యధ్వం నందసూనునా"

-------- ఘనుత్తయే॥

మీఁది శ్లోకములలో చివరి శ్లోకము నాధారముగాఁ గొని మనోజ్ఞమగు నీ క్రింది పద్యమును వ్రాసినాఁడు. ప్రపంచీకరణమయి యొక మంచి యదాహరణము –

"ఈ చరణంబులే యిందునిభానన

... సనకాదిమునియోగసరణి నొప్పు"

-------- క్రమముగనియు –నతని గానరైరి.

ఈ ఘట్టమున మూలమునకు నాంధ్రీకరణమునకు మఱొక పెద్ద భేదము గలదు. మూలమును బట్టి శ్రీకృష్ణుఁడంతర్హితుండగు నపుడొక్క గోపిక తోడనే యంతర్ధానము నందినాఁడు. ఆమె యడుగు జాడలనే తరువాత గోపికలు చూచినారు. ఆంధ్రమును బట్టి యా సమయమున శ్రీకృష్ణుతో నున్నది యొక్క గోపికకాదు. పలువురు గోపికలు. ఈ క్రింది పద్యమును జూడుఁడు.

"ఒక యెలనాఁగ చేయూఁది నాఁడిక్కడ

సరసనున్నవి నాల్గు చరణములను"

ఈ క్రింది పద్యములు కేవలమమూలకములు

"ఎలయించి ప్రాణేశ యెందుఁ బోయితి" వని

తోరంపుటలుకతో దూఱె నొకతె"

"పలికినఁ బ్రతిజ్ఞ దప్పెడిఁ"

"పట్టినఁగాని మనో విభుఁ"

"చెలువుఁడు నెప్పకపోయిన"

స్కం. ౧౦ పద్య, ౧౦౬౩ - ౬౬

ఈపద్యములు ప్రయోజనము నువిదితమే. గోపికలు ముగ్ధలు. ఆ ముగ్ధాప్రణయమును వ్యక్తీకరించుటకే యీ పద్యములు వ్రాయఁబడినవి.

రాసక్రీడాభివర్ణనమునందును జాల పెంపుగలదు

ట పోతన భాగవతమున సర్వ సాధారణముగా పెంపే కానవచ్చుచున్నది కొన్ని యెడల మూల శ్లోకములకు దెలుగు సేతగానరాదు. ఇట్టివి చాలనరుదు ఉదాహరణకు అక్రూరుని నందగోకుల ప్రవేశఘట్టమును గైకొననగును.

అక్రూరుని నందగోకుల ప్రవేశ సందర్భమున పోతన వ్రాసిన

సుదీర్ఘ వచన రచన గమనింపదగ్గది

"కని బృందావనంబుదరి యంజొచ్చియందు సాయంకాలంబున అడవికిమేతలకేగిన కుఱ్ఱుగోడె పడ్డ తండంబులంగానక --------------- దండ ప్రాకారరక్షావిశేషభూషంబైన ఘోషంబు ప్రవేశించి"

స్కం. ౧౦ వచ ౧౧౯౭

ఈ వర్ణనకు రెండు మూఁడు ముఖ్యకారణములు గన్పట్టుచున్నవి. మొదటిది పోతనకుఁగల పల్లీజన జీవితవర్ణనాభిలాష. ఈ విషయమున సర్వసాధారణముగా నెఱ్ఱన యనుయాయి. ఎఱ్ఱన తన హరివంశమున గోకుల బృందావన వర్ణనమును మిషఁగాఁ గొని పల్లీయజన జీవితమునే చిత్రించి యున్నాఁడు. అట్లే పోతనయు నవకాశము దొరకిన

బల్లీజనజీవితమును వర్ణించుచుండును. అసలు ముఖ్యముగా హరివంశమునకును భాగవతమునకును దగ్గర పోలికలు గలవు. ఇతి వృత్తము ననేక స్థలములం దొక్కటియె. అందులకే పోతన భాగవతమున నక్కడక్కడ హరి వంశ చ్ఛాయలుండక తప్పదు. ఇఁక రెండవది పోతనకు సహజముగా నున్న వర్ణనాభిలాష. పోతన భాగవతమున మనోజ్ఞములగు ప్రకృతి వర్ణనము లనేకములు గలవు. అందిదియొక్కటి అక్రూరుఁడు నంద వ్రజమునకేగునప్పటికి సాయంసమయమగుచున్నది. అట్టియెడ నందగోకుల మెట్లున్నది? అక్రూరుఁడు గోకులమును బ్రవేశించెనని చెప్పఁగాఁ బోతనవంటికవి చెప్పఁగలఁడా! అందులకే యీ వర్ణనము. అంతయును బాగున్నది కాని యిందు గోపికలు శ్రీకృష్ణని కొఱకు సంకేతస్థలము లందు వేచి యున్నారని చెప్పుట యంతయుచితముగాఁ దోఁపదు ! సాయం సమయమునకే సంకేతస్థలములా! వారు బంధుమిత్రాదులనేగాక మగలఁ గూడ లెక్క సేయలేదనుట మనకందఱకుఁ దెలిసిన విషయమే. కాని యెద్దాని కైనను నౌచిత్యము జీవగఱ్ఱ. సంకేతస్థల ప్రసంగమిచ్చుట నిజముగా నుచితము గాదు.

"నాహం భవద్భ్యాం రహితః ప్రవేక్ష్యే మధురాపురీమ్

------------ యదూత్తమోత్తమ నారాయణ నమోస్తుతే"

ఈ శ్లోకమునందు నక్రూరుని భక్తి పారవశ్యము సువ్యక్తమగు చున్నది. భగవత్పాద శౌచ తీర్థమునఁ బితరులు నగ్నులు సమరులును దనియుదురు. భగవత్పాదయుగమును గడిగి బలి పుణ్యకీర్తి నుల్లసిల్లి యింద్ర పదమును బరమ భక్తగతిని బొందియున్నాఁడు. అతని పాదశౌచసలిలములే గంగయై పాఱుటయు శర్వుండద్దానిని శిరముపై ధరియించె. అమ్మహనీయ తోయములే నగర సుతులకు స్వర్గతిని గలిగించెను. దేవదేవ! జగన్నాథ! పుణ్య శ్రవణ కీర్తన! యదూత్తమ! ఉత్తమ శ్లోక! నారాయణా! నీకుఁ బ్రణామంబులు.

ఇట్టి భక్తి భావములు గల శ్లోకములను సంక్షేపించి పోతన యీ క్రింది కందమును వ్రాసినాఁడు.

"నా యింటికి విచ్చేయుము

నీయంఘ్రిసరోజరేణు నికరము సోఁకన్

నా యిల్లు పవిత్రంబగు

శ్రీయుత! నీ భటునిఁబెద్ద సేయందగదే!

ఇట్లే రామకృష్ణులు మధురానగరమును బ్రవేశించు నప్పుడు తత్పుర వరనము
యూలమున 8 శ్లోకములలో సతి మనోజ్ఞముగఁ జేయఁబడియున్నది. అద్దానిని గూడఁ
పోతన చాల సంక్షేపించి వ్రాసినాఁడు.

"దదర్శ తాం స్ఫాటిక తుంగ గోపుర
ద్వారాం బృహద్దేమ కవాట తోరణామ్
-------- స్వలంకృత ద్వారగృహం సపట్టికై:"

స్క౦. ౧౦ అధ్యా ౪౧ శ్లో ౨౦ -౨౩

ఈ వర్ణన వమిచ్చుట త్యావశ్యకము. కంసపాలితమగు నానగరమెంత మనోజ్ఞమో
యంత శత్రు దుర్భేదము. పోతన యిట సామాన్యమగు నొకపద్యమును వ్రాసియున్నాఁడు.
సహజవర్ణనా ప్రియుఁడగు నిమ్మహాకవి యిట నేల సంక్షేపించి వ్రాసెనో చెప్పఁ జాలము.

"పరిఖల్ గోటలుఁ గొమ్మలుంబడగలుంబ్రాసాదము ల్వీధులున్"

స్క౦. ౧౦ పద్య ౧౨౪౫ (బు)

బలరామ కృష్ణులు మధురానగరమును బ్రవేశించు నప్పుడు తద్దర్శనకుతూహల
ంగుపురస్త్రీల సంరంభము, మూలమునఁ గూడ మనోజ్ఞముగనే వర్ణింపఁ బడియున్నది.
దానినిఁ బోతన మఱి కొంచెము పెంచి వ్రాసియున్నాఁడు.

ఈ క్రింది 2 పద్యములు అమూలకములే

"నంద తపః ఫలంబు సుగు
ణంబుల పుంజము గోపకామినీ"

స్క౦. ౧౦ - ౧౨౪౬ పద్య

ఇచ్చుట మూలమున "ద్రష్టుం సమీయుస్త్వరితాః పురస్త్రియః" అని మాత్రమే కలదు.

ఈ క్రింది పద్యము నమూలకమే

"వీడటే! రక్కసి విగత జీవఁగ జన్ను
బాలు ద్రావిన మేటి బాలకుండు"

స్క౦. ౧౦ పద్య ౧౨౫౦ (బు)

రామకృష్ణులు కంస సభకేగుటకు ముందు చేయఁబడిన సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయవర్ణనములు కేవల మమూలకములు. మూలమున "అదిత్యోస్తము పేయివానే" అనియు "సూర్యేచాద్భ్యుస్సముత్థితే" అనియు మాత్రమే కలదు. దీనినిఁ బోతన ప్రబంధ ధోరణిలోఁ బెంచి వ్రాసి యున్నాఁడు. కాని యీ వర్ణనలు కథాగతితోఁ గేవలము సంబంధములేనివి గావు. అట్లు కథను గొంతవఱకు సూచించి వ్రాయుట యందే పోతన వర్ణనానైపుణ్యము వ్యక్తమగుచున్నది. అట్లని కావ్యగత పాత్రలకు నీ వర్ణనకుఁ బ్రత్యక్ష సంబంధమేమియు లేదు.

"తరుణుఁడగు శీతకరునిన్
మరగి వియల్లక్ష్మి దన్ను మని ముదుకడున్
ఖరకరుఁడు ననుచు ద్రొచ్చిన
కరణిన్ రవి పశ్చిమాద్రి కడఁ గ్రుంకెన్నృపా॥

ఈ పద్యము నందలి వియల్లక్ష్మియే విజయ లక్ష్మి వియల్లక్ష్మికిఁ దరుణుఁడగు శీతకరుఁడు నచ్చినాఁడు. వాని మరిగి ముదుకఁడు ఖరకరుఁడు నగు రవిని వీడినది. ఇట జయలక్ష్మియుఁ గృష్ణుని మరగి కంసుని వీడ నున్నవి.

"కళలు గలుగుఁగాక కమలతోడగుఁగాక
శివుని మౌళి మీఁదఁ జేరుఁగాక
అన్యునొల్లఁ దపనుఁడైన మత్పతి యని
సాధ్వి భంగిఁ గమల జాతిమొగిడె.
కమల ముల జాతిము కళించుకు పోయినవి. అస్తమయము

చంద్రుఁడు కళలు గలవాఁడు శ్రీ కృష్ణుఁడును గళలు గల వాఁడే కమలతో సంబంధమిర్వురకునుగలదు. చంద్రుఁడు శివ మౌళి నధిష్ఠించిన వాఁడే. విష్ణు పాదోదకమును శివుఁడు మౌళిపై ధరించినాఁడు గావున విష్ణు దేవుని మౌళిధరించినట్లే. శ్రీ కృష్ణుడు విష్ణ్వవతారమేకదా! కంసుని పక్షమునను గొందఱున్నారు. బాగోగులతోఁ బనిలేకుండ వారాతనినే యంటి పెట్టుకొనియుండు వారు. చండ శాసనుఁడయ్యు నాతఁడు వారికిఁ బ్రీతిదాయకుఁడే. ఇతరులెంతటి వారైనను వారాతని వీడువారుకారు. స్పష్టముగా లేకున్నను నిట నాతని భార్యలు స్ఫురణకు వచ్చుచున్నారు.

"సుందర సాయం సంధ్యా
వందన విప్రార్థతోయ వజ్రహతోద్య
న్మందేహాసుర రక్త
స్యందము క్రియఁగెంపు సొంపెసఁగెన్నపరదిశన్."

ఈ పద్యమునఁ గంస మరణము సూచింపఁ బడినది. అతని యందుఁ గల రాక్షసాంశయు నిందు సువ్యక్తము.

"భూమినిండి మింటఁ బూర్ణమై కర్కాట
మకర మీన రాశి మహితమై
హరియశస్సుధాబ్ధి యందలి తుంపురు
లనఁగఁ జుక్క లొప్పెనాకసమున"

ఇది శ్రీ కృష్ణుని విజయమును వ్యక్తీకరించున్నది. అతని యశస్సు దశదిశావ్యాప్తమయ్యెననుట. తరువాతి దగు

"ఎల్ల దిశలు నిండిన శ్రీ" అను పద్యమును అట్టి దియే

"తొగలు సంతసిల్ల, దొంగలు భీతిల్ల, గడలు మిన్ను ముట్టి కడలు కొనఁగ "శీత కరుఁడు పొడిచినాఁడు. శ్రీకృష్ణుని యుదయమునట్టిదే కదా!

సూర్యోదయ వర్ణనమునఁ గూడ నిట్టి పద్యములు గొన్ని గలవు.

మచ్చునకుఁ గొన్ని :

"అరుణ హరినఖరవిదళిత
గురుతిమిరే భేంద్ర కుంభ కూట వినిర్ము
క్త రుధిరమౌక్తి కముల క్రియ
సురప తిదిశఁ గెంపు తోడఁ జుక్కలు మెఱసెన్.

అరుణుఁడను హరి (సింహము) గొప్ప చీఁకటి యను నిభరాజు కుంభమును విదళించినాఁడు. శ్రీ కృష్ణుఁడు కువలయా పీడమును గజమును వధించినాఁడు.

"పౌలోమిదన బాలుఁ బాన్పుపైఁ గనుపట్ట
బన్నిన పవడం పు బంతియనఁగ."

ఇందు దేవకీ దేవి శ్రీకృష్ణుని జూడగలదనియు (జూచిమాతృవాత్సల్యముతో నాతనిని లాలింపఁగలదనియు సూచన గలదు).

"ఆయురర్థము

"కాలజాంఘికుచేతి ఘంటయనఁగ
ఘనజంతు జీవితకాలరాసులవిధి
కొలువనెత్తిన హేమకుంభమనఁగ

ఈ రెండు పాదలందును గంసమరణము సూచింపఁబడియున్నది. కాలజాంఘికుఁడు ఘంటమ్రోయించినాఁడు. శ్రీ కృష్ణుఁడు మథరా నగరమును ప్రవేశించినాఁడు. ఘన జంతు జీవితకాలరాసులను గొలవ విధి హేమకుంభము నెత్తినాఁడు. ఇఁకఁ గొలుచుటయే మిగిలియున్నది. అంతట రాశియుఁ దఱిగిపోవును.

"పశ్చిమ దిక్కాంత పరఁగగై సేయుచో
ముందర నిడుకొన్న ముకురమనఁగ

పశ్చిమ దిక్కాంత సింగారించు కొనుచున్నది. ఎందులకు? ప్రియునిఁ గూడుటకు. విజయలక్ష్మి గై సేసికొన్నది. ఎందులకు? శ్రీకృష్ణునిఁ గూడుటకు.

"కోక తాపోపశమ దివ్య ఘటిక యనఁగఁ
బద్మినీకాంత నోముల ఫలమనంగ
మూడు మూర్తుల సారంపుముద్దయనఁగ
మిహిరమండలముదయాద్రి మీఁద నొప్పె."

రవి కోక తాపోపశమ దివ్యఘటిక. శ్రీకృష్ణుఁడు భక్త తాపోప శమ దివ్య ఘటిక. పద్మినీకాంత నోముల ఫలము రవి. వ్రజ వధూ జనుల నోముల ఫలము హరి. అతఁడును మూడుమూర్తుల సారమే. ఈతఁడును మూడు మూర్తులసారమే.

శ్రీకృష్ణుఁడు కువలయాపీడమను గజమును వధించుట మూలమున నాలు శ్లోములలోఁగలదు. అద్దానిని పోతన స్వకపోల కల్పితములనేకములు చేర్చి బహుధా పెంచినాఁడు.

ఇట్లే చాణూరముష్టికులతోడి మల్లయుద్ధ సందర్భమున రచింపఁబడిన

శా "స్థాణున్ మెచ్చఁడు బ్రహ్మఁ గైకొనఁడు వి

ష్వక్సేను నవ్వున్ జగ"

స్కం. - ౧౦ పద్య ౧౩౩౯

సీ. "చలమున ననుడాసి జలరాశిఁ జొరరాదు" స్కం. ౧౦ ౧౩౪౧

"మనుజ సింహుండనిన మలయరాదు.

చేరినఁ బడవైత్తు జెయిసాఁపగా రాదు

బెరసి నాముందటఁ బెరుగ రాదు

భూనాథ హింసకుఁ బోరాదు నను మీఱి

శోధింతుఁగానలఁ జరగరాదు."

"ప్రబలమూర్తి ననుచు భాసిల్లగారాదు"

అదిగాక నీవు శ్రీహరి నంటేని

"మహిమతో నుండఁగ మధురాపురముగాని

పాలుపారవైకుంఠ పురముగాదు. స్కం. ౧౦ పద్య ౧౩౪౩

చాణూరుని యీ వాక్యము లాశ్చర్య జనకములుగా నున్నవి. మల్ల యుద్ధ విశారదుఁడగు నాతనికి శ్రీకృష్ణుని యందలి విష్ణుత్వమెట్లు గోచరించెనో తెలియ రాదు. కంసాదులాతని శ్రీకృష్ణుని భగవదవతారముగా గ్రహించిరో లేదో తెలిసి కొనుటకంతగా నవకాశము లేదు. ఒక వేళ కంసునకుఁ దెలిసినను జాణూరునకుఁ గూడఁ దెలియుట కవకాశము గలదా? ఈ ఘట్టమునమూలమే యుచితముగాఁగన్పట్టు చున్నది.

మల్లయుద్ధమునకు సన్నద్ధుఁడగుచున్న చాణూరుని రూప వర్ణన సందర్భమున

"రోషాగ్ని భూమ ప్రదోహంబు కైవడి

శిరమున సన్నపు శిఖ వెలుంగ"

అను నీ పద్యమును అమూలకమే

శ్రీకృష్ణ చాణూరుల మల్లయుద్ధమునందును నాంధ్రమునఁ జాలపెంపు గలదు. మూలమున నించుమించుగాఁ బదునాలుగు శ్లోకములున్న ఆంధ్రమున నొకపుట గద్యమును నేడు పద్యములు గలవు.

రుక్మిణీ కళ్యాణ ఘట్టమునందును నమూలకములగు పద్యము లనేకములు గలవు. అసలీ కథనొక స్వతంత్ర ప్రబంధముగాఁ బోతన రచింపఁ దలంచినట్లు గన్పట్టును. రుక్మిణీ బాల్యవర్ణనమంతయునమూలకమే.

"బాలేందు రేఖదోఁచిన" స్క- ౧౦ పద్యము ౧౬౮౭

"మరియు దినదిన ప్రవర్థమానయై"

వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు

నబలలతోడ వియ్యంబులందుఁ"

మూలమున రుక్మిణి పంపిన బ్రాహ్మణుఁడు కాంచనాసనాసీనుఁడగు శ్రీకృష్ణునిఁగాంచి యూరకున్నాఁడు. బ్రాహ్మణుఁడుకదా! అందు నాకాలపు బ్రాహ్మణుఁడు! ఆ బ్రహ్మణ్య దేవునిఁ గాంచినంతనే యాశీర్వదింపవలదా!

"అపశ్య దాద్యం పురుష మాసీనం కాంచనాసనే" అనిమూలమున చెప్పినది.

పోతనకురుచింపలేదు. అందులకే "కనకాసనాసీనుడై యున్న పురుషోత్తముంగాంచి, పెండ్లి కొడుకువు గమ్ము నిదీవించి నట్లు వ్రాసియున్నాఁడు. ఎంత సమయోచితమగు నాశీర్వాదమిది. అందులకే శౌరి ముసి ముసి నగవులఁ జాచినాడు. వచ్చిన కార్య మెట్టి దియోయి. ద్వ్వరకును విదితమే ఆగత అనాగతము లెరిగిన భూసరోత్తముడీతడు. ఘటనాఘట ననమర్థుడైన పురుషోత్తముడాతడు.

ఇఁక రుక్మిణీ సందేశము : ఇందును బెంపు చాలఁ గలదు.

"ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక

దేహతాపంబులు దీఱిపోవు

నేనీశుభాకారమీక్షింపఁ గన్నుల

కఖిలార్థలాభంబు గలుగుచుండు. స్క-ం. ౧౦ పద్య ౧౭౦౩

ఇంత దనుక మూలాను సారమే నడచినది.

ఈ క్రింది పాదముల మూలకములు.

"ఏ నీచరణ సేవలే ప్రొద్దు చేసిన

భువనోన్నతత్వంబుఁబొందఁ గలుగు

నే నీలసన్నామమే ప్రొద్దు భక్తితోఁ

దడవిన బంధసంతతులువాయు"

ఈ క్రింది పద్యము గూడఁ గొంత దనుక మూలమునననుసరించి యున్నది.

"ధన్యుల్ లోకమనో భిరాము గులవిద్యారూపతారుణ్య సౌ

జన్యశ్రీ" --------- మోహముల్" స్కం.౧౦ పద్య ౧౭౦౪

తరువాతి దంతయు స్వకపోలకల్పనమే

రుక్మిణీ కళ్యాణ కథా భాగము మూలమున నించు మించుగా నిన్నూరు శ్లోకములలోఁ గలదు. ఆంధ్రమునది యైదు వందలకుఁ బెఱిగినది. పోతనకుఁ విపులీకరణ ప్రయత్నమునకీ యొక్క కథయే చక్కని నిదర్శనము.

ప్రకరణ సారాంశము :

పోతన విపులీకరణ ప్రియుఁడు. సంస్కృత భాగవతము పదనెనిమిది వేల శ్లోకములకుఁ బరిమితమై యున్నట్లా ధారములు పెక్కులు గలవు. కాని యిప్పటి సంస్కృత భాగవతముననిరువది రెండు వేల శ్లోకములు గలవు. వీనిని పోతన ముప్పదివేలకు పైగా పెంచి యున్నాడు. గుదించిన భాగములు నందందు లేక పోలేదు. అక్రూరుఁడు రామకృష్ణుల దర్శించు ఘట్టము ముందే వివరింపఁబడియున్నది. వేదాంత ఘట్టములు వచ్చినప్పుడెల్లఁ బోతన శ్రీధరీయము ననుసరించి విపులీకరించి యున్నాఁడను, మాట సర్వధా సత్యము గాదు. కొన్ని యెడల విపులీకరించిన మాట వాస్తవమే కాని యందొక వ్యవస్థ యాతని కున్నట్లు గానరాదు. వ్యాఖ్యాన మవసరమైన శ్లోకము లనేకములు యథాతథముగా నాంధ్రీకరింపఁ బడియున్నవి. వీని కన్నింటికి నుదాహరణము లీయఁబడినవి. ఆంధ్రభాగవతము నందలి పెంపుదలకు ముఖ్య కారణములు వర్ణనలు. పోతన బహువర్ణనా

ప్రియుఁడు. ఇందితఁడు ప్రబంధ కవులతోఁ దుల తూగుచుండును. భక్త్యావేశమునఁ బాల్కురికి సోమనయు నీతఁడు నొక్క కోవలోని వారు. సోమన భక్త్యావేశమునఁ బరమత నిరసన మున్నది. కావున నయ్యది మనకంతగా రుచింపలేదు. పోతన యందుమత సహనమున్నది. కావున నీతని యావేశము మనకు సహ్యమగుచున్నది. భక్త్యావేశమునఁ బోతన కావించిన వర్ణన లనేకములు దాహరింపబడినవి. పోతన పెంచి వ్రాసిన ముఖ్య ఘట్టములు :- ౧. ప్రథమ స్కంధమునసై మిశారణ్య వర్ణనము. ౨. ద్వి. స్కంధమున శుక ప్రోక్తయగు భక్తి మార్గము. ౩. విదురమైత్రేయ సంవాదము ౩ స్కం ఇంచుమించుగా ౨౦౮ గద్య పద్యము నిది యున్నది. ఇందనేకములు పోతన స్వకపోల కల్పనలే. ౪. తృతీయ స్కంధమున దేవతలు విష్ణువును స్తుతించు నవసరమునఁ గల ౧౩ శ్లోకముల నొక దీర్ఘమగు దండకముగాఁ బ్రపంచించ యున్నాఁడు. ౫. యజ్ఞ వరాహస్తము ౬ దక్ష యజ్ఞ విధ్వంసము. ౭. ప్రహ్లాద చరిత్ర ౮. క్షీరసాగర మధనము. ౯. గజేంద్ర మోక్షము ౧౦. వామన చరిత్ర. ౧౧. పరశురామచరిత్ర ౧౨. శ్రీకృష్ణుని బాల్యము, బాల్యక్రీడలు. రాస క్రీడలు జలక్రీడలు గోపికాగీతలు మొదలగునవి. ౧౫. రుక్మిణీ కళ్యాణము. ౧౫ వామనావతార ఘట్టము (మూలమున నించు మించుగా ౨౦౦ గ్రంధము. ఆంధ్రమున ౭౦౦ గ్రంధము). ౧౯ ప్రహ్లాద చరిత్ర (మాతృకలో ౨౫౦ శ్లోకములలోఁ గలదు.) ఆంధ్రమున ౧౦౦౦ గ్రంధముగాఁ బెఱిగినది. గజేంద్ర మోక్షము మూలమున ౧౨౦ గ్రంథము. ఆంధ్రమున నించు మించుగా దీనికి నాలుగు రెట్లు పెఱిగినది. గంగావతరణ ఘట్టమ్మున మూలమునందలి ౨ శ్లోకములకు మూఁడు పుటల గద్యము వ్రాయబడినది. సత్యభామా యుద్దము కేవల మమూలకము.

పోతన వర్ణనలు రస నిర్భరములు. ఎంత త్రావినను దనివి తీరని యమృతంపు సోనలు.

# 6. ఎఱ్ఱాప్రగడ, నాచన సోమన, పోతనల కవితా రీతులు

పోతనామాత్యునకుఁ బూర్వము విష్ణుకథలను దెల్పునట్టి యాంధ్ర గ్రంథములలో నెఱ్ఱనార్యుని హరివంశ నృసింహపురాణములు నాచన సోముని ఉత్తర హరివంశము ముఖ్యములు. భాగవతము హరివంశము వలె నాంధ్రీకరణమే యయ్యుఁ దదాంధ్రీకరణ సందర్భమునఁ బోతనార్యుఁడు తానక్కడక్కడ స్వతంత్రించిన సందర్భములందుఁ గథాకథన రసభావాలంకారములలోఁ దనకుఁ బూర్వులైన ప్రసిద్ధకవుల ననుసరించిన స్థలములెన్నియేని కలవు.[౧] అందుఁ బయి నృసింహపురాణ, హరివంశోత్తరహరివంశములు మూఁడును విష్ణు కథలకు సంబంధించిన వగుటచే సమాన ఘట్టములను వ్రాయునపుడు కథాకథన పాత్ర నిర్మాణాదులలో భాగవతమునకుఁ బయి గ్రంథములలో నెంత వఱకుఁ బొత్తుకుదిరినది - అను విషయము నాంధ్ర గ్రంథములతో మాత్రమే పోల్చి చూచుట యీ ప్రకరణోద్దేశము.

సమానేతివృత్తముగల ఘట్టములందు నరకాసురవధ, కృష్ణుని బాల్య క్రీడలు, ఉషాపరిణయము, ప్రహ్లాద చరిత్ర మొదలగునవి ముఖ్యములు.

కవి తన ప్రతిభా విశేషముతోఁ ప్రాణ ప్రతిష్ఠ చేసిన పాత్రలను దర్శించుటకు తత్సంబంధమైన కథనంతను బరామర్శింప నవసరము లేదు. ఆయువు పట్టులవంటి కొన్ని సన్నివేశములను జూచినచాలును. భావుకులైన వారికి దత్స్వరూపము సంపూర్ణముగ గోచరించును. ఆ దృష్టితోఁ బయి ఘట్టము లందలి సన్నివేశకల్పనములను, పాత్రనిర్మాణ పద్ధతులను బరిశీలింతము.

### ౧. నరకాసురవధ :—

ఈ కథా భాగమునందు సత్యభామ పాత్రతోఁబాటు గమనింపఁదగినవి ముఖ్యముగా మూఁడు సన్నివేశములు. యుద్ధాత్పూర్వము సత్యభామకు శ్రీకృష్ణునితో జరిగిన సంభాషణము, సత్యభామ యుద్ధ నైపుణ్యము, ఆమె విజయము.

ఈ ఘట్టమునందు నెఱ్ఱన, సోమన, పోతనలు ముగ్గురును మూఁడు విధములైన ప్రతిభా విశేషములను మెఱయించినారు. ఎఱ్ఱనార్యుని భావగాంభీర్యము, నాచన సోముని చమత్కార జనకత్వము, పోతనార్యుని సన్నివేశకల్పనము నెన్నఁదగినవి. ముప్పురును సత్యభామను వీర శృంగారముల సంగమ స్థానముగాఁ జిత్రించిరి. అందుఁ బోతన నర్మించిన

---

౧. అవన్నియు బోతనపై పూర్వకవుల ప్రభావమను ప్రకరణమునఁజూపఁబడును.

సత్యభామ పాత్రయందు నోర్పునుమించిన నేర్పు భక్తిని మించిన యుక్తి, వీరశృంగారములు అండగా నేకకాలమునఁ బ్రదర్శింపఁబడినవి. సత్యభామపట్ల భాగవత కృష్ణుని చర్యయే వేఱు. ఆమె ప్రత్యక్షముగా నరకాసురునితో యుద్ధము సేయువఱకు శ్రీకృష్ణునకామె యందున్న వీరత్వాంశ అసలే తెలియదు. ఆమె యెన్నడును దన శక్తిని గూర్చి తానై చెప్పికొని యుండలేదు. ఆమెకుఁ గల గాంభీర్యమట్టిది. ఇంద్రప్రేరితుఁడైన శ్రీకృష్ణుఁడు నరకాసురునితో యుద్ధమునకుఁ బోవుచుఁ దనపోకను గూర్చి యలవోకగా సత్యభామతోఁ బ్రసంగింప, నామెహృదయముప్పొంగును. తానుఁగూడఁ గృష్ణునితో నటకేఁగి తనప్రావీణ్యమును ప్రదర్శింపవలెనని యామె కోర్కె.

అద్దానికిది తరుణమని మురిసినది, కాని సరసురాలుకాన భర్తకు వెలితి పడి వత్తునని చెప్పదు. తదింగిత మెఱింగి యాతఁడు రమ్మని పిలువఁడు. అపట్టున సత్యభామ తననేర్పు నంతను సంధించి "భర్త చిత్తంబురా" సతియుక్తితో "దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీప్రావీణ్యంబును జూడఁ గోరుదుఁగదా! ప్రాణేశ! మన్నించి నన్నీవెంటం గొనిపొమ్ము నేఁడు కరుణన్" (దశ. ఉ. ౧౫౧ ప) అని వినమ్రమయై వేఁడికొనును. ఆ వేఁడికోలుమరుఁగున ధ్వనితార్థ మించుక కలదు. "లోకమున నీ మగఁడు వీరాధివీరుఁడని జనులందురు. అట్టి జగత్ప్రఖ్యాతమైన మీ శక్తి సామర్థ్యములను ప్రత్యక్షముగాఁ జూచు యోగ్యత లేదా! సౌధములు నిర్మింపమనలేదు. భూషణాద్యలంకారము లిమ్మని వేఁడలేదు. నాథుని సామర్థ్యమును గన్నులారఁ జూడ నిచ్చగింతును, ఆ మాత్రపుఁ జనవు ప్రసాదింపరాదా! యని భావము. అద్దానికిఁ గృష్ణుఁడు వీనమైనను వీఁగక వినియు విననట్లూరకొనినాఁడు. సత్యభామకు గత్యంతరము తోఁపలేదు. మరల పై వాక్యముల కనుబంధముగ "నేఁజూచి యేతెంచి నీదేవీ సంహతికెల్లఁ జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్" అన్నది. ఈ వాక్యము మనోహరభావ విలసితము. పదాఱువేల గోపికాస్త్రీలలో నేను గాక యేడుగురు పట్టమహిషులలో నేయొకరి యందైనను నాయందుఁ గంటె మీ కధికమైన ప్రీతి యుండవచ్చును. అది చెప్పలేక మీరు నాకడ మోమోటము చెందవచ్చును. నిజమునకు నచ్చిన ప్రియురాలు మెచ్చినదే విద్యయని సంభావించుట మాన్యము. నేఁడు నారాక ననుమతించినచో, మీ ప్రతాపాదులఁ జూచివచ్చి మీ హృదయము నంటిన దేవీ సంహతి కెల్ల నాయంతట నేను బోయి చెప్పుకొందును. ఆ ప్రయోజనమునకైన, నారాక ననుమతింప రాదా! యని భావము. అయ్యది సత్యభామ నేర్పులో విపక్షితాన్యపరవాచ్యమై భాసించినది.

అప్పుడైనను కృష్ణుఁడు రమ్మనఁడు సరికదా తనయసమ్మతినే వెలిబుచ్చుచు యుద్ధమున

సీ. "సమద పుష్పంధయ ఝుంకారములు గావు
భీషణకుంభీంద్ర బృంహితములు------
----- కన్య నీవేడ రణరంగ గమనమేడ
వత్తు వేగము నిలువుము వలదు వలదు"

భాగ. దశ. ఉత్త. ప. ౧౫౩

అని వారించును. ఆదిగ జారు మాటలకు సత్యభామ యుప్పొంగు తన యుత్సాహమును జారనీలేదు. దైత్యసమూహముతోడి యుద్ధమనిగదా! నన్నీతఁడు భయపెట్టు నదనుకొని, మఱికొంతనేర్పుతో "దానవులైన నేమి మఱి దైత్యసమూహములైననేమి నీమానిత బాహు దుర్గముల మాటున నుండఁగ నేమి శంక" యని వెంటనే "నీతో నరుదెంతునంచు కరతోయముల్ ముకుళించి మ్రొక్కిన" దట, యమ్మానిని, అట్లు మ్రొక్కి నిలచిన సత్యభామలో భక్తి భావము పూర్తిగ తొణికిసలాడినది. శృంగారమునకుఁ జలింపకున్న అరసికత్వమే ద్యోతితమగును, గాని, భక్తి కరుణలకుఁ గరుగకున్న మానవత్వమునకే కాదు, దైవత్వమునకును లోపమే, ఆ కీలక మెఱిఁగిన వాఁడు పోతన. అందుచే "ఇట్లు మ్రొక్కిన సత్యభామను గరకమలంబులఁ గ్రుచ్చి యెత్తి తోడ్కొని గరుడారూఢుఁడై హరి, గగన మార్గంబునఁ జని" నాఁడని చెప్పి యాసన్నివేశమును రసవత్తరము గావించినాఁడు.

ఈ సందర్భమున నెఱ్ఱాప్రగడ, సోమనల పోకడలే వేఱు. వారికృతులలో యుద్ధాత్పూర్వము సత్యభామకు శ్రీకృష్ణునితో వాగ్వాదమే లేదు. శ్రీకృష్ణుఁడామె రణ కౌశలమును బాగుగా నెఱిఁగిన వాఁడు. తనకు యుద్ధమునఁ జేదోడుగ నుండుటకే సత్యభామను వెంటనిడికొని పోయినట్లు దోఁచును. హరివంశమున నింద్రుఁడు నరకాసురుని దుర్నయములు కృష్ణునితోఁ జెప్పి తద్వధకుఁ బ్రేరేపింప కృష్ణుఁడు "గద్దియ డిగ్గి యదువృద్ధుల వీడుకొని యాయతంబైన చక్ర శార్ఙ్గాది సాధనములు గైకొని సత్యభామను రావించి తత్సహితుండై గరుడ స్కంధారోహణంబు సేసె" నని చెప్పఁబడినది. ఉత్తర హరివంశమున" ఇంద్రుఁడుబ్బ యదునాయకుఁడప్పుడు|సత్యభామతో నావిహగేంద్రునెక్కి వివిధాయుధుఁడై వియదంతరంబుపై కెగసి" నాఁడని కలదు. వారిరువురు సామాన్యముగాఁ జెప్పిన యీ సన్నివేశమును పోతన పై రీతిని మనోహరముగ వర్ణించి సత్యభామకొక క్రొత్త స్వరూపము నిచ్చినాఁడు.

సత్యభామ నరకాసురునితోఁ జేయు యుద్ధ వ్యాసంగ వర్ణనా సందర్భమునందు నెఱ్ఱన సోమనల ప్రభావము పోతనపై కొంత ప్రసరించినది. ఎఱ్ఱనార్యుఁడు :

శా. "విల్లుంగేతువు ద్రుంచి రథ్యములనుర్విංగూల్చిసూతున్ వెసన్.

---

ర్విల్లున్నుగ్గగ జేసె నాక్షణమదేవీరత్నము గ్రోద్ధతిన్"

హరి. ఉత్తరభా. ४ ఆ ౧౬౬ ప

క. "మూఁడవ విల్లెత్తిననది

---

వేఁడిమితోవైచె వృష్ణి విభుసతి దెసకున్"

హరి. ఉత్తరభా. ४ ఆ ౧౬౭ ప

వ. "దాని నడుమ తిల ప్రమాణ శకలంబులు గావించి సత్యభామ భీమాటోపపరిదీపితయై మఱియుం బ్రతి వీరుచేఁ బర్యాయ ప్రయుక్తంబులగు శక్తి పరిఘంబులు పొడిసేసి భాసిత ముఖంబుల నతని వెఱచఱవ నేసినం జూచి ఖేచరులు ప్రశంసించి రట్టి సంరంభంబునకుఁ బ్రీతుఁడై పీతాంబరుఁడు" అని సంగ్రహముగఁ జెప్పిన విషయమును నాచన సోమనాథుఁడు చమత్కరించి పదునైదు పద్యముల వఱకు పెంచినాఁడు. అందు.

ఉ. "ఇచ్చినఁ బొంగి యచ్చెలువ యింపునుదెంపును లోనమానమున్

---

మచ్చరమున్ బెనంగ మురమర్దను పైనరకాసురేంద్రుపై"

ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౫౬

మ. "గనయంబున్ గొనయంబు వెన్నడుముతోఁ గర్ణావతంసంబుతో"

ఉత్తర॥ హరి ౧. ఆ. ౧౫౭ ప.

క. "అరవింద నయన శరముల"

ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౫౮

చ. "కమలముఖీకటాక్ష కటకాముఖపాణి నఖోపకారి"

ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౫౯

శా. "సత్రాజిత్తనయాకరాంతర ధనుర్జ్యారావమైరావతీ"

ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౬౦

సీ. "తంత్రీవినోదంబు తడవు సైపని వ్రేళ్ల
గొనయంబు తెగలపైఁ గోరుకొనుట" ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౬౧

మ. "అరిఁజూచున్ హరిఁ జూచుఁజూఁచుకములందందమందారకే"
ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౬౨

ఉ. "ఊఁచిన కట్టువంపనిపయోరుహలోచన మింటమంటలం
బూఁచిన బాణజాలమునఁబూర్వసపర్వపురాణ గర్వమున్"
ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౬౩

ఉ. "అక్కమలాయతాక్షినరకాసురుపై సరివేసె బాణమున్"
ఉత్తర॥ హరి ఆ. ౧. ప. ౧౬౪

మొదలగునవి ముఖ్యములు. ఆ భాగమున పోతనామాత్యుఁడు పయి రెండు గ్రంధములనుండి కొన్ని భావములను గ్రహించుచు స్వకీయ ప్రతిభతో మఱికొన్ని వర్ణనములను గావించి సత్యభామ యుద్ధము నొక రస వత్ఘండము గావించినాఁడు. అందు :

మ. "పరుఁ జూచున్ వరుఁజూచునొంపనలరింపన్" భాగ. ౧౦ ఉ.౧౭౮

సీ. "బొమ్మపెండ్లిండ్లకుఁ బోనొల్లనను బాల
రణరంగమునకెట్లు రాఁదలంచె" ,, ,, ౧౮౦

సీ. "వీణెఁ జక్కఁగఁ బట్టదెరవెఱుంగని కొమ్మ
బాణాసనంబెట్లు పట్టనేర్చె" ,, ,, ౧౮౧

అను పద్యములలో నాచన సోముని సొంపును బుణికి పుచ్చుకొనినాఁడు. అట్లే,

శా. "విల్లుంగేతువుఁ ద్రెంచి రథ్యములనుర్విం గూల్చి సూతుంవెసం"
హరివం. ఉత్తర.భా.ప. ౧౬౬

శా. "ఆవిల్లంది బలంబునొంది తదగణ్యానంత తేజోవి శే"
భాగ. ౧౦స్కం. ఉత్తర.భా.ప. ౧౭౫

అను దానిలో ప్రదర్శించినట్లు స్పష్టము. ఇఁక మిగిలినవన్నియు నాతఁడా సన్నివేశమున కనుగుణముగ తీర్చి దిద్దుకొనినవే. అందు ;

సీ. "సౌవర్ణకంకణ ఝణఝణ నినదంబు
శింజినీరవముతోఁజెలిమి సేయ" భాగ. ౧౦ ఉ. ప. ౧౭౭

సీ. "రాకేందుబింబమై రవిబింబమైయొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు" భాగ. ౧౦ ఉ. ప. ౧౮౩

శా. "జ్యావల్లీధ్వనిగర్జనంబుగసురల్ సారంగ యూథంబుగా"

భాగ. ౧౦. ఉ. ప. ౧౮౨

మొదలైన పద్యములు ముఖ్యములు. వీనిలోఁ గొంత యెఱ్ఱనార్యుని భావగాంభీర్యము, నాచసోముని యుద్ధ వర్ణనానైపుణ్యము నటనటఁ గాననగును.

భాగవతమున సత్యభామ నరకాసురునితోఁ బ్రత్యక్షముగా యుద్ధము సేయు వఱకు శ్రీకృష్ణుఁడామె యుద్ధనైపుణ్యము నెఱుఁగకుండుటచే నామె వీరావేశముతో శత్రువులను జీల్చి చెండాడునపుడాతనికిఁ గల్గిన యాశ్చర్యము ద్విగుణీకృతవమైనది. అందువలననే "వీణెఁ జక్కఁగబట్టి వెరవెఱుంగని కొమ్మ, బాణాసనంబెట్లు పట్టనేర్చె" – "బొమ్మ పెండ్లిండ్లకుఁ బోనొల్లననుబాల రణరంగమున కెట్లు రాఁదలంచె" మొదలగు పద్యములు భాగవతమునందు తమ విలువను పెంచి కొన్నవి.

ఈ కథయందు సత్యభామ నేర్పును, కృష్ణుఁడు మెచ్చుకొనుట యనునది యొక మచ్చుతునుక.

ఎఱ్ఱనార్యుని కృతిలో సత్యభామ రణ క్రీడాకౌశలమునకుఁ బ్రీతుఁడైన పీతాంబరుఁడు "సమరస్వేదజలోజ్జ్వలంబైన యుగ్మలి ఫాలభాగమును తుడిచి" ఆభరణముచే నామె కంఠము నలంకరించి సాదరముగఁ జూచినాడు. ఆతఁడు బహుమానముగ నిచ్చిన ఆయాభరణము సామాన్యమైనది కాదని యెఱ్ఱన దాని విలువ నిట్లు చెప్పినాఁడు.

సీ. "ఎయ్యది గాంక్షించి యెన్నడుఁగానలే
దయ్య రుక్మిణి యంతయదియుఁదొల్లి"

హరివం. ఉత్తరభా. ౪. ఆ. ౧౭౧. ప

అనుదాని భావమును నాచన సోమనాథుఁడు.

ఉ. "ఏఁచనుపేంద్రునింబతక మిమ్మని రుక్మిణి మున్నుదేవుఁడుం
నోచిన వారి సొమ్ముల వినోమనివారికి వచ్చునే ధరన్"

ఉత్తరహరి. ఆ. ౧. ప. ౧౬౮

అని తాక్యముగ వర్ణించినాఁడు. పోతన పై రెండు వర్ణనలను చూడకపోలేదు. ఆ సమయమున నాభరణముతోఁ గృష్ణుని ప్రేమను గొలుచుట ప్రధానము కాదని తలఁచియు, సత్యభామకు నెఱ్ఱన సోమనలిచ్చిన యాభరణమును తానీయకుండుట భావ్యముకాదని కాఁబోలు తానును ఆభరణప్రసక్తి నించుక గావించినాఁడు. కాని యాభరణము నిచ్చుచు నొక్కయాభరణమునే చెప్పనేల యని కృష్ణునిచే "కొమ్మా! మెచ్చితి నిచ్చెదఁ గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్" అని సామాన్యముగఁ బలికించి" సమ్మాన రూపంబులును, మోహన దీపంబులును, దూరీకృత చిత్తవిక్షేపంబులు నైన సల్లాపంబులంగళావతిని దద్దయుఁ బెద్దరికంబు సేసి "నాఁడని ప్రత్యేకముగ నొక్కిచెప్పినాఁడు. అందు సత్యభామ పట్లకళావతి" యను శబ్దము వేయుట సాభిప్రాయము. ఆమె పట్టమహిషులందఱిలోఁ గళలందు నేర్పరి. ఆమె నేర్పరితనము లలితకళలతో నాఁగిపోక, రణకళాకౌశలమును గూడ నలవరచు కొనినది. వీణనెంత చక్కఁగఁ బట్టఁగలిగినదో, బాణాసనమునంత యవలీలగా సంధించినది.

ఎఱ్ఱన యాభరణపు విలువను జెప్పుటలో సత్యభామయందలి కృష్ణుని యనురాగమును ధ్వనింపఁ జేసినాఁడు. నాచన సోమన యాభరణమిచ్చి రుక్మిణితో సత్యభామను తులఁదూచి రుక్మిణినించుక క్రిందు పఱచినాఁడు.

పోతనార్యుఁడొక యాభరణమని నిర్దిష్టముగఁ జెప్పుటకాని, రుక్మిణితో తరతమ పరీక్షకుఁ గడంగుటకాని చేయలేదు, ఎవరి విలువలు వారికుండనే యున్నవి. కాన, రుక్మిణి ప్రసక్తిలేకయే సత్యభామ పాత్రనున్నయము గావించినాఁడు. భాగవతమున కృష్ణుఁడు కోరిన యాభరణముల నిచ్చెదఁ గోరు కొమ్మని చెప్పుచు దూరీకృత చిత్త విక్షేపంబులగు సల్లాపంబులను దేల్చినాడని చెప్పుటలో నాభరణ ప్రసక్తి గుణీభూతమయి యనురాగము ప్రధానమైనది.

ఇట్లు సత్యభామ పాత్రకు పోతనార్యుఁడు స్వతంత్రించి ప్రత్యేకమగు సొంపును జేకూర్చినాఁడు.

ప్రహ్లాద చరిత్ర :–

ఇది నృసింహపురాణ, భాగవతములందు మాత్రమే కలదు.

నృసింహపురాణము నందయిదాశ్వాసములవఱకు నున్నకథ. భాగవతమునఁ జాలవఱకు సంగ్రహముగా కాననగును. ఎఱ్ఱనార్యుఁడు తనకృతికి నృసింహపురాణమని పేరిడినను, అది పురాణమన పేరుతోఁ బ్రబంధత్వమునే సంతరించుకొన్నది. కవి యట్లు ప్రబంధోచితముగాఁ దానీయఁదలఁచిన రూపమునకు సరితూఁగు వర్ణనలెన్నియో యేర్చి కూర్చుకొనినాఁడు.

హరిపార్శ్వచరులైన పురుషుల శాపవృత్తాంతము, హిరణ్యకశిపుని విహారము, సీమంత పుత్త్రోత్సవాది మహోత్సవములు మొదలగునవి భాగవతమునందు కంటె నృసింహపురాణమున నధికము.

అవికాక పురాణమునఁ గొన్ని ప్రత్యేక విషయములు కాననగును. ఇందు హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని హింసించు వర్ణన సుదీర్ఘమగుటయే గాక యక్కడక్కడ పునరుక్తము కూడ నైనది. ప్రహ్లాదుని తత్త్వోపన్యాసములు భాగవతమునందుఁ గంటె నిందు ప్రౌఢములు ప్రహ్లాదుని హింసించు కలాపమునందు దండధరుని బిలిపించి హిరణ్యకశిపుఁడాతనిని హతమొనర్చుమనును. అతఁడు వల్లెయని దానికొడంబడ, విష్ణువు ప్రహ్లాదుని రక్షింప విష్వక్సేనుని బంపును. ఇవి భాగవతమున లేవు.

ఇట్టి కథాగతితో నెఱ్ఱన లీలావతీ హిరణ్యకశిపుల పాత్రలందుఁ జూపిన మెలకువలు గమనింప దగ్గవి.

ఎఱ్ఱనార్యుని నృసింహపురాణమున హిరణ్యకశిపుఁడు కేవలము మూర్ఖ చిత్తుఁడు కాఁడు. తపోనిష్ఠాగరిష్ఠుఁడు. మాతృభక్తి పరాయణుఁడు. అసామాన్య పరాక్రమోపేతుఁడు. అంతియేకాక యాతఁడు రాజసగుణ ప్రధానుఁడైన భోగి. విరించి యందెంత భక్తి కలవాఁడో హరియందంత ద్వేషము గలవాఁడు. భాగవతమున హిరణ్యకశిపునియందీ లక్షణములన్నియు సూచింపఁబడినను భోగలాలసత్వము మాత్రము స్ఫుటముగా గోచరింపదు.

హరివంశమున హిరణ్యకశిపుఁడు సంతతైశ్వర్యముల వర్ధిల్లుచు నొకనాఁడు "అమరుల తల్లి కంటెను మదంబవరిష్ఠ త్రిలోక రాజ్యభోగములను నాకెయోగ్యములు గాని, నిలింపులకెట్లు కల్గు" నని చింతించి తపమున కుపక్రమించినాఁడు. తత్సిద్ధికి తనతల్లి శక్తిని నమ్మికగా గ్రహించుటలో యాతని మాతృభక్తి ద్యోతితము. "దిట్టతనము పేర్మి దేహాభిమానంబు విడిచి నిష్ఠయేడు గడయుగాఁగ" పంచభూతములు ప్రకంపించునట్లు తపము గావించినాఁడు. ఆ ధాటికి తల్లడిల్లిన సురేశ్వరుఁడు తనకడపటి యాయుధమగు నప్సరోగణము నీతనిపైఁ బ్రయోగించినాఁడు. అవ్విలాసినీ గణము మధుపవ్రజ కోకిల కీర మీనకేతనాదులతో నాతని చెంత మదన వికారకారణంబులగు విన్యాసంబులను ప్రదర్శించినది. అవ్వానికిని సుమంత యొనకదలక సమాధినిష్ఠను సుస్థిరుఁడై కుదురుకొనియున్న హిరణ్యకశిపుఁడు, వారికి.

మ. "పురుషాకారముతోడనున్నసిరియో పుంస్త్వంబులేదోయటే
తరువోపుత్తడి రూపొచిత్తమును చైతన్యంబు శూన్యంబొకో
విరసత్వంబుల ప్రోవొనిశ్చలకళా విజ్ఞానసర్వస్వమో
యరుదీచందమనంగ ................................."

ధృతియందు అత్యంతమందస్థితితో భాసించినాఁడఁట. అచ్చరకన్నెలు తమచారుహాసంబులన్నియు రిత్తవోవ సిగ్గుపోయి వెనుకకు మరలిరి. ఇట్టిది యాతనినిష్ఠ.

అయ్యసురేశ్వరుండెంతభక్తుఁడో యంత భోగి. తఱుచు వల్లభాజన సహితంబుగా నిజమందిరాభ్యంతరకేళి కాంతారములందు సాంద్రానందహృదయుఁడై లీలావతీ ద్వితీయుఁడై విహారములు సల్పువాఁడు.

అంతర్వత్నియు దినదిన ప్రవర్ధమాన గర్భలావణ్యలలితయు నగు లీలావతిని జూచి హర్షజలపూర్ణన యనుఁడై పరమానందముతో భార్గవనిరూపిత ప్రకారము పుంసవనసీమంతాది సంస్కారంబులతిగారవమున నిర్వర్తించి పుత్రోత్సవము కూడ నంతకు తక్కువకాని వైభవముతో జరిపించినాఁడు.

ఇదంతయు నాతని రసికతకును భోగలాలసతకును దార్కాణము.

లీలావతీ పాత్రయు నిట్లే పోషింపఁ బడినది. పరమ భాగవతోత్తముని గన్నతల్లి లీలావతీ స్వరూపమును బాఠకులకుఁ గొంత చూపఁదలఁచి యెఱ్ఱనార్యుఁడు ప్రధానేతి వృత్తమునకుఁగొన్ని మార్పులను జేసి వర్ణించినాఁడు. దర్పణపుఁ దునుకల వంటి యాకూర్పులలో నామె స్వరూపస్వభావములు పాఠకులకుఁ బ్రత్యక్షమగుచున్నవి.

ఒకనాఁడు లీలావతి యద్దమ రేయి దాక నీలోద్యానమున విహరించి యలసినకతంబున సుఖనిద్రఁజెంది యొకవింతస్వప్నము కనినది. వెంటనే మేలుకొని, తత్ప్రభావంబెట్టిదో తెలియరాక కుతుకాద్భుత సంచలితాంతరంగయై యాకులపడినది. అట్లుయ్యు కంటికి రెప్పవలెఁ దన్నతి గారవమునఁ జూచు భర్త, చెంతునున్నను నిజస్వప్నవృత్తాంతమాతనికిఁ జెప్పవెఱచినదఁట. ఈ భావ ప్రకటనములో లీలావతి సౌజన్యము హిరణ్యకశిపుని దుడుకుతనమును వ్యక్తములు. లీలావతి పరమసాధ్వి, నిత్యప్రియోపలాలిత, ఐనను తన సౌఖ్యముతోఁ దృప్తిపడి యూరకొనక నానాఁటికిఁ ద్రిలోకకంటకమగు చున్న తన పతి పరాక్రమాదులను నార్యజనులవలన విని చింతనొందెడిది. కావుననే తన స్వప్నవృత్తాంతమాతని హృదయమునకేమైన తీవ్రతఁ గలిగించునేమోయని భీతిఁజెంది భర్తృహితమును లోకకల్యాణమును గోరినదై స్త్రీజనోచితమగు తాల్మితోఁ దనలోఁ దానే వ్యాకులపడినది.

తరువాత ప్రభాతమగుటయు "అసురేశ్వరుఁడంతః పురము వీడి యాస్థానభవనంబు నలంకరించిన శుక్రాచార్యుఁడాతని నాశీర్వదించి తదను మతంబున లీలావతిని దీవింప నభ్యంతరమందిరమునకు వచ్చును. ఇట్లు కవీశ్వరులు గురుజనులును అంతః పురములలో

దేవేరులకడ చనవులు గ్రహించుట రాచమర్యాద ఎఱ్ఱన కావ్యములో హిరణ్యకశిపుఁడు కూడ నామర్యాదను పాటించినాఁడు. ఇట్టి సందర్భములందే కవుల సంస్కారములు కావ్యములలో ప్రతిబింబించును.

వంశాచారము ప్రకారము తన్ను దీవింపవచ్చు గురూత్తము నల్లంతనె గాంచి లీలావతి భక్తిభావముల్లమున పల్లవింప నమస్కరించి మహాత్మా! స్వప్నమున "ఘనచక్ర లాంఛనుఁడైన వారిజాక్షుఁడు గోచరించి నన్ను భజింపుమని ఫలమిచ్చి స్వహస్తములతో మదీయ కంఠహారమును గ్రహించి వెడలినాఁ" డని చెప్పి విన్ననై నిలచును. ఆచార్యుఁడామె ననునయించి భక్తాగ్రేసరుఁడైన బాలుఁడు నీ గర్భమున జన్మింప నున్నాఁడని సూచించుట, ఫలము నిచ్చుటలోఁ గల భావమనియు, నా బాలుఁడు నిమిత్తముగా రాక్షసేశ్వరుని దుర్నయ మడఁగునని సూచించుట కంఠహారమును గ్రహించుటయందలి భావమనియు, స్వప్న ఫలమును చెప్పివెడలినాఁడు. నాఁటినుండి లీలావతికి శాంతిలేదు. ప్రహ్లాదుఁడు జన్మించి శైశవ క్రీడలలోఁ జూపు హరిభక్తి ముద్రలకుఁ దాత్పర్యమెఱుఁగక రాక్షసరాజు మురియుచుండ, లీలావతి కొమరుని చందమునకు నానందించియు స్వప్నగతమగు కీడును దలఁచికొని వికలస్వాంతయగుచుండును.

తనభర్త రాక్షసకులేశ్వరుఁడు అసామాన్యబలపరాక్రమోపేతుఁడు. విరించి వరప్రసాద పర్ధితుఁడు మృతిలేనివరమును బడసినవాఁడు. ఇఁక పుత్త్రుఁడు ప్రహ్లాదుఁడు కారణజన్ముఁడు. సాక్షాద్విష్ణువు చేత ననుగ్రహింపఁబడినవాఁడు. భక్తకుల పారిజాతము. ఒకరికి విరించి యభయమీయ, నొకరికి హరి యండగ నిలిచినాఁడు. ఇందెవరివలన నెవరికి కీడు సంభవించినను లీలావతికి సహింపరానిదే. అంతభారముతో శిశువునాడిలో నిడికొనిన యామాతృమూర్తి హృదయమెంత వ్యాకులపడి యుండునో పాఠకులూహించుకొనఁగలరు. ఇట్టిది లీలావతి పాత్ర.

ఇట్లు ఎఱ్ఱనార్యుఁడు లీలావతీహిరణ్య కశిపుల పాత్ర చిత్రణములందుఁ గొన్నిమెలఁకువలను జూపి మెఱుఁగులు దిద్దినమాట వాస్తవమే, కాని యంత మాత్రముచే నెఱ్ఱనార్యుని పాత్ర చిత్రణాది ప్రజ్ఞా విశేషములు పోతనకు లేవన లేము. పోతన రచించిన ప్రహ్లాద చరిత్ర శతాధిక విషయ సంభరితమగు భాగవత మహా గ్రంథమందొక యమృత బిందువు. ఆ బిందువును అమృత భాండము చేయఁదలఁచిన యెఱ్ఱన, ఆ యేకైక ఘట్టమునకు వన్నెలు చిన్నెలు చేర్చి వ్రాసిన కావ్యము నృసింహ పురాణము.

పోతనార్యుఁడు ప్రహ్లాద చరిత్రలోఁ బ్రదర్శింపఁదలఁచినది ప్రహ్లాదుని యచంచల

భక్తి. ఆ ఘట్టమందలి ప్రధాన రసము భక్తి. అందుచేఁ బ్రధానమగు నా యంశయమునకు భంగకారులగు వర్ణనకాని భక్తికి వ్యతిరేకమైన భావ పోషణము కాని యాతఁడు చేయఁదలఁచు కొనలేదు. చేయనూ లేదు. నృసింహావిర్భావ ఘట్టమునందలి భీభత్సాద్భుతరములను గూడ భక్తిరసమున కంగ ప్రాయముగ నుండునట్లు చూచుకొనినాఁడు.

ఎఱ్ఱనార్యుని కావ్యతత్త్వమట్టిదికాదు. అందు భక్తితో పాటు శృంగారమును బోషింపఁబడినది. ఒక్కొక్కచోట శృంగారము యొక్క యుద్ధృతము చూడ నయ్యది భక్తి రసముతో ప్రతిభటత్వమునకు వచ్చెనో యనునట్లుండును. అంతియేకాదు. నృసింహపురాణమాంధ్ర ప్రబంధ ధోరణిలో సాగుటచే వర్ణనలు సుదీర్ఘములు కాక తప్పినదికాదు. అందు లీలావతి స్వప్నము, ఆచార్యుని వివరణము, హిరణ్యకశిపుని విహారము మొదలగు వర్ణన లెంత రసవంతములైనవో, విష్వక్సేనునిరాక, హిరణ్య కశిపుఁడు అంతఃపురమునకుఁ బాఱిపోవుట మొదలగునవి యంతసరసములు.

పోతనార్యుని ప్రహ్లాదచరిత్ర పుట్టురత్నము. అతని నిసర్గమనోహరశయ్యా సౌభాగ్యమనెడి కేదారములందు పొంగి ప్రవహించిన భక్తికినితర గ్రంధములన్నియుఁ దీసికట్టే యనిపించును. అశేషాంధ్రావళి రసనాగ్రములందు నాట్యమాడు "అచ్చపుఁ జీకటింబడి ":- "మందారమకరంద"--"అంధేం దూదయముల్" -- "కమలాక్షునర్చించు కరములు కరములు" -- "సంసారజీమూత సంఘంబు విచ్చునే" మొదలగు పద్యలే దానికి సాక్షీ భూతములు. వానిని మననము సేయునపుడు, తపశ్శక్తిచే మృగధరమండలంబు నిర్గమించి చరించు మహాభక్తుని హృదయమునకు సిద్ధించిన నైర్మల్యము నందొక యంశ మనకును, సిద్ధించి నట్లుండును.

ఎఱ్ఱన నృసింహ పురాణము భక్తి శృంగార సమ్మిశ్రితమైన యానంద ప్రవాహమైనచో, పోతన ప్రహ్లాద చరిత్రము నీరములేని క్షీరము వలె పొంగి పొరలిన భక్తి రసాయనము.

ఎఱ్ఱన తనకావ్యమునందు ప్రపంచించి వర్ణించిన భావములన్నిటికిని (ఒక్క శృంగారమునకుఁ దప్ప) భాగవతపురాణము నందు సంగ్రహమగు సూచనలు కలవు. హరివంశకారుఁడు శృంగారస్పర్శనిచ్చి యప్సరోగణముల సమక్షమున వర్ణించిన హిరణ్య కశిపుని నిష్ఠ పోతనార్యుఁడు శృంగార భావచ్ఛాయలేకయే యీ దిగువ రీతిని వర్ణించినాఁడు.

హిరణ్య కశిపుని తపమునకు "అదరెంగుంభిని సాద్రియై కలఁగె నేడంభోనిధుల్ తారకల్ సెదరె" నని దేవతలందఱు బ్రహ్మతోఁ జెప్పిన నాతఁడు హిరణ్య కశిపునకుఁ బ్రత్యక్షమై యాతని నుద్దేశించి.

శా. "దంతవ్రాతములుంబిపీలికలు మేధః క్రవ్యరక్తంబులన్

--------------------------------------

భ్రంశంబింతయు లేని నీకు నిలువంబ్రాణంబులెట్లుండెనో"

భాగ. ౭ స్కం. ౮౨ ప.

అని బ్రహ్మతానై పల్కెను. ఇందునట్లు పిపీలికలచే శల్యావశిష్టుఁడైన రాక్షసకులేశ్వరుని స్వరూపము పాఠకునకుఁ బ్రత్యక్షమై భీతియు నాశ్చర్యమును గలుగుచుండ నచ్చరకకన్యలను ప్రవేశ పెట్టవలసిన యవసరమే కానరాదు.

ఎఱ్ఱనార్యుఁడు సుదీర్ఘముగ వర్ణించిన హిరణ్యకశిపుని లీలోద్యాన విహారాదుల ఛాయ పోతన యీ దిగువరీతిని సంగ్రహముగఁ జెప్పినాఁడు.

శా. "లీలోద్యానలతా నివాసములలో లీలావతీయుక్తుఁడై

------------------------------------

------------------------------------

వాలాయంబుఁ గరంగఁ జేయుదుముదేవద్వేషినుర్వీశ్వరా!"

భాగ. ౭ స్కం. ౧౦౨ ప.

అని నారదుఁడే చెప్పికొనినాఁడు.

కథా వస్తువొకటియే యైనను గ్రంథతత్త్వమును బట్టి పాత్రచిత్రణాదులు చాలవఱకు మారుచుండును. పోతనామాత్యుఁడు ఎఱ్ఱనవలెఁ బ్రహ్లాదచరిత్రమును బ్రత్యేకకావ్యముగ సంతరించినచో, లీలావతీ హిరణ్యకశిపుల పాత్రలను ఎఱ్ఱన తెచ్చిన స్థాయికి చాలవఱకు తేగలఁడేమోకాని, ప్రహ్లాదుని పాత్రను మాత్రము పోతనవలె నాంధ్రకవులెవ్వరును వర్ణింపలేరనిపించును.

**ఉషాపరిణయము :–**

ఇది హరివంశ – ఉత్తరహరివంశ, భాగవతముల మూఁడింటను గలదు. ఈ గాథస్థూలముగ రెండు భాగములు. బాణాసురుఁడీశ్వర ప్రసాదంబు నొందినది మొదలు ఉషానిరుద్ధులకు సమాగమము సిద్ధించు వఱకుఁ గల భాగము పూర్వార్థము. తరువాతిది యుత్తరార్థము. ఇందుత్తరార్థము కంటెఁ బూర్వార్థము ప్రధానమైనది, కాన దానితో సంబంధించినంతవఱకు నీ గ్రంథత్రయమును బరామర్శింతము.

హరివంశ – ఉత్తరహరివంశములలో నుషా కన్య పార్వతీ పరమేశ్వరుల రతి క్రీడలు చూచి మదన వికారమునందినట్లును, తదింగితమెఱిఁగిన పార్వతి యుషాకన్యనుద్దేశించి, కొలఁది కాలములో నామెకు స్వప్నమున నొకపురుషవరేణ్యుఁడు గోచరించుననియు, నాతఁడే యామెను వివాహము చేసికొనుననియుఁ జెప్పినట్లు కలదు. బహుశః పార్వతి యట్లు చెప్పుట యనిరుద్ధుఁడుషాకాంతకు దైవదత్తమగు భర్తయని తెలియఁజేయుటకై యుండును. అది భాగవతమున లేదు.

స్వప్నానంతరము హరివంశమున అనిరుద్ధునిఁ దెచ్చుటకేఁగిన చిత్ర లేఖ, నారదునితో సంప్రదించి యనిరుద్ధునితో నుషాకన్య స్వప్న వృత్తాంతమంతయుఁ జెప్పియొప్పించి యాతనిఁ దోడితెచ్చును. భాగవతకారుఁడట్లు ముందుగ ననిరుద్ధునకు విషయము నెఱిఁగించియుండలేదు. అట్లే యనిరుద్ధుఁడు నాగపాశబద్ధుఁడై కాళికాదేవిని స్తుతించుటయు, నుషాకన్య సూరార్చుటయుఁ గూడ హరివంశములందధికముగఁ జెప్పఁ బడినవి.

ఈ యుషాపరిణయ కథాకథన నిర్మాణమునందు హరివంశ – ఉత్తరహరివంశ కర్త లిరువురి రచన మొకతీరుగను, భాగవతకారుని దొక పద్ధతిగను గోచరించును. భావగాంభీర్యమున నెట్టిదయుఁ జమత్కార జనకత్వమున సోమనయు నధికులే కావచ్చును, కాని యీ ప్రత్యేక కథా నిర్మాణమున భాగవతకారుఁడు పాత్రోన్మీలనమునందుఁ జూపిన నేర్పు హరివంశ కారుల ధిగమించినదనుటకు నందియము లేదు.

హరివంశకారుల ప్రకారము ఉషా సుందరికిఁ బార్వతీ పరమేశ్వరుల క్రీడలు చూచుట వలన మదనచాంచల్యము కలిగినది. అట్లు చెప్పుట భాగవత కారుని దృష్టిలో నంతయుత్తమముగఁ దోఁచియుండలేదు. అది కారణముగాఁ బార్వతి యుషనను గ్రహింప నవసరమును లేదు. ఆకారణము కల్పించి చెప్పకపోయినను ఉషానిరుద్ధుల సమాగమము దైవసంకల్పము వలననే జరిగినట్లు స్పష్టమగుచున్నది. హిరణ్య కశిపుని దౌర్జన్యమడఁచుటకు ప్రహ్లాదుని జననమెట్టిదో ఇంచుమించుగ బాణాసురగర్వపరిహారమునకు నుషా సుందరి యావిర్భావమును, అట్టిదే. భాగవతమున బాణాసురుఁడు తనకు సరియగు ప్రతివీరునితో యుద్ధము ప్రసాదింపుమని శివుని వేడును. అతఁడు కొలఁది కాలములోఁ దనయంతవానితో బాణునకనికల్గునని అచ్యుతునుద్దేశించి చెప్పును. వెంటనే యుషాకన్యకు స్వప్నమున ననిరుద్ధుఁడు గోచరించును. ఇట్లు బాణుఁడు వరమువేడిన వెంటనే వ్యవధిలేకుండ ఉషకు స్వప్నము కల్పించి చెప్పుటలోని పరమార్థమది దైవసంకల్పితమని తెల్పుట కొఱకే యనవచ్చును. అందుచే భాగవత కారుఁడు, పార్వతీ పరమేశ్వరుల రతి క్రీడలను విడిచినాఁడు. బాణునకు శివుఁడు ప్రతివీరుని గూర్చియభయ మిచ్చిన వెంటనే ఉషాకన్యను గూర్చియిట్లు చెప్పియున్నాఁడు.

సీ. ఆదానవేశ్వరునను(గుకుమారి యు
షా కన్య విమల సౌజన్య ధన్య
--------------------------
కలితుననిరుద్ధు నర్మిలిఁ గవిసినటు ల"
కలఁగనినదఁట భాగ. ౧౦. ఉ. ౩౨౭ ప.

కలవచ్చినట్లు చెప్పి యనంతర కథను విలంబనము లేకుండ నడిపించినాఁడు.

హరివంశములోఁబార్వతి యుషాకన్యకు "వైశాఖ శుద్ధ ద్వాదశి నాటి రాత్రి హర్మ్యతలంబున సుప్తయైన నిన్ను ననుభావ్యరస సంస్కారంబగు భావసంభవ వికారంబు నొందించినవాఁడు వల్లభుండగు" నని చెప్పును.

ఉత్తర హరివంశమున

తే. కడఁగి వైశాఖ శుక్ల పక్షంబునందు, ద్వాదశిదినాంతవేళ సౌధంబుమీఁద
మదనకేళికిఁగలలోనఁ గదియునిన్ను, నెవ్వఁడాతండుమగడునీకిందు
వదన' ఉత్తరహరి. ఆ. ౫. ప. ౭౮

అని కలదు. అందుచే హరివంశ ఉత్తరహరివంశములలో నుషకు స్వప్నానంతరము ఆత్రమునందవలసిన యవసరము లేదు. అనావశ్యకముగునీ యాతురత నెఱ్జనయు, సోమనయు వర్ణించుట చింత్యము.

భాగవతమున బాణాసురుఁడు శివుని యానతి ప్రకారము ప్రతి వీరునకై వేచియుండ, నిటనుషకు స్వప్నము కల్గును. ఆ స్వప్న మెందులకుఁ గల్గినదో, స్వప్నగత పురుషవరేణ్యుఁడెవ్వఁడో, యాతని కులగోత్రములెవ్వియో, మఱల నాతని దర్శనము స్వప్నమందైనను గల్గునో కల్గదో యను భావపరంపరలచే నామె కలవర పడినది. విషయ మెఱుంగని కన్యకు నాకలవరపాటు ఎంతయో సహజముగ నున్నది. స్వప్నమును దలఁచికొని ....................

తే. "అతివమనమున సిగ్గు మోహంబు భయముఁ
----------------------
కోరితలచీర వాటింపనేరదయ్యె" భాగ. ౧౦ ఉ. ౩౩౧ ప.

ఇట్లు విరహవేదనాదో దూయమానమానసయై యుషాకన్యః

చ. "పొరిఁబొరిఁ బుచ్చునూర్పుఁగమిఁ బుక్కిటనుంచికుచాగ్రసీమపైఁ
బెరసిన సన్నలేఁజెమట బిందువులొయ్యన నార్చుఁ గన్నులం
దొరిఁగెఁడు బాష్ప పూరములు దొంగలి ఱెప్పలనాని" .....

గూఢరాగయై మోము వాల్చును. ఆమె విచారమునకు విన్నఁ దనమునకుఁ గతంబెఱుఁగక చెలులందఱు నామెకడఁ జేరి ప్రశ్నింప, నుషకంతరంగముగ వలపును, బాహ్యముగ సిగ్గును, మిక్కుటమై కలవరపెట్టినవి. "అంతకంతకు సంతాప మతిశయించి, వలుద చన్నులు కన్నీటి వరదఁ దడియ చెలుల దెసఁజూడ జాల లజ్జించి" మోము వాల్చినదఁట. ఆలంకారికముగఁ జూచినచో ముగ్ధాలక్షణమిట సంపూర్ణముగాఁ గాననగును.

హరివంశములలో నీ సన్నివేశముల కింత సొంపు వచ్చియుండలేదు. వానిలో నుషాకన్య కలఁగని మేలుకొని యంతయు నెఱిఁగియుఁ గళవళపాటు నందును. అంతియేకాదు కలలోని కాంతుని చేతలకుఁ జింతనొంది తన కన్యాత్వమారడి వోయినదని వగచును. ఆ సందర్భమున నెఱ్ఱన చెప్పిన పద్యమిది.

క. ఏనింకను గన్నియనని
మేనంబ్రాణములు దాల్చి మెయికొనియున్న
ట్లేనినిహముఁ బరమునుగల
వే నిక్కము కులట యెవ్వరింత కంటెన్" హరి.౭. ఆ. ౧౦౭ ప

అని కన్యచేత స్వప్నమును గూర్చి, కులటయను శబ్దము జుగుప్సాకరముగాఁ బలికించినాఁడు. ఉత్తరహరివంశమున - కలఁగని మేల్కొని - యుష

క. ఎలుఁగెత్తియేడ్చు దనకుం
దొలుసమరత నిక్కమైన దురపిల్లుఁగటా!
కులమిటు దూషితమగునే
చెలులు నగందనగుణంబుచే నని వగచున్" ఉత్త. హరి. ౫. ఆ. ౧౫. ప

ఈ భావప్రకటనలో నాచన సోమన యెఱ్ఱనకుఁదీసిపోలేదు. వృద్ధ కాంతవలె భాలికలు కలగని వగచుట జుగుప్సాకరముగ నున్నదని కాఁబోలు భాగవతకారుఁడాభావమును

బూర్తిగా త్యజించినాఁడు. అది కలగాన యుషాకాంత యట్లు వగవఁ బనిలేదనియు, నామె కన్యాత్వమునకు భంగముకాదనియు నాతని యభిప్రాయమై యుండును. అదిగాక యామె యట్లు జుగుప్సాకరముగా వృద్ధనారివలె వగచుట వలనఁ బ్రకృతార్థమునందు ఉషా కన్యవిరహవర్ణనము వలనఁ బ్రధానముగఁ బ్రతీయమానమగు శృంగారము గుణీభూతమగుచున్నది. అట్లగుట కావ్య శిల్పమునకు లోపమని కూడ భాగవత కారుఁడు పై యంశమును విడిచి యుండును.

చిత్రగతమగు నానాదేశాధీశ్వరులను, జిత్ర రేఖ వర్ణించి చెప్పుటలోఁ గూడ భాగవతకారునిదే పై చేయి. భాగవతమునందీ సన్నివేశము నాటకీయ పద్ధతిలో మనోహరముగ విపులీకరింపఁ బడినది. ఈ రసపట్టము నాచన యేలకో మిగుల సంగ్రహముగఁ జెప్పినాఁడు. ఎట్టిన కొంత విపులీకరింపక పోలేదు. కాని రాకుమారుల వర్ణనములో దేవదానవ సిద్ధ కిన్నరకింపురుషాదినాయకాదులను జెప్పి ముఖ్యముగాఁ జెప్పవలసిన మానవశ్రేష్ఠులను జెప్పునపుడొక్క సారి విషయము కుదించినాఁడు.

భాగవతమున చిత్రరేఖ కిన్నర కింపురుషాదుల నొక్క సీస పద్యమున సంగ్రహముగఁ జెప్పి, ఉషాకన్య చిత్తమున నిజమనోరథసిద్ధి కల్గిన జాడ కానక, "మధ్యమ క్ష్మాత లాధిపతులను" విపులముగాఁ జూపుచు నన్వయగోత్ర నామధేయంబులతో వారిని వివరించినది. ఆ సందర్భమునందుఁ జెప్పిన :

ఉ. సింధురవైరివిక్రముఁడు శీతమయూఖమరాళికాపయ
స్సింధుపటీర నిర్మల విశేషయశో విభవుండు"

౧౦. ౩౪౯ ప.

శా. సకలోర్వీతల నాథసన్నుతుఁడు శశ్వద్భూరి బహు"

౧౦. ౩౫౦

ఉ. సంగరరంగనిర్దళిత చండ విరోధివరూధినీశమా -------
తంగ ----------------------------
కాళింగుఁడు వీఁడె చూడు తరళీకృతచారుకురంగలోచనా!"

మొదలగు పద్యములను జదువునపుడు రాకుమారులు అహమహమికతో ముందునకు వచ్చి నిలచినట్లుండును.

ఇట్లు రాకుమారుల నందఱ వర్ణించి, యదువంశ సంభవులగు శూర సేన వసుదేవ శ్రీ కృష్ణాదులను చెప్పి చిత్రరేఖ.

చ. "స్ఫురదళి శింజినీరవ విభూషిత పుష్పధనుర్విముక్త భా----

--------------------------------

వరసుతు రాజకీర పరివారుని మారునిఁ జూడు కోమలీ."

౧౦. ౩౫౯ ప.

అని కోమలలికి మారుని జూపినది. ఉష కృష్ణనందనుని భావ ప్రౌఢిలో ననిరుద్ధుని ఛాయలఁ జూచి తడబడిచుండినదఁట. ఇంతలో చిత్రరేఖ తరువాత చూపవలసిన యనిరుద్ధుని చిత్రపట్టము నెడమచేతఁ బట్టియే యున్నది. వెంటనే యుషాకన్య యటు చూచి తటాలున యాగి ఇంచుక సంతాపముతో "ఇంతీ! మదీయ మానధనమెల్ల హరించిన ముచ్చు" ఈతఁడే యని చెప్పి యమ్మహా వీరుని కుల గోత్రబల పరాక్రమాదులను వినఁగోరినది. ఈ సందర్భమునందు భాగవతమున సిద్ధించిన జిగి హరి వంశములలోఁ గాన రాదు. పాత్ర సాక్షాత్కారమును శిల్ప చాతుర్యమును భాగవతము నుండి చూపఁ దలఁచినచో నీ ఘట్టమొక ప్రబల తార్కాణము.

అట్లే యనిరుద్ధుని పాత్రయు నిందుమిగుల పొందికగఁ గుదిరినది. విషయమెఱుఁగని యనిరుద్ధుఁడొకనాఁటి రేయి నున్న పాటుగ నుషా కన్యాంతః పురమునఁ గనులు విచ్చును. నూత్న పద్ధతిలో నున్న తత్సౌధరామణీయ కమునకు, నపరిచితయు లావణ్యారాశియు నగు నుషా సుందరి రూపము నకును దిగ్భ్రాంతుఁడై నాఁడు. అది జాగ్రదవస్థయో స్వప్నావస్థయో ఆతఁడెఱుఁగక బిత్తరపోయి చూచును. మున్ను ఉషకు స్వప్నములో ననిరుద్ధుని కలయిక నిజమేమోయని భ్రాంతి కలుగ నిపుడనిరుద్ధునకు జాగ్రదవస్థలో నుషను జూచుట స్వప్నమేమోయను భ్రాంతి కల్గినది. రెండును భ్రాంతులే. ఒకటిలేని దున్నట్లు భావించుట. వేఱొకటి యున్నది లేదనుకొనుట. అనిరుద్ధునకు భ్రాంతి కల్గినపుడుషా కన్య యాతనిస్థితిఁ జూచి మున్ను స్వప్నమునఁ దన్నలయించినందులకీ ఫలితము ననుభవింప వలసినదే యనునట్లు తలవాల్చియుండును. ఇన్ని భావము కాలవాలమై యున్న యీ సన్నివేశమున హరివంశ - ఉత్తరహరివంశకారులిరువురును జిత్రరేఖచే ననిరుద్ధునకు ముందుగనే విషయమెఱిఁగించుటచేత వారి గ్రంథములలో నీ సొంపు తగ్గిన దనక తప్పదు.

## శ్రీకృష్ణుని బాల్యక్రీడలు :-

ఇవి హరివంశ భాగవతములలో మాత్రమే కలవు. ఉత్తర హరివంశమున వీని ప్రసక్తియే లేదు.

కృష్ణుని బాల్యక్రీడలను వర్ణించు సందర్భమునఁ బోతనకు నెఱ్ఱనార్యుఁడు మార్గదర్శియైనను, ఎఱ్ఱన ప్రదర్శించిన పల్లీజనజీవిత శోభ పోతనార్యుని కవిత్వపు మూసలలో ప్రతిబింబములను సృజించు కొనలేక పోయినది; కాని పోతనార్యుఁడక్కడక్కడ స్వకపోల కల్పనలచే నిసర్గ మనోహరములు గావించిన స్థలము లిట గమనింపఁదగును. అట్టి వానిలో పూతనాహరణము, ఉలూఖల బంధనము, కృష్ణుని దుడుకు చేష్టలను గోపికలు యశోదతోఁ జెప్పుట ముఖ్యములు.

పూతనాహరణము నందు హరివంశ కారుఁడు -- పూతనరాకను.

సీ. "పండులు గొఱుకుచుఁ బదరిహుమ్మని మిడి -----

నదుమటయు బాపఁడార్తుఁడై నట్లు పోలె."

ఉ. ఎత్తిలి కావుకావురన నేడ్చితదీయపయోధరాగ్రముల్.

పొత్తుగఁ బ్రాణముల్చనటి బొందియత్రిక్కఁగనొక్కఁవ్రేల్మిడిన్.

అని రక్కసికి రక్కసియై పూతన ప్రాణములు హరించినాఁడని వ్రాసినాఁడు. ఈ ఘట్టమును పోతనార్యుఁడు స్వభావ సిద్ధముగ వ్రాసినాఁడు.

భాగవతమునఁ గంసుఁడు శ్రీకృష్ణుని జంపుటకుఁ బన్నిన పన్నాగము లన్నియు రహస్యములే. అగుట్టెరిఁగినవసుదేవుఁడు అడుగడుగునను నందుని హెచ్చరించుచుండును. నందయశోదలు కృష్ణుని కంటికి ఱెప్పవలెఁ గాపాడుచున్నను గోకులమున నుత్పాతములు జనించుచునే యున్నవి. ఆ సమయమున పూతనయను రక్కసి కామ రూపిణియై యిల్లిల్లుఁ దప్పకతిరుగుచు నందుని గృహముఁ జొచ్చినది. ఇందామె హరివంశమునఁ జెప్పినట్లు భయం కరాకారముతో వచ్చి యుండలేదు. సుందరీ రూపముతో వచ్చినది. అంతే కాదు, బాలెంత చందమునఁ బాలిండ్లన్ విసమూని వచ్చుపూతన రూపమిది.

మత్త. "క్రాలుఁగన్నులు గుబ్బచన్నులు, గందువొందని చందురుం

బోలు మోమును"

పూతనపై విధముగ వచ్చినదఁట. అప్పుడు గోపకామిను లారూపవతిని జూచి

మ. సిరిమమ్మున్ బ్రదుకంగఁ జూచుకొఱకై శృంగారవేషంబుతో
నరుదే నోవునటంచు గోపికలు జిహ్వాల్ రాకమోహించి త
త్వరలై చూడ ..................................

లతాంగి పర్యంక మధ్యంబునందున్న బాలునెత్తికొనినదఁట. యశోదారోహిణులు మాటవరసకు "చన్నుగుడుపన్ పల్దమ్మ" యన్నను, నామె వినిపించుకొనక 'కోశములోని కరవాలములవలెఁజొరవ జేసికొనినదఁట. ఇట్లామె మనోహర రూప లావణ్యమునకు భ్రమసి ముగుదలందరు నివ్వెరతో నిలిచిపోయిరి. పూతన యిట్లు సుందరీ రూపమునఁగాక నిజకుల సాధారణమగు వికారాకారముతో వచ్చిన యెడల గోవకామినులామెనింట నడుగైనను బెట్టనీయరు. అందులకై పోతనార్యుఁడు రక్కసికంత చక్కని రూపమును బ్రసాదించినాఁడు.

వికారాకారముతోఁ బూతనను ప్రవేశపెట్టిన హరివంశకారుఁడును, యశోదాదుల జాగరూకత నెఱుఁగును. అందులకే యశోద యొకింత కన్ను మూసినపుడు పూతనభయంకరముగ లోనఁ బ్రవేశించినదని చెప్పినాఁడు. హరివంశమునఁ గ్రూరాకారముతో రక్కసి వచ్చినపుడు యశోదకు ఒక క్షణము నిదుర గ్రమ్మ భాగవతమునఁ బూతన చెలువమునకు గోవకామినులందఱకు మైకము గ్రమ్మినది. భగవంతునకు మైకములేదు గదా!

శా. ఆ లోకేశ్వరుఁడా చరాచర విభుండాబాల గోపాలుఁడా
బాల ధ్వంసిని గొంతు గంటెడి వెసన్ బాలెంత చందంబునం
గాలుంగేలు నెఱుంగకున్నకరణిన్ గన్మోడ్చి ౧౦ - ౧౨౦

యాపాపజాతి సుందరిని క్రీఁగంటఁ జూచినాఁడఁట. ఆమె "ఆకొన్న చిన్ని యన్న చన్నుగుడువు" మన

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లనఁ గనువిచ్చి
క్రీఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి --------
నొక రెండు గ్రుక్కల నువిద ప్రాణంబులు

సైతము మేనిలో సత్త్వమెల్లఁ

ద్రావె ..............." నని చెప్పినాఁడు.

భాగ - ౧౦. పూ. ౨౨౫ ప.

ఇది పోతనార్యుఁడు చిత్రించిన పూతనాహరణ ఘట్టము

యశోద శ్రీకృష్ణు నులూఖల బద్ధుని గావించుట :-

ఇది భాగవత హరివంశముల రెండింటను గోపికలు కృష్ణుని దుడుకు చేష్టలు యశోదాదేవితోఁ జెప్పిన తరువాతనే జరిగినట్లు చెప్పఁబడినది. హరివంశమున నొకనాఁడు యశోదకృష్ణునుద్దేశించి

క. వఱువాతలేచి నీదగు
కొఱగాములు చక్కద్రోచికొనఁ బోయి దినం
బిఱులు వడి చనియె నీపను
లఱజాతివి నిన్ననేమి యననేర్తునుతా హరి. పూ. ౨౪౨ ప.

అని సంబోధించి "పెయ్యదామెన త్రాటంగొని శకట సమీపంబున బలితంబగు రోల నుదరంబు బంధించి" కదలిన మొత్తుదునని చెప్పి నిజకుటుంబకార్యములు చక్కఁ బెట్టుకొనుటకు లోన కరిగిన దని చెప్పినాఁడు.

ఆ ఘట్టమును భాగవతకారుఁడు సాక్షాత్కరించుకొన్న విధమిది. యశోద గోపికలను వారించి పంపిన యనంతరమొక్కనాఁడు,

సీ. "కరకమలారుణకాంతిఁ గవ్వపుఁ ద్రాడు
పవడంపునుఁ దీవపగిది మెఱయఁ
--------------------
దరువులిగురొత్తఁ బెరుగింతి దరువఁ జొచ్చె" ౧౦. ౩౫౫ ప.

నని పెరుగు దఱచుటను చెప్పినాఁడు. ఇందు దధిభాండముతోఁ గూడ యశోద రూపము కన్నులకుఁ గట్టినట్లు కానవచ్చును. అంతియేకాదు. దధిమథన శబ్దమును, దాని నధిగమించి తరువులు చిగిరించునట్లామె పాడెడిగీతియుఁ గూడ వినవచ్చుచున్నట్లున్నది. యశోద

రూపము నింత సహజముగఁ జిత్రించిన యాంధ్ర కవిని కానము. కృష్ణ చరిత్రమును జదువునపుడు సాధారణముగ కృష్ణునిఁ గన్న తల్లి యెంతధన్యురాలో యనిపించును, కాని యీ పద్యమును జదువునపుడు యశోద కడుపునఁ బుట్టిన బాలుఁడెంత ధన్యుఁడో యనిపించుచున్నది. చల్లని తల్లి, యశోద యమృతమువంటి మాతృహృదయముతో బాలునిఁ గూర్చి పాటఁ బాడ దరువులు చిగిర్చినట్లుండెనఁట. తల్లి గుణమును పుణికి పుచ్చుకొనిన కృష్ణుఁడు శరద్రాత్రులందు యమునాతటిని గానము సేయునపుడు గోపికలు పరవశులగుట యబ్బురమా! అట్లే యశోద చల్లచేయు సమయమున కృష్ణుఁడు :

క. "సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు

గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్" ౧౦. ౩౫౭ ప.

కవ్వము పట్టిన ప్రియసుతుని, అవ్వనరుహనేత్ర నవ్వుచు నెత్తికొని యంకతలమందిడికొని పాలిచ్చుచు హఠాత్తుగా లేచి పొయ్యి మీఁద పొంగారెడు పాలు దించుట కేఁగినది. అపుడు కడుపారంజనుఁ బాలు ద్రావని బాలుఁడు తల్లిడించిపోవమిక్కుటమగు కోపముతో మిధ్యాసంకులద్భాష్పుఁడై దధికుంభమును పగుల గొట్టి వెడలినాఁడఁట. యశోద పాలు డించి వచ్చి వికలమైన దధిభాండమును జూచి, కొమరునిఁ గానక యాతనిఁ బట్టి దండించు తలఁపుతో నిల్లిల్లు దిరిగి యొకయింటిలో రోలునెక్కి యుట్లు గొట్టుచున్న బాలుని గాంచినది. పట్టరాని కోపముతో నడుము బిగించి యశోద "నిలు నిలు" మని యదలించునంతలోఁ గృష్ణుఁడు గజ్జెలు గల్లన రోటినుండి గంతిడి పరువిడినాఁడు. ఘన యోగీంద్రులు పట్టలేని లీలారతునిఁ బట్టెదనని యశోదయు బాలుననుసరించి పరువిడినది. అదృశ్యమును పోతన వర్ణించిన రీతి యిది :

మ. "స్తనభారంబున డస్సి కృస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో"..

భాగ.౧౦.౩౭౧ ప.

అట్లు ముందు తనయుఁడు తరువాత తల్లిపరుపులిడుచు

సీ. స్తంభాదికంబులు తనకు నడ్డంబైన

నిట్టట్టుసని పట్టనీనివాని

సురుఁగుచుఁగ్రీఁగంటఁ జూచువాని"

నొకచోట యశోద పట్టి "వీరెవ్వరు శ్రీకృష్ణులుగారా! యెన్నఁడు వెన్నఁ గానరఁట కదా! చోరత్వంబించుకయును నేరరఁట". యని పరిహసించి కొట్టఁ జేతులాడక రోలునకుఁ గట్టఁ బ్రయత్నించినది. ఎన్నిత్రాళ్లుగలిపినను బొజ్జతిరిగిరాకుండుటచే నాశ్చర్యపడుచు నుత్తరీయము జాఱీ, నొడలు చెమట గ్రమ్మ శ్రమించు తల్లిని కరుణించి, సనకాది యోగి చిత్తములకుఁ జిక్కని లీలారతుఁడు తల్లి బంధనకుఁ గట్టువడినాఁడఁట.

ఈ ఎన్నివేశమునింత మనోహరముగ వర్ణించిన యాంధ్ర కవులెందఱు గలరు?

గోపకామినులు కృష్ణుని దుడుకు చేతలను వర్ణించి చెప్పు సందర్భమున హరివంశ భాగవతములకు నెంత సామ్యమున్నదో యంతభేదముకూడ నున్నది. హరివంశమున కృష్ణుని దుడుకు చేష్టలలో మోహనోద్దీపకములగు ప్రౌఢచేష్టలు వర్ణింపఁ బడలేదు. అవి భాగవతముననే కాననగును.

క. "వెన్నఁ దినఁగఁ బొడ గని మా"

౧౦. పూ.౩౦౪. ప.

క. "ఇమ్మగువ దన్నువాకిటఁ
గ్రుమ్మరు చోఁ జీరినిలిపికొని పేరడుగం" ౩౦౫

క. "ఇచ్చెలువఁ జూచి ముచ్చి"

భాగ. పూ. ౧౦ - ౩౦౭ ప

క. "కొడుకులు లేరని యొకసతి
గడువగవఁగఁ" ౩౦౮

క. "వ్రాలఁగ వచ్చిన నీ సతి" ౩౦౯

క. "మగువా! నీ కొమరుఁడు మా
మగవారటువోవఁ జూచి మంతనమునకుం" ౩౨౧ ప.

మొదలగు పద్యములట్టివి. ఈ చిలిపి శృంగార భావస్పర్శయైనను హరివంశమునఁ గానరాదు.

హరివంశకారుఁడు కొన్నిచోట్ల పామర భామల వాక్కులు సంస్కరింపక యథాతథముగా వాడినాఁడు. గోపికలు యశోదతో శ్రీకృష్ణుఁడు ఉట్లను గొట్టుటాదిగాఁ గల చేష్టలను లోక కంటకముగ వర్ణించి చెప్పుదురు.

ఆవర్ణనలోఁ గొంత కటువుఁ దనమును భాసించును.

చ. అసురయొకాక నీతనయుఁడంగన యేఁబడి బానలందుఁ బొ

ల్పెసఁగెడు వెన్నయుట్లు వయినేఁబదిలంబుగడించి యుండ వె

హరి. పూ. ౨౧౭ ప.

చ. కలయఁగఁ బాలుపిండి పులకండము వెన్నయుఁ బెట్టి యట్టులై

యలవడ పండితింబతియు నాత్మజులుం బ్రియపడ్డనాలు గే

౨౨౪ ప.

ఇట్టివే మఱికొన్ని పద్యములు కలవు. వానిలో "అసురయొ నీ తనయుఁడు" -- "బానలు మ్రింగె" -- "బూతము లున్నవిగాకకడ్పునన్" మొదలగు పదములు కటువులై యున్నవి. ఈ సందర్భమున భాగవతమునందున్న సౌకుమార్యము హరివంశమునఁ గానరాదు. భాగవతమున గోపికలు త్కాంతలై యెన్నెన్నోదుడుకు చేష్టలనేకాక శిశువులు చేయరాని తప్పు పనులు కూడ చేయుచున్నాఁడని యశోదతోఁ జెప్పి నిష్ఠురములాడినను వారి పల్కులలో కటుత్వముతోపదు. అతినిష్ఠురమగు భావములు సైతము మెత్తని పదములలో లలితముగా వినిపించును. ఈ శక్తిని పూర్తిగ కైవసమొనరించుకొన్న యాంధ్రకవులలో పోతనమొదటి వాఁడనఁదగును.

కృష్ణుని దుడుకు చేష్టలను చెప్పిచెప్పి గోపికలు కోపమాపుకొనలేక యశోదతో నిట్లందురు.

క. కడులచ్చి గలిగెనేనిం

గుడుతురు గట్టుదురుగాక కొడుకుల నగుచున్

బడుగులవాడలపైఁ బడ

విడుతురొకో కాంతలెందు విమలేందుముఖీ"

భాగ. ౧౦. పూ. ౩౨౮

క. ఓయమ్మ! నీ కుమారుఁడు

మాయిండ్లను బాలుఁబెఱుగుమన నీఁడమ్మా ౩౨౯ ప.

అని మంజులముగనే కఠిన భావములను వెలిఁ బుచ్చిరి. అందులకే భాగవతమున జానపదులు సైతము నాగరికులగుచున్నారు. లోకానుభవముగల యెఱ్ఱనార్యుఁడు ప్రకరణానుకూలముగఁ బామరజనోచితములగు మాటలను వాడ, లోకముతోనంత సంబంధము కల్పించుకొనని పోతన తనకింపగురీతిని సుకుమారముగ వ్రాసికొనినాఁడు. ఈ మార్పులకు కవుల యాత్మీయత గారణము కాని మఱొకరీతిని వారు వ్రాయలేని వారని మాత్రము తలఁపరాదు. పోతన వలె నెఱ్ఱనయుఁ దలఁచుకొన్నచో సుకుమారముగా వ్రాయఁగలఁడు. ఎఱ్ఱన యంత సూక్ష్మముగాఁ గాకున్నను పోతనకూడ జానపదుల జీవన విధానమును వలయుచోఁ దరచి చెప్పఁగలఁడు. ఉదాహరణమునకు పోతన భాగవతములోని గోపబాలురు చల్ది లారగించు ఘట్టమును గైకొన నగును.

సీ. కడుపున దిండుగాఁ గట్టిన పలువలో

లాలిత వంశనాంళంబుఁ జొనిపి

శైశవంబు నెఱపి చల్ది గుడిచె" భాగ. ౧౦. పూ. ౪౯౯ ప.

ఇందు కడుపున దిండుగాఁ గట్టిన పలువ లోవంశనాళమునుంచుట, వేళ్ల సందుల నూరుగాయల నుంచుట, దండములను జంకనుంచుకొనుట, మొదలగు నవి యచ్చమగు గోపబాలుర చేష్టలు కావా? ఇట్లు రెండు పద్ధతులనొకకవి వ్రాయఁగలిగినను కవులు సాధారణముగ తమ యభిరుచులకు వశులై వర్ణించి వ్యక్తిత్వమును బ్రదర్శింతురు. మధురములగు పదములతో పాఠకులకు భక్తిరసాయనము నందిచ్చుట పోతనకు వ్రతమువంటిది. అది సిద్ధించినదను తృప్తి తనకుఁ గల్గిన గాని యితర విషయవర్ణనమునకుఁ బోడు. అట్లే జాతిగతమగు తత్త్వము నున్నది యున్నట్లుగంభీరముగ వర్ణించుట యెఱ్ఱన యభిమతము. తత్సాధనపై నాతఁడు దృష్టినిలుపును. అంతమాత్రముచే నెఱ్ఱనకు భక్తి భావము తక్కువనికాని, పోతనకు ప్రకృతి పరిశీలన దృష్టి యసలే లేదని కాని యర్థము కాదు. అన్యతర ప్రాధాన్యమును బట్టి సాధారణముగ విషయ నిర్ణయము జరుగును.

కృష్ణుని బాల్యక్రీడల సందర్భమున పోతనార్యుఁడు మాతాశిశువులతత్త్వమును మానవ సహజముగ వర్ణించుచు. శిశువునందు సైతము సర్వశక్తులను భక్తతోఁ జూచినాఁడు.

ఎఱ్ఱనార్యుని రచనలో మానవమనస్తత్త్వముతోఁబాటుగ గ్రామీణుల యాకార చేష్టా స్వభావములు సమయము దొరకి నపుడెల్లఁ జూడ గల్గుదుము.

హరివంశమున శకటాసుర సంహారావసరమున యశోద బాలుని నిద్రఁ బుచ్చి జలక మాడనేగును. శకటాసురుఁడాసమయమున బాలు నెత్తుకొని యాతని బరువు మోయలేక యసువుల వీడును. యశోద తిరిగి వచ్చి శకట భాగములపై నిర్భయముగ నాడుకొనుబాలుని జూచి గుండెలు బాదుకొనుచు బాలునెత్తికొని రక్ష గట్టి దృష్టితీయును. బాలుఁడు సురక్షితముగఁ దనకు దక్కినను, బాలునియెడఁ దన యుపేక్షకు మగఁడేమి యనునోయనిభీతిల్లి "విభుండేమియది యనిన నుత్తరమేమన యిత్తు" నని వగచినది. టల్లే గోపికయొర్తు కృష్ణుని దుండగమును యశోదతోఁ జెప్పుచుఁ గృష్ణుని యాగడములకేమిగాని నామగఁడు వినిన నేమగునో యని భయపడుచు "మగండింక నన్ను సైచునె దిగవిడుచుం జంపుఁగాక" యని యశోద కడ వగచును. ఇట్టి వర్ణనలు వ్రజకులాంగనల సాధుత్వము నకుఁ బతి భక్తికి సాక్ష్యములు.

శకటాసుర సంహారానంతరము మందకేగిన నందగోపుడు పరిమిత పలితైక కేశ సంచయముతో గోఖురోద్ధరరేణు కుంఠితంబైన మోమునఁ జెమట బొట్టులు జాలువార, తాఁ గట్టిన చెంగాని కాసెకోక లేఁజిగురు జిగినూని, తనువు ప్రకాశింప, గోపాల పరివారముతో నాలమందనుండి వచ్చినాఁడఁట. వచ్చి, భగ్నశకటాకారమును ముంగిటఁ జూచి బాలునకేమికీడు వచ్చినదో యని భయమంది, "బల్లిదంపుటాఁబోతుపెట్లురేఁగి తొడరి త్రోచి త్రొక్కెనో" నిజము చెప్పుమని భార్యను గద్దించినాఁడు. అట్లాతఁడు యశోదను గద్దించుటకుఁ గారణమామెయందుఁ బ్రీతి చాలమికాదు. బాలునిపై ప్రేమ మిక్కుటమగుటయే. ఆలంకారికముగా తమ భావమునకు రంజనము సేయలేని పామరుల గద్దింపులలోఁ బ్రేమలంత చిక్కనివి. ఆ గద్దింపునకు ఖిన్నయై యశోద "నావలనందప్పుచాలఁగలదు మీరు సహింపవలయునని" విషయము చెప్పి మిన్నకుండినది. ఈ భావ వ్యక్తీకరణము యశోద హృదయమునకే కాదు పతి భక్తి పరాయణలైన వల్లవీ కాంతుల హృదయ తత్త్వమునకే దర్పణము.

ఇట్లు కొన్నిచోట్ల భాగవతకారుఁడును, కొన్నిచోట్ల హరివంశకర్తలును దమ యభిరుచులను బట్టి నేర్పులను మెఱయించిరి. ఇట వానిని గొలఁదిగఁ బరామర్శించుట మాత్రమే యుద్దేశముగాని, యెఱ్ఱన, పోతన, నాచనల న్యూనాధిక్యములను నిరూపించుట మాత్రము కాదు.

# 7. పోతనపై నాతనికిఁ బూర్వమందున్న ప్రసిద్ధకవుల ప్రభావము

కవి యెంతటి ప్రతిభావంతుఁడైనను రచనావసరమందెంత స్వాతంత్ర్యము చూపఁ గల్గినను, గవిత్వమునందుఁ దనకుఁ బూర్వులైనవారి ప్రభావము కొలఁదిగనో గొప్పగనో భాసించుట యనివార్య ధర్మము. అట్లే పోతనామాత్యునిపై నతనికిఁ బూర్వమందున్న కొందఱి ప్రసిద్ధ కవుల శబ్దాలంకార ప్రభావము, కొందఱి పద్య బంధముల నేర్పు, కొందరిభావసంపద, కొందఱిశైలి, కొందఱి శయ్యా సౌభాగ్యము గాననగును.

ఎఱ్ఱన నృసింహపురాణమునఁ బ్రహ్లాదుఁడు విష్ణుభక్తి విడువనని తండ్రితోఁ జెప్పు సందర్భములోని :

ఉ. "ఊషరబీజముల్ భసితయోగ్య ఘృతంబులు షండ కన్యకా

న్వేషణముల్" నృ. పు. ౫ - ౨౪

అను పద్యమునకు ఛాయగా -

శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్

భాగ. ౭ - ౧౬౮

అను పద్యమనుకరణమని చెప్పక చెప్పుచున్నది.

సీ. వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి, తగదను తండ్రియుఁ

దండ్రిగాడు. నృ. పు. ౫ - ౨౨

అను పై పద్య భావము పోతన రచనలో భంగ్యంతరమునంది నీ దిగువ రీతిని మనోహరముగ నిల్చినది.

సీ. కమలాక్షునర్చించు కరములు కరములు,

శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ. భాగ. ౭ - ౧౬౯

ఉ. "పాపఁడయింత కాలమును బాయక యొజ్జల యొద్దనుండి నీ

వేపగిదిన్ బఠించినది యేర్పడఁ బ్రస్ఫురితార్థ సారమై"

నృ. పు. ౪ - ౫

అని హిరణ్య కశిపుఁడు కుమారుని విద్యను బరీక్షింపఁ గోరునపుడు నృసింహపురాణ కర్త చెప్పిన పద్యమునకు సరితూఁగునట్టి పద్యమును భాగవతకారుఁడీ దిగువ రీతిని గూర్చుకొనినాఁడు.

శా. "చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్ శోధించి యేమేమి సం

వేద్యాంశంబులు సెప్పిరో గురువులేవెంటన్ బఠింపించిరో"

చ. కఱచిరి మెయ్యెడన విసము గ్రక్కితి మీతనియందు నెట్టి మా

కఱచిన కాట్లకున్ శిశువుకాయముతోలును స్రుగ్గదయ్య మా"

హరివం. ४ - ४३

అనునది భాగవతమున నిట్లు మారినది.

ఉ. ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులందుఁ ద్రో

క్కించితి శస్త్రరాజిఁ బొడిపించితి మీఁద నిభేంద్రపంక్తి రా"

భాగ - ౭ - ౨౦౧

ఇట్లు భావమునందేగాక పదబంధమునను పోతన యెట్లు ననుకరించినట్లు గోచరించును. ఉదాహరణకీ క్రింది :

ఉ. "ఆడఁగ బోయినప్పు డసురాత్మజుఁడంబుజనాభు నవ్యయుం

బాడుదనూడి దేవ్వ పదపంకజ పూజలు సేసి భక్తిమై"

నృ. పు. ३ - ౧४౯

అను నృసింహపురాణమందలి పద్యమునకుఁ బోతనార్యుఁడాపద బంధములతో నీదిగువ పద్యమును గూర్చుకొనినాఁడు.

క. ఆడదము మనము హరి రతి"

భాగ ౭ - ౨४౮

ఆ. కుడిచినపుడు నిద్రగూలినయప్పుడు, మేలు కొనినయపుడు"

నృ. పు. ౩ - ౧౫౦

దానిని పోతన దిగువరీతిని శార్దూల పద్యమున ప్రదర్శించినాఁడు.

శా. "పానీయంబులు ద్రావుచుంగుడుచుచున్ భాషించుచున్ హాసలీ"

భాగ. ౭ - ౧౨౩

నాచన సోమనాధుఁడు - పోతన :- (ఉత్తరహరివంశము)

ఉత్తరహరివంశము నుండి భాగవతకారుని యనుకరణములు రెండు రకములుగ నున్నవి. ౧. సామాన్యానుకరణము. ౨. విశేషానుకరణము. మొదటిదానిలో ననుకార్యములైన పూర్వగ్రంధమందలి పద్యములనుండి కొంత భావసామ్యము, కొంత పద్యముల కూర్పుతీరు, మొదలగునవి గోచరించును. ఇట్టి వానిని గొంతవఱకు శైలి కుదాహరణముగా గ్రహింపవచ్చును. రెండవదానిలో భావసామ్యమే గాక సమాసములు పదములుఁ గూడ యథాతథముగాఁ గాని యించుక మార్పుతోఁగాని గాననగును.

నాచన సోమనాథుని నుండి సామాన్యానుకరణములు :-

మ. ఇతఁడే సాత్యకి యిమ్మహో భుజబలం బెల్లప్పుడుం జెప్పఁగా"

ఉత్తర హరి. ౪ - ౧౭౩

మ. ఇతఁడే దానవ చక్రవర్తి సురలోకేందాంఘ్రి కీలాది ది"

భాగ. ౮ - ౫౪౩

మ. వినరా! సాత్యకి, మాటలేమిటికిరా వేదండ కోదండ కే"

ఉత్తర. హరి. ౪ - ౨౦౬

మ. వినరా డింభక, మూఢచిత్తగరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెదవైన నిందుఁగలఁడే యంచున్ మదోద్రేకియై"

భాగ. ౭ - ౨౮౪

మొదలగు పద్యములిట్టివి.

ాచన సోమన నుండి విశేషాను కరణములు :-

౧. నరకాసుర సంహార ఘట్టము - సత్యభామ వర్ణనము :

మ. అరిఁజూచున్ హరిఁ జూచుఁ జూచుకములందందందమందారకే

సరమాలామకరంద బిందు సలిల స్యందంబు లందంబులై

ఉత్తర. హరి. ౧ - ౧౬౨

ను పద్యభావము ననుసరించి భాగవతకారుఁడు

మ. పరుఁజూచున్ వరుఁజూచునొంపనలరింపన్

భాగ. ౧౦ - ౧౩౮

ను పద్యమును రచించెనా యనిపించును.

. "తంత్రీవినోదంబు తడవుసైఁ పనివేళ్ల, గొనయంబు తెగలపైఁ గోరుకొనుట

ఉత్తర. హరి. ౧ - ౧౬౧

ను పద్యభావమును పోతన రెండు సీసములలో నీ దిగువరీతి వర్ణించినాఁడు.

సీ. వీణెఁజక్కఁగఁ బట్టివెరవెఱుంగనికొమ్మ, బాణాసనంబెట్లు పట్టనేర్చె

భాగ. ౧౦ - ౧౮౧

బొమ్మ పెండ్లిండ్లకుఁ బోనొల్లనను బాల, రణరంగమున కెట్లు రాఁదలంచె

భాగ. ౧౦ - ౧౮౦

ఉషాపరిణయము :-

సీ. పాంచాల పాండ్యబర్బరకిరాతాభీర, కురువిదేహవిదర్భకకుర గ్గౌళ

గాంధరమగధకొంకణ కళిందపుళింద, సింధు సౌవీరాంధ్రచేర చోళ.

ఉత్తర. హరి. ౫ - ౧౪౪

"మాళవ కొంకణ ద్రవిడ మత్స్యపుళింద" భాగ. ౧౦ - ౩౪౮

మడికి సింగన - పోతన :-

పోతనామాత్యునకుఁ బూర్వము మడికి సింగన భాగవతమునందలి దశమస్కంధ పూర్వోత్తర భాగములను ద్విపద కావ్యముగ రచించినట్లు తెలియు చున్నది. అట్లు రచించుటలో దశమస్కంధ కథా భాగమునాతఁడు కాండములలో విభజించి వానిని వేర్వేరు నామములతో వ్యవహరించినాఁడు. వానిలో మధురాకాండము, కల్యాణకాండము, జగదభి రక్షకాండము, అనునవి మాత్రమే ముద్రితములైనవి. శ్రీకృష్ణుఁడక్రూరునిఁ గంసునికడకుఁ బంపుటతో నారంభమై జరాసంధుని జయించు వఱకుఁ గలభాగము మధురాకాండముగను, రుక్మిణీ కల్యాణము మొదలు "ఉషాపరిణయము" వఱకుఁ గల కథ కల్యాణకాండముగను, నృగమహారాజు చరిత్ర మొదలుకొని శిశుపాల వధ వఱకు "జగదభిరక్ష" కాండముగనుఁ గాననగును. దానికి సంబంధించిన పూర్వోత్తర కథాభాగములు కవి రచించినట్లును, అవిశిథిలమైనట్లును నేతద్గ్రంథ పీఠికాకారుల వ్రాతను బట్టి తెలియుచున్నది.

ద్వి॥ భా॥ ఉపోద్ఘాతము. పుటలు ౧౧ - ౧౨

సమానాంశములను వర్ణించునపుడు కొన్ని కొన్ని ఛాయలు సింగన నుండి పోతన గ్రహించి వానిని స్వీయ ప్రతిభతోఁ బ్రౌఢముగఁ దీర్చి దిద్దినాఁడు. అట్టివానిలో నీ దిగువ నిచ్చినవి కొన్ని.

శ్రీకృష్ణ బలరాములు కంసుని సంహరించి దేవకీ వసుదేవులను సందర్శించుట :-

"మా నిమిత్తమున దుర్మనుజులచేతఁ
బూని బహుక్లేశము మీకుఁ గలిగె
తనయుండె యతఁడు ..................

ద్వి-భాగ. ౨౫, ౨౬ పుటలు

భాగవతమున నాభావమించుక మార్పుతో నీదిగువ రీతిని జెప్పఁబడినది.

సీ. "మమ్ముఁగంటిరిగాని మాబాల్య సౌగంధ కైశోరవయసులఁగదిసిమీర

------------------------------------

మేనికెవ్వారలాఢ్యులు మీరకారె, యారుణముఁ
దీర్పనూఱేండ్లకైనఁజనదు." భాగ. ౧౦ - ౧౩౮౯

నందయశోద లుద్ధవుని కుశల ప్రశ్నగావించుట :-

"దేవకియును వసుదేవుఁడు సుఖులె!"

ద్వి. భాగ. ౩౩ పుట

భాగవతమున నాభావ మిది :-

క. "నామిత్త్రుఁడు వసుదేవుఁడు"

భాగ. పూ. ౧౦ - ౧౪౩౯

గోపికల విరహము :- భ్రమరగీతలు

"చంచరీకమ నీవు చంచలాత్ముఁడవు

పక్షపాతివి నీవు బహు చుంబకుఁడవు." ద్వి. భాగ. ౩౫ - ౩౬ పు

అను పాదములందలి భావము భాగవతమున బహు భంగులలోఁ జెప్పఁబడినది. అందు.

1. మ. "ఒక పువ్వందలి తేనె ద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే"

2. "భృంగా కృష్ణుడు" "సమదాళీస్వర" "రోలంబేశ్వర" మొదలగు పద్యములు ప్రధానములు. భాగ. ౧౦. పూ. ౧౪౫౬

మధురానగర స్త్రీలు శ్రీకృష్ణునిఁ జూచుట :-

"ఈతఁడే యెలనాగ యిసుమంతవాఁడు

పూతనపాల్ద్రావి పొరిగొన్న వాఁడు"

అనుదాని భావము భాగవతమున :-

సీ. "వీఁడఁటే ఱక్కసి విగత జీవఁగఁ జన్నుఁ బాలుద్రావిన మేఁటిబాలకుండు

వీఁడఁటే నందుని వెలఁదికి జగమెల్ల, ముఖమందుఁజూపినముద్దులాఁడు"

భాగ. ౧౦ పూ. ౧౨౫౩

ఇట్లింకను మఱికొన్ని భావము లచ్చటచ్చట గలవు°

పాల్కురికి సోమనాథుఁడు - పోతన :-

పాల్కురికి సోమనాథుని నుండి పోతన గ్రహించిన భావాను కరణములు చాల

ప్రస్తుతము సింగన ప్రభావమేమైన పోతన పై ప్రతిభాసించిన దాయనునంశము జూచుటకు. పోతనామాత్యుడు భాగవత దశ॥ నందు "శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవితో విరసోక్తులాడుట" యగునంత వరకు మాత్రమే వ్రాసెనను రచనను చూచుట జరిగినది.

పరిమితములు. అవి బసవ పురాణ పండితారాధ్య చరిత్రలలో రెండు మూఁడు చోట్ల స్పష్టముగ గోచరించును.

"క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగ"

బస. పు. ౩ - ౫౪ పు

ఈ ద్విపద పాదములు సోమనాధుని బసవ పురాణములోనివి బసవనమంత్రి ........ ................ ధనమంతయు జంగములకు వెచ్చపెట్టుచుండ రాజాగ్రహించి: "పరధనంబ పహరింపని బాసయంద్రు పరధనంబెట్లొకో బసవ! గైకొంటి, వేయు మాటలు నేల వెఱతుమునీకు, మాయర్థమిప్పించి నీ యంతనుండు" మని మందలించును. ఆ సమయమున బసవన మంత్రి నరనాథునితో నన్నమాటలివి. పై వాక్య రచనా విధానముననే గాక, భావమును గూడ ననుకరించుచుఁ బోతన బ్రహ్లాదచరిత్రములో భాగవతమునందు బ్రహ్లాదునిచే నీ దిగువ రీతిని సీస పద్యములోఁ బల్కించును.

సీ. "మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధువంబు వోవునే మదనములకు"

భాగ ౭ - ౧౫౦

ఇట్లు సమానేతి వృత్తమును గ్రహించిన యెఱ్ఱన నాచన సోమన వడికి సింగనాదులలోనే గాక మఱి కొందఱి యితర కవుల భావములను గూడఁ బోతన కొంత గ్రహింపక పోలేదు. వారి భావములు పోతనలో యథాతథములుగాఁగాక ఛాయా మాత్రముగ నుండుటచే నట్టి వాని నధికముగ నీయక కొలఁదిగ మాత్రమే ప్రసిద్ధ మైన వాని నీ దిగువ నిచ్చుట జరిగినది.

పండితారాధ్య చరిత్ర :-

"బసవలింగముకృతిపతి యట్టె! కృతియు
రసికతఁబండితారాధ్య చరిత్ర"

పండి. చ. దీక్షా. ప్ర. ౨౨ పుట

పై పాదములు చదువునపుడు పోతన వ్రాసిన ఈ క్రింది : -

క. "పలికెడిది భాగవతమఁట
పలికించెడివాఁడు రామభద్రుండఁట" భాగ. పీఠిక

అన్న పదము తలఁపునకు వచ్చును.

తండ్రిపనుపున దైత్యులెన్ని తెఱంగుల బాధించినను ధ్యాన తత్పరుఁడై యించుకయుఁ జలింపని ప్రహ్లాద కుమారుని వర్ణించుచు భక్తి పరవశుండై పోతనామాత్యుఁడు.

ఉ. "పాఱఁడు లేచి దిక్కులకు బాహువులొడ్డఁడు బంధురాజిలో
దూఱఁడు హాహారకృత్యమని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం"

భాగ. ౭ - ౧౯౪

అను పద్యము రచించుటలో సోమనాథుని పండితారాధ్య చరిత్రయందలి యీ దిగువ పంక్తులు ద్బోధములేమోయనిపించును.

"హానోచ్చె నొచ్చితి నయ్యయ్య యనక
యేనీకుఁ జేసిన యెగ్గేమి యనక"
---------- యక్కటాయనక"

పండిచ. పు. ప్రక. పుటలు ౩౦౨, ౩౦౩

తిక్కన -పోతన :-

పోతనకుఁ దిక్కనతో స్ఫుటముగు భావ సామ్యము కాన్పించదు, కాని నిర్వచనోత్తర రామాయణమునందుఁ దిక్కనార్యుఁడు ప్రదర్శించిన శయ్యా సౌభాగ్యము పోతనలోఁ జాలవఱకుఁ బ్రతిభాసించినట్లు స్పష్టపడును.

చ. "శుకపికసంకులత్వమున సుందర సాంద్రలతాంత పల్లవ
ప్రకర బహుచ్ఛవిం బుళవనంబు విహార వనంబు లొప్పున"

నిర్వ రా. ౧ - ౬౦

చ. అతుల సరస్వతీ సరిదుదంచిత బాలరసాలసాల శో
భిత తటతుంగ రుగనుగు బిందు సరంబు వినిర్గమించి

భాగ. ౩ - ౭౬౦

చ. "అతఁడభిరాముఁడై పెరిగి యోవన సంపద నుల్లసిల్లుచుం
బ్రతియిడరాని రూపమునఁ బ్రస్తుతి కెక్కె వివాహమయ్యె వి"

నిర్వ. రా. ౨ - ౫౫

చ.	"సురుచిరభంగి నాసతి కిశోరవయః పరిపాకయొరణ
ద్వరమణి హేమనూపుర రవంబు నెలంగఁగనాడుచున్"	భాగ.

ఇట్లు శయ్యయందు నిర్వచనోత్తర రామాయణ భాగవతములకు సామ్యము గల పద్యములెన్నియోగలవు. గ్రంధ విస్తరభీతిచే నింతమాత్రము వ్రాసివిడచితిని.

షోడశకుమార చరిత్ర – భాగవతము :-

ఈ గ్రంధము నుండి సకృత్తుగ నొకటి రెడు సామ్యములు శైలికి సంబంధించినవి కాననగును. షోడశకుమార చరిత్రమందలి కమలాకరుని విహారమునకును, భాగవతమందలి హిరణ్యకశిపుని విహారమునకును దగ్గఱ సామ్యము గోచరించును.

షోడశకుమార చరిత్ర – కమలాకరుని విహారము :-

మ.	"చెలులుందానును వేడ్కమీర విలసచ్ఛృంగారుఁడై తత్పురీ
లలితోద్యానములందుఁబుష్పితలతాలాస్యంబు లీక్షింపుచున్"
షో. కు. చ. ౨ – ౩

భాగవతము – హిరణ్య కశిపుని విహారము.

శా.	"లీలోద్యాన లతా నివాసములలో లీలావతీయుక్తుఁడై
హాలాపాన వివర్ధమాన మదలోలావృత్త తామ్రాక్షుఁడై"
భాగ. ౭ – ౧౦౨

మొదటి దానియందు రాకుమారుఁడు చెలులుందానును దత్పురీ లీలోద్యానములందుఁ బుష్పిత లతాలాస్యంబులీక్షింప రెండవదాని యందు రాక్షసకులేశ్వరుఁడు లీలావతీ యుక్తుండై లీలోద్యాన లతానివాసములలోఁగేళిం దేలినాఁడు. అందు నాయకుఁడు కలకంఠీ నినాదములకు మైమఱచి వినోదింప నిందు హిరణ్య కశిపుఁడు హాలాపాన వివర్ధమాన మదలోలావృత్త తామ్రాక్షుఁడై వినోదించినాఁడు.

షోడ శకుమార చరిత్రమున నృపకుమారుని భేతాళుఁడు మెచ్చుకొను సందర్భమునందలి యీ దిగువ పద్యములోని ప్రసాద గుణభావ ప్రౌఢిమలు భాగవతములో రుక్మిణి కల్యాణ సందర్భమున రుక్మిణి బ్రాహ్మణునకుఁ గృతజ్ఞతా సూచకముగాఁ జెప్పు సమాధానమునందుఁగాననగును.

షోడశ . కు. చరిత్ర.

"ధరణీ నాయక నీదు శౌర్యమును సత్యంబుంబ్రతాపంబు ని
ద్ధర నెవ్వారికి లేదు నీదగు చరిత్రంబెప్డు విన్వారలం"

షోడశ కు. చ. ఆ. ౫. ప. ౧౪౧

భాగవతము :-

"జలజాతేక్షణు దోడితెచ్చితివి నా సందేశముంజెప్పినన్
నిలువంబెట్టితి నీ కృపనే బ్రతికితిన్ నీయంతపుణ్యాత్మకుల్"

భాగ. ౧౦ స్కం. పూ. భా ప. ౧౭౩౬

అందు భేతాళుఁడు రాజును మెచ్చుకొనుట, యాతని పరాక్రమునకు. ఇందు బ్రాహ్మణుని రుక్మిణి శ్లాఘించుట తనకుపకారము చేసినందులకు. అందలి రాజు సర్వజ్ఞ చూడామణి, ధరణీ నాయకుఁడు కాగా నిందలి బ్రాహ్మణుఁడు సద్బంధు చింతామణి, భూసురాన్వయ మణియైనాఁడు.

ఇట్టి సామ్యములు గల పద్యములింకను, యనేకములు కాననగును.

శ్రీనాథుఁడు – పోతన :–

శ్రీనాథ కవీశ్వరుని భావములను బోతనార్యుఁడనుకరించిన జాడలధికముగ లేవు. ఎచ్చటనో యొకటి రెండు మాత్రమే పట్టి చూచినచోఁ గాన వచ్చును. కాని సొంపుదీరిన శ్రీనాథుని సీసపద్యపు నడకలకుఁ బోతన ముగ్ధుఁడై నాఁడు. సీస పద్యములను రచించునపుడు కవిసార్వభౌము ననుకరింపని యాంధ్రకవి యరుదనుటలో నతిశయోక్తి లేదు. ఆంధ్రమున స్వతంత్రించి రసవత్ప్రబంధములను సంతంచిన పెద్దనాదులీతని సీసపద్య పాదములనే తమ రచనలలో నుపయోగించుకొనినారు. పోతనామాత్యుని భాగవతమునఁ గూడ శ్రీనాథుని సీసపద్యపుటొయ్యారపు నడకల ననుసరించి రచింపఁబడిన తావులు పెక్కుగలవు.

౧. కొన్ని సీస పద్యములందు శ్రీనాథుఁడు వర్ణ్యమాన వస్తువునసమాన దర్మము నారోపించి నాల్గు పాదములను నడపినాఁడు.

సీ. తఱిపి వెన్నెలలోని ధావళ్యమొకకొంత
నవసుధాకర్దమద్రవము గాఁగ

--------- ప్రాచిక భినవ మాణిక్య పదకమమ్యె"

కాశీఖం. ౧ - ౧౨౩

పోతనయు నద్దాని నవలంభించి కొన్ని సీసములను గూర్చినాఁడు. అందొకటి.

సీ. గురుకుచ భారసంకుచితావలగ్నంబు

దనరారు నాకాశతలము గాఁగ"

భాగ. ౩ - ౨౩౪

౨. సీస పాదములు నాలుగును ప్రత్యేకముగానేక సమాసము చేసి క్రింది యాటవెలఁదిలోనో తేఁటగీతిలోనో క్రియను విన్యసించుట శ్రీనాథుని సీస పద్య భంగిమలలో నొకటి.

సీ. ధూర్దండ ఘట్టన త్రుటితగ్రహగ్రాహ

ధూళిపాళీమిళద్వ్యస్థలములు" కాశీఖం. ౧ - ౧౨౭

పై తీరు పద్యములను బోతనయు సృష్టించినాఁడు. అందొకటి.

సీ. "హలకులిశాంకుశజలజధ్వజచ్ఛత్ర

లాలిత లక్షణ లక్షితములు" భాగ. ౩ - ౯౨౯

౩. శ్రీనాథుని సీసపద్యపు సొంపులలో మఱియొక ప్రయోగము, ప్రతిపాదమున రెండేసి సమాపకవాక్యములు క్రమబద్ధముగానడపుట.

సీ. "ఒకదీవి కొకకొండ యుదయాద్రియైయుండు

నది యొండు దీవికి నస్త శిఖరి" కాశీ. ఖం. ౧ - ౧౨౯

భాగవతము నుండి

సీ. "గంధవాహుఁడు మందగతిననుకూలుఁడై

వీచెనద్దిక్కులు విశదమయ్యె" భాగ. ౪ - ౨౯

౪. ప్రతి పాదము నొకొక్క ప్రత్యేక సమాపకవాక్యముగా, అనఁగా నాల్గు పాదములు నాల్గు ప్రత్యేక వాక్యములుగా సీసపద్య రచన చేయుట మరి యొక విశేషము.

సీ. ప్రాలేయ కిరణబింబంబు వెల్వెలఁ బారి

యస్తాచలంబు పై నత్తమిల్లె" కాశీ. ఖఏ. ౧- ౧౨౨

ఈ నాల్గవ ప్రక్రియకు చెందిన పద్యములు భాగవతమున లెక్కకు నెక్కువగానుండు టచే నీరచనకుఁ బోతన యొక్క ప్రత్యేక స్థానమందికొనినాఁడు.

సీ. అందంద కురిపించి రమరులు మునినాథ

వితతివియ్యంబంద విరుల వాన' భాగ. ౪ - ౪౩౬

౫. సీస పద్యములను రచించునపుడు పోతన శ్రీనాథుని నుండి వర్ణన సామ్యమును గూడ గ్రహించి ప్రదర్శించినాఁడు.

సీ. "కబరికాభరంబు కై పెక్కు విరులతో

నవటుదేశంబుపై నత్తమిల్ల" కాశీ. ౯౦. పీఠిక ౩

సీ. "కటివిరాజిత పీత కౌశేయ శాటితో

వితతకాంచీ గుణద్యుతి నటింప" భాగ ౩ - ౫౩౮

పోతనామాత్యుని శబ్దాలంకార ప్రియత్వము భాగవతమున గంగా స్రవంతి వలెఁ బలురీతులలో గాననగును.౧ అతని శబ్దాలంకార రచనాచణత్వమునకు భాస్కర రామాయణ కర్త పాల్కురికి సోమనాథులు కొంత యుద్బోధనిచ్చియుందురు. అంత్యాను ప్రాసమునకు భాస్కర రామాయణము, మిగిలిన శబ్దాలంకార ప్రక్రియలకుఁ గొంత పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకమును నాలంబనములుగా గోచరించుచున్నవి.

భాస్కర రామాయణము - భాగవతము :-

| | | |
|---|---|---|
| మ. | సతతాకీర్ణములై పురింజెలఁగె | భాస్క. బాల. ౧౬౯ |
| మ. | ధరణీశుంగనగాధి పుత్త్రుఁడు | భాస్క. బాల. ౧౭౬ |
| ఉ. | బాల్యుఁడశక్తుఁడీతఁడను భావము | భాస్క. బాల. ౧౮౭ |
| మ. | అతు లోత్సాహ ధురీణులై | భాస్క. బాల. ౨౨౧ |
| ఉ. | పాటిత దుష్ట సత్త్వ | భాస్క. బాల. ౨౬౧ |

---

౧. అవియన్నియుఁబోతన కవిత్వ విశేషములను బ్రకరణమున వ్రాయఁబడినవి.

| | | |
|---|---|---|
| ఉ. | జంగము వల్లులో | భాస్క. బాల. ౩౧౯ |
| మ.స్ర. | ఘనులారాజన్య సూనుల్ | భాస్క. బాల. ౩౫౭ |
| సీ. | జలమధ్య సందీప్త | భాస్క. బాల ౫౩౨ |
| మ. | అరుదేరంబొడ గాంచిరి | భాస్క. బాల. ౭౪౯ |
| శా. | ధీరోదారుఁడు నిర్వికారుఁడు | అయోధ్య.కాండ ౫ |

| భాగవతము :- | స్కంధము | పద్యము |
|---|---|---|
| కలుగఁడే నాపాలి కలిమి సందేహించి | ౧ | ౨౭ |
| అటఁ జనికాంచె | ౧ | ౪౨ |
| కలభంబుల్ సెరలాడు | ౧ | ౩౫ |
| ఇది నాకు నెలవని | ౧ | ౫౫౬ |
| మనుఁడుగ్రమొక్కెదన్ | ౯ | ౩౬౦ |
| ఉరుతరాక్రాంతాహి | ౯ | ౬౦౦ |
| తనువుననంటినధరిణి | ౧౦ | ౨౯౧ |
| స్తంభాదికంబులు తనకు నడ్డంబైన | ౧౦ | ౩౭౩ |
| విశ్వమోహనమైన | ౧౦ | ౭౬౩ |

పాల్కురికి సోమన – పోతన :-

పాల్కురికి సోమనాథుఁడు శైవవాఙ్మయ కర్తలలో సుప్రసిద్ధుఁడు. ఆతఁడు భాషయందును భావమునందును ఛందము నందును అవలంబించిన స్వాతంత్ర్యము తత్పక్కికలు సర్వజనైక వేద్యములు. పోతనయు మొదట తన మొదటి కావ్యమగు వీరభద్ర విజయమును రచించు నాఁటికి శైవుఁడు. ఆతనికిఁ బూర్వుఁడైన పాల్కురికి సోమనాథుఁడు మత విషయమునను సాహిత్య విషయమునందును గూడఁ బోతనకు నారవడియైనాఁడు. సోమనాథుని వృషాధిప శతకమునందలి శబ్దాలంకారవైచిత్రిపోతనపై ప్రకృష్టమగు ప్రభావమును జూపినని; యిటనొక ప్రశ్న. ఆంధ్ర వాఙ్మయమున శతకములన్నియు శబ్దాలంకార

బాహుళ్యములే యగుచుండగా వృషాధిప శతకము ప్రత్యేకముగ పోతన కుద్బోధకమైనదనుటయేమని. పోతన మొట్టమొదట శైవుడగుటయు, వృషాధిప శతకము శైవ గ్రంథములలో నొకటి యగుటయు, అప్పటికి యనఁగా పోతనకుఁబూర్వము శబ్దాలంకారములందలి యన్ని భంగిమలను ప్రదర్శించిన శతకములలో నిదియే మొదటి దగుటయు దానికి గారణము. అందుచే సోమనాధుని వృషాధిప శతకము పోతన విషయమున శతకసామాన్యమునుండి ప్రత్యేకింపఁబడినవి.

వృషాధిప శతకకారుఁడు శబ్దాలంకారములలో, ముఖ్యముగా ప్రతిపాద ప్రేత్యకాంత్యాను ప్రాసము సర్వత్రాంత్యాను ప్రాసము, అనువానిని పలుసార్లు వాడినాఁడు. అవన్నియు పోతన రుచికింపగుట చేత అవి యాతని స్వభావముతో మిళితమై తరువాత యాతఁడు నిర్మించుకొన్ని శబ్దాలంకారజలనిధియందు తరంగాయమానములై తమ ప్రత్యేకతను నిరూపించుకొను చున్నవి. వానికి దిఙ్మాత్రముగ రెండు మూఁడుదాహరణములీ దిగువ నీయబడినవి.

ప్రతిపాద ప్రత్యేకాంత్యాను ప్రాస – సోమన :-

"సరసవచస్క నిర్మలయ శస్క శివైక్య మనస్క భక్త హృ

త్సరసిజ గేహక్లుప్త భవదాహదయాపరివాహ చిత్సుఖీ" వృ.శ.ప. ౩౮

భాగవతము

"నిరుపమగుణజాలా! నిర్మలానందలోలా

దురిత ఘనసమీరా! దుష్టదైత్యప్రహారా!" భాగ. ౨ – ౨౮౮

సర్వత్రాంత్యాను ప్రాసము – సోమన

"నందితభక్త బృంద యవినాశరదాంశుముఖారవింద సా

నదలినీత కందకరుణామకరంద రసోపలాలిత" వృషా.శ.ప.౩౨

భాగవతము

"బాలు ప్రభావిశాలు హరిపాదపయోరుహ చింతక్రియాలోలు"

మొదలగున్నవి భాగ. ౭ – ౧౨౭

వీరభద్ర విజయ రచనావసరమునఁ బోతనపై సోకిన పూర్వకవుల ప్రభావము :-

పోతనామాత్యుని ప్రథమ కృతియగు వీరభద్ర విజయము నందుఁ గూడ నాతనికిఁ బూర్వులైన ప్రసిద్ధ కవుల ప్రభావము గోచరించును. అందుఁ గొన్ని నన్నయ తన భారతాది పర్వకృత్యాదిని "శ్రీ వాణీగిరిజాశ్చిరాయ" భార - అది. ప. ౧. శ్లో అను శ్లోక రూపముననను, తిక్కన తన విరాట పర్వ కృత్యాదిని "శ్రీ యన గౌరినాఁబరఁగు చెల్వకుఁ జిత్తము వల్లవింప" భా.వి. ౧ ప అను పద్య రూపముననను త్రిమూర్త్యాత్మకముగఁ గావించిన స్తుతిని పోతన చదివి చిన్ననాఁడే యాభావమును మెచ్చి యాకళించికొనినాఁడు. అది వీర భద్ర విజయ కృత్యాదిని రూపాంతరమున నీ దిగువ రీతిని గాననగును. "సిరియును వాణి గౌరియును జెన్నగుకన్యకు" వీర. విజ. ౧. ఆశ్వా ౧౧ పద్యము.

ఉత్తరహరివంశము - వీరభద్ర విజయము :-

నాచన సోమన సత్యభామ యుద్ధ సందర్భము నందుఁజెప్పిన "హరిఁ జూచున్ పరుఁజూచు" అని చెప్పిన భావమును పోతన చూచి మెచ్చి తలయూఁచి యద్దానిపైఁ దనకుఁ గల మక్కువకుఁ జిహ్నముగ నాభావమును వీరభద్ర విజయ భాగవతముల రెండింటను ప్రదర్శించినాఁడు. వీరభద్ర విజయమున మన్మధుఁడు శివుని పై బాణప్రయోగము చేయు నపుడు. "విలు జాచున్ వెలి జాచుఁ జూచు సురలన్" వీర. వి. ౨ఆ. ప ౧౦౧ అని యా ఛాయను ప్రదర్శించి మరల భాగవతమున సత్యభామ నరకాసురునితో యుద్ధము సేయు సందర్భమున స్మరించినాఁడు.

హరివంశ - వీరభద్ర విజయములు :-

హరివంశమునఁ భార్వతీ పరమేశ్వరుల క్రీడల వర్ణించునపుడు చెప్పిన "కంఠకాళిమదన కంఠంబునకు నూత్న" (హరి. ఉ. భా. ౭. ౭౧) అను భావము వీరభద్ర విజయమున మన్మథేంద్రుల సంభాషణావసరము నందుఁ జెప్పిన "కలకంఠ గణముల కలనాదముల తోడఁగల హంసంబు గడలు కొనఁగ" (వీర. విజ. ఆ. ౨. ప. ౬౩) అను పద్యమున నుద్బోధకము కానోపు.

భాస్కరరామాయణము - వీరభద్ర విజయము :-

వీరభద్ర విజయమున మన్మథ దహనానంతరము రతీదేవి విలపించు ఘట్టములోనిదగు:-

ఉ. "ఏవలరాజు భార్యను నుపేంద్రుని కోడల శంభు చేత నా"

వీర. విజ. ౨-౧౨౪ ప

అను రచనము భాస్కర రామాయణమునదు (సీతాపహరణానంతరమున) సీతరామునుద్దేశించి విలపించు ఘట్టమును దలపించుచున్నది.

ఉ. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరుకోడల రాముభార్యఁ జుండో"

భాస్క. రామా. యు. కా. ప. ౪౧

ఆంధ్రవాఙ్మయమున సీతమ్మ శోకమునందున్న ముద్ద రాలితనము, బేలతనము మఱియొక పాత్రలో కానము. ఆచ్ఛాయ మరల వీరభద్ర విజయకారుఁడు రతీ విలాపమునకుఁ దెచ్చినాఁడు. రతీ విలాపమును వర్ణించిన కాళిదాస నన్నె చోడాదులా ఘట్టమును చమత్కారమగను ప్రౌఢముగను వన్నెలు చిన్నెలు చేర్చి వర్ణించిరి. అంతియే కాదు. వారా సందర్భమున నామె యందుఁ గామ విహ్వలత్వమును ప్రధానముగఁ ప్రదర్శించిరి. పోతనకు సీతమ్మ శోకమందలి నసారళ్యము అమాయికత్వమే నచ్చినవి. అందులకే భాస్కరుని స్మరించి ఆ ఛాయను ప్రదర్శించినాఁడు.

కాశీఖండము – వీరభద్ర విజయము

వీరభద్ర విజయమునందలి దక్షుని యజ్ఞ వృత్తాంతము దధీచి శివునకుఁ జెప్పు సందర్భములోని :

సీ "నీలకంఠునకు నెచ్చెలికాఁడు కాఁడొకో
యటమటీఁడైన యీ యంబుజాక్షుఁ

-------------------

తే. ఏమికుడువంగ వచ్చితిరిందు మీరు
తాము పాలించు నట్టి లోకములు విడచి
పంచవదనుని కను జేవురించెనేని
తక్షణంబునఁదమయాళ్ల త్రాళ్లు దెగవె" వీర.వి. ౪.౪౭ ప.

అను సీస పద్య రచనము శ్రీనాథుని కాశీఖండములోని దక్షేశ్వర లింగ ప్రాదుర్భావ ఘట్టమునందలి :

సీ. "శితికంధరునకు నెచ్చెలి కాఁడు గాఁడొకో
యటమటీఁడైన యీ యక్షభర్త"

తే. డేమికుడు వంగ వచ్చి నారిండ్ల విడచి
హరుని వెలివెట్టినట్టి యీ యాగమునకుఁ
బంచవదనునికను జేవురించె నేని
తక్షణంబునఁ దమయాండ్ర త్రాళ్లు దెగవె. కాశీ. ఖ. ౭.౬౦ ప.

అను రచనమునకు యథాతథానుకరణము సీస పద్య పదములందలి రచనలో నించుక భేదమున్నను తేటగీతి మాత్రము యథాతథముగా గ్రహింపబడినది. శ్రీనాథుని సీస పద్యారంభమందలి "శితికంధరునకు" అను పదము పోతన రచనలో "నీలకంఠునకు" అని మారుటలో ప్రాసపూర్వాక్షర నియమము సడలినది.

ఇట్లే మంచన కేయూర బాహు చరిత్రము మడికి సంగనార్యుని వాశిష్ఠరామాయణము, జక్కన విక్రమార్క చరిత్ర మొదలగు గ్రంథముల ప్రభావము పోతన కృతులలో నచ్చట ఛాయా మాత్రముగ చూపట్టును. కాని నస్ఫుటములగు వానిని బహుధా విపులీకరించుటలో ప్రయోజనమంతగా లేదని భావించి స్ఫుటములగు వానిని మాత్రమే యీ ప్రకరణమున వివరించితిని.

# 8. భాగవత తత్త్వము – ఆంధ్రలోకమునకుఁ బోతన యిచ్చిన సందేశము

ఆంధ్ర లోకమునకుఁబోతన యిచ్చిన సందేశమేమి? ఈ ప్రశ్నకు సమాధనమీయ వలయునన్నచోఁదత్ప్రతమగు భాగవత తత్త్వము నెఱుంగ వలయును. పోతన రచించిన గ్రంథములలో భాగవతముత్తమోత్తమము. భాగవతము పురాణములందెల్ల శ్రేష్ఠము. ఇందులకుఁ బ్రాచీనములగు గ్రంథములనేకములు ప్రమాణములు. భాగవత గ్రంథమును గూర్చి గరుడ పురాణమున నిట్లు చెప్పఁబడి యున్నది –

"అర్థోయం బ్రహ్మ సూత్రాణాం భారతార్థ వినిర్ణయః

గాయత్రీ భాష్య రూపోఽసౌవేదార్థ పరిబృంహితః

పురాణానాం సామరూపః సాక్షాద్భగవతోదితః

ద్వాదశ స్కంధయుక్తో యం శతవిచ్ఛేద సంయుతః

గ్రంథోఽష్టాదశ సాహస్రః శ్రీమద్భాగవతాభిధః"

ఇట్లే మత్స్య పురాణమున :–

"యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః

వృత్రాసురవధోపేతం తద్భాగవతమిష్యతే

అష్టాదశ సహస్రాణి పురాణం తత్ర్ప కీర్తితమ్."

స్కాందమున :–

"గ్రంథోఽష్టాదశ సాహస్రోద్వాదశస్కంధ సమ్మితః

హయగ్రీవ బ్రహ్మ విద్యాయత్ర వృత్రవధస్తథా

గాయత్ర్యాచ సమారంభస్తద్వై భాగవతం విదుః"

భక్తి జ్ఞాన వైరాగ్య బోధకమగు భాగవత పురాణము సర్వపురాణ శ్రేష్ఠ మనుటకు దానిపై వెలసిన వ్యాఖ్యలే సాక్ష్యము.

౧. అమృత తరంగిణి

౨. ఆత్మ ప్రియ

౩. కృష్ణపది

౪. చైతన్య చంద్రిక

౫. జయమంగళ

౬. తత్వ ప్రదీపిక

౭. తాత్పర్య చంద్రిక

౮. తాత్పర్య దీపిక

౯. భగవల్లీలాచింతామణి

౧౦. రసమంజి

౧౧. శ్రీనివాసకృత ప్రకాశవ్యాఖ్య

౧౨. శుకపక్షీయ ప్రబోధిని, (జనార్దన భట్ట నరహరుల టీకలు)

౧౩. కల్యాణ 'రాయ' కృత తత్త్వదీపిక. కృష్ణ భట్ట కారసాధుల టీకలు, గోపాల చక్రవర్తిటీక.

౧౪. అన్వయబోధిని. చూడామణి చక్రవర్తికృతము.

౧౫. భావప్రకాశిక నరసింహాచార్యకృతము. యదు పతిటీక.

౧౬. వల్లభాచార్య కృత సుబోధినీ వ్యాఖ్య

౧౭. విజయధ్వజతీర్థ కృతపద రత్నావళీవ్యాఖ్య. విఠలదీక్షితుని టీక.

౧౮. సారార్థదరిశని : విశ్వనాథ చక్రవర్తికృతము. విష్ణు స్వామి కృత టీక.

౧౯. భాగవత చంద్రిక. వీరరాఘవ కృతము.

౨౦. భావార్థ దీపిక శివరామకృతము

౨౧. భావార్థ దీపిక శ్రీధరకృతము

౨౨. స్నేహపురణి; కేశవదాసకృతము. శ్రీనివాసాచార్యులును సత్యాభినవ తీర్థులును సుదర్శన సూరియు వ్రజభూషణుఁడును వ్రాసిన టీకలు.

౨౩. హరిభానుకృత భాగవత పురాణార్కప్రభ

౨౪. భాగవతపురాణ ప్రథమ శ్లోక టీక. జయరామమధుసూదన సరస్వతులచే వ్రాయఁబడినది.

౨౫. వల్లభాచార్యకృత పంచమస్కంధ టీక.

౨౬. సుబోధిని. బాలకృష్ణ యతికృతము.

౨౭. వైష్ణవతోషిణి. సనాతనగోస్వామి కృతము

౨౮. వాసుదేవకృత బుధరంజని

౨౯. నిబంధ ప్రకాశ. విట్ఠలదీక్షిత కీతము.

౩౦. అనుక్రమణిక. వల్లభాచార్యకృతము.

౩౧. ఏకాదశస్కంధ తాత్పర్య చంద్రిక. బ్రహ్మానందకృతము.

౩౨. అనుక్రమణిక. బోపదేవకృతము.

ఈ వ్యాఖ్యలే గాక భాగవత పురాణమునకు సంబంధించిన గ్రంథము లితరములనేకములు గలవు. రామానంద తీర్థులు, ప్రియదాసు, విశ్వేశ్వరులు, పురుషోత్తములు, శ్రీనాథుఁడు. బృందావన గోస్వామి, విష్ణుపూరి, సనాతనుఁడు మొదలగు వారు భాగవత పురాణ తాత్పర్యమును నిర్ణయించుటకై యనేక గ్రంథములను వ్రాసిరి. పూర్ణప్రజ్ఞులు గూడఁదమ మహా భారత తాత్పర్య నిర్ణయముతో పాటు భాగవత తత్త్వ నిర్ణయమను గ్రంథమును వ్రాసిరి. ముఖ్యములగు భాగవత శ్లోకములు గొన్ని యిందు దాహృతములై యున్నవి. భాగవత తాత్పర్య నిర్ణయముపై వ్యాఖ్యలు పెక్కువెలసినవి. అందుఁగొన్ని యిటఁ జేర్కొనఁబడును.

౧. భాగవత తాత్పర్య వ్యాఖ్య. నామాంతరము తాత్పర్యబోధిని.

౨. భాగవత తాత్పర్య నిర్ణయ వ్యాఖ్యానివరణము.

౩. భాగవత తాత్పర్య నిర్ణయ వ్యాఖ్యా ప్రబోధిని.

౪. భాగవత తాత్పర్య నిర్ణయ వ్యాఖ్యా పద్యరత్నావళి

౫. భాగవత తాత్పర్య నిర్ణయ వ్యాఖ్యా ప్రకాశ

౬. భాగవత తాత్పర్య నిర్ణయటీక

ఈ వ్యాఖ్యలను బట్టియే శ్రీమద్భాగవత పురాణమునకుఁగల ప్రాశస్త్యము స్పష్టము. ఇన్ని వ్యాఖ్యలు భారత రామాయణములకుఁగూడ లేవు.

భాగవత మహా పురాణము :-

పురాణములు రెండు విధములు - మహా పురాణములు, ఉపపురాణములు. ఉప పురాణములనే సామాన్యముగాఁ బురాణమని వ్యవహరింతురు. దాని లక్షణములైదు :-

సర్గము; ప్రతి సర్గము; వంశము; మన్వంతరము; వంశాను చరితము. ఈ యైదును గాక మఱియైదులక్షణములు గలసిన మహా పురాణమగును. ఆ లక్షణములు :- ౧. స్థానము, ౨. పోషణము, ౩. ఊతి, (వాసన), ౪. నిరోధము, ౫. ముక్తి. ఈ పది లక్షణములును గలదిగావున భాగవతము మహా పురాణమగుచున్నది. ఇఁక నీ లక్షణ వివరణము - అవ్యక్తమందు గుణ పరిణామముచేఁ గల్గు మహదహం కార పంచతన్మాత్రాగ గనాది మహా భూత సృష్టియే సర్గము. ఈశ్వరునిచే సృజింపఁబడిన బ్రహ్మాండ శరీరాభిమానయగు హిరణ్యగర్భునిచేఁ జేయఁబడిన చరాచర భూత సృష్టియే ప్రతి సర్గము. లోక సంరక్షణార్థము భగవంతుఁడు మత్స్యకూర్మాద్యవతారములను ధరించి జగద్రక్షగావించుటయే స్థానము లేక స్థితి. దీనికే వైకుంఠ విజయమనియు నామాంతరము గలదు. భగవద్దర్శితమగు భక్త జనానుగ్రహమే పోషణము. భగవదనుగ్రహము వడసిన స్వాయంభువాది మనువుల సద్ధర్మ వివరము మన్వంతరమనఁబడును. కర్మవాసన లూతులనంబడును. భగవంతుని లీలావతార చరిత్రములును హరిభక్తులగు సంబరీషాదుల చరిత్రములును వంశాను చరితములనంబడును. పరమాత్ముని యోగ నిద్ర ననుసరించి జీవులు నిజోపాధులతోఁ గూడ నేకీభవించుటయే, లయ మనఁబడును. దీనినే నిరోధమనియుఁ జెప్పుదురు. ప్రకృతి సంబంధములు సడలినంతనే జీవుఁడు స్వస్వరూపముతోఁ బ్రకాశించుటయే ముక్తి యనంబడును. జగములకెల్లనుత్పత్తి స్థితిలయము లెవ్వని వలనఁ గలుగునో యతఁడే బ్రహ్మమనియుఁ బరమాత్ముఁడనియు భగవంతుఁడనియు నాశ్రయమనియుఁ జెప్పఁబడును. ఈ పది లక్షణములును భాగవత గ్రంథమునఁ దృతీయ స్కంధము మొదలు పండ్రెండవ స్కంధము వఱకుఁ గ్రమముగ నిరూపింపఁబడియున్నవి. అనఁగా నొక్కొక్క స్కంధమునందొక్కొక్క విషయము ప్రాధాన్యమును వహించుననుట. ఇతరాంశములు గూడఁ దత్పోదబలకములుగ నుండవచ్చును.

## బృహదారణ్య శ్రుతి

ఇందు 'ఇతిహాసాది శబ్దములెమిదియు వేదములందుఁగల యష్ట విధార్థ వాదములను జెప్పుచున్నవనియు ఋగ్వేదాది శబ్దములు విధి విధానమును జెప్పుచున్నవనియు శ్రీ శంకర భగవత్పాదులభిప్రాయపడిరి. కాని భాష్య వార్తిక కారులగు శ్రీ సురేశ్వరాచార్యులా శబ్దము సుప్రసిద్ధములగు పురాణేతిహాసాదులే కాని యన్యములుగానేరవనియు నట్లన్యార్థమును గల్పించి ప్రసిద్ధార్థమును విడనాడుట సమంజసముగాదనియు నుద్ఘాటించిరి.

ఈ క్రింది వాక్యములు గూడఁ బై యంశమునే ధ్రువపఱచుచున్నవి.

"పురాతపశ్చచారో(గ్రమమరాణాంపితామహ ః

వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణేస్యాత్ర సంసయః"

## నారదీయము, తత్త్వసందర్భము

ఇందు వేదార్థముకంటెఁ బురాణార్థమే గణనీయమని చెప్పఁబడి యున్నది. ఇయ్యది కేవలమౌపచారిక వాక్యమనరాదు. వేదములందలి కర్మకాండమంతయు సత్త్వ నిష్ఠులగు జ్ఞానులకంతగా నుపాదేయము కాదు. వేదములందునుఁ గర్మకాండయు ముఖ్యముగా గీతా శాస్త్రమునందును గర్హింపఁబడియే యున్నవి.

"వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతివాదినః

కామాత్మానః స్వర్గపరాః జన్మకర్మఫలప్రదామ్

క్రియావిశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్

వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధేనవిధీయతే".

"త్రైగుణ్య విషయావేదా నిస్త్రైగుణ్యోభవార్జున" (గీత)

కావున నిందు "వేదార్థాదధికంమన్యే" అనుమాటకు మనమాశ్చర్య పడఁబనిలేదు. ఇట్లే స్కాందమున వేదవిదుఁడయ్యుఁ బురాణార్థమునెఱుంగనిచో నాతఁడు విచక్షణ శూన్యుఁడగుడని చెప్పఁబడియున్నది.

"వేదవన్నిశ్చలం మన్యే పురాణార్థం ద్విజోత్తమాః

వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణేన్యాత్ర సంశయః స్కాంద - ప్రబాసఖండ.

పురాణములు వేదతుల్యములనునది సునిశ్చితము. కాని పురాణములన్నియు కే త్రోవను నడచినవి కావు. అవి మఱల ముత్తెఱఁగులు :-

౧. సాత్త్వికములు, ౨. రాజసములు, ౩. తామసములు.

"పంచాంగం చపురాణం స్యాదాఖ్యానమితరంస్మృతమ్

సాత్త్వికేషు చ కల్పేషు మహాత్మ్య మధికంహరే ః

రాజసేషు చ మహాత్మ్యమధికం బ్రహ్మణోవిదు ః

తద్వదగ్నేశ్చమహాత్మ్యం తామసేషు శివస్యచ."

మత్స్య పురాణము.

ఇందుఁ దామసములకంటె రాజసములును రాజసముల కంటె సాత్త్వికములును ప్రశస్తతరములు. సాత్త్వికములందు భాగవతముత్తమోత్తమము. భాగవత ప్రథమ శ్లోకార్థము ః- భాగవత ప్రథమ శ్లోకమునందే తదర్థమంతయు నిమిడియున్నది. భాగవత తత్త్వము నెఱుంగవలెనన్నచో నా శ్లోకార్థమును దెలిసికొనుట యొంతయు నావశ్యకము.

"జన్మాద్యస్యయతోఽ న్వయాదితరత

శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్

తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే

ముహ్యంతి యత్సూరయః

తేజోవారి మృదాం యథా వినమయో

యత్రత్రిసర్గో మృషా

ధామ్నాస్వేన సదా నిరస్తకుహకం

సత్యం పరం ధీమహి.

దీనికిఁ బోతన చేసిన యాంధ్రీకరణ మాంధ్రీకరణ విధానములో నీయఁబడినది

"అర్థోయం బ్రహ్మ సూత్రాణా" మ్మనునది భాగవత విషయమున సర్వథా సత్యము. పిండీకృతమగు భాగవతార్థమే యీ శ్లోకము గావున నిందును బ్రహ్మ సూత్రార్థము స్పష్టము కావలెను.

"అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనునది బ్రహ్మ సూత్రములలో మొదటిది. ఈ సూత్రార్థము "జన్మాద్యస్య" యను శ్లోకముయొక్క తృతీయ చతుర్థపాదములందిమిడి యున్నది. తేజోవారి – ధీమహి ఈ సూత్రమున కర్థమిది ః- అథ అనంతరము; అతః

అందువలన; బ్రహ్మజిజ్ఞాసా బ్రహ్మమును గూర్చి పర్యాలోచన యనుట. ఇందలి బ్రహ్మపదవాచ్యుఁడు పురుషోత్తముఁడే. అతఁడప్రాకృతగుణ సమన్వితుఁడు. అనంత కల్యాణ గుణ పరిపూర్ణుఁడు. ఇట్టివాఁడు భగవంతుఁడొక్కఁడే. అతఁడే శ్రీకృష్ణుఁడు. "కృష్ణస్తు భగవాన్ స్వయమ్". ఈ భగవత్పదము ముఖ్యముగా శ్రీకృష్ణునకును గౌణముగా నవతారమూర్తులకును వర్తించును. మీది యర్థమునే శ్లోకమునందలి 'పర'మ్మను పదము దెలుపును. సంస్కృతమునఁ బర శబ్దమునకు ముఖ్యము, ప్రధానము అనియర్థము. ముక్త ప్రగ్రహోయోగ వృత్తి వలన నిటఁ బరశబ్దమునకు ముఖ్యాతి ముఖ్యుఁడని యర్థము. అతఁడే మూల స్వరూపి. ఆతఁడు సర్వులయందును గలఁడు. కాని యాతఁడు సర్వాతీతుఁడు గూడ.

బ్రహ్మ శబ్దవాచ్యుఁడెవడో తెలసినది. ఇఁక జిజ్ఞాసా పదమును గూర్చి విచారింతము "జ్ఞాతుం ఇచ్ఛాజిజ్ఞాసా". తెలిసికొనుట యనఁగఁ గేవల వాచ్యార్థమును దెలిసికొనుటగాదు. దీనియందు ధ్యానోపాసనాదులిమిడి యున్నవి. 'ధ్యై' అను ధాతువునకుత్తమ పురుష బహువచనపము ధ్యాయేమ. దీనికి ఛాందసమగు రూపమే 'ధీమహి'. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడగు శ్రీకృష్ణుఁడు వ్యాసుని కొక్కనికే కాక సర్వ ప్రపంచమునందలి సర్వులకు సర్వకాల సర్వావస్థల యందును ధ్యేయుఁడే.

ఇఁక "అథ – అతః" అను పదములను గూర్చి విచారింతము. దీనిని వివరించుటకుఁ బూర్వము మనము ముఖ్యముగా గమనింపవలసిన విషయమొకటి గలదు. వేదములందుఁ గర్మ కాండజ్ఞాన కాండయను రెండు విభాగములు. యజ్ఞయాగాదులను గూర్చి చెప్పునది కర్మకాండ. పరబ్రహ్మతత్త్వమును గూర్చి చెప్పునది జ్ఞానకాండ. కర్మకాండను జెప్పునది పూర్వ మీమాంస. జ్ఞానకాండను జెప్పునది యుత్తర మీమాంస. అనఁగాఁ బూర్వోత్తర మీమాంసలు క్రమముగాఁ గర్మజ్ఞాన ప్రధానములనుట కర్మ కాండకుఁబ్రయోజనము స్వర్గ ప్రాప్తి. ఇది యశాశ్వతము. పునరావృత్తి రహితమగు మార్గము జ్ఞానమార్గమే. కర్మ ఫల మశాశ్వతము, పరిమితము. జ్ఞాన ఫలము శాశ్వతము, అనంతము. కాని కర్మాచరణనంతరమే జ్ఞాన మార్గమును జేపట్టవలయును. అంతదనుక మనుజుఁడు జ్ఞానమార్గ స్వీకరణ మున కధికారికాఁడు. అందులకే 'అథ' అనంతరము అను పదము. అశాశ్వతమగు ఫలము నిచ్చు కర్మాచరణము నందే కొట్టుకొనుట వలన ఫలమేమి? శాశ్వతముగుదానికి యత్నింపవలయును. అందులకే 'అతః' అను పదము ప్రయుక్తము. శాశ్వతమగునదేద్ది? అని ప్రశ్న. సత్యము శాశ్వతము; కేవలము. కావునఁ గేవలుఁడు సత్యస్వరూపుడు. అందులకే భాగవతమున 'సత్య'మ్మను పదము 'పర'మ్మను పదమునకుఁ బూర్వము ప్రయుక్తమై యున్నది.

'సత్య' మ్మను పదమునకు 'సతేహితమ్' అని వ్యుత్పత్తి. అనఁగా నెవ్వని యునికి వలన సర్వమును నిలిచి యున్నదో యట్టి సత్స్వరూపుఁడనుట అట్టి సత్తకుఁగారణము జ్ఞానము. జ్ఞానమానంద హేతువు. ఉపలక్షణచే జ్ఞానానంద స్వరూపుఁడని చెప్పనగును. అందులకే శ్రుతి "సత్యం జ్ఞానమానందం బ్రహ్మ" తై ౨-౧-౧ యని చెప్పుచున్నది. అనగా నా పరబ్రహ్మము సచ్చిదానంద విగ్రహుఁడనుట.

"ధామ్నా --- కుహకమ్" అనునదియు నా కేవలుఁడేల పరశబ్ద వాచ్యుఁడో చెప్పుచున్నది. ధామ శబ్దమునకుఁదేజమని యర్థము. కుహక శబ్దమునకు మాయయని యర్థము. ౨యా శక్తిని జయించుటకు భగవదనుగ్రహము కావలెను. ఆ యనుగ్రహము కేవల భక్తి సాధ్యము. అందులకే గీతా శాస్త్రమునందుఁ గూడ "దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా, మామేవయే ప్రపద్యంతే మాయామేతాంతరంతితే" అని భగవానుఁడు చెప్పియున్నాడు. "స్వేనధామ్నా సదాన రస్తకుహక" మ్మనుటచే మాయా శక్తి దురత్యయయయ్యు భగవంతునకు నిత్య విధేయయే యని తెలియుచున్నది. త్రిగుణాత్మకమగు మాయను జయించుటకే బ్రహ్మజ్ఞానమావశ్యకము. అద్దానికి ననఁగా బ్రహ్మ జ్ఞానమునకు భగవద్భక్తియే ప్రాధాన సాధనము నిత్య సత్య స్వరూపుఁడును బరుఁడునగువాఁడే సదా నిరస్త కుహకుఁడు. కావుననే సదాధ్యేయుఁడు.

ఇట్లు బ్రహ్మ సూత్రములలోని ప్రథమ సూత్రార్థము భాగవత ప్రథమ శ్లోక తృతీయ చతుర్థ పాదములందిమిడి యున్నది. ఇఁకఁ దక్కిన నాల్గు సూత్రముల యర్థమెట్లు భాగవత ప్రథమ శ్లోక ప్రథమద్వితీయ పాదములందిమిడి యున్నదో పరిశీలింతము :-

వస్తు నిర్వచనమును ద్వివిధాచేయవచ్చును :- 1. స్వరూప లక్షణము (By pointing out its essential marks) (భాగవత ప్రథమ శ్లోకము నందలి సత్య పరశబ్దములచే స్వరూపకణము చెప్పఁ బడియున్నది) 2. తటస్థ లక్షణము :- (By pointing out its collateral marks) ఇది "జన్మాద్యస్య యతః" అను దానిచేఁ జెప్పఁ బడుచున్నది. జన్మాది - అస్య - యతః "విశ్వ జన్మస్థితి విలయంబు లెవ్వని వలన నేర్పడు" నని మీఁది సూత్రమునకే జన్మా ద్యస్య యతః అనునది శారీరక బ్రహ్మ సూత్రములలో రెండవది పోతన యాంధ్రీకరణము. శ్రుతియు "౧ యతోవా ఇమా నిభూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్ర యంత్యభిసంవిశంతి" యని చెప్పుచున్నది. స్మృతియు "౨ యతస్సర్వాణి భూతాని భవంత్యాదియుగాగమే" యనినుడువుచున్నది.

వేదాంత సూత్రములందలి మూఁడవ సూత్రమును నాల్గవ సూత్రమును మీఁది

యభిప్రాయమునే బలపఱచుచున్నవి. "శాస్త్రయోనిత్వాత్" ఇది మూఁడవ సూత్రము. దీని యర్థమును రెండు విధములుగాఁ జెప్పనగును. ప్రత్యక్షాది ప్రమాణములచే బ్రహ్మము తెలియఁబడదు. అందువలన శబ్దమే యనఁగా శ్రుతి ప్రమాణమే పరిగ్రాహ్యము. "యతోవా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాది శ్రుతి ప్రమాణము వలననే బ్రహ్మ పదార్థము నెఱుఁగ నగును. 'తత్తు సమన్వయాత్' అను నాల్గవ సూత్రము గూడ మీఁది భావమునే వ్యక్తీకరించును. బ్రహ్మతత్త్వము నెఱుంగుటకు శబ్ద ప్రమాణమే యాధారము. యుక్తి ప్రత్యుక్తులుగావు. యుక్తి ప్రత్యుక్తుల కొక యవధి లేదు. కావున నిట ననవస్థాదోషము తప్పదు. పర ప్రహ్మ విషయమున శ్రుతిపామాణ్యము సమన్వయ మూలమున సాధ్యము. అనఁగా శ్రుతులన్నియు అన్వయ – ఇతరత : పరబ్రహ్మమునే నిరూపించుననుట.

రెండవ సూత్రమున (జన్మాద్యస్య యతః) జగత్కారణము బ్రహ్మమని చెప్పఁబడినది. కాని యొకఁడు సృష్టికారణము ప్రధానమేల జడ ప్రకృతి కారాయని వాదింపవచ్చును. కాని యది సరికాదు. అందులకే "అభిజ్ఞః" కార్యము లందభిజ్ఞుఁడై అను పదమువాడఁబడినది. ఇది చేతన లక్షణము కాని జడలక్షణము గాదు జగత్కారణత్వమును బ్రహ్మమునే తెల్పుచున్నది. "౧ ఈక్షతేర్నా శబ్దమ్మను బ్రహ్మ సూత్ర మిద్దానినే చెప్పుచున్నది.

**హరిభక్తి భూమికలు :–**

భాగవతము భక్తి ప్రధానమగు గ్రంథము. ఇందుధ్యేయుఁడు నారాయణుఁడు. భగవద్భక్తిని గొన్ని భూమికలుగ, మెట్లుగ, శ్రీధరమధుసూదన సర్వత్యాదులు విభజించి యున్నారు. భాగవతము నందలి భక్తుల చరిత్రములనేకములీ భూమికలకు సంబంధించియుండును. కావున నవ్వానిని గూర్చి యిట వ్రాయఁబడును. భాగవత ప్రథమ స్కంధమునదలి వ్యాస నారద సంవాదము నాధారముగాఁ గొని నారదుని పూర్వజన్మ చరిత్రము నాధారముగా శ్రీధర స్వాములు తొమ్మిది భూమికలనిట్లు చెప్పియున్నారు. ౧. మహత్సేవా, ౨.తతస్తత్కృపా ౩. తతస్తద్ధర్మశ్రద్ధా, ౪. తతో భగవత్కథా శ్రవణమ్, ౫. తతో భగవతి రతి : ౬. తయాచదేహద్వయ వివేకాత్మ జ్ఞానమ్, ౭. తతోదృఢాభక్తిః, ౮. తతో భగవతత్త్వజ్ఞానమ్, ౯. తతస్తత్కృపయా సర్వజ్ఞత్యాది భగవద్గుణావిర్భావః" – హరిభక్తి రసాయన ప్రథమోల్లాసములో శ్రీమధుమాదన సరస్వతులు వానిసే పదునొకండు భూమికలుగ విభజించియున్నారు.

---

౧. శ్రీధరీయము ప్రథమ శ్లోక వ్యాఖ్య

౨. చూడు :– వావిళ్ల ప్రతి, పుట. ౪. ౧౯–౨౭ ప్రకటితము

"ప్రథమంతుమహత్సేవా, తద్దయా పాత్రతావునః
శ్రద్ధాతుతేషాంధర్మేషు తతోహరిగుణ శ్రుతిః
స్వరూపాధిగతిస్తతః
ప్రేమవృద్ధిః పరానందే తస్యాథస్ఫురణంతతః
భగవద్ధర్మ నిష్ఠాతః స్వస్మిన్ తద్గుణ శాలితా
ప్రేమ్ణోథ పరమాకాష్ఠే త్యుదితాభక్తి భూమికాః"

ఇయ్యని వరుసగావివరింపఁ బడును. ప్రప్రథమముగఁజెప్పఁబడినది మహత్సేవ. అనఁగా మహాత్ములగు వారిని సేవించుట. మహాత్ములనఁగా నిట భాగవతులనియే తాత్పర్యము భాగవతులకు సదాధ్యేయుఁడు భగవంతుఁడే. కావున భాగవత సేవయు భగవత్సేవక్రిందనే లెక్కింపఁబడును. నారదుఁడు వ్యాసునితోఁ దన పూర్వ జన్మవృత్తాంతమును జెప్పుచున్నప్పుడు మహత్సేవ వలనఁ గలిగిన యౌన్నత్యమును వివరించి యున్నాఁడు. పూర్వజన్మమున నారదుఁడొక దాసీపుత్త్రుఁడు. ఆతఁడు వేదవాదులకుఁ బరిచర్యచేసెడివాఁడు. వారి యనుగ్రహముననే యాతనికి భగవత్స్వరూప జ్ఞానము గలిగినది. కావుననే హరిభక్తి భూమికలలోఁ బ్రథమము మహత్సేవ. సాధు సేవవలనఁ దత్కారుణాలాభము. దాని వలన ధర్మ శ్రద్ధ వలన భగవత్కథాశ్రవణము. దాని భగవదాసక్తి. అయ్యాసక్తి వలన దేహద్వయ వివిక్తాత్మజ్ఞానము. ఆ జ్ఞానము వలన దృఢ భక్తి. ఆ భక్తివలన భగవతత్త్వ విజ్ఞానము. దాన సర్వజ్ఞత్వాది భగవద్గుణావిర్భా వంబనుగ్రమముగాఁ గలుగును. భగవదర్పణ పూర్వకముగఁ జేయఁ బడుకర్మము భక్తి యోగ సమన్వితంబైన జ్ఞానము నొదవించును. బాహ్య కర్మములగు భోజన దాన తపంబులెల్ల నాకర్పింపుమని భగవంతుఁడర్జునున కుపదేశించిన గీతార్థమును దలపోసి తత్క్రమమునఁ గర్మములాచరించువారు కృష్ణ నామకీర్తన స్మరణాదులంజేసిన వారగుదురు. ప్రణవాది మంత్రపూర్వకములుగ వాసుదేవ చతుర్మూర్తి నామములకు భక్తితో నమస్కరించి, మంత్రమూర్తియు నమూర్తియునగు యజ్ఞ పురుషుంబూజించువాఁడు సమ్యగ్దనుండగును.

మహాత్ముల సేవశ్రేయోదాయకమని ఋషభ దేవుఁడు కొడుకుల కిట్లుపదేశించెనుః— ముక్తిద్వారము మహాత్ముల సేవయని పెద్దలు సెప్పుదురు. సమచిత్తులు, ప్రశాంతులు విగత క్రోధులు, సుహృత్తులు, సదాచార పరులును బరమేశ్వరుఁడనగు నా మీఁది సౌహృదంబే

ప్రయోజనంబని నిశ్చయించి ధర్మానుష్ఠానార్థము దేహభరణమును తలంపునఁ బుత్రకళత్ర గృహాదుల యెడ నాసక్తి యుడిగి లోకమున సత్యంతావశ్యకంబైన యర్థంబే గ్రాహ్యంబని తదితరములయెడ విరక్తులగు వారును మహాత్ములనఁబడుదురు. ౫-౫-౨౪.

కపిలుడు తనతల్లియగు దేవహూతికి నిట్లే చెప్పియున్నాఁడు. ప్రాకృత జనుల సంగముఆత్మకు శిథిలము గాని పాశమైనను సాధుసంగము వివృతమగు మోక్షద్వారము "అని పెద్దలు చెప్పుదురు. మూర్ఖుల చర్యలను భూమి వలె సహించువారును స్వార్థ రహితముగఁబర దుఃఖో పశమనమునకై యత్నించు కారుణికులును, సర్వసుహృత్తులును, లోకమునందెచ్చటను శత్రువులు లేనివారును, శమదమాది గుణ సంపన్నులును, పరకార్యసాధకులు నగు సాధువులును, అనన్య భావమున నాయెడ భక్తిం జేసి మదర్థంబు లౌకికాలౌకిక కర్మములను ద్యజించిన వార్తైత్యక్త స్వజన బాంధవులై, మదీయ కథలఁ గీర్తించుచు వినుచు సంతసిల్లుచుందురు. మచ్చిత్తులగు నట్టివారినిఁ దాపములు దపింపఁ జాలవు. తల్లీ! వారే సర్వసంగ వివర్జితులగు సాధువులు. సర్వదోషహరులగు నట్టి సాధువుల సాంగత్యము ప్రార్థనీయము. ( ౩. ౨౫-౨౦౫)

మహత్సేవా విషయమున ముఖ్యముగా గమనింపఁదగిన యంశమొకటి గలదు. భక్తులయోగ్యతను బట్టి కొందకు సాక్షాద్భగవత్సాంగత్య మబ్బును. కొందఱకు భగవత భక్త సంగమలవడును. సాక్షాద్భగవత్సాంగత్యము గలవారు కృతార్థులు గాన వారికి భాగవత సాంగత్యమనావశ్యకము. భాగవత సాంగత్యము మాత్రమే గల భక్తులు, తత్ఫలమగు భగవత్సాంగత్యము లభించు దనుక యత్నింపవలయును.మొదటి పక్షములో, భగవంతుఁడే భక్తులకు సాధనము, సాధ్యము. రెండవ పక్షమున భాగవత సేవసాధనము. భగవత్సాంగత్యము సాధ్యము. దేవహూతియు యాదవ పాండవులును, గోపికలును సాక్షాద్భగవత్సేవవలనఁ గృతార్థతనందిరి. నారద వ్యాస శుక ప్రహ్లాదాదులు భాగవత సేవవలన ధన్యులయిరి.

**2. తద్దయాపాత్రతాతతః**

పిదపనమ్మహాత్ముల దయగలుగుటకు శిష్యులకు యోగ్యతగలుగవలెను. ఇది రెండవ భూమిక. వారిదయ సంపాదించుటకు పాయము తత్సౌశీల్యాది గుణాచరణమే. వారి సహజ గుణములనీ తీరున శ్రీకృష్ణుఁడుద్ధవున కుపదేశించెను :- పరదుఃఖమును సహింపనివాఁడును ఇతరులకు ద్రోహము సేయనివాఁడును, నన్యులు దనకపకృతి యొనర్చి ననునోర్మితో సహించు వాఁడును, సత్త్వనిష్ఠగలవాఁడును, నసూయాదిదోష వివర్జితుఁడును సుఖదుఃఖములందు సమబుద్ధిగలవాఁడును, యథాశక్తి, పరులకు పకారముగావించువాఁడును.

గాను చపలముగాని చిత్తముగలవాఁడును నింద్రియ నిగ్రహముగలవాఁడును, మృదువును, శుచియు నపరిగ్రహుఁడు నగువాఁడును, దృష్టాదృష్టఫలములకు సాధనములనాచరింపనివాఁడును మితాహారముగలవాఁడును మనోనిగ్రహము గలవాఁడును స్వధర్మస్థిరుఁడగు వాఁడును సంసారమసారమని చింతించువాఁడును, సావధానచిత్తుఁడును, నిర్వికారియుఁ గష్టములు సంభవించినను దైన్యము నొందనివాఁడును దేహ సంబంధములగు జరామృత్యువులును ప్రాణ సంబంధములగు క్షుత్పిపాసలును, మనస్సంబంధులగు శోకమోహములను షడూర్ములకును భయపడని వాఁడును దేహాద్యభిమానము లేనివాఁడును నితరులను సన్మానించువాఁడును నన్యులకుఁదత్త్వ బోధనేయఁగలవాఁడును సర్వులయెడస్నేహ భావముగల వాఁడును దీనులయెడ వాత్సల్యము జూపువాఁడును, ఆత్మానాత్మ వివేకముగల వాఁడును సాధువనంబడును. ఈ గుణములను ప్రయత్నముతో సాధించినవాఁడు మహాత్ముల దయకుఁ బాత్రుఁడగును (౧౧-౧౧-౨౮)

గురువునకును ఉపాసింపఁబోవు శిష్యునకునుండవలసిన లక్షణములను గూడ భగవంతుఁడుద్ధవున కిట్లు చెప్పియున్నాఁడు. తనకు సన్మానమును గోరనివాఁడై పరగుణములందు దోషదృష్టి లేనివాఁడై గ్రహణ దక్షుఁడై దేహాది మమకారములు లేనివాఁడై సర్వులయెడ సోదరభావముగలవాఁడై, పనులయెడఁ దొందర లేనివాఁడై, తత్త్వార్థము నరయనిచ్ఛగలవాఁడై, యసూయారహితుఁడై, సత్యవాక్పరతంత్రుఁడై, పుత్రకళత్ర క్షేత్రాదుల యెడను పేక్షాభావముగల వాఁడై, లాభమును గోరనివాఁడై, నా స్వరూపమును దెలిసికొని శాంతుఁడై మత్స్వరూపుఁడగు గురువును సేవింపవలెను. (౧౧-౧౦-౫)

ఇట్టి గుణములు గలవాఁడు ప్రహ్లాదుఁడు. అతఁడు పెద్దలను సేవించు సత్స్వభావము గలవాఁడు. సత్యసంధుఁడు. జితేంద్రియుఁడు. బ్రహ్మనిష్ఠగలవాఁడు. సర్వభూతవకు సుహితుఁడు. ఆర్యుల యడుగుల కెఱఁగుచు దానునివలెఁ బ్రవర్తించువాఁడు. దీనులయెడ వాత్సల్యముగల వాఁడు గురువులయెడ నీశ్వరభావము గలవాఁడు. వేయేల - అతఁడా సురంబగు భావమును పడిన మహానీయుఁడు.

ఇట్టి గుణములు లేని శిష్యునియెడ మహాత్ములకు దయగలుగదు. అట్టియెడ వారి సాంగత్యము వలని ప్రయోజనమేమియులేదు. అందులకే పాత్రతరెండవ భూమికగాఁ జెప్పఁ బడినది. ఇదియు రెండు విధములు. ఈ జన్మమునఁ దన ప్రయత్నము లేకయే కలుగు దయా పాత్రత మొదటిది. దీనికి భాగవతమందలి శ్రీ కంఠ ప్రచేత్సంవాదము తగిన దృష్టాంతము. తప్త సువర్ణ సవర్ణకాంతుల వెలయించుచు, శ్రీ కంఠుఁడు ప్రచేతసులకు సాక్షాత్కరించెను. కృతాంజలులైన యాబర్హిష్మంతుని పుత్త్రులకు, నారాయణపరంబైన

శ్రీ రుద్ర గీత నుపదేశించెను. (౪-౨౪-౨౪-౨౫) ఇట్లే నారదునకును మునులు శ్రీ కృష్ణ తత్త్వము నుపదేశించిరి.

ప్రయత్నలభ్యమగు దయాపాత్రత రెండవది. నారద ధ్రువ సంవాద మిందులకుఁ దగిన దృష్టాంతము.

**3. శ్రద్ధాతుతేషాం ధర్మేషు :-**

పూర్వోక్తగుణగణ సమన్వితుఁడై, మహాత్ములను సేవించుచున్నవానికి, తద్ధర్మములందు శ్రద్ధగలుగును. అనఁగా నేను గూడ నిట్లే యాచరించి కృతార్థుండనగుదునను రుచి విశేషము జనించుననుట.

ఇది మూడవ భూమిక. నారదుని జీవితమేయిందులకొక ప్రబలదృష్టాంతము.

**4. తతోహరిగుణశ్రుతి :-**

ఇది నాల్గవభూమిక. దానివలన భక్తుఁడు హరిగుణ శ్రవణాదులను జేయును. హరిగుణ శ్రవణాది కమేలచేయవలయును ? ఈ ప్రశ్నకు సమాధానము దశమస్కంధము నందలి తొంబది యవయధ్యాయమునఁ గలదు. శ్రీ శుకులిట్లునుడివిరి.

"ఇత్థం పరస్యనిజ ధర్మ వర్త్మరిరక్ష యాత్త

---------- గ్రామాద్వనంక్షితి భుజోపియముద్యదర్థాః ౧౦-౧౦-౫౩

హరిగుణశ్రుతియను నాల్గవ భూమిక సర్వభాగవత లక్షణములకు సూచకమని శ్రీ శుకుల యభిప్రాయము. భగవద్భక్తిని దొమ్మిది తెఱఁగులుగా ప్రహ్లాదుఁడు చెప్పియున్నాఁడు.

"శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్
అర్చనంవందనం దాస్యం
సఖ్యమాత్మనివేదనమ్."

విష్ణుశ్రవణము చేఁబరీక్షిత్తు, కీర్తనముచే శుకుఁడు, స్మరణము చేఁ బ్రహ్లాదుఁడు, పాదసేవనముచే లక్ష్మి, పూజచేఁబృథువు, వందనముచే నక్రూరుఁడు, దాస్యముచే హనుమంతుఁడు, సఖ్యము

చే సర్జునుఁడు. స్వాత్మ సమర్పణముచే బలియు, మోక్షము నందిరి[౧].

శ్రవణ కీర్తనాదుల వలనఁ గలుగు ఫలమును శ్రీమదాంధ్ర భాగవత కర్తయగు బమ్మెర పోతరాజిట్లు చెప్పియున్నాఁడు.

"అపశబ్దంబులఁగూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా

పపరిత్యాగము సేయుఁగా హరిన్ భావించుచున్ బాడుచున్ జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచున్ తపసుల్ సాధులు ధన్యులౌదురుగదా! తత్త్వజ్ఞచింతింపుమా".

కుచేలునితో నాతని భార్య స్మరణము చేతనే భగవంతుఁడు మోక్షమును గూడ నిచ్చునని చెప్పియున్నది.

"కలలోనందను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడై నట్టిదు
ర్బలుఁడావత్సమయంబునన్ నిజపదాబ్జాతంబులులంబులోఁ
దలఁపన్నంతన మెచ్చి యార్తిహరుఁడై తన్నైననిచ్చున్ నుని
శ్చల భక్తిన్ భజియించు వారికిడఁడే సంపద్విశేషోన్నతుల్"
భాగ.౧౦.౭౭౧

మాలాకారుఁడిట్లు భగవద్భాగవతపాద సేవాభాగ్యమును దనకుఁ బ్రసాదింపుమని శ్రీకృష్ణుని వేడినాఁడు.

క. నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూత దయయును
దాపసమందార! నాకు దయసేయగదే"

దాస్యభక్తికి హనుమంతుని జెప్పిమఱి యొకనిఁ జెప్పవలెను. దైహికములు మానసికములు నగు సర్వకర్మలను భగవత్పరముగా నాచ రించుటయే దాస్యభక్తి. దీనిని పృథు ప్రహ్లాదులొనర్చిరి.

---

౧. శ్రీవిష్ణో శ్రవణే పరీక్షిదభవద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదస్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీ పృథుః పూజనే

సఖ్యమునకుఁ బ్రప్రథమముగాఁ జెప్పఁ దగినవాఁడర్జునుఁడు. వ్రజకులమంతయు నిందులకుదాహరణమే. పరమానంద స్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడు నందాదులగు గోపకులకుఁ బరమ మిత్రుఁడు గా సంచరించెను. కావుననే బ్రహ్మయు వారి భాగ్యమున కచ్చెరువందెను.

"అహోభాగ్యమహోభాగ్యం, నందగోపవ్రజౌక సాం
యన్మిత్రం పరమానందం, పూర్ణంబ్రహ్మసనాతనమ్"
౧౦.౧౪.౩౨

అత్మ నివేదనమునకు బలినిమించినకు బలినిమించిన వ్యక్తి లేఁడనుట యతిశయోక్తి గాదు. దీనినే ప్రపత్తియనియు శరణాగతియనియు నందురు.

5. తతోరత్యంకురోత్పత్తిః :—

హరిగుణ శ్రవణాదికమను విత్తువలన రతియను నంకురము పుట్టును. ఇదియే భక్తి రసమునకు స్థాయీభావము. శ్రీ కృష్ణ చైతన్యుల శిష్యుఁడగు శ్రీ రూపగోస్వామి దీనిని గూర్చి విశదముగ నుజ్జ్వల నీలమణిలో వ్రాసియున్నాడు. దీని భావమిట వివరింపఁబడును. అలంకార శాస్త్రయులందు శృంగారమునకు రతిస్థాయీ భావముగాఁ జెప్పఁబడి యున్నది. రూపగోస్వామి యుద్దేశమున నాశృంగారమే భగవత్పరమగు నపుడు భక్తియనఁబడును. కావున భక్తి రసమునకు స్థాయీ భావము రతియే. ఆలంబన విభావము భగవత్స్వరూపమే. ఉద్దీపన విభావము సాధుసంగము భగవత్కథా శ్రవణాదులు. అనుభావము మహతాంధర్మ రూపమగు శ్రద్ధయను బీజము. పూర్వజన్మకృత పుణ్య కర్మము భగవదనుగ్రహము గూడ శ్రద్ధకు హేతువులు. అశ్రుగద్గద స్వేదరోమాంచాదులు సాత్విక భావములు. నిర్వేదాదులు వ్యభిచారులు లౌకిక సుఖములు నిష్ఫలములను బుద్ధి నిర్వేదమనఁబడును.

6. స్వరూపాధిగమస్తతః :—

భగవంతుని యందుఁ గల ప్రేమాంకురమగు రతివలన, జీవునకు స్వస్వంపానుభవము గలుగును. అనఁగా దేహేంద్రియా దులయందు మమకారమునశించుననుట. కర్తృత్వభోక్తృత్వాదులయెడ నుదా సీనుఁడై, మాయాకల్పిత విషయవాంఛా విముఖుఁడై యుండుననుట.

7. ప్రేమ వృద్ధిః పరానందే :—

ఇదియే పరమానంద స్వరూపుడగు పరమాత్మయందుఁ బ్రేమ వృద్ధియను నేడవ భూమిక ప్రహ్లాదుని ప్రవర్తనమిందులకుఁ బ్రబల దృష్టాంతము.

**8. తస్యాధస ఫ్షరణంతతః :—**

భగవద్రూప సాక్షాత్కారమే యెనిమిదవభూమిక. పరకాష్ఠనందిన భగవత్ప్రేమ ఫలమమే యిది. ఈ విషయమునే కపిలుఁడు దేవ హూతికి బోధించినాడు.

**9. భగవద్ధర్మనిష్ఠాతః :—**

భగవత్ప్రేమవృద్ధిచే భాగవత ధర్మములైన శ్రవణ కీర్తనాదుల యందత్యంతాభి నివేశము గలుగును. ఇది ప్రేమ వృద్ధి ఫల రూపమగు తొమ్మిదవ భూమిక. దీనికిని "శ్రద్ధాతుతేషాం ధర్మేషు" అను మూఁడవ భూమికకును గల భేదమిది. మూఁడవది సాధన కోటిలోఁ జేరును. ఇది ఫలకోటిలోఁ జేరును. మూఁడవది ప్రయత్న సాధ్యము. ఇది ఫల రూపమగుటచే నప్రయత్న సిద్ధము. అంబరీషాదుల చరిత్రము లిందులకుదాహరణములు.

**10. స్వస్మిన్ తద్గుణ శాలితా :—**

భక్తులు గూడ భగవద్గుణములను గలిగి యుండవలయును. బృందావనమునందు శ్రీకృష్ణుఁడంతర్ధానముకాఁగా, నాతని యందుఁ దమకుఁగల గాఢానురాగముచే గోపికలాతని బృందావన చర్యల ననుకరింపఁ జొచ్చిరి.

**11. ప్రేమ్ణోధవరమాకాష్ఠా :—**

భగవద్విషయమైన ప్రేమ యొక్క పరమావధిని బొందుటయే పదునొకండవ భూమిక. ఈ భూమికను బ్రవేశించిన భక్తులు భగవద్వియోగమును భరింపఁజాలక నిమేషమొకయుగముగా గడపుదురు. ఇందుకును గోపికలే దృష్టాంతము. "భగవద్విస్మరణే పరమవ్యాకులతా, యధా వ్రజగోపికానాం" ని నారదుఁడు భక్తిసూత్రములతోఁ జెప్పియున్నాఁడు.

**పోతన సందేశము :—**

భాగవత తత్త్వమే లోకమునకుఁ బోతనయిచ్చిన సందేశము. ఇటుఁ గొందఱిట్లు ప్రశ్నింపవచ్చును. భాగవతము వ్యాస ప్రోక్తముగదా! సందేశమును పోతన యిచ్చుటయేమి? ఈ ప్రశ్నమునకు సమాధానముగా నింకొక ప్రశ్నమడుగవలసియున్నది. భాగవత ప్రతిపాదితమగు తత్త్వము వ్యాసోపజ్ఞమా! కాదు. సమస్త తత్త్వములకును మూలము వేదమే. కావున నట్లే చూచినచో నెవ్వరెవ్వరికిచ్చిన సందేశమును లేదు. ఇటుఁ బోతన సందేశమనఁగాఁ దత్సందేశము పోతనమూలమున నాంధ్ర లోకమునకందినదనుట తత్త్వమును దొలుదొల్తఁ బోతనయే కనుగొనెనని యర్థము కాదు.

"చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబులోనుఁ గాఁదలఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు."

పోతన మహా భక్తుఁడు. శివకేశవ భేదము లేనివాఁడు. దయాళువు. సత్యవ్రత పరాయణుఁడు. కావున నిట్లు చెప్పినాఁడు.

భాగవత గ్రంథావిర్భావమే తత్త్వస్వరూపమును వ్యక్తము సేయుచున్నది. భారత గ్రంథరచనానంతరము వ్యాసుఁడు వ్యాకుల చిత్తుఁడై సరస్వతీ తటముననుండఁగా నారదుఁడరుదెంచి యాతని వ్యాకులతకుఁ గారణము నిట్లు చెప్పియున్నాఁడు. "అంచితమైన ధర్మచయమంతయుఁ జెప్పితినందులోన నించించుకఁగాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపంచించిన మెచ్చునే? గుణవిశేషములెన్నిక"

దీనిని బట్టి హరిగుణ కీర్తనమే భాగవత ప్రతిపాదిత పరమధర్మము. దయాసత్యశౌచమైన భక్తియే యాంధ్రలోకమునకుఁ బోతన యిచ్చిన సందేశము.

– – –

# 9. వీరభద్ర విజయ కర్తృత్వము

వీరభద్ర విజయము పోతన కృతమగునా ? అగుచో నిది భాగవతమునకుఁ బూర్వము రచింపఁబడెనా? లేక తరువాత వ్రాయఁబడెనా? యను విషయములు వాదోపవాదమునకు లోనై యున్నవి.

వీరభద్ర విజయ గ్రంథస్థ విషయములను బరిశోధక దృష్టితోఁ జూచినచోఁ బోతనను గూర్చి యీ దిగువరీతిని నిర్ణయమునకు రాఁగలము. పోతన వంశము వారు (తల్లి దండ్రులు – అన్నయు) శైవులు పోతనయు వీరభద్ర విజయము రచించునప్పటికి శైవుఁడే. ఆ విషయము వీరభద్ర విజయ భాగవతముల రెండిటను గలము.[౧]

---

౧. లలితమూర్తి బహుకళానిధి కేసన
దానమాననీతి ధనుఁడు ఘనుఁడు
తనకు లక్కమాంబధర్మగేహిని గాఁగ
మనియె శైవశాస్త్రమతము గనియె. భాగ. పీఠిక. ౧–౨౪

"మానినువీడు గారు బహుమాన నివారిత దీనమానస
గ్లానికి దానధర్మ మతిగౌరవ మంజులతా గభీరతా
స్థానిక ముద్దుసానికి సదాశివ పాదయుగార్చనానుకం
పాయన వాగ్భవానికిని బమ్మెర కేసయలక్కనానికిన్" (భాగ. ౧–౨౬)

"తదనుజన్ముండనై యేను జన్మించి పోతయనామధేయుండనై వరఁగి వీరభద్ర ప్రసాదలబ్ధకవితాతిశయంబున" వీర. విజ. ౧ – ౩౮ వ వీరభద్ర విజయ విమర్శనము వావిళ్లవారి ముద్రితప్రతినిబట్టి చేయఁబడినది.

"వెలయ మఱియుఁ గల్గు వీరమాహేశ్వరా
చారవరుల వీరసత్యవ్రతుల
వీర సచ్చరితుల వీర విక్రములను
బరఁగ మ్రొక్కి తలఁచి భక్తితోడ" వీ.వి. పీఠిక

వీరభద్ర విజయ రచనావసరమునకుఁ బోతన పిన్న వయసునందున్న వాఁడు.[౨] అనఁగా ౧౮, ౨౦ సంవత్సరముల ప్రాయము వాఁడై యుండును. నాఁటికిఁ గవిత్వము చెప్పుట యందుత్సాహింయేకాని నిష్ణాతుఁడు కాఁడు. అప్పటికి స్వయంకృషిచేఁ బద్యములల్లుచు భోగినీ దండకము వంటి చిన్నచిన్న కృతులను మాత్రమే రచించినవాఁడు.

వీరభద్ర విజయమునందుఁ జెప్పఁబడిన యివటూరి సోమనాథుఁడు పోతన వంశము వారికి మత గురువు. అతఁడు పరమ భద్రాసన ప్రముఖ మార్గములలో యోగీశ్వరుని వంటి వాఁడు. వీరవ్రతులలో సాక్షాద్వీర మహేశ్వరుఁడు. ఇఁక వేదాంత సిద్ధాంత విషయమున ధర్మశాసన బిరుదాంచితుఁడు. అతఁడు భక్తి సాగరుఁడే కాదు. అరాధ్య చంద్రుఁడుకూడ.

శైవ శాస్త్రములను విపులీకరించి బోధించుటకు, నారాధ్యుఁడైన సోమన మత వేదికల నధిష్ఠించి శైవమత ప్రసంగాంతరంగుఁడై యుండువాఁడు. నరనాథులు, శివ భక్తులు, పురాణజ్ఞులు; పెద్దలు, మొదలగు వారందఱు నాతనిని గొలుచుచుండెడివారు.[౩] పోతనవంశము వారందఱు శైవులగుటచే వారందరు సోమనారాధ్యుని భక్తులే.

పోతన యప్పటికిఁ గవన మల్లుట నేర్చి తత్సాధనయందుత్సాహియై యిహపరసాధనకుఁ దోడ్పడు నేదేని యొక్క గ్రంథమును రచింపఁదలఁచి "తదీయ విచారయుక్తుఁడై తత్కథారంభంబూహించుచున్న సమయంబున" సోమనాథుఁడాతనిని గాంచి "వీరభద్ర విజయమెల్లను వినఁగ వేడ్కయయ్యెనది తెలుంగున రచియింపు మభిమతముగ" నని యానతిచ్చినాఁడు.

వీరభద్ర విజయము రచించిన మఱియొక ముప్పది సంవత్సరములకో ముప్పదియైదు సంవత్సరములకో భాగవతమును రచించియుండును. అనాఁటికాతఁడు జ్ఞానియై లోకానుభవము చాలఁగల్గి పరమ భాగవతోత్తముఁడైనాఁడు. చిన్నవాఁడు తండ్రి చదువను వ్రాయను నేర్పఁగాఁ దాను సహజ కవితాశక్తి గలవాఁడు గాన స్వయం కృషిచేఁ దత్సగ్రంథ పరిశోధను చేసి

---

౨. "పిన్నవాఁడననియుఁ బెక్కు సంస్కృతులను
వినని వాఁడననియు వెఱపు మాను
మత్ప్రసాదవిద్య మహిమచే నెంతైన
కవిత చెప్పలావు గలదు నీకు" వీ.వి. పీఠిక

౩. సీ. పరమభద్రాసన ప్రముఖీ మార్గంబుల యోగీంద్రులితఁడాదియోగియనఁగ వీర. ప. ౧

సంస్కృత భాగవత భాషాకాఠిన్యమును, అందలి దురవగాహములగు తాత్త్విక రీతులను నవగాహనము చేసికొని, యుభయ కావ్య రచనాదక్షుఁడై చాలినంత నిబ్బరముతో భాగవత రచనకుఁ బూనుకొనినాఁడు. కావుననే భాగవతమున కొందఱకుఁ దెనుంగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం, గొందఱకు గుణములగునే, నందఱ మెప్పింతుఁ గృతులనయ్యై యెడలన్ భాగ.౧-౨౦ అని ధైర్యముగఁ జెప్పికొని రచనకుపక్ర మించినాఁడు.

చిన్నతనమున వీరభద్ర విజయము రచించినపుడు సోమనాథుని ప్రోత్సాహమెట్లు లభించినదో భాగవతమును రచించునపుడు శ్రీ రామచంద్రుని ప్రోత్సాహమట్లు సిద్ధించినది.

ఈ విధముగాఁ బోతన భాగవత వీరభద్ర విజయములను రచించు నాఁటి పరిస్థితుల నవగాహము చేసికొని వీరభద్ర విజయము నందలి విషయమును బరిశీలించినచో నది పోతన కృతమని స్పష్ట పడుచున్నది.

ఈ గ్రంధ కర్తృత్వ నిరూపణమునకై ముందు వీరభద్ర విజయ భాగవతముల పీఠికలను బరిశీలింతము.

## ఆశ్వాసాంత గద్యము

| వీరభద్ర విజయము | భాగవతము |
|---|---|
| ఇది శ్రీ మన్మహేశ్వర ఇవటూరి సోమనారాధ్య దివ్యపాద పద్మారాధక కేననామాత్య పుత్ర పోతయనామ ధేయ ప్రణీతంబైన" | ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితావిచిత్ర కేనన మంత్రి పుత్త్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన" |

వీరభద్ర విజయము రచించునప్పుడు పిన్నవాఁడుగానఁ దన వంశగురువును శైవమతాచార్యుఁడునగు సోమనారాధ్యుఁడు ప్రోత్సహింపఁగా వ్రాసినాఁడు గాన, సోమనారాధ్య దివ్యపాదపద్మారాధక' యని చెప్పికొనినాఁడు. భాగవతమును రచించునప్పటికి స్వయంకృషిచే వేదాంతార్థముల నెఱిఁగి తత్త్వ నిష్ణాతుఁడై హరిహరులయెడ సమభావము గలవాఁడై శ్రీ రామచంద్రుని యాదేశమున గ్రంథరచనకుఁ బూనుకొనినవాఁడు. కావున 'పరమేశ్వర కరుణాకలిత . . . సహజ పాండిత్య' యని వ్రాసినాఁడు.

షష్ఠ్యంతములు :–

వీరభద్రవిజయము శైవగ్రంథముగాన, నందలి షష్ఠ్యంతములు శివ పరముగను, భాగవతము విష్ణు కథాత్మకముగావున నందలి షష్ఠ్యంతములు విష్ణుపరముగను జెప్పఁబడినవి.

## వంశ వృక్షము

| వీరభద్ర విజయము | భాగవతము |
|---|---|
| ౧. మల్లన | ౧. భీమన |
| ౨. భీమన | ౨. అన్నయ |
| ౩. అన్నయ | ౩. సోమన |
| ౪. సోమన | ౪. ఎల్లన |
| ౫. ఎల్లన మాచమాంబ | ౫. కేసన (లక్కాంబ) |
| ౬. కేసన – మాధవుఁడు – ఇమ్మడి | |
| (లక్ష్మి కన్య) | |
| తిప్పన పోతన | తిప్పయ పోతన |

పీఠికయందలి అంశములలో వంశవృక్షము ప్రధాన విషయము. అందలి కవి వంశ నామధేయములు రెండు గ్రంథములందును సమానముగనున్నవి. భాగవతమునఁ గవి తన పూర్వుల నయిదు తరముల వఱకుఁ బేర్కొనినాఁడు. వీరభద్ర విజయమునందు, ఆఱుతరముల వఱకుఁ బేర్కొని, తండ్రిగారి సోదరవర్గమును గూర్చి కూడఁ గొంత విపులీకరించి చెప్పినాఁడు. వీరభద్ర విజయము చిన్నతనమునందు రచించిన కృతిగానఁ గవి యుత్సాహ వశమునఁ దన వంశమునందలి యందఱి పేర్లను జెప్పి యుండును. భాగవత రచనము ప్రారంభించు నాఁటికి రచయితకు వయః పరిపాకముచేతను లోకానుభవము వలనను, సంయమనము సిద్ధింప నట్టి పైపై మెఱుఁగుల మీఁద నుత్సాహము తగ్గిపోయి యుండును. అందులకే తన వంశమునందుఁ బ్రసక్తమైన వారినే క్లుప్తముగాఁ బేర్కొనినాఁడు. అంతియే కాదు వీరభద్ర విజయమునఁ దల్లిపేరు 'లక్ష్మికన్య' యని ప్రకృతిరూపమును గ్రహించి వ్రాసియు, భాగవతమున నిత్యము నింటిలోఁ బిలిచికొను 'లక్కాంబ' యను

వికృతిరూపమునే యథాతథముగ(సంస్కృతీకరింపక) వ్రాయుట యీ విషయమునకు దోహదము. అట్లే వీరభద్ర విజయమున శివభక్తులనందఱను బహుశ్రద్ధతోఁ బేర్కొనినాఁడు. భాగవతము రచించు నాఁటికిఁ బోతన కట్టి చిల్లర విషయములందుత్సాహము తగ్గినది. కావుననే విష్ణుభక్తులను బేర్కొన కవిడిచినాఁడు.

అయినను నొక వర్గము వారు వీరభద్ర విజయమును పోతన రచించియుండలేదని చెప్పుదురు. దాని నెవరో వ్రాసి పోతన పేరు పెట్టి యుందురని వారి వాదము. కాని, లోకమునఁ గవిత్వము వ్రాసి పేరు నార్జింపఁ దలఁచిన యే కవియు నట్లు చేయఁడు. అట్లు చేయుటలోఁ గతి కిసుమంతయుఁ బ్రయోజనము లేదు. అట్లు అగుచో లోకమున నొకరు రచించి యింకొకరి పేరు పెట్టుట లేదా యను ప్రశ్న రావచ్చును. అట్టివి లేకపోలేదు. గాని అవి యిట్టివి గావు. సాధారణముగాఁ గొందఱు, మత విషయకముగనో వేదాంత విషయకముగనో తమకుఁ దోచిన సందేశములను వ్యాప్తిలోనికిఁ దెచ్చుటకై మత ప్రవర్తకుల యొక్కగాని మహా కవుల యొక్కకాని నామముతో నట్టి విషయములఁ బ్రకటింపఁ జూతురు. దానవారాశించిన ప్రయోజనము వారియుద్దేశములు వ్యాప్తిలోనికివచ్చుటయే. స్వమత వ్యాప్తియే వారు కోరునది. పేరుగాదు. వీరభద్ర విజయము వంటి సాధారణ కృతుల విషయమై తత్కర్త కట్టిపని గావింపవలసిన యసరములేదు.

వీరభద్ర విజయము పోతన కృతముకాదనువారిలో వావిలకొలను సుబ్బారావుగారు ప్రముఖులు. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు 'నిదురలో వేడినను పోతనయంత యభాగ్యకవిత్వము చెప్పఁడనియు, చిలుకూడి వీరభద్రరావుగారు 'ఎవరో వ్రాసి పోతనపేరు పెట్టి' రనియుఁ జెప్పిరి. అట్లు చెప్పుటకుఁ గల యుపపత్తులేవియో, యవి యెంత వఱకు సమంజసములో విచారింప వలయును.

వీరభద్ర విజయము పోతన కృతము కాదని చెప్పు వర్గము వారందఱి యభిప్రాయములను గ్రోడీకరించి అనఁగాఁ దన కాలము నాఁటి వారి యభిప్రాయములను శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ 'వీరభద్ర విజయ వివేక' మను వ్యాసమున నీదిగువ యంశములను బేర్కొనిరి.

**వీరభద్ర విజయ వివేకమునందలి యంశములు :**

౧. విష్ణు భక్తుఁడైన పోతన వీరభద్ర విజయమునఁ దాను శైవుఁడుగఁ జెప్పుకొనుట విరుద్ధము.

౨. ఒకదానిలో సహజపాండిత్య పోతనామాత్యుడనియు, వేఱొక దానిలో జనక శిక్షిత విహితాక్షరాభ్యాసుండనియుఁ జెప్పుకొనుట.

౩. భాగవతమునఁ దాను పరమేశ్వరుని కరుణచేఁ గవియైనట్లు చెప్పుకొని, రెండవదానిలో సోమనాథారాధ్యుని కృపవలనఁ గృతిని నిర్మించు చుంటినని చెప్పుకొనుట.

౪. వీరభద్ర విజయకారుఁడొక చోట భాగవతమందలి దక్ష యజ్ఞవృత్తాంత సందర్భమునఁ జేసిన శివ నిందకుఁ బరిహారముగా వీరభద్ర విజయమును వ్రాయుచున్నాని, వేఱొక చోట నివటూరి సోమనారాధ్యుని ప్రోత్సాహముచే గ్రంథము వ్రాయుచున్నానని చెప్పినాఁడు. అట్టి విరుద్ధాంశములను భాగవతకారుఁడు చెప్పఁడుగావున నివియేక కవి కర్తృకములుగావని యభిప్రాయము. ఇవి పీఠికకు సంబంధించిన విషయములు. అందు మొదటి మూఁడిటికి సమాధానమిచ్చియే యున్నాము. ఇఁక నాల్గవ దానికి సమాధానమిది.

ఇందలి "భాగవత ప్రబంధ" మను పద్యమును బట్టి భాగవత రచనానంతరము వీరభద్ర విజయము రచింపఁ బడెనని తలచుట చేతఁ బయి చిక్కులన్నియు నేర్పడినవి. అసలాపద్యమే వీరభద్ర విజయ కర్త వ్రాసి యుండలేదు. వీరభద్ర విజయ ముద్రాపకులు పై పద్యము పెక్కు మాతృకలందుఁ గన్పింపలేదని యథసూచికలోఘోషించుచునే యున్నారు. అదియుఁగాక వీరభద్ర విజయ కర్త యా పద్యము వ్రాసియుండలేదనుటకు గ్రంథస్థ నిదర్శనము లెన్నియేనిఁ గలవు. అందు ముఖ్యమైనవి కొన్ని :

౧. ఆ పద్యమునందు "దక్షమర్యాదగ కథా ప్రసంగమున నల్పవచస్కుఁడనై న్నిమిత్తాగత వక్త్ర దోష పరిహారముకై యజనైకశైవ శాస్త్రాగమ వీరభద్ర విజయంబు" రచించెనని గదాః చెప్పఁబడినది. అగుచో భాగవతమునందు దక్ష యజ్ఞ సందర్భమున దక్షుఁడు శివునిఁ జేసిన నిందయేమి? వీరభద్ర విజయమునఁ జేయనిదేమి? యనునది ముందుగాఁ జూడవలయును.

సీ. పరికింప నితఁడు దిక్పాలయశోహాని
కరుఁడీ క్రియా శూన్యవరుని చేతఁ
గరమొప్ప సజ్జనా చరితమార్గము దూషి
తంబయ్యెఁ; నెన్నగ తత్రవుండు
మహితసావిత్రీ సమానను సాధ్వన
స్మత్తనూజను మృగశాబనేత్ర

సకల భూమీసుర జన సమక్షమున మ

ర్కటలోచనుఁడు కరగ్రహణ మూర్తిఁ

తే. జేసి తా శిష్యభావంబుఁ జెందు టాత్మఁ

దలఁచి ప్రత్యుద్గతాభివందనము లెలమి

నడపకుండిన మానవీ నన్నుఁ గన్న

నోరి మాటకుఁ దనకేమి గోరవోయె. భాగ. ౪-౪౨

సీ. అనయంబులుప్త క్రియాకలాపుఁడు మాన

హీనుఁడు మర్యాద లేనివాఁడు

మత్తప్రచారుఁడున్మత్త ప్రియుఁడు దిగం

బరుఁడు భూత ప్రేత పరివృతుండు

తామస ప్రమథ భూతలకు నాథుండు

భూతిలిప్తుండస్థి భూషణుండు

నష్ట శౌచుండు నున్మదనాథుఁడును దుష్ట

హృదయుఁడుగ్రుఁడును బరేతభూని

తే. కేతనుఁడు వితతస్రస్తకేశుఁడశుచి

యయినయితనికి శివనాముఁడను ప్రవాద

మెటులు గలిగె? నశివుఁడగు నితని నెఱిఁగి

యెఱిఁగి వేదంబు శూద్రునకిచ్చినట్లు. భాగ. ౪ - ౪౩

అని కలదు. ఈ రెండు పద్యములందును దక్షునిచేఁ గావింపఁ బడిన శివనిందకు సంబంధించినవి. దక్షుఁడవమానితుఁడైన సందర్భమునఁ జెప్పఁబడినది. వీరభద్ర విజయమునందాసన్నివేశమున దక్షుఁడు ప్రతీకారమును మాత్రము చింతించి సతీదేవి యాగమును జూడవచ్చినపుడు సభలో శివనింద చేయును. భాగవతమందొక చోటఁ జేయఁబడిన శివనింద వీరభద్ర విజయమున స్థలాంతర మందుఁ జేయఁబడినది. వీరభద్ర విజయము – యాగ సందర్భము.

సీ. కట్టంగ దిక్కులేకాని కోకలు లేవు

పూయగంధము లేదు భూతిగాని

కాలకూటమెగాని కంఠమాలిక లేదు.
ఫణిగాని తొడుగంగ మణులు లేవు
నలినాకసమెగాని తల వెండ్రుకలు లేవు
తలకుఁ బువ్వులు లేవు నెలయె కాని
కుడువఁ గంజయులేదు వెడద పుఱ్ఱయకాని
యెక్క గుఱ్ఱము లేదు యెద్దుగాని

తే. మూఁడు మూర్తులందు మొగినెవ్వఁడునుగాఁడు
జాతిలేదు పుట్టు జాడలేదు.
వరముఁడొంటిగాఁడు బ్రహ్మాదులెఱుఁగరు
తిరుగు జోగిఁ దగునె దేవుఁడనఁగ. వీ.వి. ౧ - ౧౩౬

ఉ. లోకములోన లేఁడు నృపలోకములోననలేఁడు లేఁడు కుండలీ
లోకములోనలేఁడు మునిలోకములోనులేఁడు దేవతా
లోకములోన లేఁడు సురలోకములోనను లేఁడు వెఱ్ఱి ము
ప్పోకలఁబోవుటేనెఱిఁగి పూజలు సేయఁగ నెంతవాఁ డొకో. ”

వీ. వి. ౧ - ౧౩౭

ఇవి వీరభద్ర విజయమందలి శివనిందకుఁ జెందిన పద్యములలో ముఖ్యములు. పై రెండు గ్రంథములందలి పద్యములను బాగుగాఁ జూచినచో భాగవతమునందు కంటె వీరభద్ర విజయమునందే శివనింద విశేషముగనున్నట్లు స్పష్టము.

అదిగాక ఈ సందర్భమున నన్నిటికన్నను ముఖ్యముగ విమర్శకులు జ్ఞప్తియందుంచుకొన వలసిన విషయము భాగవత వీరభద్ర విజయములు రెండును నాంధ్రీకరములే గాని స్వతంత్ర గ్రంథములు కావనునది. రెండిటికి నాధారభూతములగు మూల గ్రంథములు వేఱుగానున్నవి. ఆంధ్ర భాగవతమునకు సంస్కృత భాగవతమును, తద్వ్యాఖ్యానములలో ముఖ్యమగు శ్రీధర వ్యాఖ్యయును మూలములు. వీరభద్ర విజయమునకు మూలము వాయు పురాణము. ౧

ఆంధ్రీకరమన మూల గ్రంథమునకుఁ గవి కొంతవఱకు విధేయుఁడన్న మాట మఱువరాదు. భాగవతాంధ్రీ కరణమున "అనయంబులుప్త క్రియా కలాపుఁడు. మాన

హీనుఁడు మర్యాదలేనివాఁడు", మొదలగు పద్యములకాధారమగు మూల గ్రంధమునందా సందర్భమున నెట్లున్నదో యించుక చూతము.

"శ్రూయతాంబ్రహ్మర్షయోయే సహదేవాస్సహాగ్నయః
సాధూనాంబ్రువతోవృత్తం నాజ్ఞానాన్న చమత్సరాత్
అయంతులోక పాలానాం యశోఘ్నోనిరపత్రపః
సద్భిరాచరితః పంథాయేనస్తబ్ధేన దూషితః
ఏషమే శిష్యతాంప్రాప్తోయన్మేదుహితురగ్రహీత్
పాణిం వప్రాగ్నిముఖతస్సావిత్ర్య ఇవసాధువత్
గృహీత్వామృగశాబాక్ష్యా, పాణి మర్కటలోచనః
ప్రత్యుత్థానాభివాదార్హేవాచ ప్యకృతనోచితం
లుప్త క్రియా యాశుచయే మానినే భిన్నసేతవే
అనిచ్ఛన్న ప్యదాంచాలాం శూద్రాయేవోశతీంగిరం
ప్రేతావాసేషుయోఘోరైః ప్రేతై ర్భూతగణైర్వృతః
అటత్యున్మత్తవన్నగ్నోవ్యుప్తకేశో హసన్రుదన్
చితాభస్మకృత స్నానః ప్రేతస్రజ్నృస్థి భూషణః
శివావదేశోహ్యశివో మత్తోమత్తజనప్రియః
పతిః ప్రమథ భూతానాంతమో మాత్రాత్మకాత్మనాం
తస్మాదున్మాద నాథాయ నష్ట శౌచాయదుర్హృదే
దత్తాబతమయా నాధ్వీచోదనాత్పరమేష్ఠినః"

సం.భా. ౪ స్కం. ద్వి. ౬

---

౧. కావున వాయు పురాణసారంబగు నీకథావృత్తాంతంబంతయుఁ దెనుంగున రచింపుమనియానతిచ్చిన మద్గురుని మధురవాక్యంబులకు సత్యంతాను రాగ సంతుష్టుండనై తదీయానుమతంబునమదీయ వంశావళివర్ణనంబొనరించెద.

వీర. విజ. పీఠిక. ౨౧

తొలుత శబ్దార్థములను వ్రాసి తరువాత వాస్తవార్థమును వ్యాఖ్యానించినాఁడు

"పూర్వోక్త శ్లోకచతుష్కస్యవాస్త వస్త్వయమర్థః లుప్తాః క్రియా యస్మిన్ పరబ్రహ్మరూపీత్వాత్ అతఏవనాస్తి శుచిర్యస్మాత్. అమానినే అభిన్నసేతవ ఇతిచ్ఛేదః తస్యపరమేశ్వ రస్య మదీయామానుషీ కన్యా కథం యోగ్యాస్యాదితి లజ్జాదినా దాతుమిచ్ఛన్నపి తత్సంబంధలోనేనదత్తవాన్. శూద్రాయేత్యన ర్హత్వమాత్రే దృష్టాంతః నహీనత్వే యద్వా శోకంద్రావయతీతి శుద్రః అత్మనిష్ఠః తస్యవేదవాణీఁ కర్మవిద్యామివ పూర్వాపరస్వవచన విరోధాపత్తేః. ఏతదుక్తం భవతి. యథా కశ్చిచ్ఛూద్రాయ వేదమర్థలోభేన దదాతి తద్వదితి. ప్రేతావాసే ష్వితాయాది సర్వం విడంబన మాత్రమితి స్వయమేవాహ. ఉన్మత్త వదితి – అన్యథోన్మత్త ఇత్యేవ వదేత్. అశివో నాస్తిశివో యస్మా దితి. అమత్తః అమత్త జన ప్రియ ఇతిచ్ఛేదః. పతిః ప్రమథ భూతానామితి. భక్తవాత్సల్యమాహ తామనానామపిదోష మశేష మపనీయ పాతీతిపతిః నష్టానామపి శౌచఁ శుద్ధి ర్యస్మాత్. దుష్టేష్వప్యేతేమయా అనుకం ప్యాఇతి, హృన్మనో యస్యస దుర్హృత్తస్మై బతేతిహర్షే. బ్రహ్మణోవాక్యాల్లజ్జా భయాదికం పరిత్యజ్య దత్తేత్యర్థః" శ్రీధరవ్యాఖ్య.౪స్కం. ద్వితీయా శ్లో॥ దానికిఁ దెలుంగు సేఁత యిది.

సీ. పరికింపనితఁడు దిక్పాలయశోహాని
 కరుఁడీక్రియాశూన్య పరునిచేత భా.౪ – ౪౨

సీ. అనయంబులుప్త క్రియాకలాపుఁడు మాన
 హీనుఁడు మర్యాదలేనివాఁడు. భాగ.౪ – ౪౩

ఇదియంతయు మూలము నందున్న విషయమే. అదిగాక భాగవతమున దక్షునిచేఁ శివదూషణము నిజమునకు నిందాభాసమే గాని నిందకాదు. "ఇట్లు దక్షుండు పల్కిన గర్హిత

వాక్యంబులు వినిందితం బులుగ నుండినను యథార్థంబున వాస్తవంబులగుచు భగవంతుఁడగు రుద్రునందు ననిందితంబులై స్తుతి రూపంబున నొప్పు" నని భాగవతకారుఁడే వ్రాసినాఁడు. ఇట్లు మూలమునకు విధేయమైయున్న యాంధ్రీకరణమును, మూలముతోఁజూడక, యద్దానినొక స్వకపోలకల్పితమగు స్వతంత్రకావ్యముగా భావించి భాగవతమునందు శివనింద చేయఁబడినదిగాన తత్పాప నివారణార్థమంత కంటె నెక్కువగ శివనిందచేయఁబడిన వీరభద్ర విజయము వ్రాసెననుటలో నర్థము లేదు. కావుననాపద్యము నిశ్చయముగాఁ బ్రక్షిప్తమే.

ఇఁక వీరభద్ర విజయ వివేకకారులు వీరభద్ర విజయభాగవతము లేక కర్తృకములు కావని చెప్పుచు నద్దానిని బలపఱచుకొనుటకు రెండు గ్రంథములందును గల కథా భాగములను విమర్శించి కొన్నియుపపత్తులను జూపిరి.

౧. సతీ దేవి ప్రయాణ సందర్భము :-

దక్షుని యజ్ఞవృత్తాంతము విన్న తరువాత వీరభద్ర విజయమున సతీ దేవి శివుఁడు పోయి రమ్మన్నను పోవుట కిష్టపడక యెట్టకేలకు సమ్మతించినది. భాగవతమున శివుఁడు వలదను చున్నను బయనమగును. ఏక కర్తృకములైన గ్రంథములలో నిట్టి విరుద్ధాంశముండదనియు.

౨. సతీ దేవి దక్షునితో యజ్ఞవాటిక యందుఁబల్కిన పల్కులు :-

వీరభద్ర విజయమున సతీపరాభవ సందర్భమునందు దక్షుఁడు శివ నింద గావింపఁగా సతి దక్షుని దుర్భాషలాడినది. అందు 'ఏరాదక్ష' విడువరా 'చేఁబట్టరా' 'వైరమొప్పదురా' 'శివనిఁ దలంపరా' దుర్మతీ 'దురాత్మా' యని తండ్రిని గూర్చి విద్యావతియగు పుత్త్రిక పలుకరాని దనియు, నౌచిత్యమెఱిఁగిన భాగవత కారుఁడట్లు చేయడు గాన రెండు నేక కర్తృకములు కావనియుఁ జెప్పిరి.

౩. అనంతర కథా వృత్తాంతము :- అశుచి విషయము.

ఈ యంశమును జెప్పునపుడు శ్రీ పంతులుగారిట్లు వ్రాసిరి : "భాగవతమున - వృత్తాంతంబంతయు నారదుని వలన వెంటనే ఈశ్వరుఁడు తెలిసికొనెను.

శా. "అద్యుండుగ్రుఁడు నీలకంఠుఁడిభదైత్యారాతిదక్షోష్ఠుఁడై"

ఈశ్వరుఁడు, దాక్షాయణీ వృత్తాంత శ్రవణానంతరమునఁ గలిగిన కోప విశేషముచేఁదన జడను బెఱుకగా నందు వీరభద్రుఁడుద్భవించెను. అతఁడీశ్వరుని యెదుట నిలువంబడి కర్తవ్యంబడుగఁగా శివుఁడు.

చ. గురుభుజ శౌర్య, భూరిరణకోవిద, నుద్భట కోటికెల్లనీ
వరయవరూధినీ వరుఁడవై చని యజ్ఞము గూడ దక్షునిన్
బరువడిఁ ద్రుంపుమీవచట బ్రాహ్మణ తేజమజేయమంటివే
నరిది మదంశ సంభవుఁడవై తగునీకు నసాధ్యమెయ్యెడన్.

అనిశాసించినాఁడు. "ఇట్లుగా నాజ్ఞాపింపఁబడిన వీరభద్రుండట్టహాసంబున బయలు వెడలి శివ సేనాపరివృతుఁడై దక్ష యజ్ఞవాటంబునకు వచ్చి యజ్ఞంబుతోఁ గూడ దక్షుని వధించి, నిజనివాసంబయిన కైలాసంబునకుఁజనియె" నని పోతనామాత్యుఁడు దక్షయజ్ఞ పరిసమాప్తిందెలిపెను.

వీరభద్ర విజయమున

"దాక్షాయణి దేహంబుఁ దొఱంగిన యనంతరము తత్ప్రకారంబు వీక్షించి దక్షమఖమండపంబున సుఖాసీనులై యున్న బ్రహ్మ విష్ణు సూర్య చంద్ర దేవేంద్ర దండధర వరుణకుబేరాది దేవజనంబులు మహాభీత చిత్తులై మూర్తి వంతంబులైన మంత్రంబులు చాలించి పాపకర్ముండగు దక్షుని నిందించి బ్రహ్మ తన లోకంబునకుఁ బోయె. మఱియుఁదక్కిన వారందఱుఁ దమ తమ నివాసంబులకుం జనిరి. తత్సమయంబున"

అనియొక ఘట్టము చెప్పఁబడినది. దీనిలో యజ్ఞ సమాప్తి నందిన విధము విచార్యము. యజ్ఞ శాలలో నొక శవంబు పడియెంగావున నక్కడి ఋత్విక్కులందఱు నశుచి కారణంబున మూర్తివంతంబులైన మంత్రంబులు చాలించి యా పాపాత్ముం దిట్టుచుం దమ తమ నివాసంబులకుంజనిరని లోకాచారంబు ననుసరించి యూహించెంగాని యజ్ఞాదులు జరుగుచున్నపుడు యజమానికి ఋత్విక్కులకును దీక్షా మధ్యంబున నుండుటం జేసి యవ బృధాంతము వఱకును జాతా శౌచ మృతా శౌచంబులు పట్టవను విధిగాని, ప్రారంభమైన యజ్ఞము పరిసమాప్తి నొందింపక ఋత్విక్కులు గాని యజమానిగాని తమ యిష్టానుసారము దానిని వదిలివైచి పోఁగూడదను విధిగాని, తెలిసియుండలేదు. ఇవి సర్వద్విజులకును దెలియఁదగిన ధర్మములై గాని యిట్టి వానిలో గూడ నీ వీరభద్ర విజయ కవి పరాకు చెందినందులకు నాలోచించెదను.

४ ఇఁక నీశ్వరుఁడు సతీ వృత్తాంతము నెఱింగిన సందర్భమును బరిశీలింతము.

సీ. కైలాసగిరి మీఁదఁ గఱ కంఠుఁడొకనాఁడు
కరమొప్పఁ గొలువుండి గౌరిఁ దలఁచి

యిదియేమిరాదయ్యో నీ యేణలోచన
యనియవ్విథంబెల్ల నాత్మ నెఱిఁగి
నుందరితనకుఁ గూర్చుట యెల్ల భావించి
శంభుండు మనమునఁ జాలమెచ్చి
యిది యేమి పంపితి నీ దక్షునింటికి
మీనాక్షితానేల మేను వాసె

ఆ. పాలఁతి నిన్న నేను బొమ్మని తరిమినఁ
బోవనొల్ల ననియెఁ బువ్వుఁబోఁడి
పంకజాక్షి నొంటిఁ బంపిన కతమున
వెఱ్ఱితనము వచ్చె వేయు నేల.

వ. అని మఱియుఁ బరమేశ్వరుండు గౌరీ దేవిననంతకరుణాపూరితమానసుండై తలంచి వెండి యుఁదనమనంబున.

మ. వుడమిన్ రాజ్యము గోలుపోయి తగనేడ్పుంబొందిశోకించున
జ్జడ ధీశాత్మకుఁడైన యింద్రునకుఁ దా జన్మించి రోషాంబుధిం
బడవైన స్వతమన్వునాఁడు ముదమొప్పన్ రాజ్యముంజేయఁగాఁ
గడతేర్తున్నని పాపదక్షునకు వేగన్ శాపమిచ్చెన్ వడిన్.

వ. ఇట్లు పరమేశుండు శాపంబిచ్చిన దక్షుడు తదీయ ప్రకారంబున నుండె నంత"

వీర. విజ. ౧ - ౧౬౩'టు ౧౬౬

అని దక్షయజ్ఞ వృత్తాంతము ముగించఁబడినది. రుద్రునంతటి వాని భార్యనవమానించి చచ్చునట్లుగాఁజేసిన దక్షున కుపడే రుద్రుని వలన శిక్షగలుగునట్లుగా వచింపఁ బడక, యనేక మన్వంతరములైన పిమ్మట వచ్చెడు వైవ స్వతమనువు కాలములో నీ దక్షునీశ్వరుఁడు సంహరించెదనని చెప్పినట్లు కథ పొసగించి, తిరుగ దక్షునకు మఱియొక జన్మమును కల్పించి, యందులో నీశ్వరుఁడు ప్రస్తుతమన్వంతరములో దక్షుఁడు చేసియున్న యపచారమునకుఁగా దక్షునకు లేని దీర్ఘ క్రోధము మనసులో నుంచుకొని, వీర భద్రుఁ బట్టించి యతని వలన నానాఁటి యజ్ఞమునకు వచ్చిన దేవతల నందఱను గూడ శిక్షించెనని

చెప్పుట యెంత శ్లాఘనీయము? పురాణములో నట్లుండెఁ గావున నతఁడట్లు చెప్పెనందురేమో; భాగవతములోఁ బోతరాజా పురాణములను జూడక చెప్పెనా? అట్లుగా నొక చోటఁజెప్పి సందర్భముం గుదిర్చిన పోతరాజే మఱియొక గ్రంథములో నాకథనే సందర్భహీనముగఁ జెప్పునా? కావున నీ రెండు కథలును జెప్పిన వారొకరుగాక యిరువురు వేర్వేఱు కవులని చెప్పి యీ గ్రంథము నవీనమనియుఁ గల్పితమనియు సిద్ధాంతీకరించెదను." అని వ్రాసిరి.

సమాధానము :–

౧. సతీ దేవి ప్రయాణ సందర్భము :–

వీరభద్ర విజయమునకు మూలమైన వాయు పురాణమునందు దక్షయజ్ఞమునకు సతీ దేవి పోవు సందర్భమున సతీ పరమేశ్వరులకు వాదము లేదు. సతి పిలువకున్నను యజ్ఞమునకుఁ బోయినది. అద్దాని నాంధ్రీకరించునపుడు తత్కర్త శివునిచే "పిలువకున్ననేమి యాగమును జూచిరమ్మని చెప్పించినను, సతి పరమేశ్వరునకంతటి యపచారముగావించిన తండ్రికడకుఁ బోవుట కిచ్చగించి యుండలేదు. శివుఁడనునయించి చివరకామెను బంపును. ఈ మార్పు వలనఁ బార్వతి పతిభక్తియు సౌశీల్యమును వ్యక్తమగుచున్నవి. భాగవతమునఁ గవి స్వాతంత్ర్యమును బ్రదర్శింపక మూలమునందున్నది యున్నట్లు వ్రాసినాఁడు. మూలములో శివుఁడు వలదన్నను పార్వతి పయనమగును. అదియే యాంధ్రీకరణమునకు వచ్చినది.

ఇట్లున్న మూల గ్రంథమును బరిశీలింపక భాగవత కర్మయేదో యౌదార్యమును బ్రత్యేకముగఁ బ్రదర్శించెననియు నది వీరభద్ర విజయమున లోపించినదనియు విమర్శ సాగించుట పొరపాటు.

౨. సతీదేవి తండ్రి తోఁబల్కిన పల్కులు:–

వీరభద్ర విజయమున సతీదేవిచే కవి 'ఏరాదక్ష', 'నిగమములార' మొదలగు పద్యములు చెప్పించినాఁడనియు, నవి విరసములైనవనియు పితా పుత్రికలు నీచ జాతి సంజాతుల వలె సంచరించిరనియు, రచన మిగుల పేలవముగను, రసహీనముగను నున్నదనియు, నా సందర్భము భాగవతము నందౌచితీ బద్ధముగ నున్నదనియు విమర్శ. సతీ దేవి తండ్రిని తూలనాడు సందర్భము వాయుపురాణము నందుఁ గంటె వీరభద్ర విజయమునఁగొంత విపులీకరింపఁబడినది. దానికిఁ బ్రబలకారణమొకటి గలదు. వీరభద్ర విజయమును రచించు నపుడు పోతన శైవుఁడు. అందును సోమనారాధ్యుని యడుగుజాడలలోఁ బెరిగిన వాఁడు. శైవులకు శివ నిందకంటె ఘోర కార్యమింకొకటి లేదు.

దక్షుఁడు శివుని నిండు సభలో దుర్భాషలాడినాఁడు. కావున శైవుల దృష్టిలో దక్షుఁడు మహాపాపి. నిందార్హుఁడు. అపుడు కవి సతిచేఁ బల్కించిన పల్కులు కవి హృదయమునే వ్యక్తీకరించును. శైవుఁడుగ నున్నపుడు పోతనకు దక్షుని యెడనుండు నసహ్యాభావము ద్వైతియై భాగవతమును రచించు నాటి కుండదు. వీరభద్ర విజయమున కవి సతిచే నా సందర్భరమున కఠినమైన దుర్భాషలనే పలికించినాఁడు. కాని శివ ద్రోహులకు శైవగ్రంథ కర్తలందఱుఁ జిత్రవధలనే విధించినారు.

3. అనంతర కథా వృత్తాంతము :—

భాగవతమునఁ బార్వతి దగ్ధమైన తరువాత నా ఘోరకార్యమునకు శివుఁడు ప్రతీకారము సేయనెంచి వెంటనే వీరభద్రుని సృష్టించి యజ్ఞమును ధ్వంసము గావించి నట్లుండ, వీరభద్ర విజయమున నా వార్త విన్న శివుఁడు దక్షున కొక శాపమిచ్చి యూరకొని కొన్ని మన్వంతరముల తరువాత దక్షుని శిక్షించెనని యున్నది. దీనిని బట్టి వీరభద్ర విజయకర్తకుఁ గథాకథ నౌచితి గూడా తెలియదనుట శోచనీయము.

వాయు పురాణమునందు సతీదేవి దగ్ధమై పోఁగా శివుఁడు దక్షునకు శాపంబిచ్చి వైవస్వతమన్వంతరమున నాతని శిక్షించినట్లు వ్రాయఁబడ, వీరభద్ర విజయ కర్తయాభాగము నట్లే యనువదించినాఁడు. సంస్కృత భాగవతమున వెంటనే ప్రతీకారము చూపినట్లు కలదు, కానీ నాంధ్ర భాగవతమునను నట్లే యున్నది. అసలు కథా భాగములలో లోపమున్నచో నది మూల గ్రంథ కర్త లోపముగాని, యాంధ్రీకరణలోపము కాదు. ఆంధ్రమున రెండు గ్రంధములకును కర్తయొక్కఁడేయైనను, మూలములు వేఱయినపుడు వస్తు భేదముండక తీరదు. భాషాంతరీకరణములను స్వతంత్ర కావ్యములుగా నూహించి, మూలమును జూడక విమర్శించుటలో వచ్చిన లోపమిది.

౪. అశుచి విషయము :—

ఇది [౧]ముద్రిత ప్రతులలో లేదు. శ్రీ పంతులుగారి విమర్శకుఁ బాత్రమైన ప్రతి ముద్రితమో యముద్రితమో తెలియదు. వారు వీరభద్ర విజయ వివేకమునః "బమ్మెర పోతరాజు వీరభద్ర విజయమను గ్రంథము రచించియుండెననియొక ప్రతీతి గలదు. అయ్యది భాగవత శైలి వలెనుండి లేదనియు, పోతరాజు వార్ధక దశలో వ్రాసియుండుట చేత నందులోఁ గొన్ని దోషంబులు గలిగె" ననియు వ్రాసియున్నారు. లోకములోని వాడుక

౧. అముద్రితములను జూడలేదు.

గూడ నట్లే యుండుట చేత నా గ్రంథము విమర్శన పూర్వకముగాఁ గొంత చదివి యందలి పరస్పరభేదములను బరికించి యది భాగవత గ్రంథకర్త బమ్మెర పోతన కృతంబగునా! యని సంశయించుచుఁ బైన విమర్శించిన నాలుఁగుప్రపత్తులను బేర్కొనిరి. అంతియే కాని వారనుసరించిన ప్రతి ముద్రితమో, యముద్రితమో, యయ్యది వారికెచ్చటలభించినదో వివరింపరైరి. తక్కిన ముద్రిత ప్రతులలోఁ గాని, మూలమునఁగాని యశుచివిషయము సూచనాప్రాయముగ నైనఁ జెప్పఁబడి యుండలేదు.

ఇప్పటికి వారు వీరభద్ర విజయ కథా సందర్భమందుఁ జూపిన యౌచిత్యలోపములు మూలగ్రంధ కారునివే గాని యాంధ్రీకర్తవి గావని సహేతుకముగను, సప్రమాణముగను నిరూపింబఁబడినవి.

౫. ఇఁక శైలి విషయము :-

పోతన వీరభద్ర విజయమును చిన్నతనము నందు రచించుటచే శైలియందును. చమత్కృతి విశేషములందును నాంధ్ర భాగవతముతోఁబోల్చి చూచినపుడు, నాతి ప్రౌఢమైయుండుట సహజము. అదిగాక యా రెండు గ్రంథములకును నడుమ కాల వ్యత్యాసమధికముగ నుండినట్లు దెలియు చున్నది. అట్టియెడ శైలి పేలవముగ నున్నదను విషయము నెక హేతువుగా గ్రహించి కర్తృత్వమును శంకించుట సమంజసముకాదు. ఇఁక వీరభద్ర విజయము పోతన కృతమే యనుటకు గ్రంధస్థ సామ్యములఁ జూఁడనగు.

## 10. భాగవత – వీరభద్ర విజయములకుఁ గల సామ్యములు

వీరభద్ర విజయమునఁ గోరకితములైన భావ సుమములు భాగవతమున నాయా సందర్భములలోఁ గుసుమితములైనవి. అట్టి స్థలము లెన్నియేనిఁ గలవు. అందు గొన్ని :

౧. ఎ. పార్వతిని జెలికత్తెలు గారవించుట :-

సీ. వీణియ నీవుదే వీణావినోదిని, మృగనాభినీవుదే మృగనిభాక్షి !
రాజహంసికఁ దెమ్ము రాజహంసికయాన ! కీరంబు నీవుదే కీరవాణి !
మణిహారములఁ దెమ్ము మణిగణాలంకృత, పువ్వుల నీవుదే పువ్వుబోఁడి
గంధంబు నీవుదే గంధసింధురయాని, కనకంబునీవుదే కనకవర్ణ !

గీ పాలఁతియాడు వసిఁడి బొమ్మలు నీవుదే, వసిఁడి బొమ్మఁ
బోలిలు పడఁతి మఱియు
వలయునట్టి పెక్కు వస్తువుల్ గొనిరండు, గౌరివెంట మనము
గదలవలయు వీర.వి. ౧-౧౨౩

౧. బి. భాగవతమున శ్రీకృష్ణుని రాకకు నంతఃపురకాంతల లరి యలంకరించుకొనుటః-

సీ. తిలకమేటికిలేదు తిలకినీతిలకము, పువ్వులు తురుమవా పువ్వుఁబోఁడి!
కస్తూరియలఁదవా కస్తూరికాగంధి, తొడవులు తొడువవా తొడవుతొడవ
కలహంస పెంపుదే కలహంసగామిని, కీరము చదివింతె కీరవాణి!
లతలఁబోషింతువా లతికాలలితదేహ, సరసినోలాడుదే సరసిజాక్షి!

గీ. మృగికిమేఁతవిడుదె మృగశాబలోచన, గురులనాదరింతెగురువివేక!
బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి, యనుచుసతులనడిగెనచ్యుతుండు.
భాగవతము ౧-౨౩౪

౨. ఎ. పురస్త్రీలు శివునిఁ జూచి ముచ్చటించుకొనుట :-

సీ. కల్యాణియాతఁడే కళ్యాణమూర్తియై, సమ్మోదమునవచ్చుజాణమగడు
కామిని యాతఁడే ఘనజటావళిలోని, మిన్నేరుదాఁచిన మిండగీఁడు

వనితరొ యీతఁడే మనగౌరినలరింప, మాయఁపువటులైన మాయలాఁడు
వెలఁదిరొ యీతఁడే వెన్నెల పాపని, ఁబువ్వుగాఁడుఱిమిన పుట్టుభోగి

ఆ. ఉత్తమాంగి యితఁడె పిత్తేఁచెలికాఁడు, విమలనేత్రియితఁడె వేల్పుఱేఁడు
ఇందువదన యితఁడె మందిరకైలాస, కంధరుండునీలకంధరుండు.

వీ.వి. ౩-౧౬౨

౨. బి. మధురానగరమందలి రమణులు కృష్ణునిఁ జూచి మెచ్చుకొనుట :-

సీ. వీఁడటే రక్కసి విగతజీవఁగఁ జన్నుఁబాలు ద్రావినమేఁటి బాలకుండు
వీఁడటేనందుని వెలఁదికి జగమెల్ల, ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు
వీఁడటే మందలో వెన్నలు దొంగిలి, దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁడటే యలయించి వ్రేఁతలమానంబు, నూరలాడినలోక సుందరుండు.

గీ. వీఁడు లేకున్నఁ బురమటవీస్థలంబు, వీనిఁబొందని జన్మంబువిగతఫలము
వీనిఁబలుకనివచనంబు విహగరుతము, వీనిఁజూడనిచూడ్కులు
వ్యథలు వృథలు"

భాగ. ౧౦-౧౨౪౯

౩. ఎ. వాయు దేవుఁడు శివుని మహత్త్వము వర్ణించుట :-

సీ. దేవాదిదేవుని తెలుఁగిట్టిదందమా తెలుఁగులెల్లనుఁబుట్టు తెలుఁగుదాన
మదనమదారాతిఁ జదివెదమందమా చదువులకెల్లను మొదలు దాన
బ్రహ్మాది వంద్యునిఁ బరికింతమందమా, బ్రహ్మాదులకునైన బ్రహ్మదాన
దేవతారాధ్యునిఁ దెలిసెదమందమా, తెలిసిన మీదటిధృతియుఁ దాన

ఆ. ఎంతయనఁగ నేర్తునేమని వర్ణింతు, నేదియాదియంత్యమేదియరయ
సకలమునకు నతని సంతతానందంబు, నెఱిఁగి కొలఁది సేయసెట్లు వచ్చు"

వీర.విజ. ౧ - ౪౯

౩. బి. వామనమూర్తి వ్యంగ్యముగఁ దన్నుఁ గూర్చి చెప్పుకొనుట:-

సీ. ఇదినాకు నెలవనియేరీతిఁ బలుకుదు, నోకచోటనక యెందునుండనేర్తు
నెవ్వనివాఁడనంచేమని పలుకుదు? నాయంతవాఁడనై నడవనేర్తు

నీనడవడియని యెట్లు వక్కాణింతు? ఁబూని ముప్పొకలఁబోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు ననియేలఁ జెప్పంగ? నేరుపులన్నియునేననీర్తు

ఆ. నొరులుగారునాకు నొరులకునేనౌదు, నొంటివాఁడఁ జుట్టమొకఁడులేడు
సిరియుఁదొల్లిగలదు చెప్పెదనాలెంకి, నుజనులందుఁ దఱచు సొచ్చియుండు

భాగ. ౮ - ౫౫౨

౪. ఎ. శివునికడకు బ్రహ్మరాక :-

క. చదువులుపెక్కులు గలవా, చదువులకును మొదలు నాల్గ
చదువులుగలవా
చదువులకు మొదలు గలిగిన, చదువులు గల శంభుఁగొలువఁ
జదువులు వచ్చెన్

వీర. వి. ౧ - ౫౯

౪. బి. ప్రహ్లాదుఁడు హిరణ్యకశిపునితోఁ దన చదువును గూర్చి చెప్పుట :-

క. చదివించిరి నముగురువులు
చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులు, నేఁ
జదివినవి గలవు పెక్కులు,
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ."

భాగ ౭ - ౧౬౬

౫. ఎ. పార్వతి శివుని వేడికొనుట :-

మత్త. తల్లియాదిగఁ దండ్రియాదిగఁ దాతయాదిగఁ గల్గువాఁ
రెల్లభంగులనీవెకాని మహేశ! యన్యమెఱుంగనే
నుల్లమందునఁ జిత్తగించితి నొప్పముల్ తగునయ్యయా
ప్రల్లదుండఁట నాకుఁ దండ్రి భరంబు పల్కితి శంకరా!"

వీర. విజ. ౧ - ౧౧౭

౫. బి. సహోదరుని పరాభవమునకు భిన్నయై రుక్మిణి కృష్ణుని వేడికొనుటః-

మత్తు. కల్లలేదని విన్నవించుట గాదు వల్లభ! యీతనిన్

ౘల్లదుండెగఁ జూచితేనియు భాగ్యవంతులమైతి, మే
మల్లుఁడయ్యెముకుందుఁడీశ్వరుఁడంచు మోదితులైన మా
తల్లి దండ్రులు పుత్త్ర శోకముఁ దాల్చి తక్కుదురీశ్వరా!

భాగ. ౧౦ - ౧౨౬౭

౬. ఎ. హరుని వలచిన పార్వతిస్థితి :-

సీ. శృంగారములుసేయ శృంగారియొల్లదు, పువ్వులుదుఱుమదు పువ్వుఁబోడి
పలుకంగనేరదు పలుకనేరని భాతి, జంచలత్వమునొందుఁ జంచలాక్షి
సరసులఁ గ్రీడింప నరసిజాననవ్రోదు, మౌనంబుతోఁగుందుమానవిభవ
గంధంబు పూయదు గంధవారణయాన, చెలువలఁబిలువదుచెలులచెలియ.

గీ. ముకురమేప్రొద్దుఁ జూడదుముకవదన, తరుణిమఱియును సర్వకృత్యములు మఱచి
హరునితోడిదె గొండాటయైలతాంగి, యుగ్రతావంబు సైరింపకున్నఁజూచి.

వీర. విజ. ౧ - ౨౦౧

౬. బి. శ్రీకృష్ణునిఁ గామించిన రుక్మిణి స్థితి :-

సీ. మృగనాభియలఁదదు మృగరాజమధ్యమ, జలములనాడదుజలజగంధి
ముకురంబుసూడదు ముకురసన్నిభముఖి, పువ్వులుదుఱుమదు పువ్వుబోఁడి
వనకేళిఁగోరదు వనజాతలోచన, హంసంబుఁబెంపదు హంసగమన
లతలఁబోషింపదు లతికాలలితదేహ, తొడవులు తొడువదుతొడవుతొడవు.

ఆ. తిలకమిడదు నుదుటఁ దిలకినీతిలకంబు, కమలగృహముఁజొరదు కమలహస్త
గారవించి తన్నుఁగరుణఁగైకొనవన, జాలిరాఁడు తగవుమాలియనుచు

భాగ - ౧౦ - ౧౭౩౦

౭. ఎ. తండ్రి శివునియెడఁ జేసిన యపచారమునకుఁ బార్వతి వగచుట :-

క. వడవడ వడకుచు నుడుగుచుఁ
జిడిముడిమయినొంది కలఁగి చింతాకులయై

వెడఁగుఁదనంబున నిలుచుచుఁ
గడువాడిన పువ్వుభంగిఁ గాంతి దొఱంగన్"

వీర. విజ. ౧ - ౧౦౬

౭. బి. గజేంద్రరక్షణార్థము పోవుచున్న నారాయణుని వెంటవెడలు లక్ష్మి స్థితి :-

క. అడిగెదనని కడువడిఁ జను,
అడిగినఁదనుమగుడ నుడువడని నడయుడుఁగున్
వెడవెడ చిడిముడి తడబడ,
నడుగిడు నడుగిదడు జడిమనడుగిడునెడలన్

భాగ ౮ - ౧౦౩

౮. ఎ. హిమవంతుఁడు పార్వతిని స్తుతించుట :-

సీ. రాలోకసుందరి రాజగన్మోహినీ, రావమ్మకైలాసరాజపత్ని
రాకన్యకామణీరారాజబింబాస్య, రావమ్మ యౌవన రాజ్యలక్ష్మి
రా ఓ మహాకాళి రా ఓ సరోజాక్షి, రావమ్మభారతీరమణవినుత
రా ఓ జగన్మాత రా ఓ సదానంద, రావమ్మమత్తేభరాజగమన
యనుచుఁ బెక్కుగతులనంకించియంకించి, దగిలిమేనకాఖ్యఁదన్నుఁబిలువఁ
దండ్రిచేయిడిగ్గి తద్దయువేడ్కతో, కామినీలలామ గౌరియపుడు"

వీర. విజ. ౧ - ౧౮౯

౮. బి. శ్రీకృష్ణుఁడు పేరుపేరున గోవులను సంబోధించుట :-

సీ. రాపూర్ణచంద్రికారాగౌతమీగంగ, రమ్ముభాగీరథీరాజతనయ
రానుధాజలరాసిరామేఘబాలికా, రమ్ము చింతామణీ రమ్ముసురభి
రామనోహారిణి రాసర్వమంగళా, రాభారతీదేవి రాధరిత్రి
రాశ్రీమహాలక్ష్మి రా మందమారుతి, రమ్ము మందాకిని రా సుభాంగి

ఆ. యనుచు మఱియుఁగలుగు నాఖ్యలుగలగోవు, లడవిలోన దూర
మందు మేయ
ఘనగభీరభాషఁగడు నొప్పఁ జీరునా, భీరజనులు వొగడఁబెంపునెగడ

భాగవ. ౧౦ - ౬౦౩

ఎ. శివుఁడు మన్మథునిపైఁ దనకంటిమంటలు పఱపుట :-

క. భుగభుగయను పెనుమంటలు,
భగభగయని మండనంత బ్రహ్మాండంబున్
దిగుదిగులుదిగులు దిగులన,
దిగిమరుపైఁ జిచ్చుకన్నుదేవుఁడు విచ్చెన్.

వీర. విజ. ౨ - ౧౧౦

క. దిక్కులెఱమంటఁ గప్పెను
మిక్కిలిగామింటనెగయు విడుగురుగములున్
గ్రక్కదలరాల వడిగాఁ
జుక్కలు ధరఁబడఁగమింట సురలుంగలఁగన్"

వీర. వి. ౨ - ౧౧౧

బి. గజేంద్రుని యుద్దండక్రీడ :-

సీ. భుగభుగా యితభూరి బుద్బుదచ్ఛటలతోఁ
గదలుచో దివికి భంగంబులెగయ"

భాగ - ౮ - ౩౧

ఎ. కుహనావటువు శివుని లక్షణములను వర్ణించుట.

సీ. తరలాక్షియీతండు ధనవంతుఁడందమా
కోరివేడినఁగాని కూడలేదు
చిన్నారి వయసున చిన్నివాఁడందమా
యెన్నటివాఁడొకో యెఱుఁగరాదు.
ఆకార సంపదనతిమేటి యందమా
యాకారమెట్టిదో యరయరాదు
కులగోత్రములు రెండుఁ దెలియుదమందమా
తలిదండ్రులెవ్వరు ధరణిలేరు.

గీ. తిరుపరొంటిగాఁడు దేవుండు చూడఁడే
మాయమందు కపట మంత్రములను

మగువ! నిన్నునెట్లు మరగించుకొన్నాఁడొ
కాని తగినవాఁడు కాఁడు కాఁడు."

వీర. విజ. ౨ - ౨౭౩

౧౦. బి. శోద కృష్ణుని గుణములను వర్ణించుట :-

సీ. బాలుఁడీ తండని భావింతునందునా
యే పెద్దలును నేరరీక్రమంబు
వెఱపెరుంగుటకునై వెఱపింతు నందునా
కలిగి వేకొక్కఁడుగాని లేఁడు
వెఱపుతో నాబుద్ధి వినిపింతునందునా
తనుఁదానయై బుద్ధి దప్పకుండు
నొండెఱుంగకయింట నుండెడినందునా
చొచ్చిచూడనిదొక చోటులేదు

ఆ. దన్ను నెవ్వరైనఁదలపోయఁబాటెడి
యోజలేదు భీతియొకటి యెఱుఁగఁ
డెలమి నూరకుండఁడెక్కసక్కెము లాడుఁ
బట్టి శాస్తిసేయు భంగియెట్టు

భాగవ. ౧౦ - ౩౬౬

౧౧. ఎ. పార్వతీకళ్యాణముకు శివుఁడు విఘ్నేశుఁ గొంపోవుట :-

శా. లెమ్మా శీతనగేంద్ర పట్టణమునన్ లీలార్థమైయున్న మీ
యమ్మందేవలెనుండనీదగు నీవాయత్తమై తోడితే
రమ్మా! నీవును నీగణంబులును సంరంభమ్ముతో ముందఱం
బొమ్మాయేమును గూడ వచ్చెదము సమ్మోదంబుతోఁబుత్రకా"

వీర. వి. ౩ - ౧౦౧

౧౧. బి. శ్రీకృష్ణుఁడు గోపకాంతలచెంతకుద్ధవుని బంపుట :-

శా. రమ్మాయుద్ధవ గోపకామినులు నారాకన్ నిరీక్షించుచున్
నమ్మోహమ్మున నన్నియున్మఱచియే చందంబును గుందిరో

తమ్ముండున్నమ్మినవారి డిగ్గవిడువన్ ధర్మంబుగాదంద్రు వే
పొమ్మా! ప్రాణములేక్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్"

భాగ. ౧౦ - ౧౪౩౮

౧౨. ఎ. రతీవిలాపము :-

శా. కట్టాదేవరకంటిమంటలు నినుంగాల్చెంచుచో మన్మథా
చుట్టాలందలిదంద్రులందలంచితో శోకంబునుంబొందితో
పట్టం జాలని శోకవార్ధిఁబడి నీ ప్రాణేశ్వరిబిల్చితో
యెట్టుంబోవఁగలేక మంటలకునై యేమంటివో మన్మథా!"

వీర. వి. ౨ - ౧౧౭

౧౨. బి. కాళీయమర్ధన సందర్భమున యశోద విలాపము :-

క. కట్టా క్రూర భుజంగము
కట్టలు కన్నిన్నుఁగఱువఁ గంపించితివో
తిట్టితివో పాపపు విధి
పట్టిమ ముందలఁచికాకఁ బలవించితివో.

భాగ. ౧౦ - ౬౫౫

౧౩. ఎ. రతీ విలాపము

క. వారక నిఖిల జనంబుల
నీరసమున సతులఁబతులనేచికలంపన్
నేరిచి శివునిఁగలంపఁగ,
నేరు పలేవై తిమదన నిన్నేమందున్" వీర. వి. ౨ - ౧౨౦

౧౩. బి. యశోద విలాపము :-

క. విషకుచయుగయగు రక్కసి,
విషకుచదుగ్ధంబుఁద్రావి విషవిభయుఁడవై
విషరుహలోచన యద్భుత,
విషయుండగు నీకు సర్పవిషమెక్కెఁగదా." భాగ. ౧౦ - ౬౫౪

౧౪. ఎ. రతీ విలాపము :-

సీ. ఉచితమార్గంబున నుపలాలనము చేసి
యెలమి రక్షించువారెవ్వరింక
అటువారు నిటువారు నయ్యేడు గడయునై
యెలమినన్నేలు వారెవ్వరింక
వీలనర్థించిన వేదన పలుకక
యిష్టంబు లిచ్చువారెవ్వరింక
కర్ణంబులకు నింపుగా నిష్ట వాక్యంబు
లేపారఁ బల్కువారెవ్వరింక

ఆ. నేఁడు నాథనీవు నీఱైన పిమ్మట
తివిరినన్నుఁగావ దిక్కులేమి
తలఁపులోనఁ దలఁచఁదగదయ్యెచెల్లబో
వీరసూకళత్ర విష్ణుపుత్ర" వీ. విజయము

౧౪. బి. యశోద విలాపము :-

సీ. శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ
నెలమి భాషించువారెవ్వరింక
కరచరణాదులకలిమి ధన్యతనొంద
నెరిగిపైఁ బ్రాకువారెవ్వరింక
నయనయుగ్మంబులున్నతి గృతార్థములుగా
నవ్వులు సూపువారెవ్వరింక
జిహ్వలు గౌరవశ్రీఁజేరఁ బాటల
యెడఁ బలికించువారెవ్వరింక

ఆ. దండ్రి నీవు సర్పదష్టుండవై యున్న
నిచటమాకుఁ బ్రభువులెవ్వరింక
మరగిపాయలేము, మాకునీతోడిద,
లోక; మీవులేని లోకమేల?"

భాగ. ౧౦ - ౬౫౮

౧౫. ఎ. శివుఁడెఱుకతరూపము దాల్చినప్పటి యాకారము :-

ఉ. ఈముఖపంకజంబురుచు లీనయనోత్పలపత్రనిర్మలు
లీమెయి చాయలీనగవు లీమురిపెంబులు నీవిలాసమున్
గామినులార! యెందు మఱి కల్గఁగ నేర్చునె తొల్లి బాపురే
సామజయానయీ యెఱుకసానికిఁ దాఁజెలువింత యొప్పునే."

వీర. వి. ౨ - ౧౭౬

౧౫. బి. మోహినీ రూపముగాంచిన శివుని భావన :-

శా. ఈ కాంతాజనరత్నమెవ్వరిదొకో? యీయాఁడురూపంబు ము
న్నేకల్పంబులయందుఁగాన, మఱుఁడీయింతిన్ సృజింపంగఁదా
లేకుంటెల్లనిజంబు, వల్లభత నీ లీలావతింజేరఁగా
నేకాంతుండు గలండో? క్రీడలకు నాకీయింతి సిద్ధించునే ?

భాగవ. ౮ - ౩౯౫

౧౬. ఎ. శివుని యెఱుకత వేషము :-

సీ. కడునొప్పుదిశలెల్లఁగనకంబుగావించు, తాటంకరోచులు దనరుచుండ
చనుదోయిపైఁగాలు శంఖహారావళి, పయ్యెదలోపల బయలుదూఁగ"

వీర. వి. ౨ - ౧౭౨

౧౬. బి. విష్ణుని మోహినీరూపము :-

సీ. ఒకయెలదోఁటలోనొకవీథినొకనీడఁగుచకుంభములమీందికొంగుదొలగఁ,
గబరికా బంధంబు గంపింపనుదుటిపైఁ జికురజాలంబులు చిక్కువడఁగ,"

భాగవ. ౮ - ౩౯౩

౧౭. ఎ. కుహనావటుని రూపము :-

చ. సదమలమైనవాఁడు కడు చక్కని రూపమువాఁడు కాంతిచేఁ
బొదలినమోమువాఁడు మెయిభూతినలందినవాఁడు దివ్యమై
యొదలిన బ్రహ్మచారిగతి నొప్పినవాఁడిటువచ్చుచున్నవాఁ
డదెయొక గుజ్జుతాపసుఁడహో వనితామణులార కంటిరే."

ఈచాయలోనడచిన పద్యములు భాగవతమున సుమారు పండ్రెండు వఱకును గలవు. గ్రంథ విస్తర భీతిచేయన్నియు వ్రాయుటమాని యొకటి రెండు మాత్రమీదిగువ నుదాహరించుచున్నాను.

౧౭. బి.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, కృపారసంబుపైఁ
జల్లెడువాఁడు, మౌళి పరిసర్పిత పింఛమువాఁడు, నవ్వురా
జిల్లెడు మోమువాఁడొకఁడు చెల్వల మానధనంబుఁదెచ్చెనో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ! చెప్పరే!

భాగవ. ౧౦ - ౧౦౦౦

౧౮. ఎ. పార్వతి చెలులు శివుని స్తుతించుట :-

ఉ. వేదపురాణ శాస్త్రములు విస్తృతినిన్నును జేయలేవు బ్ర
హ్మాదులుగానలేరు సనకాదులుఁగానఁగలేరు నిర్జరేం
ద్రాదులుఁగానలేరు ధనదాదులుఁగానఁగలేరు లక్ష్మినా
థాదులకైన నీదు మహిమాతిశయంబుఁ దలుపశక్యమే."

వీర. విజ. ౨ - 303

౧౮. బి. కాళియుని భార్యలు శ్రీకృష్ణుని స్తుతించుట :-

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద; మొల్లరు బ్రహ్మపదంబు నొందగా,
నొల్లరు చక్రవర్తిపద, వమొల్లరు సర్వరసాధిపత్యము;
నొల్లరు యోగసిద్ధి; మఱియొండు భవంబుల నొందనీనినీ
నల్లలితాంఘ్రిరేణువుల సంగతి నొందిన ధన్యులెప్పుడున్."

భాగవ. ౧౦ - ౬౫౮

౧౯. ఎ. శివుఁడు ఔషధీపురమునుచేరుట :-

ఉ. కాలుని గెల్చిలీలమెయిఁగాముఁ బరాజితుఁజేసి కొండరా
చూలికిఁ జిక్కి జూటమునఁ జుక్కలఱేనిధరించి జాణఁడై"

వీర. వి. 3 - ౧౪3

౧౯. బి. శ్రీకృష్ణుని మధురానగరప్రవేశము :-

ఉ. నందతపః ఫలంబు, సుగణంబులపుంజము, గోపకామినీ
బృందము నోముపంట, సిరివిందు, దయాంబుధి, యోగిబృందముల్
డెందములందుఁగోరెడు కడింది నిధానము, సేరవచ్చె, నో
సుందరులార! రండు, చనిచూతము కన్నులకోర్కి దీఱఁగన్
భాగవ - ౧౦ - ౧౨౪౬

౨౦. ఏ. వీరభద్రవిజయమునఁ దండ్రికొమరునిపై నీదిగువరీతిని వాత్సల్యము చూపును:-

శా. రావోకుఱ్ఱఁడయంచుఁ గౌఁగిటికిఁ జేరంబిల్చియ్యూరార్చియు
ద్దేవురేనుంగు తుండముంబుణికి మూర్ధిఘ్రాణముంజేసి స
ద్భావుండంక తలంబు పై నునిచి సంభావించి ప్రేమాబ్ధిఁ దా
దైవారందన ముద్దు పట్టికిని గందర్పాంతకుండిట్లనెన్.
వీర. విజ. ౩ - ౧౦౦

౨౦. బి. భాగవతమునఁదల్లి వామనమూర్తిని జూచి యిట్లుముద్దు సేయును :-

క. అన్నారమ్మని దగ్గఱఁ జన్నులపాలేఱువాఱ, సంశ్లేషిణియై,
చిన్నారిమొగము నివురుచు, గన్నారంజూచెఁ గన్నకడుపై యుంటన్
భాగవ - ౨ - ౫౧౫

౨. - వచన సామ్యములు :-

వీరభద్రవిజయము - కథా ప్రారంభమున - నైమిశారణ్యవర్ణనము :-

"మహి తమాతలుంగ మందారచందన సాలభల్లాతకీ ప్రముఖ రాజిత కుంభినీ విరాజితంబును, కురువిందమహిమ్లాత మధుక శతపత్ర కమల కల్హార కరవీర మల్లికాదివల్లీ సంపుల్లపుష్పవల్లీలలిత పరిమళ సుగంధ బంధుర దిగంతరాళంబును, నిజవిరోధంబుఁ బొఱఁగినగతి వసించు చంచరీక శారికాక్రీర --------------- నైమిశారణ్య పుణ్యక్షేత్రంబునందు" నాకీల చక్రవాక నీలకంఠకనక నయన కంకనా శలింగ క్రాంచకారంభకా రండ కానకపోత పారావత శకుని భరద్వాజ చకోరలావుక జీవంజీవవాయ సారాతి కోయష్టిక డిండిభసార సశాతఖండనారంగత్ప దారంగ గణనాదప్రమోదితంబును, మండిత గండభేరుండ

వేదండ కంఠీరవ శరభశార్దూల శంబర జంబూక గవయ వరారోహప్లవంగ శల్యసారంగ చమరీమృగగోకర్ణవృకాది మహా మృగమందిరంబును, దందశూకగాధేయ మార్జాల మూషక నివాసంబును, సకలపుణ్యాతరంగిణీ మంగళ సంగమంబును, వినిర్మల సరోవర విలసితంబును, ననుపమమునినాదనిరంతర బహుళపాఠ నిఖిలనిగమ కలకలారావఘటిత గగన తలంబును, ధర్మతపోధన ధాన్య దానతాప సోత్తమ సంతతసంతుష్ట హోమధూమ సమ్మిళిత బృందారకా లోకనంబును సర్వభువనమహారణ్య రత్నంబును సకల మునిజన స్తోత్రపాత్రంబును నగు నైమిశారణ్య పుణ్యక్షేత్రంబునందు". అనువచనము

## భాగవతమందలి త్రికూటపర్వత వన వర్ణనము :-

"అది మఱియును, మాతులుంగ లవంగలుంగ చూతకేతకీ భల్లాత కామ్రాతక సరళపనస బదరీ వకుళవంజుళ వటకుటజ కుందకురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళసిందువార చందన పిచుమంద మందారజంబూజంబీర మాధవీ మధూక తాలతక్కోలత మాల హింతాల రసాలసాలప్రియాళు బిల్వా మలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థకాంచన కందరాళ శిరీష శింశుపాశోక --------------------------- ----------------------------- నొప్పునప్పర్వతసమీపంబునందు" అనువచనమును సరిపోలియున్నది. భాగ - ౮ - ౨౪

## క్షీరాబ్ధిలో హాలాహలము పుట్టుట :-

"మఱియును విలయ సమయంబున జలధరానేక నిర్గత గంభీర ఘోషణంబులుం బోలె గుభులు గుభుల్లను నాదంబుల బ్రహ్మాండంబులన్నియు సదరి బెగడి తిరిగి పరస్పర నినాదంబు చెలంగి చరాచర జంతు జాలు ప్రళయ -------------- హాలాహలంబు చేయు చందంబున" - ౩ - ౨౨౬

## భాగవతమందలి హాలాహలావిర్భావ సందర్భ వర్ణనము :-

"అదియునుం బ్రళయకాలాభీల. ఫాలలోచన లోచనానలశతంబు చందంబున నమందంబై, విలయహేదహన సహస్రంబుకై వడివడియై, కడపటి పట్టపగలింటి ----- ---------------- అకాలవిలయ కాలంబై తోచుచున్న సమయంబున"

అనుదానిని పోలియున్నది భాగ - ౮ - ౨౦౬

శబ్దసామ్యము :-

"లగ్నంబెల్లి" యను శబ్దము వీరభద్ర విజయకారుఁడు మెచ్చి వాడినాఁడు.

"శుభలగ్నంబెల్లి బృందారకుల్" వీ.వి. ౩-౯౭

"గౌరీ వివాహలగ్నంబెల్లి" వీ.వి. ౩-౧౧౭

"లగ్నమాసన్నంబైన" వీ.వి. ౩-౧౮౧

భాగవతముననుఁ "లగ్నంబెల్లి వివాహముంగదిసె" అని రుక్మిణీ కళ్యాణ ఘట్టమున -౧౭౨౪ వాడినాఁడు.

"చెల్ల, చెల్లరే" అను శబ్దములు వీరభద్ర విజయమున నెంత యవిరళములో వతమున నంత యధికములు. పూర్వకవులలోఁ బోతనకుఁ బూర్వులుఁ దరువాతివారుఁ ప నా శబ్దములను ప్రయోగింపక పోలేదు, కాని యెవ్వరును నా శబ్దములందంత ్కవను జూపియుండలేదు.

భద్ర విజయమునఁ బైప్రయోగములు మచ్చునకుఁగొన్ని :

| | |
|---|---|
| అక్కట చెల్లఁబోకట కటా | ౧౧-౧౨౬ |
| పలుకఁదగదయ్య చెల్లఁబో | |
| తెగటారె చెల్లఁబో | ౧౧-౧౪౧ |
| పరిచర్యలు సేయఁగలేదు చెల్లరే | ౧౧-౨౦౦ |
| దైవము నేమననేర్తుఁ జెల్లరే | ౧౧-౨౬౧ |
| భాములఁ గావఁ జెల్లరే | ౧౧-౨౬౮ |
| చెల్లరే యీ జాడ | ౧౧౧-౧౧ |
| జవ్వన మాఱిడిఁ బచ్చఁ జెల్లరే | ౧౧-౨౬౧ |

వతమునఁ బై పద ప్రయోగములు :—

| | |
|---|---|
| ముఖ్య ధర్మములందుఁ దెలిపితివేఁజెల్లఁదీనఁజేసి | ౧-౮౫ |
| వినీతుఁడ వీవు చలించి చెల్లరే | ౧-౮౯ |
| వనంబులన్ గృహవిరాములమై నివసింపఁ జెల్లరే | ౧-౪౬౮ |

| | |
|---|---|
| భూపరిపాలనంబు సమబుద్ధి నితండొనరింపఁ జెల్లరే | ౧-౪౮౨ |
| బాణజాలముల పాలై పోయితే చెల్లరే | ౮-౮౬౬ |
| చెల్లరేయనని పుత్త్రిచేసిన ప్రియములు | ౧౧-౬౨ |
| ప్రయాణము వల్దనరైర చెల్లరే | ౧౦-౧౨౧౩ |
| రమణులడ్డము వత్తురుగాక చెల్లరే | ౧౦-౧౪౭౨ |
| చెల్లంబో తలఁద్రెంచెనంచు | ౧౨-౧౬౬ |
| బరువయ్యెనే బ్రతుకుకోమలియే మననేర్తుఁ జెల్లరే | ౮-౬౧ |
| కొంచెమడిగితివో చెల్ల | ౮-౬౩౯ |
| మహి నెల్లఁ జల్లతిరిగితి | ౧౧-౪౦ |
| సౌఖ్యముంగనుదంట చెల్లరేనగవు గాక | ౯-౧౮౭ |
| చెల్లన్ మదిన్ నిన్ను భణింతు గంగన్ | ౯-౨౨౨ |
| వదలంజాలఁడు నాదు గౌఁగిలియుఁదావంధ్యాత్ముఁడై చెల్లరే | ౯-౪౦౫ |
| చిత్తమే మఱి మత్తిల్లి చెల్లఁ జిక్కి | ౯-౫౬౭ |
| వింతల్ నీతలఁబుట్టెఁ గాక మఱియేవీక్ష్ణ యోచెల్ల | ౧౦-౮౨౮ |
| కుసుమమంజు శరీరులఁ దెచ్చి చెల్లరే | ౧౦-౧౩౫౯ |
| జీవనంబున్ చెల్లరే చలితంబాట | ౮-౬౩౯ |
| ఓచెల్లయీఁడు గాదని | ౧౦-౧౩౫౦ |

పై శబ్దములు పోతనకృత భాగవతభాగములోఁదప్ప నితర కవుల భాగములందంతగా నను. ఒకవేళ నాకన్నొఱఁగించిన యొకటిరెండు ప్రయోగములుండి నుండవచ్చును. కవిత్రయము వారి రచనలందుఁ గూడ నీ పదప్రయోగమతి స్వల్పము.

శ్రీ పెద్ది భొట్లు వీరయ్యాగారీ ప్రయోగములను బరిశీలించుచు నిట్లు వ్రాసిరి. "పింగళిసూరన, గౌరన యీ శబ్దమును రెండుసార్లు ప్రయోగించిరి. సోమన యుత్తరహరి వంశమునను, భాస్కరుఁడు రామాయణమునను, రంగనాధుఁడు తన గ్రంధమునను "చెల్లబో" యనియు, "ఓ చెల్ల" యనియు, నొకటి రెండుసార్లు వ్రాసిరే గాని "చెల్లరే" యని శబ్దమును వారు వాడినట్లు లేదు. మడికిసింగన పద్మ పురాణమున యెఱ్ఱా ప్రగడ "హరివంశము" నను "చెల్లరే" యని వాడిన స్థలములు మూఁడు నాలుఁగు కంటెలేవు." అని వ్రాసిరి.

ఒకటి మాత్రము నిశ్చయముగఁ జెప్పఁగలము. పోతన తరువాతి కవులీ శబ్దము
న్నిరూపములలో వాడినను వీరభద్రవిజయ భాగవతము లందున్నంత బహుళముగ
నియందయ్యవికాస రావని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

అనుప్రాసలు :-

అంత్యాను ప్రాసములు వాడుటలోఁ బోతనది యందెవేసిన చేయి. అచేయి తన
థమకృతియగు "వీరభద్ర విజయము" నను, నా తీరులోఁ గొంతమలుపు తిరుగక
లేదు.

తన భాగవతము నందలి కొన్ని యత్యాను ప్రాసములు :-

| | |
|---|---|
| సూతున్ నితాంతకరుణోపేతున్ | ౧-౩ |
| కళ్యాణ విశేషణములు హరిగుణోపచిత భూషణముల్ | ౧-౯ |
| అర్జున పాప వర్జనా | ౧-౧౧౮ |
| పాశబద్ధ పాణిన్ ద్రౌణిన్ | ౧-౧౨౧ |
| సుధాంగశ్చక్రమున్ జక్రమున్ | ౧-౧౮౯ |
| జగచ్ఛ్రేణీహరిన్ శ్రీహరిన్ | ౧-౧౮౯ |
| మణిప్రాకారకన్ ద్వారకన్ | ౧-౨౦౬ |
| దోషసంగిన్ శృంగిన్ | ౧-౪౫౮ |
| కాంతల భక్తినితాంతచిత్తలన్ | ౩-౧౨౮ |
| ౦. ప్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్ | ౩-౧౪౭ |
| ౧. సత్కృపామూర్తియోదేవ చక్రవర్తి | ౩-౩౧౧ |
| ౨. దురితార్ణవతారణ సృష్టికారణా | ౩-౪౯౯ |
| ౩. విపన్నులమమ్ము భవత్ప్రపన్నులన్ | ౩-౫౦౦ |
| ౪. కృపాగుణ భూషణపాపశోషణా | ౩-౫౪౭ |
| ౫. అర్థజన పోషణభూషణు పాపశోషణున్ | ౩-౫౭౭ |

---

పై చల్లశబ్ద ప్రయోగముల పట్టిక శ్రీ వెద్దిభోట్ల వీరయ్యగారి బమ్మెర పోతనా మాత్యుఁడు అను
ధమునుండి గై కొనఁబడినవి. పేజి ౮౧-౮౨

| | | |
|---|---|---|
| ౧౬. | ఖురదళితమేరుగిరికిన్ హరికిన్ | ౩-౬౪౬ |
| ౧౭. | పాలితప్రకటధాత్రీ చక్రమున్ జక్రమున్ | ౩-౬౭౭ |
| ౧౮. | కమలజాండఘటికిన్ కిటికిన్ | ౩-౯౯౭ |
| ౧౯. | సర్వలోకశుభదాయక! నిత్యవిభూతినాయకా! | ౩-౮౬౫ |
| ౨౦. | నూరివారి కానలవారిన్ | ౧౦-౧౪౨ |
| ౨౧. | దుర్జనవధ ప్రారంభకున్ డింభకున్ | ౧౦ పూ ౨౧౬ |
| ౨౨. | విపర్జనములు యమళార్జునముల్ | ౧౦ పూ ౪౦౩ |
| ౨౩. | గుణమణిన్ గోపాలచూడామణిన్ | ౧౦ పూ ౬౭౩ |
| ౨౪. | గుణము గుణాఢ్యా | ౧౦ పూ ౬౭౫ |
| ౨౫. | సం, తోష సరోష నిర్దళితదోష ననేకవిశేషునిన్ | ౧౦ పూ ౧౨౩౩ |
| ౨౬. | దివిషదంకరిష్ణుల నతిస్థిల జిష్ణుల రామాకృష్ణులన్ | ౧౦ పూ ౧౫౫౧ |
| ౨౭. | మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్ | ౧౦ పూ ౧౬౮౪ |

ఇట్లనేకములు గలవు. గ్రంధ విస్తర భీతిచే విడువఁ బడినవి.

వీరభద్ర విజయమునందంత్యాను ప్రాసములు

| | | |
|---|---|---|
| ౧. | బాణు నంచిత శబ్దపారీణు | ౧ - ౯ |
| ౨. | కవితా గుణావాసుఁగాళిదాసు | " |
| ౩. | గుణధుర్యునన్నపార్యు | " |
| ౪. | శృంగారకవినాథు రంగనాథు | " |
| ౫. | మఘుఁగావ్యామోఘు మణిభద్రు శివభద్రు | " |
| ౬. | సేవిత కవిరాజి సోమయాజి | ౧ - ౯ |
| ౭. | సోమనాథసముఁడు సోమగురుఁడు | ౧ - ౧౪ |
| ౮. | పాపచక్షుఁడు కర్మచక్షుఁడు దక్షుఁడై | ౧ - ౭౪ |
| ౯. | చదువులు గలశంభుఁగొల్వఁ జదువులు వచ్చెన్ | ౧ - ౫౪ |
| ౧౦. | దక్షుండు దక్షాత్మఁడై | ౧ - ౧౨౯ |
| ౧౧. | శౌర్య, భాసురుండగు నత్తారకాసురుండు | ౧ - ౫ |
| ౧౨. | శూలి మంచుకొండ చూలికడకు | ౨ - ౨౫౩ |

౧౩. భూధరేంద్రము శీతనగేంద్రము 3 - 33

౧౪. మనోజ మర్దనుని కొండకు వెండికొండకున్ 3 - ౮౧

౧౫. జితదైత్యుని కొండకు వెండికొండకున్ 3 - ౮౭

౧౬. భర్గుని కొండకు వెండి కొండకున్ 3 - ౮౩

౧౭. మదనసంహరు కొండకు వెండి కొండకున్ 3 - ౮౪

౧౮. హిమభానుని కొండకు వెండి కొండకున్ 3 - ౮౬

౧౯. కంధరు నీలకంధరున్ 3 - ౧౬౨

౨౦. పాపచక్షుఁడగు దక్షుఁడు ౪ - ౧౭

౨౧. పాతకంబు దక్ష పాపచక్ష ౪ - ౨౬

౨౨. రౌద్రమూర్తి వీరభద్రమూర్తి ౪ - ౧౦౪

౨౩. మందిరాయ నీలకంధరాయ ౪ - ౨౧౭

౨౪. కాంతామణీ! ధీమణీ! 3 - 3

అనునవి. ఈ ప్రయోగములు చిన్ననాటి కృతియగు వీరభద్ర విజయమునందుఁ గంటె భాగవతమునఁ బ్రౌఢములై యున్నవి.

ఇవిగాక సమానపదములు సమాన సమానములు మున్నగు సామ్యములుఁ గూడ గలవు. వానివలనఁ బ్రకృతమునకుఁ బ్రయోజన మంతగాలేనందున విరమింపబడినవి. భాగవతముతో నిన్ని విధములైన సమానాంశములుగల వీరభద్ర విజయము పోతన కృతమనుటకు సంశయింపఁబనిలేదు.

# 11. వీరభద్ర విజయము - మూలము

వీరభద్ర విజయ మందలి కథావస్తువు దక్షాధ్వరధ్వంస వృత్తాంతము. ఇది బ్రహ్మాండపురాణము, లింగ పురాణము, కాశీఖండము, భాగవతము మొదలగు వానిలో నభివర్ణింపఁబడినది. అందొక్కొక్క దాని కథా సంవిధన మొక్కొక్క విధమున గోచరించును, కాని వాని యందెచ్చటను యజ్ఞద్వయ వృత్తాంతము లేదు. ఇది యొక్క వాయు పురాణమునను, నది యాధారముగ రచింపఁబడిన వీరభద్ర విజయమునను, మాత్రమే కాన్పించుచున్నది. వీనియందు దక్షుఁడు చేయు మొదటి యజ్ఞ సందర్భమున సతీదేవి దగ్ధమైనట్లును దానికి శివుఁడలింగి దక్షునకు శాపమిచ్చినట్లును, దాని ననుసరించి వైవస్వత మన్వంతరమున దక్షుఁడుసేయు రెండవ యజ్ఞ సందర్భమున శివుఁడు వీరభద్రునిచే నాయజ్ఞమును ధ్వంసము చేయించినట్లును గలదు. బ్రహ్మాండ పురాణమునఁ గూడ సతీదేవి దగ్ధమైన వెంటనే శివుఁడు దక్షునకు వైవస్వత మన్వంతరమున నాతని మదమడఁగునని శాపమిచ్చి, పిదప దక్షుఁడు చేయు యాగ సందర్భమున నాతనిఁ గడతేర్చినట్లున్నది. కాని యందు దక్షుఁడు రెండు యజ్ఞములు చేసినట్లు లేదు. సతీదేవి సాధారణ పద్ధతిలోఁ దన చెల్లెండ్రతోఁ బాటు తన్నుఁ దండ్రి పిలువకున్ననుఁ దనంతఁ దాను బయలు దేరిపోయి పరాభవింపఁబడి దగ్ధమైనట్లు తెలియుచున్నదది. వాయుపురాణ వీరభద్ర విజయములందు, మొదటి యజ్ఞ సమయమున సతీదేవి దగ్ధమైనట్లును, రెండవ యజ్ఞ సందర్భమున శివుఁడు దక్షుని సంహరించినట్లును జెప్పఁబడినది.

వీరభద్ర విజయకారుఁడు కృత్యాదిని "వాయు పురాణ సారంబు నీ కథా వృత్తాంతమునుఁ దెలుఁగున రచియింతు"నని తన కృతికి వాయు పురాణము మూలముగఁ జెప్పుకొనినాఁడు. వాయు పురాణ కథాభాగముతో నీ గ్రంథమును బోల్చి చూచినచోఁ గవి, కృత్యాదిని చెప్పికొనినట్లు తత్కథాసారమును గ్రహించినాఁడే కాని కథను యథాతథముగా నాంధ్రీకరించి యుండలేదని స్పష్ట పడుచున్నది. సంస్కృత వాయు పురాణమున "శాంశపాయన మామస్త్యౌ త్ర్యమ్బకా చ్చా పకారణమ్ (దక్షస్యాసన్ నుతాహ్యష్టా కన్యాయాః కీర్తితామయాస్వేభ్యోగృహేభ్యోహ్యానాయ్య తాః పితాభ్యర్చయద్గృహే ---------- కన్యాయాం శాఖినాశ్చైవ ప్రాప్తేవై చాక్షుషేన్తరే"

ఇందుఁ దనకుమార్తెల నెనమండ్రను వారి యిండ్లనుండి రప్పించి యాదరించుచుండెననియు, వారిలో జ్యేష్ఠురాలైన సతి శివుని భార్య యనియు, శివుఁడు పరమేశ్వరుఁడగుటచే దక్షునకుఁ దానెన్నఁడును నమస్కారము చేసియుండలేదనియు,

నాకారణముచే శివునిపై దక్షుఁడు వైరము వహించి నాఁడనియుఁ జెప్పినాఁడు. అది యెఱిఁగి తనచెల్లెండ్రు పుట్టినింటికిఁ బోవు టెఱిఁగి సతీదేవి తన్నుఁ పిలువకపోయినను బుట్టినింటికిఁ బోయి తనభర్తనుఁ దన్నునాహ్వానింపలేదేమని తండ్రిని బ్రశ్నించును. దక్షుండు దానికి సమాధానముగా శివనింద గావింప సతి యాపరాభవమును భరింపలేక దగ్ధమై పోవును. శివుఁడదివిని దక్షునకు శాపమిచ్చును. ఇందింతవరకు దక్షుండు తన యెన మండ్రు సుతలను యజ్ఞ సందర్భమున నాహ్వానించి నట్లు చెప్పియుండులేదు. దక్షస్యాసన్ సుతాహ్యష్టౌ కన్యాయాః కీర్తితామయా పితాభ్యార్చ యద్గృహే తతస్త్వభ్యర్చితాన్సర్వాన్యవ సంస్థాః పితుర్గృహే” అని యుండుట చేత దక్షుఁడు భవునిపై ద్వేషముండుటచే సతిని విడచి తక్కిన పుత్త్రికలను దన గృహమునకు బ్రహ్మాండ పురాణములో వలెనే సాధారణ పద్ధతి నాహ్వానించి యుండునేమో యనిపించును, కాని సూక్ష్మ దృష్టితోఁ జూచినచో సందేహమునకుఁ దావులేదు. సతిదగ్ధమైపోయిన వెంటనే శివుఁడు దక్షున కిచ్చిన శాపంబునందు “ఉత్పత్స్యంతే ద్వితీయేవై మమయజ్ఞేహ్యయోనిజాః” అనుటఁ జేసి సతిదగ్ధమగుట మొదటి యజ్ఞ సందర్భమనియు, దక్షునకు నాశము సంభవించుట రెండవ యజ్ఞ సందర్భమనియుఁ దెలియుచున్నది. అట్లుకాదేని “ద్వితీయే వై మమ యజ్ఞే” అని యనవలసిన యవసరము లేదు. ఇది మొదటి యజ్ఞము కావుననే యట్లు చెప్పుట జరిగినదని చెప్పుకొనవచ్చును.

ఇట్లు మూలమున సతీదేహత్యాగ సందర్భమునంద స్పష్టముగఁ జెప్పిన భాగమును బ్రథమ యజ్ఞముగను, దరువాతి యజ్ఞమును రెండవదానిగను, వీరభద్ర విజయకారుఁడు స్పష్ట పఱచి వ్రాసినాఁడు. ఇట మూలకారుఁడైన నేమి, వీరభద్ర విజయకర్త యైననేమి తదితర గ్రంథములందెచ్చటను లేని రెండు యజ్ఞములను జెప్పుటలోఁ గల పరమార్థమేమై యుండునని ప్రకృతము విమర్శింపవలసినది.

వీరభద్ర విజయమునందలి ప్రధాన విషయములు వీరభద్రుని జననము తద్విజృంభణ విజయములు ననునవి. ప్రథమాశ్వాసము నందలి సతీ దేహత్యాగము, వీరభద్రుని జననమునకు మూలము. ఆ వీరభద్రుఁడు పార్వతీ పరమేశ్వరుల తృతీయ పుత్రుఁడు. ప్రథమ ద్వితీయ పుత్త్రులైన గణాధిప షణ్ముఖుల జెప్పకయే తృతీయ పుత్రుని జన్మము సెప్పుట యనౌచిత్యము, కావున కవి దక్ష యజ్ఞ విషయమును మాత్రము పురాణము నుండి గ్రహించి దానికిఁ బార్వతీ కళ్యాణాదులఁ జేర్చి కుమారుని జననమును జెప్పి గణాధిపుని జననమును గూడ సూచించినాఁడు. శృంగారరస పరిపోషణమునకుఁ గవి, పార్వతీ కళ్యాణ చరిత్రమును, గరుణ విప్రలంభము నకు రతి విలాపమును గూర్చి, గణాధిప కుమారుల జననములు జరిగినట్లు సూచించినాఁడు.

పోతనకుఁ బూర్వుఁడైన నన్నెచోడ కవీంద్రుఁడు తనకుమారసంభవము నందుఁ గుమారుని యొక్క జన్మమునే ప్రధానముగా గ్రహించినను గణాధిపుని జననమును, బార్వతి జన్మమునకుఁ గారణమగు సతీ పరాభవమును గూడఁ జెప్పినాఁడు. సతి పార్వతిగా జన్మించుట జన్మాంతరముగా భావించి కుమారుని జన్మమును జెప్పినఁ జాలదా! యను ప్రశ్న వచ్చును, కాని పార్వతి పుట్టువు జన్మాంతరమను కొన్నను శివునకు రెండవ జన్మలేదు. గానఁ బార్వతియందు జన్మించినకుమారుఁడాతనికి ద్వితీయ పుత్రుఁడే యగును. ప్రథమ పుత్రుని జననము చెప్పక ద్వితీయ పుత్రుని యావిర్భావమునుఁ జెప్పుట క్రమ పద్ధతి కాదను భావము తోడనే నెన్నెచోడుఁడు గజ క్రీడను గల్పించి వినాయకుని జననమును ముందుగాఁ జెప్పినాఁడు.

వీరభద్ర విజయమునఁ దృతీయ పుత్రుఁడగు వీరభద్రుని జననము కూడ వర్ణింప వలసి వచ్చినది. అందుకుగాను కవి ప్రథమ ద్వితీయ పుత్రుల జననములను బ్రస్తావించినాఁడు. పార్వతీ కళ్యాణమునకుఁ బోవుచు శివుఁడు వినాయకుని చేరి ముద్దాడి

శా. "రావోకుఱ్ఱఁడయంచుఁ గౌఁగిటికిఁ జేరంబిల్చి యాదార్చియ

3 - ౧౦౦

శా. లెమ్మా శీతనగేంద్ర పట్టణమునన్ లీలార్థమైయున్న మీ

3 - ౧౦౧

అని వ్రాయుటలో గణాధిపుఁడున్నట్లు స్పష్టమగుచున్నది. ఇఁకఁ బార్వతికి శివుఁడెఱుక చెప్పుటకు వెడలి యామె యచిరకాలములో శివునిఁ బెండ్లాడి యాఱు మోములు గల కమారునిఁ గనునని చెప్పుటలోను, బార్వతీ కళ్యాణమునకుఁ బూర్వము తారకుని వలని బాధలను వర్ణించి బ్రహ్మచేత -

ఉ. శూలికి శీతలాచలము చూలికిఁ గూరిమితోడఁ బుట్టు న
బ్బాలుఁడు గాని దానవునిఁ బట్టి మహోగ్రతఁ గీటడంపఁగాఁ
జాలఁడు సిద్ధమీ పలుకు, సర్వయుపాయములందు భావజున్
ఫాలతలాక్షునీక్షణమె పర్వతకన్యకఁ గూర్పఁబంపుఁడా"

౨ - ౧౩

అని చెప్పించుటలోను, పార్వతీ దేవికి శివుఁడెఱుకత రూపమున వచ్చి -

సీ. కువలయ లోచన! కొన్ని దినంబులు

కొండల రాజింట నుండఁ గలవు

----------- మోములారుగల సుతుఁగాంచి మోదముననుండ గలవు

వీర : ౨ - ౨౦౭

అని కుమారునిఁ గాంచగలవని చెప్పుటలోను గల్యాణానంతరము "వేలుపుఱేఁడు శంకరుఁడు విశ్వవిభుండు గురుండు కొండ రాచూలియుఁదానుఁ గూడి యుండ" లోకములు సుస్థితిఁ బొందెనని చెప్పుటలోను గుమారుని జననము సూచితమైనది. దీనిని బట్టి చూడగా వీరభద్ర విజయ కర్త వాయు పురాణమునందు చెప్పఁబడిన యజ్ఞద్వయమును గ్రహించి ఆ రెండు యజ్ఞములకు నడుమపార్వతీ కల్యాణ రతీ విలాపాదులను చేర్చి వీరభద్ర విజయమను నొక రసవత్తర కావ్యమును సంతరించినట్లు తెలియుచున్నది.

# 12. వీరభద్ర విజయము - ప్రబంధత్వము

వీరభద్ర విజయము ప్రబంధమగు నా యని చర్చించుటకుఁ బూర్వము ప్రబంధమన నేమియో యించుక చర్చించుటవసరము.

సంస్కృత భాషలో గ్రంధ సామాన్య వాచిగా వెలసిన ప్రబంధ శబ్ద మాంధ్రమునందొక క్రొత్తరూపు దిద్దుకొన్నది. ప్రబంధ శబ్దార్థము సంస్కృతమందుఁ జెప్పిన యర్థము కంటె వేఱై క్రమముగా రాయల యుగము నాఁటి కొక ప్రత్యేక వాఙ్మయ ప్రక్రియగాఁ బరిగణింపఁబడినది. సంస్కృత కవులితిహాసములను, బురాణములనే గాక యాలంకారికాది శాస్త్ర గంధ్రములను, మాలతీ మాధవాదుల వంటి దృశ్యకావ్యములను గూడ ప్రబంధములుగనే వ్యవహరించిరి. సంస్కృతాలంకారికులు కావ్యాంగములను జెప్పుచుఁ గొన్ని కావ్యలక్షణములను గూడ నిర్దేశించిరి. దండి -

"నగరార్ణవశై లర్తు చంద్రార్కోదయ వర్ణనై
రుద్యాన సలిల క్రీడా మధుపానరతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చకు మారోదయ వర్న నైః
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి"

కావ్యాదర్శము. ప్ర. పరి. ౧౬ - ౧౯

అని పదునెన్మిది వర్ణనలు సెప్పినాఁడు ! విద్యానాథుఁడు తన ప్రతాపరుద్రీయములో-

శ్లో. నగరార్ణవశై లర్తు చంద్రార్కోదయ వర్ణనమ్
------------ తన్మహాకావ్యముచ్యతె

ప్రతా - రుద్రీ - కావ్య ౧౦ ప్రకరణం

దండి చెప్పిన వర్ణనలనే చెప్పుచు "ఏషామష్టాదశానాం యైః కైశ్చి దూనమపీష్యతే" అని పై వానియందుఁ గొన్ని లోపించినను మహాకావ్యమగునని వివరింపుచు నాశ్లోకాదినే "అథమహకావ్యాదయః ప్రబంధానిరూప్యంతే" అనినాఁడు. అందుచే మహాకావ్యాది ప్రబంధములనఁగా మహాకావ్యము మొదలగు గ్రంధములని యర్థము చేయవలసి యున్నది, కావున ప్రబంధ శబ్దమిట గ్రంధ సామాన్యవాచియగును.

అట్లే యాంధ్రమునఁ దిక్కన యెఱ్ఱాప్రెగ్గడ కేతన మంచన శ్రీనాథుఁడు మొదలగు ప్రాచీన కవులందఱుఁ దమకృతులను బ్రబంధములని పేర్కొనుచుఁ బ్రబంధ శబ్దమును గ్రంధమను గ్రంధ సామాన్యార్థముననే వాడినారు. కావ్యాలంకార సంగ్రహమను నలంకార

గ్రంథమును రచించిన మూర్తి కవి తనకృతిని విద్యానాథుని వలెనే యలంకార ప్రబంధమని చెప్పికొనినాఁడు! ఇఁక నాంధ్ర లాక్షణికులు నాలంకారికులుఁ గూడ సంస్కృతకవులు చెప్పిన కావ్య లక్షణములనే యంగీకరించుచు వచ్చిరి. విన్నకోట పెద్దన తనకావ్యాలంకార చూడామణియందు గద్య పద్యోభయాత్మకమగు కావ్య ప్రభేదములను జెప్పి

"నగర ముఖ్యాష్టదశ వర్ణనములచేఁ

బరగునదియును దివ్య ప్రబంధమనఁగ"

అని ప్రబంధ శబ్దమును వాడినాఁడు. ఆతని నాటి౧ కాంధ్రమునందు సంస్కృతమునందుఁ గంటె వేఱగు నర్థమున గొన్ని ప్రబంధములు బయలు దేరినవి. అందుచే విన్నకోట పెద్దన వాడిన ప్రబంధ శబ్దమున కర్థము సంస్కృత కవులు నిర్ణయించిన ప్రకారము చెప్పుకొనవలయునా? యాంధ్ర కవుల నిర్ణయప్రకారము చెప్పుకొనవలయునా? యని సందేహము కలుగుచున్నది. కాని తరువాతి పద్యములో :-

"పురవారాసి మహీ ధరర్తు శశభృత్సూషోదయోద్యాన పుష్క-

రకేళీ మధుపాన మోహన వియోగక్షేమ యాన స్వయం"

అను శ్లో॥ ములో

యష్టాదశ వర్ణనలను సంస్కృత కవులు చెప్పిన వానినే ముచ్చటించినాఁడు. అతని తరువాతి వాఁడైన కావ్యాలంకార సంగ్రహకర్త :-

క. పురసింధునగర్త్విన శశి
సరసీవన మధురతి ప్రసంగ విరహముల్
పరిణయ తన యోదయనయ
విరచన యాత్రాజి దౌత్య విభు వర్ణనముల్

౨. ఆశ్వా. ౧౬౬ ప

గీ. ఇందునొక కొన్ని కడమైన నెంచి చూడ
నదియు నవని మహా కావ్యమనఁగబరఁగు" ౧౬౭ ప

అష్టాదశ వర్ణనలను మహా కావ్యలక్షణములుగ చెప్పినాఁడు. సంస్కృత గ్రంథములందుఁ జెప్పఁబడిన ద్యూత క్రీడకు బదులాంధ్ర కృతులలో దౌత్యము చెప్పఁబడినది.

ఇఁక ననేక గ్రంథములను బరిశీలించిన యప్పకవి సంస్కృత ప్రబంధములను

---

౧. క్రీ.శ. 1405 ప్రాంతము. ఆంధ్రకవి తరంగిణి. సంపుటి 4 పుట 238

సర్గవిభజనమును, నాంధ్ర ప్రబంధముల కాశ్వాస విభజనము నుండునని చెప్పి

సీ. పురమును బుతుషట్కమును బ్రయాణంబును
శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబుఁ బిదపనద్భుతరణంబు
విజయంబు మద్యపాన వికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోచితంబు
తే. పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువది రెండు వర్ణనలఁ గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస!

అప్పకవీయపు పుట. ౧౬ అశ్వా ౧

అని యిరువది రెండు వర్ణనలను బేర్కొని వానిని బ్రబంధ లక్షణములని చెప్పినాఁడు.

అందు, సంస్కృత కవులును వారిననుసరించిన చూడామణి నరసభూపాలీయకర్తలును చెప్పిన యష్టాదశ వర్ణనలుకాక, వేట, మౌనీంద్ర పుణ్యాశ్రమ సందర్శనము, కన్యాంగ సౌందర్యకథనము, దౌహృదము నను నాల్గు వర్ణనలధికముగాఁ గన్పట్టు చున్నవి. చూడామణి కారుఁడు రాయలకుఁ బూర్వుడు. అనఁగాఁ బ్రబంధయుగమునకుఁ బూర్వమున నున్నవాడు అప్పకవీయము రాయలకుఁ దరువాతఁ బదునేడవ శతాబ్దమున వెలువడినది.

చూడామణి కావ్యాలంకార సంగ్రహ కారులిరువురును సంస్కృత కవులు చెప్పిన మహాకావ్యలక్షణములను జెప్పుచుఁ బ్రబంధ శబ్దమును గూడ వారివలనే గ్రంథ సామాన్యార్థమున వాడియుందురు. అప్పకవి వారికిఁ జాలయర్వాచీనుఁడు. రాయల తరువాతి వాఁడు. రాయల యుగమునందేర్పడిన ప్రకృష్టములగు నాంధ్ర ప్రబంధములను గూడఁ బరిశీలించి ప్రబంధశబ్దము నాంధ్ర కవుల దృష్టితో వాడుచుఁ దల్లక్షణములను మనసులోనిడికొని పై యిరువది రెండు లక్షణములనుఁ జెప్పినట్లు తోచుచున్నది.

ఇట్లు కావ్యప్రబంధ శబ్దము లాంధ్రము నందుఁ గూడఁ దొలుత గ్రంథ సామాన్యముగను, నష్టాదశ వర్ణనములు కావ్యసామాన్యలక్షణములుగను, బరిగణింపఁ బడుచుఁ గాలక్రమమునఁ

దదర్థము సంకుచితమై ప్రబంధమనునదొక ప్రత్యేక ప్రక్రియగా నాంధ్రమున బరిణమించినట్లు తెలియు చున్నది. అది రాయల నాటికి బరిపూర్ణమై యాంధ్ర వాఙ్మయమున బ్రబంధ యుగమను నొక ప్రత్యేక యుగమే యేర్పడినది. ఇట్లేర్పడిన ప్రబంధ ప్రక్రియ తిక్కన మొదలు రాయల వఱకు మధ్యనున్న కాలము యొక్క క్రమ పరిణామమగుటచే దాని కాది గ్రంథమేదియో నిశ్చయముగ జెప్పలేము.

ఈ రీతిగా నేర్పడిన యాంధ్ర ప్రబంధములందష్టాదశ వర్ణనలు మాత్రమే గాక పుష్పలావికలు, కన్యాంగ సౌందర్య కథనము, పురస్త్రీలు నాయకుని సౌందర్యమును వర్ణించుట, పుణ్యాశ్రమ సందరశనము, దౌహృదము, నాయిక బాల్యక్రీడలు చంద్ర మన్మథ మలయానిలాదుల యుపాలంబనము, తమశ్చంద్రికల వర్ణనము మొదలగు ననేక విషయము లాంధ్ర ప్రబంధముల లోని కెక్కి యహమహమికతో బెరిగి చివఱకు నవియు బ్రబంధ సామాన్య లక్షణము లయిపోయినవి. అందు గొన్ని యష్టాదశ వర్ణనములందు గతార్థములగును. ఉదాహరణమున కాంధ్రమందు జెప్పిన విజయము, వేట యనునవి నాయకాభ్యుదయ మందును, పుష్పలావికావిప్ర వేశ్యాదులు పురవర్ణనమందును, నాయికా పరిదేవనము విప్రలంభశృంగారము నందును, 'స్వయంవరము, దౌత్యము' అనునవి 'వివాహ'ము నందును, చీకటి నక్షత్రములు' మొదలగు వాని వర్ణన 'చంద్రోదయము' నందును, నంతర్గతములగు చున్నవి. ఇట్లే మఱి కొన్ని వర్ణనలు, సాహిత్య దర్పణకారుడు, నలంకార శేఖర కర్త కావ్య వర్ణనీయములుగా జెప్పిన వాని యందిమిడి పోవును.

ఇట్లేర్పడిన యాంధ్ర ప్రబంధములు ప్రబంధ లక్షణముల వలెనే కొన్ని ప్రబంధ గుణములను గూడ సంతరించుకొన్నవి. అందు

౧. శృంగారము ప్రాయికముగా బ్రధాన రసమగుట

౨. ఏక నాయకాశ్రయత్వముండుట.

౩. వస్త్వైక్యము కుదురుట

౪. కథ కొంత కల్పితము కొంత ప్రసిద్ధమునగుట

మొదలగునవి ముఖ్యములు. ఆంధ్ర వాఙ్మయమున బై ప్రబంధ గుణములన్నియు బట్టిన సమగ్ర ప్రబంధములరుదనియే చెప్పవచ్చును.

ఇక బ్రకృతము చర్చనీయమగు వీరభద్ర విజయమునకు బ్రబంధత్వ మెంతవఱకు బట్టినదో చూడవలసి యున్నది.

### వీరభద్ర విజయమున బ్రబంధ లక్షణములు

౧. పురవర్ణన :- ఇది ద్వితీయాశ్వాసమున నింద్రుని కడకు మన్మథుడు పోవునప్పుడు

వేయు సమురావతీ వర్ణనమునను, ద్వితీయాశ్వాసమున హిమవంతుఁడు పార్వతీ కళ్యాణార్థము పురము సలంకరించు సందర్భమునను గాననగును.

అమరావతి వర్ణన :-

సీ. కామరొందుఁ బొడవైన గోపురంబులచేతఁ
దనరారు దివ్య సౌధములచేత" ౨ ఆ. ౩౦ ప.

ఓషధీపుర వర్ణన :-

సీ. మృగనాభి జలములు ముంగిళ్లఁ జల్లిరి
ముగ్గులు దీర్చిరి ముత్తియముల" ౩ ఆ. ౧౧౫ ప

నగవర్ణనము :- సప్తర్షులు శివుని రాయబారులై శీతాద్రికి వచ్చిన సంధర్భమున నగవర్ణనము రెండు మూఁడు పద్యములలో గాననగును.

సీ. మింటి చుక్కలతోడ మేలమాడుచు నున్న
ఘన మేఘ సంఘంబు గలుగు దాని ౩. ఆ. ౩౧ ప

వ. సలలితకామధేనువులఁ జందన కల్పమహీ రుహంబులన్
లలిత తరంగిణీ తటములంగరుడామర సిద్ధ కన్యలన్
విలసిత సూర్యకాంతముల విస్ఫురితేందు శిలాతలంబులన్
జెలువగు భూధరేంద్రమును శీతనగేంద్రముగాంచి సంయముల్.

౩ ఆ. ౩౪ ప.

ఋతువర్ణన :- ప్రబంధ వర్ణనములలో ఋతుషట్కమనియున్నను, ప్రబంధ కవులాఱు ఋతువులను వర్ణించి తీరవలయు ననెడి నియమమును బెట్టుకొని యుండలేదు. అట్లు ఋతువులన్నియు వర్ణించిన నన్నెచోడ కృష్ణదేవరాయాదులవంటి కవులు లేకపోలేదు. కాని యట్టి వారి సంఖ్య తక్కువ. పార్వతి తపస్సును వర్ణించు సందర్భమునఁగాళిదాస నన్నెచోడాదులు షడృతువులను వర్ణింప వీరభద్ర విజయకారుఁడు ముఖ్యములగు కొన్ని ఋతువులను మాత్రమే వర్ణించినాఁడు.

౧. వేసవి, వర్షఋతువు, శీతకాలము సూర్యోదయ చంద్రోదయ తారకాగణములను వర్ణించినాడు.

వనవర్ణన :-

ప్రబంధములలో అవసరమును బట్టి వనమునుగాని యుద్యాన వనమును గాని

రెండును గాని వర్ణించుట సం(ప్రదాయము. సాధారణముగ వనవర్ణనము నగవర్ణనమునందో వేట సందర్భముననో వర్ణింపఁబడును. వన వర్ణనము లేని యపుడుద్యానవనమును, పురవర్ణనమునందో నాయికా నాయకుల విహార సందర్భముననో వర్ణింతురు. వీరభద్ర విజయమున వన ఉద్యాన వన వర్ణనములు రెండును వర్ణింపఁ బడినవి. ఇందు వనవర్ణనము రెండు చోట్ల సుదీర్ఘముగ వర్ణింపఁ బడినది. మొదటిది కథా (ప్రారంభమున నైమిశారణ్య వర్ణనము. రెండవది పార్వతి సేయు తపోవన వర్ణనము.

౧. నైమిశారణ్యము :-

"మహితమాతులుంగ మందార చందన సాల భల్లాతకీ (ప్రముఖరాజిత కుంభినీ విరాజితంబును .... బృందారకాలోకనంబును సర్వభువన మహారణ్య రత్నంబును సకల ముని జనస్తోత్ర పాత్రంబును నగునైమిశారణ్య పుణ్య క్షేత్రంబున" (౧ - ౪౪) వీ॥ విజ

౨. పార్వతి తపోవన వర్ణన :-

"ఇట్లు వివిధ విలసిత విచిత్ర తపోవేషధారియై తన సఖీజనంబులుందానును దలిదండ్రుల మనంబులు సంతసిల్ల ........... దశవిశాలంకృతంబును"

(౨ - ౨౩౯) వీ॥ విజ

రతివర్ణనము : -

ఇందుఁగవి రతి వర్ణన మౌచితి నెఱిఁగి "ముక్తసరిగ" వర్ణించి నాఁడు. పార్వతీ కల్యాణమునకు సంబంధించిన కథను (వ్రాసిన కవులెవ్వరును నీ సందర్భము నింత ముక్తసరిగను, మృదువుగను వర్ణించియుండలేదు. ఇందు పార్వతీ పరమేశ్వరుల విహారమీ దిగువ రీతిని వర్ణింపబడినది.

ఉ. వేలుపుఱేఁడు శంకరుఁడు విశ్వవిభుండు గురుండు కొండరా
చూలియుఁ దానుఁ గూడి బహు సుందరలీలల వెండి కొండపై
సోలుచునుండె లోకములు సుస్థితిఁ బొందె ననేక కాలమున్
లాలిత వృత్తితోఁడ నకలంకగతిన్ గడచెన్ ముందంబునన్.

౨ - ౯౧ వీ॥ విజ

విప్రలంభము లేక విరహము :- మన్మథదహనానంతరము పార్వతి శివునిఁ దలఁచికొనిమిక్కుటముగ విరహపడును. ఆ సందర్భమునందలి రెండు పద్యములీ క్రింద నుదహరింపఁబడెను.

సీ. వినరమ్మనామాట విశ్వేశ్వరునిఁబాసి, నిలువంగనేరనో నెలఁతలార !
నాగేంద్ర ధరుమీఁద నాకోరికలు పర్విపాయంగనేరవోభామలార
౨ - ౨౧౨ పీ॥ వి॥

ఉ. బాలశశాంక భూషణునిఁ బాసి చరించుట దుస్తరంబునీ
లాలకలార! చంద్ర ముఖులార! తపోవన భూమిలోపలన్
జాలతపంబు చేసిహరుశంకురు సన్నిధిఁ గాంతునింక మీ
కేల విచారముల్ హిమనగేంద్రునితో వినిపింతునింతయున్ ౨-౨౧౩

విపాహము :-

పార్వతి వివాహ సందర్భమున సేసలు చల్లుట, మధు పర్కములు గట్టుట తెఱవట్టుట, తలంబ్రాలు వోసికొనుట, హెూమములు సేయుట మొదలగు వివాహ కలాపములన్నియుఁ దృతీయాశ్వాసమున ౧౨౬వ పద్యము మొదలు ౧౮౮ వ పద్యము వఱకు వర్ణింపఁబడినవి. అందుఁ గన్యాదాన వర్ణన మీ క్రిందిది :-

శా. కన్యాదానము చేసెఁ బర్వతుఁడు గంగా మౌళికిన్ లగ్నమా
సన్నంబైన సురేంద్ర మంత్రికని సర్వంబాయతంబంచు
జెన్నారన్ సుముహూర్తమన్నఁ దెఱవాసెన్ మ్రోసె వాద్యంబుల
న్యోన్యాలోకనమయ్యెదంపతులకున్ మోహాను రాగంబునన్.
౩ - ౧౮౧

కుమారోదయము :-

కుమార సంభవ మను కావ్యమున షణ్ముఖుని జననము కుమారోదయ" మైనట్లే వీరభద్రుని జనన మిందుఁ "గుమారోదయ" మైనది. ఈ గ్రంధమున వీరభద్రుఁడే దక్షయజ్ఞవిధ్వంసమ గావించి ఫలమును సాధించినాఁడు. తత్ఫలభోక్త శివుఁడు. అనగాఁ గథానాయకుఁడు శివుఁడు. ఆతఁడు సృష్టించిన వీరభద్రుని యావిర్భావము కుమారోదయము.

వీరభద్రుని యుత్పత్తి :-

ఉ. ధారుణి దిర్దిరందిరుఁగఁ దామరసప్రభవాండ భాండముల్
బోరనఘూర్ణిలన్ నిఖిల భూతములు న్బెడగొంద శూలిహుం
కారము చేసెఁ జేసిన సఖండతర ప్రళయాగ్ని సన్నిభా
కారుఁడు వీరభద్రుఁడతి గర్వ సముద్రుఁడు పుట్టె రౌద్రతన్. ౪ - ౫౨

దౌత్యము :-

ఆంధ్రాలంకారిక లక్షణ గ్రంథములలో ద్యూతమునకు బదులు దౌత్యము చెప్పఁబడినది. ఇందును నట్లే దౌత్యము వర్ణింపఁబడినది. సప్తర్షులు శివుని పంపున హిమవంతుని కడకు వచ్చుటిందు దౌత్యము. మహర్షులు హిమవంతునిచేఁ బూజితులై

"ఉడురాజధరుఁడు శంభుఁడు
మృడుఁడు మహేశ్వరుఁడు శివుఁడు మీయింటికిఁ బెం
పడరఁగ నీ సుతఁ బార్వతి
నడుగఁగఁ బుత్తెంచెమమ్ము నచలాధిపతీ. ౩ - ౪౧ నీ॥ వి॥

అని చెప్పి యాతని సందేశమును గ్రహించి కళాధరుపాలికి వచ్చి "దేవా! మూనేర్పు ప్రకారంబున నీయనుగ్రహంబున మీకుఁ బరిణయంబుగా నిశ్చయించి పార్వతికి ముద్రారోహణంబు సేసి వచ్చితిమి. ఇకఁ దడయ నేల? వివాహలగ్నంబు నిర్ణయించి హిమనగేంద్రుఁడున్న చోటికి లేఖలు పంపుదురుగాక! మహాత్మా! గరళకంధరా! మీ కల్యాణ మహిమాభిరామంబు చూడవచ్చెదము. సోమశేఖరా! శరణంబని విన్నవించినమునులు అనుకంప సొంపు మిగుల నానంద రసంబుల నోలలార్చి యమ్మహేశ్వరుఁడు కల్యాణాయత్త చిత్తుఁడై నాఁడని చెప్పినాఁడు.

ప్రయాణము :-

ఇందుఁ బ్రయాణము రెండు చోట్ల వర్ణిత మైనది. శివుఁడు పార్వతీ కల్యాణమునకుఁ బయనమగుట యొకటి. వీరభద్రుఁడు దక్షాధ్వరధ్వంసమునకు బయలు దేరుట రెండనది.

ఇట్లే వీర భద్రుని ప్రయాణమును వర్ణించుచు చతుర్థాశ్వాసమున నిరువది పద్యముల వఱకు వ్రాసెను. ౯ - ౧౦౧

యుద్ధము :- రమారమి చతుర్థాశ్వాసమంతయు నిందు యుద్ధ వర్ణనముతోఁడనే సాగినది.

నాయకాభ్యుదయము :-

నాయకుని యున్నతిని గూర్చిచేయు వర్ణనలన్నియు నాయకాభ్యుదయ కారులే యగును. నాయకుని పరాక్రమము గుణోన్నతి యాతని గూర్చి చేయు స్తోత్రములు మొదలగు నవన్నియు నాయకాభ్యుదయము లేయగును.

ఇందు నాయకుఁడు శివుఁడు గదా! ఆతనిఁ గూర్చి చేయు స్తోత్రములు నాతని ప్రభావమును గ్రంథమునందాత్యంతము కాననగును.

విజయము :-

వీరభద్రుఁడు దక్షుని యధ్వరమును ధ్వంసము గావించి శివునకు ముదః గూర్చుట విజయము.

ఈ విధముగా వీరభద్ర విజయము నందుఁ బ్రాచీ నాలంకారికులు సెప్పిన యష్టా వర్ణనములలోఁ బ్రధాన మగు పదుమూఁడు వర్ణనలు స్పష్టముగ నుండుటయే / ప్రబంధములలో నతి ప్రసిద్ధములగు మరికొన్ని యష్టాదశ వర్ణనేతరములును గలవు. అట్ల కొన్నియియా దిగువఁ జెప్పఁబడినవి.

కన్యాంగ సౌందర్య కథనము :-

ఇది పార్వతి యౌవన ప్రాదుర్భావ సమయమునను, సప్తర్షులు పార్వతి రూపము జూచి వచ్చి శివునితో వర్ణించు సందర్భమునను గావింపఁబడినవి.

సీ. జలజాక్షి నెమ్మోముఁ జందురుఁ బోల్తమా
చందురు నందునఁ గందు గలదు. ౩ - ౬౭

క. లలనామణియు పార్వతి
విలసిత కల్యాణ రూప విభవము చెప్పన్
మలహర! నీ యాన సుమీ!
జలజాసనుకైనఁ జనదు చంద్రాభరణా! ౩ - ౭౪

పురస్త్రీలు నాయకుని సౌందర్యమును వర్ణించుట :-

ఇది భాగవతమున శ్రీకృష్ణుఁడు మధురానగరమును బ్రవేశించు నపుడు రమణీయము వర్ణింపఁబడినది. ఇఁక నాంధ్ర ప్రబంధము లందించుమించన్నింటను గొలఁదిగనో గొప్పగన యీ వర్ణన కాననగును. పోతన తరువాత రాయల యుగమందు వెలసిన కృతులందున దక్షిణాంధ్రయుగపుఁ బ్రబంధములలోను, నీవర్ణనమునకుఁ బ్రాచుర్యము మెండు పారిజాతాపహరణ ఆముక్త మాల్యద విజయవిలాసాదు లిట్టివి.

పై వర్ణనావసరమున వీరభద్ర విజయకారుఁడు వెనుకంజ వేయలేదు. ప్రబం కవులందరివలెనే సుదీర్ఘముగ వర్ణించినాడు. ౩ - ౧౫౧ - ౧౫౯

తారకాచంద్రికలు :-

తెలుగుఁ కవులలొ శ్రీనాథ నంది తిమ్మనలు తారకా చంద్రికల వర్ణనమునకు ఎక్కువమక్కువఁ జూపినారు. పురాణకవులైన నన్నయాదులును సూర్యోదయ చంద్రోదయ తమస్తారకాచంద్రికాదులను యథా సంభవముగా వర్ణించి యీ వర్ణనలో భావ్యర్థ సూచనము

గావించిరి. అవి ప్రబంధకవులధోరణిలో సుదీర్ఘములై వన్నెచిన్నెలను గూర్చుకొన్నది. వీరభద్ర విజయకారుఁడును భావ్యర్థ సూచన చేయుచు దమస్తారకా చంద్రికల వర్ణనమును జేసినాఁడు. అవి పురాణ ప్రబంధ కవులిరువురకును మధ్యేమార్గమున తగురీతిని వర్ణింపఁబడినవి.

తారకలు :- ౩ - ౧౧౭ తమము ౩ - ౧౧౯

స్తోత్రము :-

దివ్యేతి వృత్తము కథా వస్తువుగాఁ గలకృతులలో స్తోత్రముండితీరును. ఆంధ్రకుమార సంభవ పారిజాతాపహరణాది గ్రంధము లట్టివి. వీరభద్ర విజయము దివ్యేతి వృత్తమే గాన నందును స్తోత్రము పలు చోట్లఁ గాననగును. సప్తర్షులు శివుని స్తుతించుట, హిమవంతుఁడు, దాక్షాయణిని శివునిఁ బ్రార్థించుట, క్షీరసాగర మధన సమయమున దేవతలు శివుని వేడికొనుట. మొదలగునవి గద్యపద్యములలోను, దక్షాధ్వర ధ్వంసానంతరము దేవతలు శివుని చేయు స్తోత్రము దంకరూపముననను గాననగును.

ఇట్లు వీరభద్ర విజయమున నష్టాదశ వర్ణనములలో ముఖ్యములగుఁ బదుమూఁడు వర్ణనలు నష్టాదశ వర్ణనలతోఁ దుల్యములై యున్నవి. అవి కాక యష్టాదశ వర్ణనేతరములు కొన్ని వర్ణింపబడుటచే "ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూనమపీష్యతే" అని సంస్కృతాలంకారికులును. "ఇందునొక కొన్ని కొఱయైన నెంచి చూడనదియునవని మహాకావ్యమనఁగఁబరఁగు" ని యాంధ్రాలంకారికులును జెప్పుటచే వీరభద్ర విజయము ప్రబంధమగుచున్నది.

ఇక నాంధ్ర ప్రబంధములకు సర్వసామాన్యములగు నాశ్వాస విభజనము, షష్ఠ్యంతములు, నిష్టదేవతా ప్రార్థనము పూర్వకవిస్తుతి, కుకవినింద, మొదలగున వన్నియు నిందు ననుసంధింపఁబడినవి. కావునవీరభద్ర విజయము ప్రబంధమే.

# 13. వీరభద్ర విజయము - సంస్కృతాంధ్ర కుమారసంభవములు

దక్షాధ్వరధ్వంస వృత్తాంతముతోఁ గుమార సంభవ కథకును, గుమార సంభవ కథతో దక్షాధ్వరధ్వంస వృత్తాంతమునకు, బొత్తుగుదురఁ బ్రత్యేక కావ్యములుగ నిర్మింపఁబడిన ప్రసిద్ధాంధ్ర గ్రంథములు రెండు. అందు నన్నె చోడుని కుమార సంభవమే రచనా విధానమునందొౘవడి. సంస్కృతాంధ్ర కుమార సంభవములు రెండును, గుమారసంభవ కథ ప్రధానముగాఁ బార్వతీ కల్యాణాదులను దమలోఁ జేర్చుకొన్నవి. వీరభద్ర విజయము వీరభద్రుని విజృంభణము బ్రధానముగాఁ బార్వతీ కల్యాణ కుమార సంభవాదులను జేర్చుకొన్నది.

కాళిదాస నన్నెచోడులు, కుమారుని జన్మ ప్రధానముగా గ్రహించి, పార్వతీ పరమేశ్వరుల శృంగారమును బ్రపంచించి శృంగార ప్రబంధమును రచించిరి. వీరభద్ర విజయమునకును శృంగారమే ప్రధాన రసమైనను గ్రంథము యొక్క పరమార్థము కుమారుని సంభవముకాక వీరభద్రుని విజయమైనది. కాళిదాసు తన కృతి కప్రధానమైన దక్షాధ్వర ధ్వంస వృత్తాంతమును-

"అధావమానేన పితుః ప్రయుక్తా
దక్షస్య కన్యాభవ పూర్వపత్నీ
సతీసతీయోగ విసృష్టదేహా
తాంజన్మనే శైలి వధూం ప్రపేదే" (కుమా. సం. ౧)

అని సూచించి విడిచినట్లు, వీరభద్ర విజయకర్త తన కృతి కప్రధానమగు కుమార సంభవమును బార్వతీ కల్యాణానంతరము -

"వేలుపుఱేఁడు శంకరుఁడు విశ్వవిభుండు గురుండు కొండరా
చూలియుఁ దానుఁ గూడి బహు సుందర లీలల వెండికొండపై
సోలుచునుండె లోకములు సుస్థితిఁబొందె ననేక కాలమున్
లాలిత వృత్తితోడ నకలంకగతిన్ గడచెన్ ముదంబునన్"

(వీర. విజ. ౩ - ౧౯౭)

అని మాత్రమే చెప్పి విడచినాఁడు. అందుఁ బార్వతీ పరమేశ్వరులనేక కాలము గడపిరనియు, లోకములు సుస్థితిఁబొందినవనియుఁ జెప్పుటచేతఁ గుమారుని జన్మము సూచితమైనది.

సంస్కృతకుమార సంభవమున సూచనామాత్రముగ విడువఁబడిన దక్షయజ్ఞవృత్తాంత మాంధ్ర కుమార సంభవమున విపులీకరింపఁబడినది. ఇందు సతీపరమేశ్వరులగజ క్రీడ, అగ్నిదేవునిరాక, మునిపత్నుల గర్భధారణము. కుమారుని జన్మము, తారకునితోడి రాయబారము, యుద్ధమును వివరింపఁ బడఁగా, వీరభద్ర విజయమున వీరభద్రుని పుట్టుక తద్విజృంభణము నాతని పట్టాభిషేకమునుఁ జెప్పఁబడినవి.

రతీదేవి మన్మథునితో, దేవలోకమునకుఁ బ్రయాణమగుట, శివుఁడు పార్వతికి నెఱుక సెప్పుట, పార్వతి శివుని తదీయ నీలగళత్వ కారణంబడుగుట, పాలసముద్రమథన వృత్తాంతము. మొదలగునవి వీరభద్ర విజయకారుఁడు ప్రత్యేకముగఁ జెప్పినాఁడు. అవి పై రెండు గ్రంథములందును లేవు.

దక్షాధ్వర ధ్వంసమును జెప్పిన గ్రంథములన్నిఁటియందును వీరభద్రుఁడు యజ్ఞధ్వంసమును గావించినట్లు చెప్పియుండ నాంధ్ర కుమార సంభవము నందాకార్యము విఘ్నేశ్వరుఁడే నెఱవేర్చినట్లున్నది. ఆ భేదమట్లుండ పార్వతి జన్మము, శివుని తపస్సు, తారకుని వలనఁగలుగు బాధలు, మన్మథుని దేవలోక ప్రయాణము, కృత్రిమవసంతావిర్భావము, మన్మథ దహనము రతీ విలాపము, పార్వతి తపము, కుహనా వటువురాక, సప్తర్షుల రాయబారము,మొదలగునవి మూఁడు గ్రంథములందును సమానముగాన్న యంశములు. వానిని బరిశీలించునపుడు విమర్శకులు ముఖ్యముగా జ్ఞప్తియందుం చుకొనఁ దగిన దొక్క విషయము. వీరభద్ర విజయము పోతన పూర్వవయసునందు రచించిన ప్రథమకృతి. అందుచే నందుఁగవికుల తిలకుని ప్రజ్ఞావైదుష్యములుగాని యాంధ్రకుమార సంభవకారుని ప్రౌఢతనపుఁ బోకడలుగాని గోచరింపవు. అందువలన శైలి, శయ్య, చమత్కార జనకత మొదలగువాని యందుఁ బై గ్రంథములతో వీరభద్ర విజయమునకు సామ్యములేదు. కాని సమానాంశములు గల ఘట్టములను వర్ణించునపుడు పూర్వకవుల ప్రభావము తరువాతి కవులపైఁ బ్రసరించుట సహజము. అప్పట్టున సంస్కృతాంధ్ర కుమార సంభవము లొరవడిగా వీరభద్ర విజయకర్త తన కృతియందుఁ జేసిన యనుకరణములను, చూపిన మెలకువలను, బరిశీలించుట మాత్రమే యీ ప్రకరణోద్దేశము.

౧ దక్షుని పరాభవము :-

దక్షుని పరాభవ సందర్భమున నన్నెచోడుని కుమార సంభవమునందుఁ బరమేశ్వరుని కడకాతనిరాక కూఁతుల కాపురములను బరామర్శించు సందర్భమునఁ జెప్పఁబడ, వీరభద్ర విజయమునఁ బరమేశ్వరుఁడు సకల భువన ప్రధాన దేవతలతోఁ గొలువున్న సమయమున దక్షుఁడాతనిని సేవింపవచ్చినట్లు చెప్పఁబడినది.

౨. పరాభవానంతరము ఆంధ్ర కుమార సంభవమున దక్షుఁడు తన పరాభవ విషయమును ధర్మపత్నితోఁ జెప్పఁగా నామె.

"తల్లి దండ్రులఁ బూజించి తగవెఱింగి
మన్నపాడవైన నీ యత్తమామలనియె
ప్రియమెఱుంగునం చిచ్చిన బిడ్డమనకుఁ
బాసెనని యుండుఁడింక నా పలుకులేల"

అని వికల స్వాంతయై, బుత్రికపై మోహము పదలు కొమ్మని భర్తకు ప్రౌఢముగ బోధించును.

వీరభద్ర విజయమునఁ బరాభవానంతరము దక్షుఁడు చిన్నవోయిన, మోము జేవురింప దాను నిష్కారణముగ నటకుఁబోతినేయని ఖిన్నుఁడై యింటికి వచ్చును. భార్య యాతని మోముఁ జూచి కళవళపడి –

"మన యల్లుని మన బిడ్డను
గనుఁగొంటిరె! మంగళంబె! కరుణన్వారే
మని మిమ్ము గారవించిరి?
వినిపింపుఁడు వీనులలర వినియెద" (వీ. విజ. ౧ – ౯౦)

అని ప్రశ్నించినది దానికి దక్షుఁడు.

"నాకు మామగదా యితండని మన్ననల్ దగఁజేయఁడే
లోకనాథుఁడనంచు గర్వము లోకతంబడి యున్నవాఁ
డేకతంబుల నేమి చెప్పుదు నింతిరో వినునాకునున్
నీకుమారిక యైన గైరియు నిక్కమేమియుఁబల్కదే"

వీర. విజ. ౧ – ౯౨

అనును. ఇది మూలమున లేదు. వీరభద్ర విజయకారుఁడు నన్నెచోడుని భావము గ్రహించి యంతకన్న రయణీయముగఁ జెప్పినాఁడు. అందు దక్షుఁడు వచ్చిన వెంటనే భార్యకు విషయము నివేదించును. ఇందు భర్త వచ్చిన వెంటనే భార్యకుఁ బొడకట్టనది, చిన్నవోయి జేవురించి యున్న యాతని ముఖము. అతఁడు బిత్తరపోయినాఁడు. ఆమె యదిగ్రహించి నెమ్మదిగఁ గొమరిత క్షేమమును గదిపినది. దానికి దక్షుఁడు "శివుఁడు గర్వియై యున్నఁ బోనిమ్ము, నీ కూఁతురైన గైరియు నిక్కమేమియుఁ బల్కలేదే" యనును. అందు గౌరిని "నీకూఁతురనుట లౌకిక సంప్రదాయము. అంతియేగాదు. పైవాఁడైన శివుఁడు

న్నింపకున్నఁబోయెఁదన తనూజయే నిర్మోహయైనదని బాధపడినాఁడు. అయిన వారు రాభవించుటలో గలభాధపడినవారికి మాత్రమే తెలియునను భావము గలదిచట. ందుచే సతిని గూడ దక్షుడు తరువాత తాను చేయు యజ్ఞమున కాహ్వానింపలేదు.

**పార్వతి పుట్టినింటికేఁగుట :-**

ంధ్రకుమారసంభవము :- ఇందు యజ్ఞ సందర్భమున దక్షుఁడు తన విభవము సతికిఁ ాపింపవలెనని యామెను బిలువనంపును. వీరభద్ర విజయమున నట్లు పిలువఁడు. రదుని వలన సతి యీ వృత్తాంతము విని "చదువులు పెక్కు చదివి మనసులో నసువలెనుండి, నేఁడు "మలహరువెలిగా" నీ యజ్ఞము తన తండ్రి యేలచేయు న్నాఁడని వగచును. ఇది శివునకుఁ దానై చెప్పిననేమి ప్రమాదమో! చెప్పకున్న నేమి ోయని చిడిముడి, వడి, వాడినపూవు భంగిఁ గాంతిఁ దొఱఁగి భర్త చెంతకుఁ బోయి ిచినదఁట. కొంతసేపునకుఁ దొయ్యలి వగతో భర్తకు విషయము విన్నవించి "ఇది ల్లిలేని చందము, అదియేమో వింత చందమైనది" యని పల్కినది. దీనికి శివుఁడిచ్చిన మాధానమెంత గంభీరమైనదో చూడుఁడు "చంపకగంధి! నీ పలుకు సంగతి చాలదు వాఁడు వ్యలన్ మునులను బిల్చి ..... పెనుమాఢతనొచిన నోము గాక" మనలను "బిల్వమిన్మనకు న్యతకేమి కొఱంత" యని పల్కి "మెచ్చని మామలిండ్లకును మేకొని శోభనవేళఁ ్వమిన్ బొచ్చెము గల్గఁ బోదగుట పోలదు నల్లర కెజ్జంబులన్, బొచ్చెము లేదు ్యలకుఁబుట్టిన యిండ్లకుఁ బోవ లోకమునే మెచ్చును...."

అని యామెను బుట్టినింటికిఁ బోయి రమ్మని తానై ప్రోత్సహించును. అది విని ిదేవి,పోయి రమ్మనెనుగదా! యని సంతసించి యుండలేదు. శివుఁడు తన్నువేఱుచేసెనని ించి, 'ఫాలమందుఁ బాణిపద్మములధరించి మ్రొక్కి' "తల్లి యాదిగఁ దండ్రియాదిగ తయాదిగఁ గల్గునారెల్లభంగుల నీవెకాని మహేశ! యన్యమెఱుంగ" గావున నట్లు పలుకఁ దనును. ఈ ఘట్టము చదువునపుడు సతీదేవిలో పతివ్రతాధర్మములు రూపుగట్టును. మూలమున లేదు. నన్నెచోడుని గ్రంధమునను లేదు. కేవలము వీరభద్ర విజయ ుని స్వకపోల కల్పనము.

సతి హిమవంతునకుఁ గూఁతురై జన్మించి పెరుగుట :-

కాళిదాసు కుమార సంభవమున హిమవంతుని మహిమను వర్ణించి :

"సాభూధరాణా మధిపేన తస్యాం

సమాధిమత్యాముదపాది భవ్యా

సమ్యక్ప్రయోగా దపరిక్షతాయాం

నీతా వివోత్సాహ గుణేన సంపత్"

అని మేనకకుఁ బార్వతి పుట్టినట్లు వ్రాసెను. పై శ్లోకమందు "సమాధి మత్యాం" అను పదమునకు "నియమ వత్యాం - సమాధిః సంతత్యర్థం నియమ విశేషః తద్యుక్తాయాం" అనివ్యాఖ్యచేయఁ బడినది. మంచి సంతానమునకై మేనకాహిమవంతులు నియమములను పాటించిరని దీని భావము. ఆ సందర్భమున నన్నెచోడుఁడు :

"వారిరువురు సద్విధి శ

క్త్యారాధన చేసిరతిశయస్థిరభక్తిన్

గోరిక వదలక తమకడు

పారసతీ దేవి కూఁతురై జనియింపన్"

అని మేనక యు హిమవంతుఁడు నతిశయ స్థిరభక్తితోఁ శక్త్యారాధనము చేసి పార్వతిని గనినట్లు చెప్పినాఁడు.

వీరభద్ర విజయకారుఁడు :-

"ప్రాలేయాచల వల్లభుండు నియతింబాటించి సద్భక్తితోఁ

గాళీసుందరిఁ గూతుగాఁదలఁచి వేడ్కల్ పల్లవింపన్ యశ

శ్శ్రీలోలుండు తపంబు సేయనచటన్ శృంగారసాంగత్యమై

లోకానందముఁ బొందియున్ననతఁడా లోకించి సంరంభుఁడై"

అని హిమవంతుఁడు కాళికను బ్రార్థించినట్లు చెప్పును. తరువాత దాక్షాయణి హిమవంతునకుఁ బ్రత్యక్షమై తానాతనికి జన్మింతునని చెప్పును. హిమవంతుఁడు దాక్షాయణిని భక్తి పారవశ్యమునఁ బెద్దతడవు స్తుతించును. అందలి భక్త్యావేశము భాగవతమునందలి కొన్ని స్తోత్రములను దలఁపునకుఁదెచ్చు చున్నది. ముఖ్యముగా దేవకీ దేవిస్వామిని స్తుతించుట, గంగను శ్రీకృష్ణుఁడు స్తుతించుట, ప్రహ్లాదుఁడు విష్ణుని స్తుతించుట మొదలగు వానిని బోలియున్నది.

కాళిదాస నన్నెచోడుల గ్రంధములలో, దాక్షాయణి హిమవంతునకు నారాధనము వలననే గలిగినను ఆమెపార్వతిగా జన్మించిన పిమ్మట నారదుఁడా విషయమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నను మేనకాహిమవంతులు పుత్త్రికావ్యామోహముననే యున్నట్లు చెప్పఁ బడినది. హరునికై తపము చేయుటకు స్థిర నిశ్చయమై యున్న కూఁతునందు వారు వ్యామోహితులై యామెను కేవలము పుత్రిగా భావించి తపమునకు పంపుట కిచ్చగింపక విలపింతురు. సంస్కృత కుమార సంభవమున

"అధానురూపాభినివేశ తోషిణా

కృతాభ్యను జ్ఞాగురుణా గరీయసా" (౫ సర్గ ౭ శ్లో)

అని హిమవంతుఁడామె పట్టుదలకుమెచ్చి యనుజ్ఞ యిచ్చెనే గాని, యామె పరమేశ్వరి యను దృష్టితోఁ గాదు. ఇఁక మేనాదేవి :

"మనీషిణాస్సంతి గృహేషు దేవతా

స్తపః క్వ? వత్సే! క్వచతావకంవః

పదంసహేత భ్రమరస్య పేలవం

శిరీషపుష్పం న పునః పతత్రిణః"

అని యామె సౌకుమార్యమును దలఁచి వగచినది.

ఇఁక నన్నెచోడుని గ్రంథమున హిమవంతుని తీరు కొంతమాఱినది. అందుఁ బార్వతి, శివుఁడంతర్ధానమైన పిదప "కడలేని విరహవేదనచేత బాధపడి" తపము చేయుదునని తండ్రికిఁ జెలులచే వర్తమానమంప, నాతఁడు పుత్త్రికనెత్తి కౌఁగిటికిఁదిగిచికొని :

"వలవదు తల్లి, నీకుఁదగు వాని వయోగుణ రూపవంతు నీ

వలచిన వానిఁ జేసెద నవశ్యము, నీవు దపంబు సేయఁబోఁ

దలఁపకు మమ్మ! చిత్తపరితాపము సేయకు మమ్మ! మాకుఁగో

మలి, వనదుర్గవాసము ప్రమాదమగుందగదాఁడు వారికిన్".

వ. అదియును గాక

క. దొఱ యెఱిఁగి కోరవలదే

స్మరహరునకు నీకు హస్తి మశకాంతర మా

పరమునకు నీకుఁ బర్వత

పరమాణ్వంతరము దలఁపఁబతి యెట్టులగున్.

అనినాఁడు. అందుఁ బార్వతి పరమేశ్వరి యను జ్ఞానము ప్రదర్శింపఁబడలేదు. ఇఁక మేనాదేవి సంగతి చెప్పఁబనియే లేదు. ఆమె యాత్మజను జేరి.

"పూవోపూవో యని చే

రే వినఁగందునని యోసరిల్లెడు నామై

జీవంబు నిలుచునే నినుఁ

బోవిడిచి మహోగ్ర దుర్గములఁ బాల్పడఁగన్."

అని బాష్పాకులిత లోచనయై బ్రతిమాలును. ఈ సందర్భమః విజయకారుఁడు వారిననుసరింపక స్వతంత్రించి వ్రాసినాఁడు. తలిదం( వ్యామోహమును చిత్రించుట రసవత్తరమైన విషయమనునది యెఱిఁగియు ః ప్రపూరితమానసుఁడగుటచేతఁ బరమేశ్వరినిఁ బ్రాకృత కాంతఁగఁ దలపనీయ కృతియందుఁ బార్వతి చంద్రమౌళికై తపము చేయఁ దలఁచి చెలులతోడ మ్రొక్కి తన నిశ్చయమును తెల్పును.

అపుడు గిరి రాజత్యంతానంద చిత్తంబుతో ధీయుక్తిం ....... గూర్మిత "సతినీ వాక్యము వేదవాక్యము సుమీ!" యని ప్రోత్సహించుటయేగాక

మ. త్రిదశారాధితమై జగజ్జననివై దేవేంద్ర సంపూజ్యవై
మదనారాతికిఁ బ్రాణవల్లభవునై మాయా ప్రపంచాత్మవై
మదిమోదించిన నీవు కూఁతురవునై మన్నించి తీపెంపు చా
లదె! పుణ్యాత్ముఁడనైతి నీకరుణం గల్యాణీ! కృపాంభోనిధీ
వీర. విజ. ౨

అని స్తుతించినాఁడు. పార్వతి దైవ స్వరూపిణి యనుజ్ఞానము మేనాదేవి హృదయమీ పట్టున నంత చిక్కనిదిగాదు. పార్వతి తన గర్భమున చెప్పి యట్లు గావించినను, నామెను దేవతఁగా మేనా దేవి కొంతకాలమే భావి వ్యామోహమునకు లోనైనది పార్వతి పట్ల హిమవంతునకున్న భావము గడవఱకు నిల్చినది గాదు.

౫. యౌవన ప్రాదుర్భావమునఁ బార్వతియొక్క ప్రత్యంగ వర్ణన :-

ఈ సందర్భమునఁ గాళిదాసు సుమారిరువది శ్లోకములలోఁ బార్వ సౌందర్యమును వర్ణించినాఁడు. ఆ ఛాయలోనే నన్నెచోడక వీంద్రుఁడు నలువ వఱకును బెంచి వ్రాసినాఁడు. వీరభద్ర విజయకారుఁడా వేశ పూరితుఁడు సౌందర్యమును గ్లుప్తముగ నొక్క సీస పద్యములో వర్ణించినాఁడు. "ఆమె శరీ గంగా ప్రవాహమువలె వెల్లివిరియ "ననుదినము నొక చందమున నతిశ ప్రత్యంగ సౌందర్య వర్ణన మెంత చేసినను, నొకప్పుడవయవముల తీరు మాత్రమే గాని సౌందర్యమునకుఁ బ్రధానమగు లావణ్యము స్ఫురింపదు. అందుచే వీరః కారుఁడు సౌందర్యమునకు ప్రధానమగు పార్వతి లావణ్యమును వర్ణించుచు న ప్రవాహమువలెను, జంద్రరేఖ చందమునను నున్నదనినాఁడు. ఆమె లావః

ప్రవాహమువలె శరీరమంతటను గప్పి కొని వెల్లి విరిసిన దనియు, నాకాంతి చంద్రికవలె విశ్వవ్యాప్తమైనదనియు సూచించెను.

౬. ఇంద్రుఁడు మన్మధుని బిలిపించుట :–

కాళిదాస నన్నెచోడుల గ్రంధములలో ఇంద్రుఁడు మన్మధునిఁ దలఁచుకొనఁగా నాతఁడు వెంటనే దేవ సభకుఁ బయనమయినట్లు చెప్పఁగా, వీరభద్ర విజయ కర్తయా సందర్భమన కించుక మెఱుఁగు దిద్దినాఁడు. ఆతని గ్రంధమున రతీ మన్మధులేకాంతమునందున్న పుడింద్రుఁడు మన్మధునిఁ దలఁచుకొనును. ఆకారణమేమై యుండునా! యని మన్మధుఁడాలోచించుచుండును. అది యెఱుఁగక రతి మన్మధుని పరధ్యానమును శంకించి యనుమానపడి

"చిన్నతనమేల పెఱకన్నియలకు న్వలచి

నన్నుమఱువందగునె యన్నమదనుండున్

నిన్నువెలిగా సతుల నన్యులఁదలంతునె ప్ర

సన్నమతి తోఁడ విను మన్ని యెఱిఁగింతున్"

అని తనయాలోచనకు విషయము వేఱని చెప్పినాఁడు. రతి మన్మధులు కేళీ గృహమందున్నపు డింద్రుడు మన్మధునిఁ దలఁచు కొనినాఁడఁట. కార్యార్థులై కాని, యాపన్నులై కాని తలఁచు కొనువారికిఁ తలంపంబడు వారి స్థితి తెలియదు. అట్లే యాపన్నుఁడైన గజేంద్రుఁడు తలఁచుకొనినపుడు మహావిష్ణువు "ఆ మూల సౌధంబు దాపల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలోత్పల పర్యంకరమావినోది" యై యున్నాఁడు. ఈ నాటి మన్మధుని స్థితి వంటిదే యానాఁడు జనార్ధనునకుఁ గూడ వచ్చినది.

అట్లింద్రుఁడు తలఁచికొనిన, మన్మధుఁడు కారణమేమా యని పరధ్యానములో నున్నాఁడు. అదిగాంచి రతి యనుమానపడినది. స్త్రీ స్వభావములో వెంటనే పెఱకన్నియలఁ దలఁచి మఱల చిన్నతన పడెదవేల యని ప్రశ్నించినది. "నిన్ను వెలిగా సతుల నన్యులఁ దలఁతునె" యని విషయ మెఱిఁగించి "అందరు మగవారు యిచ్చు సమాధానమే యిచ్చి తానచటికి పోవుటకై ఆమె ననుజ్ఞవేడును. అందుకు సతి యాపను లేవియో చెప్పుమన్నది. దానికి మన్మధుఁడు" వెలఁదీ ముగ్ధవు ..... రాచపనులుర్విన్ చెప్పఁగా వచ్చునే" యనును. అట్లయినఁ దాను గూడ దేవలోకమునకు వత్తునని రతి పల్కినఁ గుసుమాయుధుఁ డల్లన నవ్వి :

"ఇల్లాండ్రైన కులాంగనల్ మగలతోనేతెంతురా తొల్లి శో
భిల్లంగాఁ దగవొప్పరాట్సభలకున్ మీనాక్షి మున్నెన్న మా
యిల్లాండ్రెవ్వరుఁ బ్రాణ వల్లభులతో నిట్లాడఁగా నేర్తురే
సల్లాలిత్యమె ! దేవతా సభలనన్ సంకేత శైలంబులే" వీర. విజ. ౨ - ౨౬

అని మందలించును. ఇది వీరభద్ర విజయకారుని సృష్టి. ఈ వర్ణనమున నాతఁడు రతి పాత్రకొక ప్రత్యేకత చేకూర్చినాఁడు. అంతియేకాదు. ఇట రతి పాత్ర ముఖమున స్త్రీ స్వభావ మెంత వ్యక్తమగుచున్నదో, పురుష ప్రకృతి మన్మధునిలోనంత ప్రత్యక్షమగుచున్నది.

ఇందు మన్మధుఁడు రతీ దేవితో దేవతా సభలనన్ సంకేత శైలంబులే యనుట భాగవతమునందు నరకాసురుని వధకుఁ బూర్వము సత్యభామతో శ్రీకృష్ణుఁడు "యుద్ధరంగమున "సమదపుష్పంధయ ఝుంకారములు గావు భీషణ కుంభీంద్ర బృంహితములు" అని చెప్పిన సీసపద్యమునుఁ దలఁపునకుఁ దెచ్చుచున్నది. ఈ సందర్భమున కుమార సంభవాదులలో లేని రతీ మన్మధుల సంభాషణము వీరభద్ర విజయమున నెట్లు సృష్టింపఁబడినదో యట్లే హరి వంశాదులలో లేని శ్రీకృష్ణ సత్యభామల సంభాషణము (నరకాసుర సంహారమునకు బయలుదేరుటకు పూర్వము) భాగవతమున గల్పింపఁబడినది.

౭. మన్మధుఁడమరావతికిఁబోవుట :-

కవికుల గురువగు కాళిదాసుని గ్రంధమున నింద్రుఁడు మన్మధునిఁదలఁచుకొనిన వెంటనే యాతఁడు విల్లమ్ములఁదాల్చి వసంతుని చేతియందలి మామిడి మొగ్గను బాణముగా గ్రహించి దేవసభకు వెడలినట్లు చెప్పఁబడినది. కవిరాజ శిఖామణి :

"పూవుల తేరు వసంతుఁడుఁదాను, నెక్కి కీరావళి కోకిలాళి మలయానిలముం దనుఁగొల్చి పాల్చిరాఁ"

అని మన్మధుని పరివారిమును వర్ణించి :-

దేవలోకమున కరిగినట్లు చెప్పినాడు. అచట మనోజుని చూచి పడతులెల్ల గామపరవశమున నిశ్చలు లైనిల చిరట ఆ నిశ్చేష్టతను గాంచి మన్మధుడు తన్నుఁగని యనిమిషులైరొ మున్నయైరొ అని భావించుచు నిశ్చేష్టడవగా దేవభామినులు మన్మధుని ఆకార సరసిలో మునిగిపోయిరట. ఇదియొకనాటకీయ సన్నివేశలు.

అనిమిషస్త్రీలను గూర్చి నన్నెచోడుడుతన గ్రంధమునందుఁ జెప్పిన యనిమిషత్వము వలన రెప్పపాటులేమి, అనగా మ్రాన్పాటు సూచింపఁగా నిందు కవి సమరకాంతల స్థితి కుడ్యగత చిత్రము వలె నున్న దని పేర్కొని నాఁడు. ఇందలి భావము నన్నె చోడుని

భావమును బోలియున్నను గూర్పులో మాత్రము భాగవత రచనమునే బోలియున్నది.

ఞ. ఇంద్రమన్మధుల సంవాదము :-

కాళిదాసుని గ్రంధముననున్న ఇంద్ర మన్మధ సంవాదమును నన్నె చోడుండు యథాతథముగా గ్రహించినాఁడు. పయికవులిరువురు మన్మధునిచే దేవ సభలోఁ బ్రగల్భములు పలికింతురు. కాళిదాసు గ్రంధమున మన్మథుఁ డింద్రుని యెదుట.

"తవ ప్రసాదాత్ కుసుమాయుధోపి

సహాయమేకం మధుమేవలబ్ధ్వా

కుర్యాం హి రస్యాపి పినాక పాణే :

ధైర్యచ్యుతిం కే మను ధన్వినోన్వే"

యని పలుక నాంధ్ర కుమార సంభవ కర్త :-

"వెరవున భుజ శౌర్యంబున

సురవల్లభు పనుపు నీవ చూడఁగఁ బరమే

శ్వరునైన నోర్తుఁ బెరసుర

నరఫణి దివి జాధి పతులు నాకెదురెదురే."

యని పలికించినాఁడు.

ఈ పట్టున వీరభద్ర విజయకారుఁడవలంబించిన తీరే వేఱు. కావ్య రమణీయతకు భక్తి భావముతోఁ బ్రతి భటత్వము వచ్చినప్పుడాతఁడు భక్తికే మ్రొగ్గనుగాని తదన్యము నాశ్రయింపడు. అది యాతని తత్త్వము. అదియే భాగవతముననుఁ బ్రదర్శితమైనది.

వీరభద్ర విజయమున మన్మథుఁడు హరుని శక్తి నెఱుఁగని మదోన్మాదికాఁడు. అట్లని యింద్రుని యెడల నాతని కున్న ప్రభుభక్తికి లోపమును లేదు. ఇంద్రసభకేఁగి యింద్రునుద్దేశించి.

"ఓమహిత ప్రతాప : భువనోన్నతమీరు గలంత కాలము

న్నేమికొఱంత, సమ్మదమునిప్పుడు నన్నుఁ దలంపఁగారణం

బేమి సురేంద్ర : నీతలఁచునంతఁ గృతార్థుఁడనై తిఁ జాలదే

నీమదిలో ననుందలఁప నేఁడొక కార్యము నీకుఁ గల్గెనే" (వీవి. ౧-౪౨)

అని వినమ్రుఁడై పిలిపించిన కారణమేమని ప్రశ్నించినాఁడు. దాని కింద్రుఁడు "తారక సంహారార్థము శివునకుఁ గుమారుఁడు జనింపవలెను. తత్సాధనకై యాతనికిఁ బార్వతి యందు మోహము గలుగునట్లు చేయుట నీవలనఁ గావలయు" నని ప్రార్థించినాఁడు.

౯. మన్మథుని యొడంబడిక :-

అట్లు ప్రగల్భములు వలుకుటచేఁ గాళిదాసు గ్రంథమున నింద్రుఁడు మన్మథునిఁ జూచి :

"ఆశంసతాబాణగతిం వృషాంకే

కార్యం త్వయాన : ప్రతి పన్నకల్పం"

అని, నీవు శివునైన లెక్క నేయనంటివిగదా : యాపని గావింపుమనినట్లు మాటలాడినాఁడు. అట్లే యాంధ్రకుమార సంభవమున నింద్రుఁడు 'హరగిరిజలు నైష్టికానుష్ఠానులై హిమవంతంబున నున్నవారు. వారికి సంగమంబు చేసి జగద్ధితంబు చేయు' మనును. ఈ సందర్భమున కాళిదాసు గ్రంథమున నింద్రుని మంచి మాటలకుఒప్పొంగి మన్మథుఁడాతని యాజ్ఞను భగవన్నిర్మాల్యమాలికవలె శిరసావహించి వెడలినాఁడు. నన్నెచోడుని గ్రంథమున నంతతో నూఱకొనక యింకను వాచాలుఁడై 'ఈశ్వరునిపైఁ బంపుటెందులకు? ఆ తారకునిపైకే పంపినచోఁ గార్యము నక్కఁజేయుదు "ననఁగా నింద్రుఁడు నీకసాధ్యం బెందును లేదు. ఐనను బరమేష్ఠి వచనంబవిలంఘనీయంబగుట నిదియ మనకుఁ గర్తవ్యంబు. దీని కొడంబడ వలయు" నని ప్రార్థించిన నప్పని గైకొని "నాకిది యేమి గగనం" బని దర్పకుండు దర్పించి బయలు దేరెను.

వీరభద్ర విజయమున మన్మథుఁడు ప్రభు భక్తి పరాయణుఁడే కాని మదాంధుఁడు కాఁడు. ఇంద్రుఁడు శివునిపై బాణ ప్రయోగము గావింపుమన :

"ఓహోయాపని వన్నుఁబంపఁదగవా! యూహింపనాకున్ శివ

ద్రోహంబెమ్మెయిఁ జేయఁగాఁదగునె! యీ ద్రోహంబుగావింపఁగా

నాహోవద్దని మాన్పఁ బట్టకిది చేయన్మీరు పొమ్మందురే!

మోహాతీతుఁడు శంభుఁడాతనికి నేమోహంబు లేదెమ్మెయిన్"

(వీ.వి. ౨ - ౫౦)

అని మఱియును :

"పుండరీకాక్షుని పుత్రుండనై యేను

నిభచర్మధరునిపై నెట్లువోదు"

అని శివునిపై తన్ను బంపుట తగదని చెప్పుచుఁ బరమేశ్వర మహిమతోఁ బాటు హరిబ్రహ్మల సంబంధమును జెప్పివగచి నాఁడు. దాని కింద్రుఁడు పెద్ద తడవాతనిని బుజ్జగించి :

"ఒప్పని పనికేఁ బంపను
ఒప్పుగఁ బుష్పాలపూజ లొనరించుగతిన్
గప్పుము దేవరశిరమును
నిప్పుడు నీ పుష్పశరము లింతే చాలున్" (వీ.వి. ౨ - ౫౯)

అని మఱియు ననేకవిధముల బ్రతిమాలి నీ కాపదరాదని యభయమిచ్చి అట్లు సేయుట యపరాధము గాదు, జగత్కల్యాణార్థమని నొక్కిచెప్పి నిర్బంధము చేయ "దేవేంద్రుని వచనంబులకు మన్మథుండు విహ్వలీకృతమానసుండై కొంత ప్రొద్దు విచారించి యెట్టకేలకు" నొడంబడినాఁడు.

౧౦. రతి మన్మథుల సంవాదము :-

సంస్కృత కుమారసంభవ కావ్యమున నింద్ర మన్మథుల సమాగ మానంతరము రతి మన్మథుల మధ్య సంభాషణము లేదు. అందు

"సమాధవేనాభిమతేన సఖ్యా
రత్యాచసాశంక మను ప్రయాత :
అంగవ్యయ ప్రార్థిత కార్యసిద్ధి :
స్థాణ్వాశ్రమం హైమవతంజగామ"

అని రతీవసంతులు భీతచిత్తులై వెంటరాఁగా మన్మథుఁడు శివుని యాశ్రమమునకుఁ బోయెనని చెప్పినాఁడు.

కవిరాజ శిఖామణి గ్రంథమున రతీ మన్మథులకు దీర్ఘమైన వాగ్వాదము జరుపను. రతి పరమేశ్వరుని శక్తిఁ జెప్పి మన్మథుని యవివేకమును నిందించును. అప్పుడు కూడ మన్మథుఁడు ప్రగల్భములవే పలుకును.

వీరభద్ర విజయమున మన్మథుఁడు చిన్నబోయినమోముతో వచ్చి జరిగిన యంతయు రతితోఁ జెప్పును. ఆమె శివుని మహిమఁ జెప్పి యింత యాపద వచ్చినదే యని వాపోవును. అప్పుడు మన్మథుఁడామెతో :-

మ. బలభేద్యాది సురాళితోఁ బలుకు నాపంతంబు చెల్లింపను
త్పలగంధీ తలఁపొండెగాని యితఁడే బ్రహ్మాండ భాండావళుల్
కలఁగం జేయు సదాశివుండని యెఱుంగంజాలుదుంజాలునే
కలకంఠీవరకంబుకంఠి ! శివు వక్కాణింపనికేటికిన్"

(వీ.వి. ౨ ఆ. ప ౧౫)

అని శివుని శక్తినెఱిఁగియు గత్యంతరము లేక యాకార్యమున కొడఁబడినట్లు చెప్పును. దాన మన్మథుని పాత్రకు నౌచిత్యము సిద్ధించినది.

సంస్కృతకుమార సంభవమున మన్మథ దహనానంతర విషయము :-

"తమాశు విఘ్నం తపసస్తపస్వీ
వనస్పతిం వజ్ర ఇవావభజ్య
స్త్రీసన్ని కర్షం పరిహర్తుమిచ్ఛ" (కు. సం. 3 - ౭౪)

అని మన్మథదహనానంతమీశ్వరుఁడచ్చోటు వాసిపోయినట్లు చెప్పినాఁడు. ఆంధ్రకుమారసంభవకారుఁడు కూడ :

"తనకగ సుతపై రాగము
మనసిజుపై ద్వేషముంగ్రమంబుగనైనం
జనియెఁ దపముడిగి శివుఁడెడ
పని రాగ ద్వేషములఁ దపము సెడుటరుదే" (కు. సం. ౨ - ౫౫)

అని యాజాడలోనే నడిచినాఁడు. వీరభద్ర విజయములో నా సందర్భమున శివుఁడచ్చోటు వాసిపోయినట్లు చెప్పియుండలేదు.

౧౧. రతి విలాపము :-

కాళిదాసుని గ్రంథముననను నన్నెచోడుని కృతియందును రతి విలాపము సుదీర్ఘమై లౌకికమై యున్నది. వీరభద్ర విజయమున రతీ దేవి శోకము గట్టు తెగిపారక సంయమ సమన్వితమై యొప్పినది. ఆమె దుఃఖవాహినికి పాతి వ్రత్యమను శక్తియండగా నిలచినది. ఇందు రతి దేవి తన విలాపములో సంస్కృత కుమార సంభవమునందువలెఁ గామ విహ్వలయుగాలేదు. ఆంధ్ర కుమార సంభవమునందు వలెఁ జమత్కార జనకముగ శోకాలాపనమునుఁ జేయలేదు. కులకాంతవలె కుమిలి దురదృష్టమునకు నెంతవగచినదో, అంతగంభీరముగ శివునిఁ బ్రశ్నించినది.

సంస్కృతకుమారసంభమున మన్మధుఁడు లేమిచే కాముకీ కాముకల సౌఖ్యము చెడిపోయినదనియు, వారుణీమద ఘూర్ణితనేత్ర లైన ప్రమదల ప్రయత్నములు వృధయైనవనియు, నాడుఁ గోయిలలకు దౌత్యమునాదేశించువారు లేరనియు ననేక విధముల వగచును. ఆ భావములు కొన్ని నన్నె చోడుని గ్రంధమున నింకనుఁ బ్రౌఢముగ వివరింపఁబడినవి.

వ. "కామ రహితంబుగా రతిగలదెయెందు" (ఆంధ్రకుమార సం)

క. రతిహితుఁడవనఁగ నెప్పుడు
రతిసంగతినుండు దీవురతినిప్పుడు దుః
ఖితఁజేసిపోయి తక్కట
రతివంచనచేసిపోవ రసికులగుణమే ౫ - ౩౪ (ఆంధ్ర. కు)

మొదలైన వర్ణనలట్టివి.

వీరభద్ర విజయమున రతి దుఃఖాకులితయేగాని కామవిహ్వలగాదు.

శా. కట్టాదేవరకంటిమంటలు నినుంగారించుచో మన్మథా
చుట్టాలందరి దంద్రులందఁచితో శోకంబునన్ బొందితో
పట్టం జాలని శోకవార్థిఁ బడినీ ప్రాణేశ్వరింబిల్చితో
యెట్టుంబోవఁగలేక మంటలకునై యేమంటివో మన్మథా. ౨ - ౧౧౭

అని పెక్కు విదంబుల వాపోయి యిదంతయు వ్రాఁతఫలమనుకొనినది. అసమయ బున నా యిల్లాలికి హృదయ గోచరమైనవి, మన్మధుఁడు తన్నుఁ దేల్చిన రతిక్రీడలు గావు, తన్నెఱిఁగి పల్కిన పెద్దల వాక్కులు. వానినిట్లు స్మరించినది.

ఉ. అఱిముఱిఁ చిన్ననాఁడు చెలులందఱుఁగొల్వఁగఁ గూడియాడి నీ
చిఱుతది పుణ్యకాంతయని చేతులవ్రాఁతలు చూచి పెద్దలే
మెఱుఁగుదుమంచుఁ జెప్పుటలె యెంతయుఁ దధ్యముగాకపోవునే
యెఱుకలుమాలిపోఁ బిదప నే విలపించుట తెల్లమయ్యెఁబో"

అని పెద్దల వాక్కులు వమ్మై తనకీగతి పట్టె నదని వాపోవును సర్వసమర్థులైన దేవతల నుద్దేశించి.

ఉ. తల్లులు పుణ్యగేహినులు తండ్రులు పుణ్యజనంబులంచు నా
యుల్లమునందునేఁదలఁతునో సురగేహినులార! మీరునా

తల్లులు, నేను గూఁతురను, ధర్మము నోముల దానఁగాన మీ
యల్లుని నిచ్చి నన్మరలనై దువఁ జేయరె మీకు మ్రొక్కెదన్"

అని స్త్రీజనోచితముగను అమాయికముగను ప్రార్థించినది. తన భర్తకు వచ్చిన యాపదకుఁ గారణము, దేవతల ప్రార్థనల నాఁతడిష్టము లేకున్నను విని యాత్మత్యాగమునకు సిద్ధపడుట. ఇంద్రుఁడు లోక కల్యాణమునకై మన్మథుని బ్రతిమాలి యే యాపదయు నీకురాదని చెప్పి పంచి, యిప్పుడు పలుకకుండఁ బోయెను. అందుకామెలో దుఃఖము తీవ్రరూపముఁ దాల్చినది. వెంటనే చేరువ నున్న శివుని వైపునకు తిరిగి -

క. తగునంచిక శంభుంగని
తగమిమ్మిద్దరను గూర్పఁ దగునమ్మరుపైఁ
బగమీఱఁ గృపఁదలంపక
తెగఁజిచ్చఱ కన్నుమీకుఁ దెఱవందగునే" ౨ - ౧౩౮

క. ఏచిన మన్మథు దశశత
లోచనుఁడిటుఁ దెచ్చి నీదు లోచన వహ్నిం
ద్రోచెనె యిటుగానోచితి
నీచందములైన నోము లిప్పుడు రుద్రా "" ౨-౧౪౦

అని గద్గించి పలుక రుద్రుఁడప్పతి వ్రతామతల్లి వాక్కులలో నేమి యశ్లేలములు విః వచ్చునోయని శంకించి వెంటనే రజత శైలమునకేఁగినాఁడు. ఇంతయుదాత్తముగ రతీదేః పాత్రనుఁ బోషించిన మొదటి యాంధ్రకవి యీతడే.

వసంతుఁడెచ్చటినుండియో వచ్చిచూచునరికే మన్మథుఁడు లేఁడు రతివిలపించుచున్నది. అతఁడు విషయమెరిఁగి విచారించుచుండ రతీదేవి :

క. అన్నా : నీచెలికాఁడిటు
వెన్నెలధరుమీద వచ్చి వేఁగుట నీకున్
బన్నుగ నెవ్వరు సెప్పిరి? ............ అని ప్రశ్నించి.

క. తారకుఁ దపోమహత్త్వము
నారయ దేవతలు నతని యానందంబున్
గౌరీనాయకుఁగోపము
కోరికమరుఁబట్టి భుక్తిఁ గొనియెం జుమ్మీ"

అని చెప్పి యేడ్చి సహగమనముపకు సిద్ధపడినది. వసంతునితో నామె పల్కిన పల్కులెంత వాత్సల్యపూరితములో యంత కరుణరసభరితములైనవి. తరువాత నశరీరవాణిపలుకులు నమ్మి రతియెట్లో జీవనము ధరించినట్లు సంస్కృతాంధ్ర కుమార సంభవములలోఁ జెప్పఁబడగా, నిందు సహగమనోద్యోగినియై యున్నరతి యాకాశవాణి వాక్కులను గూడ శంకించును.

౧౨. కుహనావటు వృత్తాంతము :-

ఈ మూఁడు గ్రంథములందును కుహనావటువు శివుని వ్యాజస్తుతి రూపమున నిందించును. వీరభద్ర విజయమున నట్టి నిందను మాత్రమేచేసి యూరకొనక పార్వతిని వివాహమాడఁగోరును. పార్వతికి శివనింద చేయుట వలనఁ గుహనావటువుపై వచ్చిన కోపమాతని కోర్కివిన్న తరువాతఁ బరాకాష్ఠ నందినది. పార్వతీ కుహనా వటువుల సంభాషణములో సంస్కృతాంధ్ర కుమార సంభవములందు వటువు శివనింద చేయుచు, నాతఁడు గజ చర్మధారియనియు, దరిద్రుఁడనియు, రూపహీనుఁడనియు, దిక్కులేనివాఁడనియు జెప్పి పార్వతిని బరీక్షించును.

వీరభద్ర విజయమున వటువు పై రీతినిందలన్నియుఁ జేసి వానికిఁ బార్వతి చలింపకుండుటచే నన్యకాంతా సంగతుఁడైన పురుషుని స్త్రీలు ద్వేషింతురను తత్త్వమెఱిఁగి యిట్లనును :

"ఓ లతాంగి యెఱుంగవాతఁడు నొక్క జాలరి కన్యకున్
లోలుఁడై జడలిచ్చినాఁడట లోకులెల్లరెఱుంగనీ
వేల చింతన సేయవక్కట యీతఁడొక్కఁడె కాని నీ
లాలకా ! కనలేవె దేశమునందులోన మగల్మఱిన్" వీ.వి. ౨-౨౭౬

అని జాలరి కన్యతో నాతని సంబంధమును గూర్చి లోకమంతయుఁ జెప్పుకొనుచున్నదని వివరించును. అంతలో నూఱకొనక పార్వతి యదివినియుఁ గూడఁ దన సౌందర్యమును జూచి శివుఁడు జాలరికన్యను మఱచునని భావించునే మోయని తలచి యిట్లనును.

"కంతుఁ జంపినవాఁడు వెండియుఁగంతుకెయ్యెడలోఁబడు
డింత సిద్ధము గామ్యమొల్లఁడిఁకేల యీయడియాస?"

అని యిట్లు పార్వతికి సవతి భయము గల్పించుట మాత్రమేగాక
మన్మధుని దహించిన వాఁడు గాన శివునకు మోహముండదని "మొదలేమోసమనునట్లు" చెప్పుట యీసందర్భమున కెంతయేని యొప్పియున్నది.

౧౩. సప్తర్షులు హిమవన్నగమునకు వచ్చుట :-

ఈశ్వరుని పంపున సప్తర్షులు హిమవన్నగమునకు వచ్చి హిమ వంతునిచేఁ బూజింపఁబడి శివునుద్దేశము హిమవంతునకుఁ జెప్పుదురు. ఆ సందర్భమున వీరభద్ర విజయమందు శివుఁడు పార్వతికి ఉంకువలు పంపినట్లు చెప్పును.

౧౪. వివాహము :-

ఇఁక వివాహము గూడ, నిందు సేసలు చల్లుట - పెడ్లి యఱుఁగు నలంకరించుట - మధుపర్కములు గట్టుట - తెఱయెత్తుట - తెఱతీయుట। పాద పూజచేయుట - తలంబ్రాలు పోసి కొనుట - హోమములసేయుట - కన్యాదానము మొదలగునవన్నియు సలక్షణముగ వర్ణింపఁబడినవి. దీనిని బట్టి వీరభద్ర విజయకారుఁడుపార్వతీకల్యాణాదుల సందర్భమున సంస్కృతాంధ్రకుమారసంభవములను కొన్ని చోట్ల మాత్ర మొరవడిగ గ్రహించి కొన్నిచోట్ల పూర్తిగ స్వాతంత్ర్యమునువహించి గ్రంథమును రచించిట్లు స్పష్టపడుచున్నది.

# 14. భోగినీదండక నారాయణ శతకముల కర్తృత్వము

భోగినీదండకము :

వివాదగ్రస్తమైన యున్న భోగినీ దండక కర్తృత్వమును గూర్చి యింతకుఁబూర్వము పలువురు పండితులు వేఱు వేఱు కారణములను దెలిపి చర్చించియున్నారు.

శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతుల గారు తమ కవిజీవితములలో కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహములోని [౧]"ఘనుఁడు పోతన మంత్రి" యను సీస పద్యము నాధారముగాఁ దీసికొని యిట్లు వ్రాసిరి. "తిమ్మకవి వ్రాసిన సర్వలక్షణ సార సంగ్రహము మధ్యాంధ్ర మండలము నాఁబరఁగు వేంగీ దేశములో వ్యాప్తమైనది. తిమ్మకవి నాటికే సర్వజ్ఞసింగము నీని, కథ ప్రాచీనము.... కావున సింగమనీనికి పోతరాజునకును విహత విశ్వాసములు లేవనియే విశ్చయింపవలసియున్నది."[౨]

ఈ కారణముచే భోగినీ దండకము సింగమనేని కోర్కెపై పోతరాజు రచించెనను మాట నాయన విశ్వసించుట లేదు.

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి వాదమిది! "భోగినీ దండకము చివరనున్న" "పండిత కీర్తనీయుఁడగు ..... వినుత మానవనాథ మదాపహర్తకున్" అను పద్యమున "బమ్మెర పోతన" యని ప్రథమ పురుషలోనుండుట, "పండిత కీర్తనీయుఁడు" అని యాత్మ శ్లాఘయుండుట యను రెండు హేతువులవలన.నీ దండకము పోతన కృతము కాదను వారివాదమును వారు ఖండించిరి, కవులు తమ్ము గూర్చి ప్రథమ పురుషలోఁ జెప్పికొనుట సర్వసాధారణమని నన్నయ యెఱ్ఱనలు వ్రాసిన భారత భాగములనుండి యుదా హరణములనిచ్చి, భారత రచనమువలెనే భోగినీ దండకరచనము గూడ శ్లాఘా పాత్రముగా నున్నదనియు, అట్లున్నదానిని జెప్పుకొనుట సత్యమేగాని యాత్మ స్తుతి గానేరదనియుఁ జెప్పిరి. తుదకు "భోగినీ దండకము పోతన విరచితము కాదని చెప్పుటయే మనసులో, నాకిష్టమైనను భాగవత కవిత్వముతో భోగినీ దండక కవిత్వమును పోల్చి చూచినప్పుడు నామనసట్లు వ్రాయుట కొప్పినది కాదు. దండకము ప్రత్యక్షముగాఁ జూచిన

౧. "ఘనుఁడు పోతన మంత్రిమును భాగవతము రచించి చక్రిక సమర్పించు నెడల సర్వజ్ఞసిగ మక్ష్మావరుండడది తన కిమ్మని వేఁడిన నిడకయున్న నలిగి యాపుస్తకంబవనిఁ బాతించినఁ జివికి యందొకకొంత శిథిలమయ్యెఁ గ్రమ్మర నది వెలిగందల నారహాజును మఱి బొప్పరాజు గంగరాజు మొదలగు కవివరుల్తేజమెసఁగఁ జెప్పిరా గ్రంధములయందెత్పులొదవెఁ గాని పోతన కవిచంద్రు కవిత యందు లక్షణంబెందుఁదప్పదు దక్షహరణ సర్వ. సార. సం. ౩ - ౨౬౬ ప

౨. చూ. కవిజీవితములు. పుట ౬౪౫

తరువాత దానికవిత్వము పోతనదే యని దృఢముగాఁ దోఁచిన తరువాతను, పరులాతని పేరు పెట్టి కల్పించిరని నమ్ముటకుఁ దగిన హేతువులు కనుపించక పోవుట చేతను నేను సత్యమని నమ్మిన దానిని నా కవుల చరిత్రలోఁ బ్రకటింపవలసిన వాఁడనైతిని". అనిభోగినీ దండకము పోతన కృతమని యంగీకరించిరి.

శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు భోగినీ దండక కర్తృత్వమును గూర్చి ప్రత్యేకమైన చర్చయేదియుఁ జేసియుండలేదు. కాని పోతన నివాస స్థలము "ఓరుగల్లా" "ఒంటిమిట్టా" అనువాదమును సమీక్షించుచు నేకశిలానగరమోరుగల్లేయని వారు వ్రాసిన వ్యాసమున నానుషంగికముగా భోగినీ దండకమును గుఱించి ప్రస్తావించియున్నారు: ఈ దండకమునందుదాహృతుఁడైన సర్వజ్ఞసింగ భూపాలుఁడు రసార్ణవ సుధాకర కర్తయైన మొదటి సర్వజ్ఞసింగ భూపతియే యనియు, పోతన ప్రాయికముగా నాతని కాలము నాఁటి వాఁడు కావచ్చుననియు వ్రాసి, యీ సింగ భూపతికిని వసంతావనీనాథుని సోదరుఁడైన సింగ భూపతికిని తమ లెక్క ప్రకారము కాలవ్యవధానమధికముగా లేకపోవుటచేతను, రెండవ సర్వజ్ఞసింగ భూపతికిఁ గూడ దండకములోని కొన్ని లక్షణములు సరిపోవుట చేతను, ఒక వేళ దండకమునందలి సింగ భూపతి రసార్ణవ సుధాకరకర్తకాక యతని తరువాతి సింగ భూపాలుండైనను కావచ్చునని మాత్రము వారు చెప్పిరి. భోగినీ దండకము పోతన కృతమగు నాకాదాయను విషయము ఇదమిత్థమని వారు నిర్ణయించి యుండలేదు[౧]. అయినను వీరి యుద్దేశ ప్రకారము భోగినీ దండకము పోతన కృతమనియే తేలినది. ఇందుకు పబలకముగా వారు తమ వ్యాసమున శ్రీ వీరేశ లింగము పంతులుగారి యాంధ్రకవుల చరిత్రమందలి రెండవ భాగములోని తాతంభట్టు చరిత్రము నారముగాఁ గొనియున్నారు. పదునాఱవ శతాబ్దము వాఁడగు తాతం భట్టు భోగినీ దండకమును దన లక్షణ గ్రంధమునందు దాహరించినట్లు వ్రాసి, దానిని గూర్చి చర్చించుచు, "ఈ కవి యొక్క కవిచింతామణియను లక్షణ గ్రంధము మాకుఁ బూర్తిగా దొరకియుండలేదు. కావున భోగినీ దండకమందుదాహరించ లేదని నిశ్చయముగాఁ జెప్పలేము. వీరేశ లింగం గారి గ్రంధమునుండి యీ విషయము గ్రహించితిమి." అని చెప్పినారు. కాని ౧౯౧౭ లో వీరేశలింగముగారు తాము సంస్కరించి ముద్రించిన యాంధ్ర కవుల చరిత్రమున నేకారణముననో పోతనను గుఱించి వ్రాయునపుడు ఆ విషయమును మరల స్మరింపలేదు.

ఇఁక శ్రీ చాగంటి శేషయ్యగారు తమ కవితరంగిణిలో, భోగినీ దండక కర్తృత్వమును గూర్చి వ్రాయుచు, దండకమునందుఁ బోతన పేరు లేదనియు, తదంతమునందుఁ గల

౧. దండకమునందుఁ జెప్పఁబడిన వసంతావనీ నాథుఁడు శ్రీ లక్షణరావు గారూహించినట్లు కొండవీటి ప్రభువైన గుమారగిరి రెడ్డి కాఁడు. ఇది పొఁరపాటు.

పద్యమును బట్టి దండక కర్తృత్వము పోతన కారోపితమైదనియు వ్రాసిరి. కాని యా పద్యమాతఁడు రచించిన దగునా! కాదా! యను విషయమును నిర్ణయించుటకు వారు గైకొన్న యాధారము, అందుదాహృతుఁడైన సింగభూపతి కాలము మాత్రమే. దండకమునందలి వసంతావనీ నాథ సంసేవితుఁడైన సింగభూపాలుఁడు రెండవ సర్వజ్ఞభూపాలుఁడే యని నిస్సంశయముగ నుడివిరి, కాని వారు నిర్ణయించిన ప్రకారము పోతన కంటె నీ రెండవ సింగ భూపాలుఁడు చాల పూర్వుఁడగుట వలనను, వారు ఇతరాధారములను బట్టి నిర్ణయించిన పోతన కాలమును, నీ సింగ భూపాలుని కాలమును నొక్కటికాక పోవుట చేతను వారాదండకము పోతన కృతము కాదని నిర్ణయించి యున్నారు.

ఈ విధముగా భోగినీ దండకము కొందఱుపోతన కృతము కాదని యు గొందఱు పోతస కృతమే యనియుఁ జెప్పుచుఁ దమకుఁ దోచిన యుపపత్తులను జూపుచున్నారు.

ఇవికాక పరమ భాగవతోత్తముఁడు, రాజులకంకితము సేయుట పాపకర్మమని భావించిన మహనీయుఁడునగు పోతన యటువంటి దండకము వ్రాయునా యనియు, నొక వేశ్యనాతఁడు వ్రాసినను బహుగ్రంధ కర్తయుఁగవి పండిత పోషకుఁడు నయిన సింగ భూపతి యంతటివాఁడు, అట్టి దండకమును జెప్పించు కొనునా యనియు మఱియొక యధిక్షేపము.

మొత్తముపై నీదండకము చివరనున్న పద్యము పోతన కృతము కాదని తీసినచో దండకము పోతనదని కాని, కాదని కాని యే విధమగు చర్చ చేయుటకు నవకాశము లేదు. కాని యాదండకము పోతన కృతము కాదనుట కంటె నౌననుటకే, యున్న యాధారములలో మ్రొగ్గుదల కాన్పించుటచేత శ్రీ వీరేశలింగము పంతులుగారును మఱికొందఱు సాహిత్య విమర్శకులును పోతన కృతమనియే యంగీకరించిరి. సూక్ష్మ పరిశీలనము వలన నాకు నట్లే తోఁచుచున్నది.

పోతన యంతటి భక్తాగ్రేసరుఁడు వేశ్యను గూర్చిన యీ దండకమును రచించునా యని సందేహపడ నవసరము లేదు. ఆతఁడు మొట్ట మొదట కవిత్వమునభ్యసించునపుడు చేసిన ప్రథమ రచని యొకటి కావచ్చును. అప్పటికిఁ బోతన కౌమార దశ దాటి యౌవనారంభములో నుండియుండవచ్చును. దండకమును రచించిన కొలదికాలములో శైవ కథనేదైన కావ్యముగ రచింపవలయునని కుతూహలుఁడయ్యు నళుకు తీరనివాఁడై జంకుచుండ గురువగు ఇవటూరి సోమనారాధ్యుఁడు ఆతనిని బిలిచి "పిన్న వాఁడననియుఁ బెక్కు సంస్కృతులను విననివాఁడననియు వెఱపు మాను" మని హెచ్చరించి ధైర్యము గఱపినాఁడు. దీనిని బట్టి చూచినను, దండకము చాల చిన్నతనమందు రచించినట్లు

---

౧. వీరభద్ర విజయము పీఠిక

స్పష్టపడుచున్నది. భోగినీ దండక వీరభద్ర విజయములు రచించిన పెక్కు సంవత్సరముల తరువాత నాతఁడు భాగవతము నాంధ్రీకరించినట్లు దోచుచున్నది. ఒక వ్యక్తి జీవితమంతయు నొకే తీరులో నుండునని యూహించుట పొరపాటు-కవిత్వము యొక్క ప్రౌఢతాప్రౌఢతలు, రచనాతత్త్వము, కావ్య నిర్మాణ ఫక్కి మొదలైనవి కవి యొక్క వయః పరిపాకము, పాండిత్యప్రకర్ష, లోకానుభవము వలనఁ గలిగిన మనః ప్రవృత్తి యనువానిపై ముఖ్యముగా నాధారపడియుండును. ఒక వ్యక్తికి బాల్యమందుండు నభిరుచులు వేఱు, యౌవనము నందు వాని రూపువేఱు; వార్ధకమునవాని సిద్ధి వేఱు. అందువలన యౌవనారంభదశలోఁ బోతన వేశ్యను గూర్చి శృంగార పరముగాఁ జెప్పిన దండకమును, సుమారేఁబది వత్సరముల ప్రాయమందుఁ బరిణత హృదయుఁడై రచించిన భాగవత రచనతోఁ బోల్చి చూచి యా రెండింటికిని సరియగు పొత్తుకుదురలేదు, గాన నా రెండును నేక కర్తృకములు కావనుట భావ్యముకాదు.

సింగభూపాలుఁడు తనపై నట్టి దండకమును జెప్పించుకొనునా యను నాక్షేపమును సరియైనదిగాఁ గన్పట్టదు. ఆ నాఁడు రాజులు వేశ్యలను వలచుట, వేశ్యలు రాజుల యుంపుడు కత్తెలమని బహిరంగముగఁ జెప్పుకొని గర్వించుట, నిన్నమొన్నటి వఱకు రసికలోకమున వచ్చుచున్న మర్యాదయే. అది యానాఁడు తప్పుగాఁ బరిగణింపఁబడెడిదిగాదు. అందు వలన యౌవనము నందుండి భోగలాలసుఁడైన సింగ భూపాలుఁడు తన వేశ్యను గుఱించి పిన్నవాఁడైన పోతన చేతఁ బొగడించుకొనుట వింతకాఁజాలదు. సాహిత్య వేత్తలు కవి పండిత పోషకులు నయిన వారలిట్టి శృంగార రచనల సేవగించి తీరవలయునను సిద్ధాంతమును లేదు. అందుచే సర్వజ్ఞసింగ భూపాలుఁడు పోతనచేత దండకమును జెప్పించుకొని యుండడని చెప్పలేము.

సింగ భూపాలునకును బోతనకును వైరము గలదని ౧౮వ శతాబిద వాఁడైన కూచిమంచి తిమ్మకవిచే వ్రాయఁబడిన పద్యమునననుసరించి తెలియ వచ్చు గాథ చాల సర్వాచీనము. తిమ్మ కవికిఁ బూర్వులెవ్వరును ఈ విషయమును జెప్పియుండలేదు. జన శ్రుతిలోని కట్టుకథలకు నితరాధారములు లభించు నంతవఱకు వానిని ప్రమాణముగా గ్రహింప లేము. అదియును గాక రాచకొండ ప్రభువుల చరిత్రను బట్టి చూడ వారు కవిపండిత పోషకులుగా ప్రఖ్యాతి నార్జించినట్లు తెలియుచున్నది. ౧సాహిత్య విమర్శకులనేకులు భాగవతమును సింగ భూపాలుండు పాతిపెట్టించెనన్నగాథను విశ్వసించుట లేదు.

భోగినీ దండకమునందలి సర్వజ్ఞ సింగ భూపతి రసార్ణవసుధాకర కర్తయగు సింగ భూపాలుఁడు కాఁడు. ఇతఁడు రేచర్ల వంశమునందలి తొమ్మిదవ తరమువాఁడైన సింగమనేఁడు. వసంతావనీ నాధుని సోదరుఁడు. ఈతని కాలమును గుఱించి యింతకుఁ బూర్వమే "పోతన

కాలనిర్ణయ" మను ప్రకరణమునఁ జర్చింపఁబడినది. ఆ. నిర్ణయమునను సరించి పోతన సింగములు భయులును సమకాలికులే. వసంతావనీ నాథుని సోదరుఁడైన సింగ భూపాలుఁడు రస్నార్ణవ సుధాకరాధి గ్రంధ కర్తయగు సింగ భూపాలునకు భిన్నుఁడైనను సర్వజ్ఞ బిరుదాంచితుఁడే. దండకమునందలి సర్వజ్ఞసింగ భూపతి రెండవ సింగ భూపతి యనుటకు సంశయము లేదు.

ఇది యిట్లుండఁగా భోగినీ దండక భాగవతములను బరిశీలించినచో భావసామ్యము కూడఁ గొంత గోచరించును. ఉదా :- సింగ భూపాలునిపై మోహము వదలుమని బోధించు తల్లికి భోగిని యిచ్చిన సమాధానమిది.

"ఉల్ల సత్ఫుల్ల మందార రాజన్మరందంబు నంబునన్ గ్రోలు
మత్తాళి దుత్తూరమున్ గోరునే; హేమరాజీవ రాజీ రజోరాజి
తాకాశగంగానదీలోలకల్లో లడోలానటద్రాజహంసబు శైవాల
గండూషభేక భేకీడు లీసంకులాసారకాసారముంజేరునే!
మండితాఖండలానీల జీమూతనిర్యత్ప యోధారలన్ ద్రావు సారం
గికుంభాంతరాంభ : ప్రపూరంబులంద్రావునే! మాధమోజ్జాత
చూతాంకురస్వాదులీలాలసత్ కోకిలేంద్రంబు ఝల్లీరవ క్రూర
భల్లాతకీశాఖకున్ భోవునే ! సింగభూపాల పరీరంభ సంభోగమున్
గోరు యోషా శిరోరత్నమాశించునే నీచ సంభోగమంబా" దండక. పు.

౧. సీ. నీరదాగమ మేఘ నిర్యత్పయః పాన
చాతకంబేఁగునే చౌటిపడెకు?
పరిపక్వమాకంద ఫల రసంబులు గ్రోలు
కీరంబునను నెదుత్తూరములకు?
ఘనరవాకర్ణనోత్కలిక మయూరము
గోరునే కఠిన ఝల్లీరవంబు ?
కరికుంభపిసిత సద్గ్రాసమోదిత సింహ
మరుగునే శునక మాంసాభిలాష?

భాగ. ౧౦ పూ. భా. పు. ౨౫౭

౨. "మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధువంబు వోవునే మదనములకు" భాగ. ౭ స్క. ౧౫౦ ప.

వీనిలో మొదటిది పోతన కృతభాగమందలిది కాదనుకొన్నను రెండవది నిశ్చయముగ నాతనిదే యగుట నద్దానితో దండకము నందలి పై పంక్తులలోని భావమునకు సామ్యము కుదురుచున్నది. రెండిటి యందును జెప్పఁబడిన యుపమానోపమేయములు చాల

సన్నిహితములు.

వీరభద్ర విజయ భాగవతములందు పలు సార్లుపయోగింపఁ బడిన చెల్ల శబ్దమిందును కాననగు.[౧]

"ఓ చెల్ల చెల్లన్ విచారింప" దండకము పుట

"మైదీగె" "మృగేంద్రావలగ్న" "వావిరి" యను శబ్దములుపోతనకు మిగులఁ బ్రీతి పాత్రములైనట్లు భాగవతమును బట్టి తెలియుచున్నది. వాని నాతఁడు పలు చోట్ల వాడినాఁడు. అందు మొదటి రెండు శబ్దములు నాతని ప్రథమ రచన యగు దండకము నందును వాడఁ బడినవి.

"మైఁదీఁగె" - దండకము పుట

"మృగేంద్రావలగ్న" - దండకము పుట

"కంఠీరవేంద్రావలగ్న" - భాగ. ౧౦ స్క. ప. ౧౭౪

"దేవకీ సుతుకోర్కి తీఁగలు వీడంగ

వెలఁదికి మైఁదీఁగె వీడఁదొడఁగె" భాగ. ౧౦. పూ. ౧౬౯౦ ప.

దండకము చాల చిన్నదైనను దానిని భాగవతముతోఁ బోల్చిచూచినచో మఱికొన్ని సామ్యములిట్టివి కాన్పించు చున్నవి. కాని వానిని బైనఁ జెప్పిన హేతువులకుపబలకముగా మాత్రమే గ్రహింపఁ గలముగాని ప్రత్యేకమైన ప్రమాణములుగా గ్రహింపఁ జాలము. అందువలన వానిలో ముఖ్యములగు వానినే యిటనను సంధించుట జరిగినది.

పయి విమర్శనము వలన భోగినీ దండకము పోతన కృతమే యని తోఁచుచున్నది.

నారాయణ శతక కర్తృత్వము :-

జన శ్రుతియందు నారాయణ శతక మొకటి పోతనామాత్యకృతముగా విన వచ్చు చున్నది. మత్తేభ శార్దూల వృత్తములలో "నారాయణా" యను మకుటముతో నిర్వహింపఁ బడిన నూఱు పద్యముల గ్రంధమిది. కర్తయెవరో తెలియదు. దీనిని గూర్చి జరిగిన చర్చలను క్రోడీకరించుచు బమ్మెర పోతరాజ విజయమున నిట్లు వ్రాయఁబడినది.

"సాహిత్యపరిషత్పుస్తక భాండాగారమున నారయణ శతకము నకు నైదు ప్రతులున్నవి. అందునాల్గిట గద్యముగాని కవి పేరుగాని లేదు. ఒక్కదాని యందు మాత్రము పోతన రచించినట్లు భాగవత గద్యమును బోలి గద్యయొండున్నది. దీని సంఖ్య ౧౧౧౩. పద్యములు వ్రాఁత మసితో వ్రాయఁబడినవి. గద్యము నూతనముగా కలకత్తా సిరాతో వ్రాయబడినది. లిపిభిన్నముగనే కానవచ్చుచున్నది. ఈ గ్రంధ మోరుగంటి వాదము

---

౧. వీరభద్ర విజయ భాగవతములు పుట ౫౧౩

పుట్టిన తరువాత సాహిత్య పరిషత్ కార్యాలయమునఁ జేరినది. సృష్టి కర్తలెవరో యెప్పుడు సృష్టించిరో మేము చెప్పఁజాలము, గాని గద్యము కూట సృష్టి యనుట నిస్సందేహము. ఇది గోదావరిజిల్లా ప్రతి.

పైని పేర్కొనిన యీ ప్రతి "ఓరుగంటి వాదములు పుట్టిన తరువాత లభ్యమగుట చేతను, ప్రాచీన ప్రతతులలో గద్యములేక పోవుట చేతను ఈ ప్రతియందలి కర్తృత్వమునకు సంబంధించిన విషయములను గద్య శైలిని ఆధారములుగా గ్రహింప వలను పడదు.

నారాయణ శతకము నీ దృష్టితో సమగ్రముగాఁ జదువు నపుడు శైలియందు భాగవతముతోడి కొన్ని సామ్యాములచ్చటచ్చట గోచరించినను పోతన శైలి యనుకరణ సాధ్యమైనదగుట చేతను, అతని తరువాత వెలువడిని గ్రంథములలో నాతని శైలిననుకరించిన గ్రంథములనేకములుండుటచేతను, నారాయణ శతకమునందు కర్తృత్వమును గూర్చి ప్రకృతమేమియు నిర్ణయింపలేము.

# 15. పోతన కాలమునాఁటి సాంఘికాచారాది విశేషములు

మహా కవి కృతములగు కావ్యములు నాఁటి సాంఘిక జీవనమునకు దర్పణములు. అవి స్వతంత్రములైన నేమి? యాంధ్రీకరణములైన నేమి? నాఁటి కాలాను గుణములగు కవుల సంస్కారములు కావ్యములలో దర్శనమీయక మానవు. కావ్యము స్వతంత్రమైనచోఁ గవి మనకు సంపూర్ణముగ దర్శన మిచ్చును. ఆంధ్రీకరణమైనచో నచ్చటచ్చట మాత్రమే కాననగును. అందువలననే యాంధ్ర భాగవతమునఁ గవి తాను స్వతంత్రించిన చోట్ల మాత్రమే దర్శన మీయ వీరభద్ర విజయమునఁ బోతన తానుమూలమున నుసరించిన యజ్ఞధ్వయ వృత్తాంతమునందుఁ దప్ప మిగిలిన స్థలములలోఁను ప్రత్యక్షముగ వచ్చి చెంత నిలచును. భాగవత వీరభద్ర విజయములలో నాఁటి సాంఘిక విషయములు మున్నగునవి దిఙ్మాత్రముగఁ బ్రదర్శింపఁబడుచున్నవి.[౧]

క్రీడలు : కందుక క్రీడ

"రెండుగముల వారమగుచుఁ గందుకముల శిలలఁ గురులు సేసి చేరి క్రీడింతము." బాలురందఱు బలాబలములు ముందు చూచుకొని రెండు వర్గములుగా నేర్పడి కందుకమును గ్రహించి వంతుల ప్రకారము శిలలగుఱి సేసి తిరిగి పట్టుదురు. పట్టు దొరకిన గెలుపును పట్టు జారిన నోటమియుఁ బ్రకటింతురు.

గొండాట :- క్రుమ్ము కొని యాడుకొనునాట నాడు బాలురాడుకొనునాటలలో గొండాట యనునది సర్వసాధారణమగునాట (భాగ. పుట)

రాచక్రీడలు :- వీనిలో ననేక బంధములు గలవు. అందు శంఖ, పద్మ, వజ్ర కందుక, చతుర్ముఖ చక్రవాళ, చతుర్భద్ర, సౌభద్ర, నాగ, సంద్యావర్త, కుండలీకరణ, కురరీ, వర్తులాకార బంధములు ముఖ్యములు.

[౨]తానకములు :- ఏక పాదతానకము, సమపాద తానకము, వినివర్తిత తానకము, గతాగతతానకకము, వలిత వైశాఖ మండల తానకము, త్రిభంగి తానకముమొదలగునవి. ౧౦- ౧౦౧౭౫

ఇవిగాక, ఘటిత మర్దిత, పార్శ్వగ ప్రముఖములైన పాదకర్మ భేదములు.

సమపాద శకట వదన మ్లుష్టి ప్రముఖములైన పార్థివచారి విశేషములు

---

౧. ఈ సాంఘికాచారాదికములలో కొన్నిటిని కవి సంస్కృత భాగవతము నుంచి కొన్నిటిని తన కాలమున జనులలో ప్రాచుర్యముగ నున్న వానిని గ్రహించి తన కృతులలో పొదుపరచి నాఁడు.

౨. జెట్టిపోరులందు జెట్లు నిలుచుండుట యందలి భేదములు. చూ.సూ.ఆ.నిం.

అపక్రాంత డోలాపాద సూచీ ప్రముఖములైన వ్యోమచారి విశేషములు చూపి రాచక్రీడలు జరుపుచుండిరి. (భాగ ౧౦- ౧౦౮౫)

బాలికల క్రీడలు :-

నాఁడు బాలికల యాటలు వేఱు. బొమ్మల పెండ్లిండ్లు చేసి తోడి బాలికలతో వియ్యములందుట[1] గుజ్జన గూళ్లను వండుకొని చెలులతో భుజించుట, ఉయ్యాలలూఁగుట, సరసులందుఁ గ్రీడించుట, గంధము పూసికొనుట, మొదలగునవి.

ఇఁక రాచకన్యకలు బాలికలతో బంతులాడుట, శారికా కీరములకుఁ జదువులు నేర్పుట, నెమిళ్లపురి విప్పు నపుడు వానిని వినోదముగ నాడించుట, హంసలతోఁ గూడినడకలు నేర్చుకొనుట మున్నగునని.

సంస్కారములు - వేడుకలు :- సంస్కారములనేకములు. అందుఁ గొన్ని శాస్త్ర విహితములు. కొన్ని సంప్రదాయ బద్ధములు.. సీమంతపుంస వన గర్భాధాన, ఉపనయన, వివాహాదులు శాస్త్ర విహితములైనవి. సుమారు నలువది గలవు[2]. శిశువులొదిగి నిలఁబడు నపుడు, ఊసులాడు నపుడు, అడుగు లిడునపుడు, చేయు వినోదములును, తొట్లలోఁ బెట్టుట, పుట్టిన రోజు పండుగు చేయుట, మొదలగు వేడుకలు సంప్రదాయ బద్ధములు.

గర్భవతులకు దృష్టి దోషము, గాలి దోషము తగులకుండుటకై రక్షగట్టి మంత్రించిన విభూతి బొట్టును పెట్టుట యాచారము. దానిని పోతన వామనావిర్భావమునకుఁ బూర్వమదితిని గూర్చి చెప్పుచు నిట్లు వ్రాసినాఁడు.

[3]"పెట్టుదురునుదుట భూతిని
బెట్టెదురుమేనఁ బట్టుఁబుట్టపు దోయిం
బెట్టుదురువేలుపుమ్మకుఁ
గట్టుదురు సురక్ష పడతి గర్భంబునకున్. (౮. ౫౦౨ భాగ)

శిశువులకు నూనె దిగఁబార రాచి పసుపుతో బోరు కాడించి (స్నానము చేయించి)

---

౧. బాలికలు తమ తమ యిండ్లనుండి పప్పు బియ్యములను తదితర వస్తువులను ఎవరికిఁ గల్గినవి వారు పెట్టి యొకచోఁ గలిపి వండుకొని భుజించుట.

౨. చూడు పుట ౬౦౦ నుండి ౭౦౦

౩. చూ. గౌతమ ధర్మ సూత్రము ౮వ అధ్యాయము.

౪. రాగి వెండి బంగారము మొదలగు లోహములతోఁ జేయఁబడును. అందు గొన్ని పంచలోహ నిర్మితములును గలవు. దోషస్వభావమును బట్టి వానిని మంత్రించి వాడుదురు.

పుడిసెడునీళ్లను శిశువు చుట్టును త్రిప్పి పాఱవైతురు. అదియే నేఁడు వాడుకలో శ్రీరామ రక్షయని వ్యవహరింపఁబడు చున్నది. బాలురకు పీడ-గాలులు సోకకుండఁ బ్రత్యేకమగు రక్షను గట్టుదురు.' వానిని భోతన యిట్లు వర్ణించి నాఁడు.

తే. "పాపనికి నూనెతలయంట పసుపు పూసి

బోరుకాడించి హరి రక్షపొమ్మటంచు" ౧౦-౧౮౯

ఒదికిలఁ బడునపుడు చేయు సంస్కారము :-

సీ. "బాలకుండొదికిలఁ బడ నేర్చె నని జన్మ

నక్షత్రమందొక నాఁడు నందు" భాగ ౧౦-౨౬౪

వ. "అంత నబ్బాలుని మేన బాలగ్రహంబు సోకదు గదా యని శంకించి గోపకులనేకులనేక విధానంబులు సేసిరి. బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించి ఋగ్యజుస్సామమంత్రంబుల నభిషేచనంబులు సేయించి స్వస్తి పుణ్యావచనంబులు సదివించి కొడుకున కభ్యుద యార్థంబు నందుం డలంకరించిన పాడి మొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గొని వినోదించు చుండె. (౧౦. ౨౬౦. భాగ)

సంస్కారంబులన్నిటి యందును వివాహము ముఖ్యమైనది. దానికై యేర్పఱచిన విధులు, సంప్రదాయ బద్ధములగు నాచారములు ననేకములు గలవు. నేఁడా విధులు చాల వఱకుఁ దమ బిగువును ప్రాధాన్యమును కోలు పోయినవి. వాని నన్నిటిని బరీశీలించినచో హైందవులకు వివాహ సంస్కారమెంత విలువైనదో యెంత పవిత్రమైనదో తెలియును. ఆ వివాహ విధులన్నియుఁ జాలవఱకుఁ బోతన తన వీరభద్ర విజయమునఁ బ్రదర్శించినాఁడు. భాగవతమున రుక్మిణీ కల్యాణ సందర్భమునందును గొలఁదిగ నిట్టి సంప్రదాయములను బ్రదర్శింపక పోలేదు.

వివాహ సమయములందును, బట్టాభిషేకసమయములందును పండుగల యందును నుత్సవముల సందర్భముననను నగరు నలంకరించుట యానాఁటి యాచారము. వీధులందుఁ గలయంపి చల్లి, ముగ్గులు దీర్చి, మామిడి తోరణములను రంభాస్తంభములను నమర్చి, వివిధమంగళ వాద్యములను మ్రోయింపవలయును. ఆ రంభాస్తంభములకు రంగు రంగుల పట్టు బట్టలను జుట్టువారు. వానికిఁ జిహ్నములే నేఁడు పందిళ్లలో మనము చూచు రంగు కాగితములు. వసంతోత్సవములు. దేవతా పూజలు, పట్టాభిషేకములు, మన్మథ పూజలు, వ్రతములు మొదలగునవి జరుగు నపుడొప్రత్యేక స్థలములందు వేదికలను నిర్మింప వలయును. వివాహమునకుఁ బ్రత్యేకమగు వేదిక నమర్చుట ప్రాచీనాచారమే. శ్రీరామ చంద్రుని పట్టాభిషేక సమయమున నయోధ్యాపురి నలంకరించుట దీనికొక యుదాహరణము.

అయోధ్యాపురి నలంకరించుట :-

సీ. వీధులు నున్న గావించి తోయంబుల

సల్లి రంభాస్తంభ చయము నిలిపి (అరటి చెట్లు) భాగ ౯-౩౭౦

నాఁడు వీరగాధలను చిత్రములుగాఁ గుడ్యములపై వ్రాయునాచారము గలదేమో "కలయ గోడల రామ కథ లెల్లవ్రాయించి" యని పోతన వ్రాసియున్నాఁడు. రుక్మిణీ కల్యాణ సందర్భమునందుఁ గుండిన పురము నలంకరించుట.

సీ. రచ్చలు క్రంతలు రాజమార్గంబులు

విపణి దేశంబులు విశదములుగ భాగ ౧౦ - ౧౭౭౦

గౌరీ వివాహమునకుఁ బూర్వము హిమవంతుఁడు పురమునలంకరించుట :-

క. మణులను గనకంబుల ద

ర్పణముల నవ పల్లవముల బహు వస్త్రములన్ వీ.వి. ౩-౧౦౪

సీ. మృగనాభి జలములు ముంగిళ్ల జల్లిరి

ముగ్గులు తీర్చిరి ముత్తియములఁ" వీ.వి. ౩ - ౧౦౫

వ. మఱియు ...... ఓషధీ ప్రస్థపురంబు శృంగారంబు సేయించి తన పర్వతంబునం గల బిలంబులు కొలంకులు సాను దేశంబులు నలంకరించి యగ్గిరీంద్రుండంత.

వీ.వి. ౩ - ౧౦౫

ఉంకువ :-

వివాహమునకుఁ బూర్వము మగ పెండ్లి వారు పిల్లను జూచి వచ్చి సంబంధము నచ్చిన యెడలఁ బెండ్లి కుమార్తె కుఁఉంకువ నిత్తురు. అది ధనకనక వస్తువులలో నేదియైనఁ గావచ్చును గాని పుష్పఫలకుంకుమాది శుభ వస్తు చయముతోఁ గూడి యుండవలయును. ఉంకువ - ఉభయ పక్షముల వారు వివాహమునకు సమ్మతించిన తరువాత ఒకరికొకరు వచన బద్ధులై యుండునట్లు చేయు ఒడంబడిక. దీనినే జౌత్తరాహులు "రూక్నా" అందురు. అనగా ఉభయ పక్షముల వారు ఇతర సంబంధములను వెదకుట మాని ఒడంబడిక ప్రకారము నిలిచిపోవుదరు. ఉంకువ లిచ్చినచో వివాహ సంబంధము నిశ్చయమైనట్లే. తరువాత ప్రథానము చేయుదురు. నాఁడు మగ పెండ్లివారు పెండ్లి కొమరిత వ్రేలికి అంది యాకారము వంటి యొక ప్రత్యేక రకపు నుంగరము నుంచుదురు. ఆ సందర్భమున ఆడ పెండ్లి వారొక చిన్న విందు చేయవలయును. ఆ నాఁటి విందునకే పాలకూళ్లుకుడుచుట యందురు.[౧]

శుభవార్త తెచ్చిన వారికిఁ బెండ్లి రాయబారములు జరుపు వారికి విందు చేసి నూత్న వస్త్రము లిచ్చి సత్కరింపవలయును. వీరభద్ర విజయమున గౌరీ కల్యాణార్థము మహేశ్వరుని పంపున సప్తమహర్షులును హిమవంతునితో నిట్లందురు.

క. శంకర దేవుఁడు మాతో
నుంకువడిగినంత పెట్టు మువిదకు నన్నాఁ
డింకిట నెయ్యేది గొనియెదు
కొంకకమాతోడఁ జెప్పు ధరాధిపతీ — వీ.వి. ౩.౪౯

వ. గిరీంద్రా, యమ్మహాదేవి శివదేవునకుఁ బరిణయంబుగాఁ దగు నిద్దఱికి ఈడయి యున్నది. కార్యమును గొలికికి వచ్చినది.

శుభస్య శీఘ్రమ్మని పెద్దలు పలుకుదురు. గావున దీనికిఁ దడయ నేల సంఘటింపుమని మునీంద్రులు వాంచిత కోమల భావాంకురములు వెలుంగ మంగళంబులగు నాకాశగంగా తరంగిణీ జలంబులును, సల్లలితంబులగు నశ్వత్థ పల్లవంబులును, తాంబూలకనక కలశకుసుమ గంధాక్షతంబులును, మఱియుఁ దక్కిన మంగళ ద్రవ్యంబులుఁ దెప్పించి సువర్ణ పీఠంబున శుభముహూర్తంబున నక్కాంతా తిలకంబు నుండ నియమించి విధ్యుక్త ప్రకారంబున నర్చించి యధిక పుణ్యాహ జలంబులు శిరంబునం బ్రోక్షించుకొని కల్యాణ వాద్యంబులు చెలంగ ముదితకు ముద్రారోహణంబు (ఉంగర ప్రధానము) చేసి గిరీంద్రునకు నుంకువ ముడు పిచ్చి సంయమీంద్రులు పరమానందంబున :-

ఆ. పాలకూళ్లు గుడిచి శైలాధిపుని యింట
రమణతోడ నాఁటి రాత్రియుండి
గౌరి తండ్రి తమకుఁ గట్టంగ నిచ్చిన
సత్ప్రియంబు తోడ సమ్మతించి. — వీ.వి. ౩ - ౫౭

శుభ లేఖలంపుట :-

వివాహములకు సంబంధించిన కార్య కలాపములలో బంధువులకుమిత్రులకును శుభలేఖ లంపుట యొక ముచ్చటయైన ప్రక్రియ. వరుని కుల గోత్రములు సంప్రదాయములు వివరించుచు బంధువులను గన్యాదాతలు స్వయముగఁ బిలువ వలయును. అట్లు కుదురనిచో వివరము లన్నియుఁ బత్రములపై లిఖించి వానికి నాల్గు వైపులఁ బసుపు బొట్లు నునిచి మంగళ్లచేఁ గాని, సమీప బంధువులచేఁ గాని, బ్రాహ్మణులచేఁ గాని మిత్రులకును, బంధువులకును వేర్వేఱుగాఁ బంపుదురు. ఆ లేఖ లందుఁ బెండ్లి పెద్దలు బంధువులను

పరివారబంధు మిత్రసహితముగ విచ్చేసి తమ్ముఁ బదిమంది కలవానిఁగాఁజేసి దీవింపుమని లిఖింపవలయును. ఆ పద్ధతి పోతన వీరభద్ర విజయమున యధావిధిగాఁ బాటించినాఁడు.

హిమవంతుఁడు పంపు శుభలేఖార్థములు

క. మలహరుఁడును బెండ్లికి రాఁ

గలవాఁడని యన్నెఱింగి గౌరవమున 3-౧౪౮

సీ. మలహరుఁడీశుండు మనపాపనడుగంగఁ

బత్తెంచుటయు మేము నత్తెఱంగు

ఆ. బేర్మినీ శోభనము చక్కఁ బెట్టవలయుఁ గరుణవేంచేసి మీ రెల్ల గలపలంబు లీలదన్పొంటఁ జేయక, లేఖఁగన్న/ యపుడ రండని ప్రీతితో నద్రి విభుడు" (వీ.వి.౩.౧౪౯)

మత్త. వెండి కొండకుఁ బైఁడి కొండకు వింధ్యయన్ బలుకొండకున్

జండభానుఁడు దోఁచుకొండకు సాగరాంతపుఁ గొండకున్ 3-౧౧౦

పై సీస పద్యమున శుభ లేఖలు వ్రాయు తీరును, పోతన వర్ణించి నట్లెంద రాంధ్ర కవులు వ్రాసినారు ! కుచేలోపాఖ్యానము వ్రాసిన చేతికే యట్టి యాదరము సాధ్యమగునది. లేఖ లోహృదయపుఁ దీపులన్నియు నుట్టి పడుచున్నవి. ఆంధ్రుల బంధు ప్రీతి యట్టిది. కాలవైపరీత్యముచే నట్టి యను బంధములు సడలిన యీ రోజులలో నవి యతిశయోక్తిగఁ గన్పట్టినను అనాఁడవి సాధారణములే.

ఎదుర్కొనుట :-

పెండ్లికి లగ్నము పెద్దలచేఁ బెట్టించుట, పెండ్లికి నూరంతయుఁ జాటించుటయుఁ జేసి హిమవంతుఁడు పెండ్లివారి నెదుర్కొననేఁగును. మగపెండ్లి వారూరిపొలిమేరలకు వచ్చిన తోడనే యెదుర్కొనఁ బోవలయును. దీనినే యెదురు సన్నాహమందురు. పెండ్లి బెద్దలు, కుల వృద్ధులు, మొదలగు ముఖ్యులు మంగళవాద్యముల తోడను గర్పూరాగరు చందన తాంబూలాదులతోడను బేరటాండ్రు ముత్తైదువలుఁ గూడిరాఁ బూర్ణకుంభములతో నెదుర్కొన వలయును.

సీ. గంధ మాదన మేరు కైలాస శైలాది

కుల శైలభర్తలు కొలిచి నడువఁ

ఎలమి నేతెంచెఁ బరమేశు నెదురుకొనఁగ వీ.వి. ౩-౧౨౮

గడియారముఁ గట్టించుట :-

గడియారమనునది ముహూర్త నిర్ణయమునకై యేర్పఱచిన యొక యంత్ర విశేషము. ఎత్తైన స్థలమున నొక బానయందు జలముపోయించి, ఏతము గూనవంటి యొక చిన్న పాత్రను దానియందమర్చుదురు. దానినే ఘటికా పాత్రమందురు. ఆయంత్ర నిర్మాణ పద్ధతిలో ఘటికా పాత్ర దానియంతటది బానలో మునిఁగి తేలుచుండును. అట్లది యొక సారి మునిగి తేలిన కాలమును గడియలలోపడి కట్టి ముహూర్త కాలమును నిర్ణయింతురు. ఈ పద్ధతికి గడియారము గట్టుట యనిపేరు. క్రీడాభిరామము, సింహాసన ద్వాత్రింశిక, భోజరాజీయము మొదలగు కావ్యములలో నీ ఘటికా యంత్రమును గూర్చి వర్ణింపఁబడినది.

గౌరీ వివాహ లగ్నంబెఱుంగుటకు హిమవంతుఁడను గడియారమను గట్టించి నాఁడు.

మ. తమ పెద్దింటి యరుంగు వీఁదఁ గడఁకన్ ధాన్యంబుపైఁ బెండ్లిల

గ్నము సాధింపఁబసిండి పేర్పున నభోగంగానదీ తోయముల్

౩ - ౧౨౬ వీ.వి.

మంగళ స్నానము :-

ముత్తైదువలు మంగళవాద్యములతోఁ బసుపుటక్షతలు చల్లి వధూవరులకు స్నానము చేయించి పట్టుబట్టలను గట్టింతురు. మొట్టమొదట పెండ్లి కొమరిత తల్లి నీరు పోయును. తరువాత మిగిలిన పెద్ద ముత్తైదువలు పూర్తి చేయుదురు వీరభద్ర విజయమున నీ సన్నివేశమెంతయో మనోహరముగ వర్ణింపఁబడినది.

సీ. అతివలు కస్తూరి నలికించి ముత్యాల

ముగ్గులు తీరిచి ముదము తోడ. వీ.వి. ౩ - ౧౬౬

ఇట్లే మధుపర్కములు గట్టుట, తెరయెత్తుట, తెరతీయుట తలంబ్రాలు పోయుట, లాజహోమము కంత పూజ సేయుట, కన్యాదానము చేయనపుడు కన్యాదాత పెండకుమారుని కాళ్లు గడుగుట, మొదలగు విధులు వీరభద్ర విజయమున సలక్షణముగ వర్ణింపఁబడినవి. "నాగధరుని పెండ్లి నాలుఁగు దినము" అని వివాహము నాల్గు రోజులు జరిపించినట్లు కూడఁ జెప్పఁబడినది. వీర.వి. ౩-౧౮౬

రుక్మిణీ కల్యాణ ఘట్టమున వివాహమునకుఁ బూర్వము కుల దైవములను, బిత్రు దేవతలను బూజించి పెండి కొమరితను బ్రాహ్మణాశీర్వాదములతో నలంకరించుటను జెప్పి, శిశుపాలుఁడు పెండ్లికిఁ దరలి వచ్చుటను వర్ణించినాఁడు.

భాగ. ౧౦-౧౭౨౨ - ౨౩

గౌరీపూజ :-

వివాహములందుఁ గన్య గౌరీ పూజ చేయ వలయును. దానినే "గౌరీతపస్సు" అని కూడనందురు. [1]కన్యను గంపలో గూర్చుండఁ బెట్టి మేన మామ లా బాలికను గంపతోఁ గూడ గౌరీ సమీపమునకుఁ (పూజా గృహమునకు) దీసికొనిపోవుదురు. ఈ విధి ప్రాచీన కాలమున బ్రాహ్మణ వివాహములలో ముఖ్యముగాఁ బాటింపఁబడుచుండెను. ఈ యాచారము క్షత్రియులలోఁ గూడ నున్నట్లు తెలియుచున్నది.[2] ఆ గౌరీ పూజను బోతన భాగవతమునందు రుక్మిణిచేఁ చేయించినాఁడు. అదియింటిలో కాదు కులదైవమైన అమ్మవారి గుడిలో జరిగినది. ఇది ముఖ్యముగా క్షత్రియాచారము రుక్మిణీ కల్యాణము - గౌరీపూజ :-

సీ. సన్నద్ధులై బహు శస్త్రమేతులై

బలసి చుట్టును వీరభటులు గొలువ ౧౦ - ౧౭౪౪

వ. మఱియు ...... సలిలధారాధౌత కరచరణారవిందయై వార్చి శుచియై గౌరీ సమీపంబునకుఁ జనియె.నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు భవ సహితయైన భవానికి మజ్జనంబు గావించి గంధాక్షతంబు లిడి వస్త్ర మాల్యా చరణాదులచే నలంకరించి, ధూపదీపంబు లొసంగి దీపమాలికలు నివేదించి రుక్మిణీ దేవిని మ్రొక్కించి రప్పుడు.

"నమ్మితి నామనంబున సనాతనులైన" ౧౦ పూ. ౧౭౪౬

అని రుక్మిణీ దేవి మ్రొక్కినది. అట్లామె పూజించిన గౌరీ దేవి, గృహమందలి పూజామందిరములోని దేవి కాదు. ఊరివెలుపల నున్న దేవళములోని గౌరి. అందులకే యామె యాలయమునకుఁ బోవునపుడు వారవనితలు కూడ (దేవదాసీ జనము) ననుసరించుట జరిగినది. కుండిన పురమునకు ముందున్న యాలయ మందలి గౌరి భీష్మకు నింటి కుల దేవత. ఆ యింట నెవరికి వివాహము జరిగినను, ఆ దేవతను వధువు పాద చారియై పోయి పూజింప వలసినదే. అది వారి యాచారము. అందుచేతనే రుక్మిణి "నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్క మావారు పంపుదురు" నీవు నా సమయమందు వచ్చికొని పొమ్ము అని బ్రహ్మణునిచేఁ గృష్ణునకు వర్తమానమంపినది.

ఈ గౌరీ పూజ వీరభద్ర విజయమున లేదు. అందు వర్ణితమైనది గౌరీ కల్యాణము. అందఱు కన్యలు వివాహ సమయములలో గౌరిని బూజింప గౌరి యెవరిని బూజించును? శచీదేవి, లక్ష్మీ సరస్వతులు, సప్తరుషుల భార్యలు గౌరీ వివాహమునకు వచ్చియామె నలంకరించి యామెకొక విధమైన యూడిగమునే చేసినారు.

---

౧. కన్యలెదిగున్నారు గోవిందారామ గంపల్ల ఇముడరు గోవిందా. శాంతగోవిందననామములు.

౨. చూడు పుట ౫౧౩

చ. "చెలువ పులోమనందనయు శ్రీయు నరుంధతియున్ సరస్వతీ"

౧ - ౧౨౦

అందుచే గౌరి తానై మ్రొక్కి పూజింప వలసిన దేవత లేక పోయినది. ఆమెకు శివుడే సర్వస్వము. ఆయనకై సాధారణమైన మ్రొక్కులు మ్రొక్కి యూరకొన లేదు. అసాధారణమగు తపమునే చేసినది.

పెండ్లి కూఁతునకు బుద్ధుడు సెప్పుట :-

పెండ్లిలోఁ గన్య నత్తమామలకు భర్తకు నప్పఁ జెప్పుదురు. దానినే యప్పగింత లందురు. అప్పగింతలైన తరువాత నత్తింటి కంపునపుడు, అత్త దగ్గర నెట్లు మసల వలయునో, మామ వద్ద నెట్లు మెలఁగవలెనో, బావలను మఱఁదులను నెట్లు చక్కఁజూచుకొన వలెనో తల్లి దండ్రులు కన్యకు బోధింతురు. ఇందుఁ బార్వతికి నత్తమామలే లేరు. బావమఱఁదులు, నాఁడు బిడ్డలు మొదలగు వారసలే లేరని చెప్ప నవసరము లేదు గదా : ఇక నామె రంజించు కొనవలసిన దొక్క భర్తనే, అందులకే మేనాదేవి పార్వతిని బిలిచి

సీ. "కని సన్నలాలించి కడు నప్రమత్తవై

దేవేశు మనసు రాఁదిరుగుమమ్మ"

అనినది యించుక వక్రోక్తిలో

రుక్మిణీ కల్యాణమున నప్పగింతలుగాని బుద్ధులు చెప్పుటగాని లేవు. రాక్షస వివాహమున బావమఱఁది తలగొరిగి కన్య నెత్తికొనిపోయి నవుడిక నప్పగించు టెవరికి? పయిగా బలరాముఁడు రుక్మిణిని బిలిచి "తోడంబుట్టిన వాని భంగమునకుం దుఃఖించి మా కృష్ణునెగ్గాడంజూడకు అని కృష్ణునే రుక్మిణి కప్పగించినాడు.

కన్యకు సారె లిచ్చుట బహుపురాతన సంప్రదాయము. ప్రాచీన కాలమునఁ బెండ్లినాఁడు వరునకు కట్నమిచ్చుట లేదుగాని కన్నియకుఁ గలిగి సంతవఱకు సారె చీర లిచ్చుట గలదు. సుభద్రకు సారె లిచ్చిరి. దేవకి పెండ్లి యైన తరువాత వసుదేవునితో నరణములు గొనివచ్చినది. ఆ యరణపు సామగ్రిలోఁ జాలవఱకు నిత్యకృత్యములకు దైనందిన చర్యలకు ను పయోగ పడునట్టి కనక వస్త్రాదులు గోదాసీజనాదులుండును. రాజులైనఁ జతురంగ బలము కూడ నిత్తురు. వీరభద్ర విజయమున మేనా హిమ వంతులు పార్వతి కరణము లిచ్చుటకు బదులు అవి లేవని చమత్కారముగఁ జెప్పి లోక విడంబనార్థము కొన్ని వస్తువుల నిత్తురు.

సీ. "కన్నియ, నీ రాజు గంధంబు పూయఁడు
మదనాగ భస్మంబు మాకు లేదు."

సీ. సన్నంబులగు పెక్కు వన్నియ చీరలు
భూరి నానాహేమ భూషణములు." (౩.౧౬౩)

చమత్కారములగు సన్నివేశములు

వీరభద్ర విజయము నుండి

౧. అంగజానాకార సరసిలోమునిఁగి జాలి గొనుచు (వీ.వి.౨.౩౪)

ఇంద్రలోకమునకు మన్మథుఁడేఁగి నపుడు కవి చెప్పిన వాక్యమిది. ఇంద్రుఁడు తారక సంహారార్థము మన్మథునిఁ దలఁచుకొనును. ఆ ప్రకారము మన్మథుఁడు దేవలోకమునకు వచ్చునన్న వార్త యొకరినుండి యొకరికి నిమిషములోఁ బ్రాఁకిపోయినది. దేవలోకపు స్త్రీలు మన్మథునిఁ గూర్చి విన్నవారేగాని ప్రత్యక్షముగఁ గన్నవారు గారు. మన్మథుఁడు వచ్చిన తోడనే యచ్చర కన్నెలు రిత్తపోయి యాతని యాకార సరసిలో మునిఁగి జాలిగొనిరఁట. జాలి శబ్దమునకిట తాపమని యర్థము. అతని సౌందర్యమొక సరస్సు. ఆ సరసిలో మునిఁగి దరిఁ జేరలేక యచ్చరలు భాదపడిరని భావము. ఈ వాక్యమున మన్మథుని అతిశయ సౌందర్యము, సద్దానికి వశులైన యచ్చర కాంతల విరహము 'జాలి ' పదముచే ద్యోతితములు.

సాధారణముగాఁ బ్రబంధ కవులిట్టి సందర్భములలో వర్ణింప వలసిన పాత్ర యొక్క ప్రత్యంగ సౌందర్యమును పది పదునేను పద్యముల వరకు వర్ణించి, తరువాత నచ్చరల విరహము, నంతకుఁ దక్కువ కాకుండ వర్ణించి, వానివలన నీ ప్రయోజనమును సాధింతురు. అట్టి ప్రయోజన మిట నొక చిన్న వాక్యమున సిద్ధించినది.

౨. "ఈ వనంబులోని యేపారు పుష్పంబులేయ మఱచెఁ గాక యేసెనేని, కాముచేతనాఁడు కామారి చిక్కఁడే." వీ.వి. ౨.౨౪౧

ఇది యొక సుకుమార మనోహరభావము. పార్వతి శివుని కొఱకు మురియుచు సేవలు చేసినది. మన్మథుఁడు సపరివారముగ వచ్చి శివునిపై బాణ ప్రయోగము చేసి భస్మమైనాఁడు. భనోగ్నమనోరథయైన పార్వతి తిరిగి యథాస్థానము చేరుకొన్నది.

ఆమె యానాఁటి నుండియు హరవిరహవిలుప్త ధైర్యయై కాంతి దొఱఁగి కృశించి యుగ్ర తపమున కుద్యోగించినది. తలిదండ్రులు నిరాకరించుచున్నను వినక, హిమవన్నగ వనాంతరములందుఁ దపమున కనువగు స్థలమునకై చెలులతోఁ దిరుగాడుచు నచటి ప్రకృతి

రామణీయకమునకు ముగ్ధురాలైనది. అందలి కొన్ని మనోహరములగు పుష్పగుచ్ఛములను జూచి "ఈ వనంబు లోని పుష్పంబు లేయ మఱచెఁ గాక యేసెనేని కాముచేత నాఁడు కామారి చిక్కఁడే "యని చింతించినది." అపుడామె కోమల హృదయమున నెట్టి భావ పరంపరలు రేకెత్తినవో యీా చిన్ని వాక్యము తెలియఁ జేయుచున్నది. నాఁడు మన్మథుఁడెన్నెన్నో పాట్లుపడి కృత్రిమ వసంతమును సృష్టించి యందలి పుష్పములతో బాణముల ననుసంధించి భస్మమైనాఁడు. దానికి బదులొక్క పూవు నీ వనము నుండి గ్రహించి ప్రయోగించినచోఁ గళాధరుఁడు కామునకుఁ దప్పక చిక్కి యుండుననుకొన్నది.

ఇట హిమవన్నగ వనాంతర పుష్ప శోభ ప్రకృతము. అటనున్న మనోహర దృశ్యములకుఁ బార్వతి హృదయము కదలి పూర్వస్మృతిచే వ్యాకుల పడినది. ప్రకృతములగు పుష్పములను వర్ణించుటచేఁ బ్రకృతమగు పార్వతీ హృదయ స్థితి ద్యోతిత మగుచున్నది. రెండును బ్రకృతములే. ప్రస్తుతముచేఁ బ్రస్తుతము ద్యోతితము గాన నలంకారము ప్రస్తుతాంకురము.

౩. సప్తర్షులును బార్వతిని జూచి వచ్చి యీామె రూపమును శివుని కడ వర్ణించుచు శివునితో ఆమె కనుబొమలు, పలుకులు, కొప్పును జూడ సోమునిఁ దోడుతెచ్చుకొని చిలుకలుతేంట్లు గొల్వఁగాఁ గాముఁడు విల్లు నమ్ములు నఖండతఁ బట్టినట్లు తోఁచును. ఆమె ముఖము నీక్షించు నపుడు నిజము చెప్పవలసి వచ్చినచో, నీవు కామునిఁ జంపినాఁడవను మాటకల్లయే యనిపించినది". అని యుందురు. పార్వతి సౌందర్యమును బోతన చక్కని వ్యంగ్య మర్యాదలో మనకుఁ జూపినాఁడు. "నీవు కాముని జంపుట కల్ల" యనుటలో, శివునిపై నిందారోపణ చేయుటయా, పార్వతిని బొగడుటయా, ఇది చమత్కారము.

వీ.వి. ౩-౯౬

౪. పార్వతీ కల్యాణమునకుఁ బోవుచు శివుఁడు వినాయకు నాహ్వానించి తనతోఁ గొని వచ్చును. వీ.వి. ౩ - ౧౦౦ అట్లు కొని వచ్చుటలోని మర్మమును" సవతి తల్లి యునుచు జాలిఁ బొందెడునని ప్రీతి నేకదంతు"ఁ బిలిచి నాఁడని కవి వ్యాఖ్యానించి నాఁడు. "తండ్రికిఁ బెండ్లియను సంబరమే గాని, సవతి తల్లి వచ్చునను బాధ యెఱుఁగ నేట్లు" అని లోకములో నొక సామెత గలదు. శివుఁడు వివాహమునకుఁ దరలి పోవునపుడు కవికీలోకోక్తి జ్ఞాపకమునకు వచ్చియుండును.

౪. పార్వతిని బెండ్లి కలంకరించుచుఁ జెలులామెకు రత్నాభరణాది భూషణములను గైసేసిరి. ఆ యలంకరణమున కర్థము

"దేవి రూపమునకు దృష్టి తాఁకెడునంచు

మాటు సేయు భంగి మణి సువర్ణ
పుష్ప వస్త్ర గంధముల నలంకరించి
రెలమితోడ గౌరి నిందు ముఖులు"

అని కవి వివరణము నిచ్చినాఁడు. ఆ రత్నాభరణాదులుపార్వతి సౌందర్యము నినుమడింపఁ జేయుటకుఁ గాదట. దృష్టి దోషము నుండి వరుగు చేయుటకఁట! అచ్ఛమగు సౌందర్యవతులకు నాభరణపు విలువ లెట్టివగునో కవి చక్కఁగఁ జెప్పినాఁడు. లోకములో తెగనలంకరించు కొను వారిని జూచి "పుట్టుఛాయా? పెట్టుచాయా? యని ప్రశ్నింతురు. ఇది లోకోక్తి. పుట్టుకతో అందముండ వలయునుగాని పెట్టు కొనిన వచ్చునా యని భావము. పోతన యీ లోకోక్తుల నవలోడనము చేసికొని తన రసి కత్వముచే నా భావమునకు రంజనము చేసినాఁడు. ఆభరణము లన్నియుఁ బార్వతి సౌందర్యమునకు దిగదుడుపులే కాఁగా, అ విషయమెఱుఁగని చెలులామె నలంకరించి రని భావము. అదికాక ఆయలంకరణములు నిజస్వరూపమునకు దృష్టితీత వంటిదట

౬. శివుఁడు సప్తర్షులను రజతాచలమునకుఁ బంపు ఘట్టమీ గ్రంథమున కొక వజ్రపుఁదునుక.

శివుఁడు పార్వతిని వరించినాఁడు. వెలదియై శీతాచలమున కరిగి యామె కరగ్రహణ మొనర్చి జోస్యము చెప్ప వచ్చినాఁడు. నాఁటి నుండియు నాతని విరహమునకు నంతు లేదు. సప్తర్షులను గన్య నడిగి రండని పంపును. వారితో నాతఁ డాడిన మాటలెంత దైన్యముగ నున్నవో యంత చమత్కారముగ నున్నవి.

సీ. శీతాచలేంద్రుని కూఁతుఁ బార్వతి కన్య
నతి మోదమున మాకు నడిగి రండు
ఉడురాజవదనకు నుంకు వేమడిగిన
నెంతైన మైకొని యిచ్చిరండు
మదిరాక్షి నాతండు మనకిచ్చునట్టుగాఁ
బెంపార నుంగ్రము పెట్టిరండు
పాలకూళ్లు గుడిచి బాలను మనసొమ్ము
చేసిరండనువొందఁ జేసిరండు

ఆ. ఇదియె మాకు మెచ్చు నెల్లభంగులనైన
దీనిఁ జేయవలయుఁ దెఱఁగు మెఱసి

అని చెప్పి యాతురత నాపికొనలేక
కదలి పోవ నిది యె, కడు మంచి లగ్నంబు
భూధరేంద్రుపురికిఁ బోయి రండు." ౩.౨౭

అని వెంటనే పొమ్మనును. ఇంతలో మనమున నేమి తోఁచినదో : 'మాతావిత్తం' అను న్యాయము మనమునందు మెఱసినదేమో, పార్వతి యేమనునోయని శంకించి యరుంధతిని జూచి యిట్లనినాఁడు.

మ. వనితా, కూఁతులఁ బెండ్లి సేయు నెడలన్ వాచాలకుల్ తల్లులే
యని లోకంబులు పల్కుఁగాన సతి, నీవద్రీశు నిల్లాలితో
నొనరంగన్నియకున్ వరుండు దగు మీరూహింపఁగా నేల యి
మ్మని కార్యంబు ఘటింపఁగాఁ బలుకుమీ యంభోజపత్రేక్షణా. ౩.౨౮.

కన్యలకు వివాహ సంబంధములు చూచునపుడు తల్లులు ముఖ్యముగా నల్లుర ధనధాన్యాదుల నెంచుదురు. మగవాడొకప్పు డంగీకరించినను, ఆడు వారొకంతట సమ్మతింపరు. ఇది లోకపు తీరు. అందుచే శంకర దేవునకు శంక గలిగినది. ఆఁడు వారి సందేహముల నాఁడు వారే తీర్చవలయును. అందు నరుంధతి వంటి పెద్దముత్తైదువ యాపనికిఁ జాలినది. ఒకప్పుడు మేనా దేవి లోక సహజముగ నీ సంబంధమునకు మ్రొగ్గనిచో రహస్యముగా నామెకడకుఁ బోయి, పార్వతికిఁ దగిన వరుఁడే శివుఁడు : సందేహింపవలదని నచ్చఁ జెప్పి కార్యమును సాధింపుమనినుడివెను. ఇది చదువునపుడు కవికి ఆనాఁడువారి మనస్తత్వము పట్ల నింతలోకానుభవ మెట్లు కల్గినదా ! యనిపించును. బహుశః పోతన వీరభద్ర విజయ రచనావసరము నాఁటికి వివాహ సంబంధాన్వేషణము నందుండి సహజముగ బీదవాఁడుగాన నిట్టి యెంపుళ్ళకు గురియై యుంనేమో యనిపించును. ఇది సావనుభవమ్ము కాకున్నచో శంకర దేవునకింత భ్రాంతి కల్పింపఁడు.

ఇది చమత్కార జనకములగు సన్నివేశములలోఁ గొన్ని. భాగవతమునఁ గూడ ననేకములు గలవు. అందుండి మచ్చునకొకటి.

భాగవతము :-

భాగవతమునందలి సన్నివేశములకు రెండు ప్రయోజనములు. ఒకటి. లౌకిక దృష్టిని కావ్య పాత్రలతో సాధారణీకరణము చేసికొని యానందించుట. అలౌకిక దృష్టితో పరతత్త్వార్థము నెఱిఁగి జ్ఞానము నొందుట. ఈ ప్రకరణమున మొదటి యంశమునకే ప్రాధాన్యము.

ం. చంద్రోదయము : భాగ. ౧౦ ౯౯౮

నాఁడు చంద్రుని రాక "విరహి మృగమ్ముల వేఁటాడ మదనుండు తెచ్చిన మోహన దీపమనగ" నున్నదఁట. చంద్రోదయము నిట్లు వర్ణించుట సాధారణమే. అందు విశేషమేమి లేదు. కాని, యీ వర్ణన రాఁబోవు సన్నివేశమునకుఁ బరిపోషకమగు విధానములోఁ జమత్కారముగ నున్నది.

తరువాత వర్ణింపఁ బోవు ఘట్టమున శరద్రాత్రిని గాన మొనర్చు కృష్ణుని సన్నిధికి గోపికలు వచ్చుట యనునది. వేణువు సవ్వడిని వినినంతనే వ్రజకులాంగనలు సర్వకార్యంబులను బరిత్యజించి, చైతన్యంబులుడిగి కందర్పాళుగ భ్రాంతలై యర్థరాత్రమునఁ గృష్ణవేణు రవామృత ధారఁ గ్రోలుచు యమునాతటికి వత్తురు. వారట్లు సంప్రదాయ విరుద్ధముగా నర్థ రాత్రమున వచ్చుటకు వారికిఁ గృష్ణునితోఁ గల ప్రణయబంధము, జగన్మోహనమగు వేణుగానము, మొదలైన మోహ కారణములుండఁగా, ఆనాఁడు కాచిన వెన్నెల గూడఁ గారణమైనది. ఆనాఁటి వెన్నెల యిదివఱకు వలె సామాన్యముగ లేదు. విరహిణులను మృగములను మన్మథుఁడను వేఁటకాఁడు వేఁటాడు దినమది. ఆ వేఁటకై యనంగుఁడు చీకటిలోఁ దనకు దృష్టి నిరోధము గలుగ కుండుటకు మోహనదీపమును దెచ్చినాఁడు. ఆ దీపమే నాఁటి వెన్నెల యఁట. అందుచే దాని ప్రభావమ సాధారణము గనే యున్నది.

ఇట వెన్నెల వర్ణన యొక్క ప్రయోజనము, అర్థ రాత్రమున గోపిక లిలు వెడలి వచ్చుటకుఁ గొంతకారణమైనది. వారు చేసిన దితప్పనివారెఱుఁగుదురు. అటు వేణు నాదము, ఇటు వెన్నెల పుంజము, వేఱొక వైపు కృష్ణగతమగు మోహమును పగ్గములై యగ్గలించి వారిని ఇలువెడల నడచినవి. అబల లేమి చేయఁగలరను భావము గల్గు చున్నది.

# అలంకారములు

ప్రాక్తన మానవుడు ప్రకృతి వైచిత్ర్యమునకుఁ దన్మయుఁడై మాటలాడుట నేర్చిన నాఁడే యలంకారము పుట్టినది. అలంకారమునకు బీజము చమత్కారజనకత్వము. అదియే "ఉక్తి వైచిత్రి". అయ్యది నిపుణుఁడైన కవి యొక్క భావ వ్యక్తీకరణములలోఁ గరఁగి యాతని ఉక్తి మాధుర్యపు టచ్చులలో సానలు దీరి రూపాంతరముల నందును. మహాకవి దృష్టిలో చేతనా చేతనములకంత భేదముండదు. అతఁడు జడ ప్రకృతులను బలత్కరించును. కరుణ దుఃఖ ఈర్ష్యా ద్వేషాది చేతన ధర్మములు వానికారోపించును. కొన్నిట తల్లక్షణముల ననుమానించును, కొన్నిట భ్రాంతిపడును, కొన్నిట స్థిరపఱచును, కొన్నిట మఱుఁగు చేయును, కొన్నిటఁగప్పి పుచ్చును. ఇవన్నియు నలంకారములే.

శబ్దార్థాలంకారములు పరస్పరము సంబంధించినవి. శబ్దము స్థూల రూపము. శబ్దాంతర్నిహితమైన భావము సూక్ష్మము, తదంతర్గతమైన రసము సుకుమారము. ఈ భావమనునది చిత్త వృత్తికి సంబంధించినది. వీనికన్నిటికి బాహిరమైన స్వరూపము శబ్దము. సౌకుమార్యము ప్రధానముగాఁగల కవి యర్థ గౌరవముతో పాటు శబ్ద సౌలభ్యమును పాటించును. శబ్దము లేక అర్థముగాని, అర్థములేని శబ్దముగాని యుండదు. కాని యలంకార విషయమున అన్యతర ప్రాధాన్యమును బట్టి స్థూలముగ శబ్దాలంకార అర్థాలంకార విభాగమేర్పడినది. శబ్దాలంకారము పదవినిమయమును (పరివృత్తిని) సహింపదు. అర్థాలంకారమందులకోర్చును. శబ్దముల యొక్క నియమ బద్ధమైన సరళి శబ్దాలంకారమునకు తప్పని సరి. అది యర్థాలంకారమునకంత యవసరము లేదు. ఆంధ్ర కవిలోకమున నలంకార సౌధ నిర్మాణము నందు శబ్ద శిల్ప విన్యాసములను నేర్పుమీర వెలయించిన ఖ్యాతి పోతనా మాత్యునకు దక్కినది. కావ్యకాంతాలలామ కాతఁడమర్చిన శబ్దాలంకార భంగిమలు రసమనెడి కావ్య గీతికి శ్రుతులై జీవము పోసినవి. భావమునకు వశంవదలై విరులపాన్పువంటి శయ్యా సౌభాగ్యమునిచ్చు శబ్దప్రయోగ శక్తి మహాకవి పోతనకే కలదు. ఇమ్మహనీయుని కావ్యమును జూడ, భాగవత రచనా వ్యాజమున నీతఁడు అక్షర రూపమగు నాద బ్రహ్మమునుపాసించెనేమో యనిపించును. భాగవతమును సావకాశముగఁజదివితిమేని మృదంగాది వివిధ వాద్య పరిష్కృతమైన సంగీత సభలోఁ గూరుచుండి వివిధములైన తానములను వినునప్పటి యానందము కల్గును. అడుగడుగునను పోతనా మాత్యుఁడు ప్రదర్శించిన శబ్దాలంకార విన్యాసముల నన్నిటి నొకచో గుది గూర్చుట కంటె నాయా సందర్భములలో నాతఁడు చూపిన నేర్పులను గొన్నిటిని సంగ్రహముగ బరికింతము.

ఛేకాను ప్రాసము :—

గజేంద్ర విహార సందర్భమున నొక సుదీర్ఘమగు వచనమున అరణ్య మంతయు వర్ణించి మఱల వచనాంతమందు "భిల్లీ భిల్లలు లాయక" అను పద్యమున నడవినంతను ఒక పరి ఛేకాను ప్రాసమున సింహావలోకనము చేసి కలయఁ జూపినాఁడు. అంత సుదీర్ఘమగు వచనమునందుఁ జెప్పిన విషయమే యిందు మరలఁజెప్పినను అందలి పదముల లాలిత్యములో నది పునరుక్తమను భావమే కలుగదు. సరికదా భిల్లులు భిల్లవనితలతో విల్లమ్ములను ధరించి ఫణిభల్లుకాదులను సరకుచేయక ఖడ్గ గవయ బలిముఖ చమరీ మృగాదులను వేఁటాడుట కాన్పించును. ఈ పద్య గుంభనములో చెప్పిన వచనార్థము సంగ్రహమున ధ్వనించి, ఇదొక్కఁటి చాలదా యనిపించును. అంతియేకాదు దీనిని చదువు నపుడు తద్గతమగు పదములర్థ రామణీయకములై వన్యమృగముల నన్వేషింపఁ జేయునే కాని అర్థాలంకారము నెట్లు కూర్చినాఁడోయని తోఁపనీయవు.

గజేంద్రమోక్షణ వృత్తాంతమున గజరాజు, మందనుండి విడివడి మకరికిఁ జిక్కుఁట కథకు బీజము. దానిని జెప్పుటకుఁ బూర్వముకవి గజ యూథముల క్రీడలన్నియు వర్ణించి తరువాత ప్రధాన విషయమునకు వచ్చును. అప్పుడు "ఎక్కఁడఁ జూచిన లెక్కఁకు నెక్కుఁవయై యడవి నడచు నిభయూథములో నొక్కఁ కరినాథుఁడెడతెగి చిక్కె నొక్కఁ కరేణుకోటి సేవింపంగన్" అని ప్రస్తావనా పూర్వకముగ ఛేకాను ప్రాసములో "దశలక్ష కోటి కరిణీ నాథుఁడు" వల్లభ సహితంబుగ మందనుండి వేరైనట్లు చెప్పి, బిందువును స్థాపించినాడు. ఇందు ఇభ రాజు మందనుండి తప్పిపోవుటకుఁ గారణము "ఎక్కఁడఁ జూచిన లెక్కఁకు నెక్కుఁవయై" అడవి యందు సంచరించు నిభయూథముల సమూహములే. అన్నిటిలో తన మందను తాను కానుకొనలేక పోవుట సంభవించుటచేఁ కథానాయకుఁడైన కరి నాథుఁడెడ తెగిచిక్కి, తరువాత మడుఁగు జొచ్చును. ఈ పద్యమును చదువునపుడు ప్రత్యేకముగఁ జూచిన తప్ప కరినాథునిపై నానుభూతియే కల్గునుకాని పోతన యే యలంకారమున దీనిని గూర్చి నాడను దృష్టిరాదు. అది యర్థాలంకారమైననేమి శబ్దాలంకారమైన నేమి రసానుకూలమగు రచనలో నిట్టి సొంపులుండును.

---

౧. భిల్లీ భిల్లలులాయక భల్లుక ఫణిఖడ్గగవయ వలిముఖ చమరీ ఝిల్లీ హరిశరభకకిటి మల్లాద్భుతకాక ఘూకమయమగునడవిన్" భాగ ౪ – ౨౫

౨. ఎక్కఁడ జూచిన లెక్కఁకకు నెక్కుఁవయై యడవి నడచు నిభయూథములో నొక్కఁకరినాథుఁడెడతెగి చిక్కెనొక కరేణు కోటి సేవింపంగన్ ౨ – ౩౨

౩. విశ్వకరు విశ్వదూరుని విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వునవిశ్వున్ శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు నీశ్వరునిం బరమ పురుషునే భజియింతున్ భాగ. ౮ – ౮౮

గజేంద్రుఁడు మకరితోఁ బోరాడి తన సర్వశక్తులు నుడుగఁగా మనంబున నీశ్వర సన్నిధానము కల్పించుకొనినాఁడు.

"విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వునవిశ్వున్
శాశ్వతునజు బ్రహ్మప్రభు
నీశ్వరునింబరమపురుషు నే సేవింతున్" అనినాఁడు.

ఇట నిన్ని సార్లు ఆవృత్తియైన యీ విశ్వ శబ్దమునకు సార్థకమెంతయేని కలదు. ఈశ్వరుని ప్రార్థించి ప్రార్థించియుండుటచే గజరాజు మనసప్పుడే మమకార రాహిత్యమునకున్ముఖమగుచున్నది. కాని యది యింకను నిశితము కాలేదు. అయినను ఈ జగమంతయు నాతనిమయమని మాత్రము తెలిసికొనినాఁడు. అతడు విశ్వకరుఁడు, విశ్వదూరుఁడు, విశ్వవేద్యుఁడు శాశ్వతుఁడు, అని తెలిసికొనినాడు. ఇఁక నాతనిని సాక్షాత్కరింపజేసికొన వలయును. ఈ భావమవ్యవధానమైన వర్ణముల ఆవృత్తి సహాయమునఁ బోతన ప్రకటింపఁ గల్గినాఁడు. ఇది వ్రాయుచు నమ్మహాకవి తనకుఁ గూడ నీశ్వర సాక్షాత్కారము కానున్నట్లు భావించి యుండును. అందులకే పదావృత్తి యందీశ్వరాంశ హృదయమును లోగొనుచున్నది.

వృత్త్యను ప్రాసము :—

తరువాత గజరాజునకు మోక్ష సంబంధమగు సమయమాసన్నమైనది. పరమేశ్వరుని నిదానించినాఁడు. లోకముల శాశ్వతములు, లోకేశు లస్థిరులు, లోకస్థులు తెగకమానరు, యుగాంతమున నంతయుఁ బెంజీకటియే. వీనికన్నిటికి నతీతమైయవ్వలనే కాకృతితో వెలుఁగునది పరబ్రహ్మము. అద్దానినే యాతఁడు సేవించునది. "లోకంబులు లోకేశులు" అను పద్యమునందలి హల్లులయావృత్తి యెంత భావమునకుఁ బ్రాతి నిధ్యము వహించినదో వేఱుగ వివరింపనవసరము లేదనుకొందును.

గజేంద్ర రక్షణాయత్త చిత్తుఁడై విష్ణువు శ్రీకుచోపరిచేలాంచలమైన వీడక వేంచేయునప్పుడు కమలకదంతయు నగమ్యగోచరమైనది. "అనాథ స్త్రీ జనాలాపములు వినెనో, ముచ్చులు ముచ్చవించిరో వేద ప్రపంచమును, దనుజానీకము దేవతానగరిపై

---

౧. లోకంబులు లోకేశులు లోకస్థులుఁ దెగినఁ దుదినలోకంబగు పెంజీకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుఁగునతని నే సేవింతున్" ర - ౭౬

౨. అడిగెదనని కడువడిఁ జను నడిగినఁదనుమగుడ నుడువఁడనినడయుడుగున్ వెడవెడ సిడిముడితడఁబడ నడుగిడునడుగిడదు జడిమనడుగిడునెడలన్

దండెత్తెనో" యని పరిపరి విధముల వితర్కించి యాందోళనపడి అడిగెదనని కడువడిఁ జనినదఁట. మఱల నడిగినచో నుడువఁడేమో యని వెఱచినదఁట. అడుగిడునఁట, మఱల నడుగిడక నుడుగునఁట. అడిగెద, కడువడి, నుడువఁడుమొదలగు శబ్దములు శ్రవణ గోచరమైనంతనే రమాకాంత తడబాటు సద్యః స్ఫురించును. ఈ కూర్పునందు లక్ష్మీదేవి కళవళపాటు మాత్రమే గాదు, ఆమెకుఁ గల్గిన సందేహపరంపరలును దెలియుచున్నవి.

ఈ యనుప్రాసాలంకారమునఁ గాక మఱియొక విధమున నీ భావము చెప్పినచో నీ సందర్భమున కింత సొంపురాదేమో!

**లాటాను ప్రాసము :**

భక్తి పరవశుఁడైన ప్రహ్లాద కుమారునిచేఁ గరచరణాద్యవయవములు గల్గినందులకుఁ గల ఫలమును

సీ. "కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ"

సీ. "కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే
పవన గుంఫిత చర్మభస్రిగాక" అనియు, మన్మథాళుగ భ్రాంతలైన గోపకామినులు చైతన్యంబులుడిగి చేతనాచేతనములకుఁ గల భేదమును మఱచి

"పున్నాగ, కానవే పున్నాగ వందితుఁ
దిలకంబు, కానవే తిలక నిటులు,
ఘనసార, కానవే ఘనసార శోభితు
బంధూక, కానవే బంధుమిత్రు" ౧౦ - ౧౦౧౨

అని కృష్ణుని వెదకి కొనుటను దాత్పర్య భేదము గల్గియు స్వరూపభేదము లేని శబ్దార్థముల పౌనరుక్త్యమున వెల్లడించినాఁడు. భాగవతమున నిట్టి వెన్నియోగలవు.

**అంత్యాను ప్రాసములు :**

వర్ణనాత్మకములగు విషయములను -
"అటఁ జని కాంచెఁ గరిణీ విభుండు" ౮ - ౪౨
"పూరించెన్ హరి పాంచజన్యము" ౮ - ౪౬

---

3. ఆలోల జలధి లోపల నాలోనకిం విడిచి సురలు నసురలుఁ బఱవం గీలాకోలాహలపై హాలాహల విషము పుట్టె నవనీ నాథా. మొదలగునవి.

"కనియెన్ రుక్మిణి చంద్ర మండలముఖున్'

మొదలగు పద్యములలో కవితన యాఖ్యాయికానైపుణ్యమును సూచించినాఁడు.

యమకములు :

కరిమకరముల బలాబల ప్రదర్శనములు౯, పొట్టి వడుగు బలిచక్రవర్తి సభలోఁ బ్రవేశింప సభలోని వారు గుజగుజలు పోవుట౯ మొదలుగాఁ గల వాని భావములు యమకములలో గాననగును.

ముక్త పదగ్రస్తము :-

"మానినీ మన్మథు మన్మథుఁగానరే
సలలితోదారచిత్సకములార
సలలితోదార వత్సకవైరిఁ గానరే
సుందరోన్నతలతార్జునములార" ౧౦ - ౧౦౧౫

"తనుబాసి యొక్కింత తడవైన నిటమీఁద
నేలపై మేనులు నిలువవనుము
నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబులొక్కటఁ దలఁగుననుము." ౧౦ - ౧౦౮౩

మొదలగు పద్యములలో మందగతిని భావప్రదర్శనము చేయవలసి వచ్చినపుడు ముక్త పదగ్రస్తములను గూర్చినాడు.

స్వభావోక్తి :-

"పాయని వేడ్కతో నునికి పట్టులకుంజని గోవులెల్లను
బాయని చీరి హుమ్మనుచుఁగ్రైకొని మూర్కొని పచితిల్లి పె
ల్లై యతిరేకమై పొడుఁగులందెడ లేక స్రవించుచున్న పా
లా యెడ నాకుచున్ సుఖములై యొసఁగెన్ నిజవత్సకోటికిన్" ౧-౫౨౦

గోవులయుగోవత్సములయు నాకార చేష్టా స్వభావాదులు గోవులలో గోపాలునిఁ గొల్చు పోతనకు స్వభావ సిద్ధముగ దర్శన మిచ్చుట యిందుఁ గాంతుము,

౨. అర్థాంతర న్యాసము :

"హరుఁడు గళమునందు హాలాహలము వెట్టిఁ

గప్పు గలిగి తొడవు కరణి నొప్పెసా
ధురక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె భూవరేంద్ర"                    ౪ - ౨౪౮

౩. ఇందు సామాన్యము విశేషముచే సమర్థింపఁబడినది.

౩. ఉత్ప్రేక్ష : –

"ఒక పదంబు క్రింద నుర్వి పద్మమునంటి
కొన్న పంకలవము కొమరుఁ దాల్చె
నొకటి మీఁదఁ దమ్మికొదిఁగిన తేఁటినా
వెలసెమిన్ను, నృప, త్రివిక్రమమున"                    ౮ - ౬౨౭

ఇ భూమి పంకలవముగను, అకసము తమ్మికొదిఁగిన తేఁటిగను సంభావింపఁబడినవి.

౪. ఉపమ : –

"జీవనంబు తనకు జీవనంబై యుంట
నలవుఁ జలము నంతకంత కెక్కి
మకరమొప్పె; డస్సెమత్తేభ మల్లంబు
బహుళపక్ష శీతభానుపగిది"                    ౮ - ౬౧

మత్తేభము యొక్క క్రమక్రమ క్షీణ దశ బహుళ పక్ష శీత భానునితోఁ బోల్పఁబడినది.

౫. **అతిశయోక్తి : –**

"ఆకసము తోడి చూలనఁ
బ్రాకారము పొడవు గలదు పాతాళ మహో
లోకము కంటెను లోఁతెం
తోకలదాపరిఖ యెఱుఁగ దొఱకు దొకరికిన్"                    ౧౦ - ౧౫౬౭

ప్రాకారపు పొడవు, పరిఖలోఁతు అతిశయింపఁ బడినవి.

౬. రూపకము :-

"జ్యావల్లీ ధ్వని గర్జనంబుగ సురల్ సారంగ యూధంబుగా
నావిల్లింద్రశరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగాఁ
దా విద్యుల్లత భంగి నింతి సురజిద్వాగ్ని రుగ్మంబుగాఁ
బ్రావృట్కాలము సేసె బాణచయమంభశ్శీకరశ్రేణిగాన్"

ఇట్లే ప్రతిపాద ప్రత్యేకాంత్యానుప్రాసము సర్వత్రాంత్యానుప్రాసము పాదాంత్యానుప్రాసము మొదలగునవి యర్థవంతములై రసోపస్కారములై కావ్యమునకు దీప్తి నిచ్చినవి.[౧]

ఇమ్మహనీయుని కవిత్వకాసారమునందు శబ్దాలంకార ప్రక్రియలు పద్మసంచయములైనచో, నచ్చటచ్చట మెఱసిన యర్థాలంకారములు హంసల యందమును జేకూర్చినవి.[౨]
అవన్నియు మహాకవి ప్రతిభార్ణవోద్దీర్ణములగు కావ్యములందు సాధారణములే యగుట వలన దానిని విపులీకరింపలేదు.

ఇట్లనేక శబ్దాలంకారముల చేతను, ద్వ్యక్షర త్ర్యక్షర దుష్కర ప్రాసాది సంధానముల వలనను భాగవత కర్తగీతి మాధుర్యమును సాధించినాఁడు. భాగవత కృత్యాదినే

"కొందఱకుఁ దెనుఁగు గుణమగు
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగునే
నందఱ మెప్పింతుఁ గృతులనయ్యై యెడలన్" ౧ - ౨౦

అని మొత్త మెత్తగఁ బోతన యొక చక్కని ప్రతిన నెఱపినాఁడు. ఈ ప్రతిన కర్థము తెనుఁగు పాలధికముగాఁగల రచన కొంతయు, సంస్కృత బాహుళ్యముతోఁ గూడిన రచన కొంతయు, ఉభయములును గలిసిన కూర్పు కొంతయు నాయా స్థలములలోఁ జేయుదునని.

---

౧. "కరిఁదిగుచు మకరి సరసికి" ౮ - ౫౪

౨. "గుజగుజలు వోవువారును
గజిబిజి పడు వారు" ౮ - ౪౪

౩. ఇవి "పోతనపై పూర్వకవుల ప్రభావము" అను ప్రకరణమున "వృషాధిప శతక భాగవతములు" అనుచోటఁ జూడనగును.

శా. "సౌధ ద్వారకవాట కుడ్యవలభిస్తంభార్గళాగేహళీ
వీధీవేది గవాక్ష చత్వరసభావేశ్మ ప్రఘాణప్రా
సాధాట్టాలక సాలహర్మ్య విశిఖా సోపాన సంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణి స్నిగ్ధంబులై యప్పురిన్"

౧౦ - ౧౫౯౯

మొదలగు పద్యములలో సంస్కృత బాహుళ్యమును,

"తగులరె మగలను మగువలు
తగులదె తను మున్ను కమల తగవు విడిచియున్
తగిలిన మగువల విడుచుట
తగుఁదగదని తగవు వలుకఁ దగుదువు హరికిన్"

అను చోట్ల తెనుఁగుల తేటఁదనమును,

శా. ఏమీ నారద, నీవుచెప్పిన నరుండే రూపువాఁడెంతవాఁ
డే మేరన్ విహరించు నెవ్వఁడు సఖుండెందుండుపాటిదో
సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపునస్మద్బాహుశౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వఁగలఁడే గర్వాంధుఁడే చెప్పుమా"

౧౦ - ౧౫౮౭

మొదలగు తావులందు భయములను నేర్పు మీఱఁ జూపి, చేసిన ప్రతిజ్ఞను గడదాఁకఁ నిల్పుకొనినాడు. ఈ త్రిగుణాత్మక మగు శైలి, యొక్క పద్యములందే గాదు నృసింహావిర్భావము, గజేంద్ర మోక్షము, గంగావతరణము, మొదలగు ఘట్టములందలి వచనములందును స్పష్టముగ గోచరించును.

విల్లందు, చన్నిచ్చు, ప్రొద్దు పొడుచు, మొదలగు శబ్దపల్లవ క్రియ లెన్నో విలక్షణ స్ఫూర్తితోఁ బోతనార్యుని కవిత్వము నందు నుడి కారము లకోటిలోని కెక్కినవి.

సీస పద్యములలో సగమునకుఁ బైఁగాఁ బాదాంతమునకు విఱిగి, యేపాదమున కాపాదమే ప్రత్యేకముగా గోచరించుట, సీస పద్యేతరములగు పద్యములలో నధిక సంఖ్యాకములు క్రియా పదముతో నారంభమయి క్రమముగ తక్కిన విశేషణములతో ముగియుట పోతన రచనలోని సాధారణ విషయములు.

# జాతీయములు – నుడికారములు – పలుకుఁబళ్లు

ఆంధ్ర కవి పోతన హృదయ గ్రంథుల నినుమడించి పాటించిన యాతని కవితా స్రవంతిలో నచ్చటచ్చట మెఱసిన జాతీయములు, నుడికారములు, పలుకుఁబళ్లు ముచ్చటగా మరిపెములు చూపినవి. అందుగొన్ని :

| | |
|---|---|
| తరిగాండ్ర లోన నొకఁడఁట | ౮.౨౦౬ |
| గొడ్డేరి మందిరాలవ | ౮.౨౧౮ |
| మంగళ సూత్రమ్మునెంత మదినమ్మినదో | ౮.౨౪౨ |
| కడలిగిలకరింప | ౮.౨౬౩ |
| జాణతనమునఁ జేతులు జిడ్డు విడిచి | ౮.౨౬౭ |
| కుయ్యో కుయ్యోయటంచు (గూయిడి) | ౮.౩౪౨ |
| మగలు తగులుగారె మగువలకును | ౮.౫౯ |
| ప్రాణముతోడి శవము వాఁడు (జీవచ్ఛవము) | |
| కనుఁ గొలంకుల నలుగులు వెడలిన చందంబున | ౮.౬౭౩ |
| ఏఱుఁగలఁచికారవెట్టి మిడికి పోవనీక | ౮.౭౦౧ |
| బెబ్బులియందావు పుట్టెఁ బెలుకుఱియఱవన్ | ౯.౩౫ |
| చెల్లాచెదరై పారెను | ౯.౩౬ |
| వెంగలి విత్తయి | ౯.౫౮౪ |
| వీపు తీట | ౮.౨౧౪ |
| వాతుల నెత్తురులు గురిసె | ౯.౫౨ |
| మంద విడియించి | |
| వాలేరై పఱవంగ (పాలు + ఏరై) | |
| కన్మూసి గుర్వెట్టుచున్ | ౧౦.౨౧౮ |
| ఎఱుక గలుగు వారాఁదూడ యడుగు క్రియ | ౧౦.౯౨ |
| మూఁగి నిద్రఁ జొక్కియుండె | ౧౦.౧౪౭ |
| పుత్త్రులకునోమనేని పుత్రీదానమ్ము చేసి పుణ్యముగనవే. | ౧౦.౧౫౨ |
| ఏమినోముఫలమొ యింత ప్రొద్దొక వార్తివింటి మబలలార | ౧౦.౧౮౪ |
| సిరిదడఁబడు మొగములు (లక్ష్మీ కళలోడు మొగము) | ౧౦.౧౮౬ |

| | |
|---|---|
| కోశంబులో నాలుమెల్పున | ౧౦.౨౨౩ |
| మగపోడుములు సేయఁ జాగినాఁడు | ౧౦.౩౨౭ |
| పాలుపెక్కిన నేర్పరిగాక | |
| చల్కనఁగా వాడెదంత పంక్తి వెలియై గనుపట్టఁగ | |
| సిగ్గుపోనాడనేల | ౧౦.౮౪౩ |
| ఎగ్గు లాడనేల | ౧౦.౮౪౩ |
| కన్నుల పండువుగఁ బాడికట్టి పదువులు జరిగెన్ | ౧౦.౮౯౮ |
| కన్నుల కట్టిన యంతదూరమున్ | ౧౦.౧౨౬ |
| మంచి పటంబులు లేవు నీ ముడిన్ (వస్త్రములు) | ౧౦.౧౨౫౯ |
| గడలనొడ్డ గెడవుగాఁగ నెగసె | |
| చున్నుల పాలేఱువాఱ | ౮.౫.౧౮ |
| ఒప్పుల కుప్పవోలె | స్కం ౮ ప ౪౦ |

| | | |
|---|---|---|
| వీపు తీఁట | ౮.౨౧౪ | పొట్టనున్నవె బూమెలు |
| గసిబిసలై | ౮.౩౪౪ | తొల్లులగమి – ౧౦.౮౯౬ |
| మగపోడుములు | ౮.౩౯౧ | పాడికుట్టి – ౧౦.౮౯౮ |
| గదికినీల్గి | ౧౦.౨౨౫ | చుంచుదువ్వు |
| జరభిరండ (ముసలిముండ) | ౧౦.౨౨౯ | విరిసుట్టు (పువ్వులు పెట్టుట) |
| చేటులేని మందు (అమృతము) | ౮.౨౦౮ | చెక్కిలి ముద్దుగొను |
| | | నీల్లాడు – మొదలగునవి. |

ఇట్లే జాతీయములను వాడకుండ జాతీయార్థము నిచ్చు ప్రయోగముల నెన్నిటినో గావించినాఁడు. ఇది పోతన కవిత్వములో నొక ప్రత్యేక విశేషము.

| | |
|---|---|
| "నెలఁత చూడ్కిగముల నీరై కరంగుచు" | ౮.౩౨౧ |
| "గర్భంబై నెల మసలం జీర జిక్కె నెలఁతకు" | ౮.౪౯౬ |
| "మన్నురుచియయ్యెఁ బగతురు మన్ను సొరఁగ" | ౧౦.౭౧ |
| "నీల్లాడఁ బ్రొద్దు వెదుకఁగ సహితవల్లభవైదువ | ౧౦.౭౫ |
| "వైతనర్చు ప్రొద్దులన్నియుఁ గ్రమమునఁ బోవఁ దొడఁగె" | ౧౦.౭౫ |
| "పగచెలుముల కీలుధర్మ బంధము సుండీ" | ౧౦.౧౬౦ |
| "ఎండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు" | |

"చల్లడముక్రింద దూఱని మల్లరు"

కడుపులార, మీరు గొడుకులఁ గనుఁడింక ౮.౪౯౯

సామెతలు - లోకోక్తులు - ఉప మానములు :-

వీరభద్ర విజయము :-

దేవతా సభలనన్ సంకేతశైలంబులే ౨ - ౨౬

చందురు వొడమ నందందు ఘూర్ణిల్లు పాలవెల్లి భంగి.

భాగవతములో :-

ఇంగలముతోడి సంగతి బంగారము వన్నెగలుగుభంగి ౮.౭౩౦

తామరపాకు జలంబుకైవడిన్ ౯.౩౯౦

పయ్యెదకొంగడ్డమైన ప్రాణము వెడలున్ ౯.౪౦౧

వెన్నునిఁగని మెఱుఁగుఁ బోఁడి కడునొప్పారెన్

బున్నమ నాఁడు కళానిధిఁ ౧౦.౧౧౦

గన్నమహేంద్రాశ చెలువు గలిగి ౧౦.౧౧౦

పృధ్వీనధిపులు నూతన ప్రియులుగారె

ఈ పురుటింటి కుడ్యదీపము వోలె ౧౦.౧౧౫

ఊరకరారు మహాత్ములు ౧౦.౨౮౪

"సంపన్నాంధునకంజనంబు వినుమాదారిద్ర్యమూహింపఁగన్"

"మోమరవాంచి వగలఁబొందె మవ్వంబు గందిన పువ్వువోలె"

"సముద్రంబునకు నడచు నదుల తెఱంగున"

"కొండ బెకలించి యెత్తుట..... యెకకొండ"

"అరసి క్రతుంతువు సర్పమొదిగి మూషికంబు నొడియునట్లు"

"మ్రాను దెచ్చిన నవ వహ్ని శిఖన్ వడిఁ ద్రెచ్చుకైవడిన్"

"నరవరులో యమ్మ నూతన ప్రియులు గారె"

కూటువలుగొనుచుఁ జూచిరి. (గుమిగూడి) ౧౦.౧౨౫౨

మంచి పటంబులు లేవునీముడిన్ (వస్త్రములు) ౧౦.౧౨౫౯

ఇమ్ముల నున్నవాఁడె హరి ౧౦.౧౪౭౮

తగులరె మగలను మగువలు ౧౦.౧౪౮౪

# 16. ఉపసంహారము

ఇట్లు రీతులు, గుణములు పదములు పలుకుబళ్లు వర్ణనలు మొదలగున వెన్నియేని చెప్పవచ్చును. అవన్నియుఁ గావ్యకాంతాలలామ యొక్క ప్రత్యంగ సౌందర్య వర్ణనములే యగును. ఈ యవయవ వర్ణన మనెడి యాకృతికి రసమను జీవము పోసి కవి ప్రాణ ప్రతిష్ఠ చేయును. ఆ రసమే ప్రాణము. రసస్వరూప మానందము. అది "ఇట్టిది" అని నిర్వచించి చెప్పలేము. అనందమనునది మనోధర్మము. అదియనుభవైక వేద్యమే కాని నిర్వచన సాధ్యము కాదు. బ్రహ్మ పదార్థమును నిర్వచించుట యెట్టిదో రసానందమును వివరింపఁ జూచుటయు నట్టిదే. ఉదాహరణకు –

అశ్రాంతదరిద్ర పీడితుఁడు కృశీభూతాంగుడు, జీర్ణాంబరుఁడు నగు కుచేలుఁడు దోళాందోళితమానసుఁడై సన్నని యాశతో వచ్చుటను జూచి శుద్ధాంత కాంతా జనంబులోలిఁ గొలువ అంబుజోదరుడాతనిని నిజపర్యంకతలంబు నందిడుకొని శీతలోపచారములు చేయు ఘట్టమును –

అర్ధ రాత్రమున యమునా నదీ పులిన ప్రదేశములందు మన్మథా శుగభ్రాంతలగు గొల్లపడతుకలు కృష్ణునుద్దేశించి"నీ కుటిలాలక లాలితాస్య మిచ్ఛా విధిఁ జూడకున్న నిముసంబులు మాకు యుగంబులై చను"

"భవదాలోకన హాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధర పల్లవా మృతముచేఁ బాపందగుం బాపవే
నీ వియోగానలహేతి సంహతులచే నీఱై భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయ వీధి బొందెదము నీపాదంబులానం ప్రియా"

అనియు వారు పొందిన ఆర్తికి చిహ్నమగు సన్నివేశములను – "ప్రత్యాలీఢ పాదంబుతో" అగణ్యానంత తేజో విశేషా విర్భూత ప్రతాపమున – వీరశృంగార విస్మయ భయ రౌద్రములు కలసి భామినియయ్యెనో యనిపించు – నాటి సత్యావధూటి చెలువమును

బాలభక్తుఁడైన ప్రహ్లాదుని యచంచలాత్మ విశ్వాసము, ఉద్ధవుని జూచిన నాటి గోపకాంతల మనః స్థితి, త్రివిక్రముఁడై విజృంభించు వామన మూర్తి యాకృతి మొదలగు సందర్భములలో పోతనామాత్యుఁడు నిక్షేపించిన రసానందము నెట్లు నిర్వచింపఁగలము. ఆ యానంద విశ్వరూప సందర్శన భాగ్యము సహృదయులకే పరిమితము.

పోతనామాత్యుఁడు గర్భదరిద్రుడు కాకపోవచ్చు కాని సంపన్నుడు మాత్రము కాఁడు. "సంపన్నాంధునకు అంజనంబు వినుమీదారిద్ర్యమూహింపగాన్" అని నమ్మి ఐశ్వర్యమును

చిన్న చూపు చూచిన ఆత్మసన్యాసి పోతన సంపన్నాంధునకు దారిద్ర్యమనెడి యంజనమును మందుగా నిచ్చిన భిషగ్వర్యుడాతఁడు. కాంచన మణిరత్న సంఘటిత సౌధములందున్న ధన మదాంధులు నూతన ప్రియులని గుర్తించిన మేధావి. పేదటికమును వలచి పెద్దమ్మకు ఒత్తులొత్తిన తాత్వికుఁడు. ఈతనితో నారంభమైన దారిద్ర్య పూజ, ఆత్మ విశ్వాసము తరువాతి కవులకు నాదర్శమైనవి. పోతన నుండి యీ యంశ నంది కొన్న వారిలో త్యాగయ్య యొకఁడు. భక్తి విషయమున త్యాగయ్యగారి కవిత కృత్రిమములేని పల్లెటూరి పడుచైనచో పోతనగారి కవిత కృష్ణచింతనే వ్రతముగాఁ గల ప్రజకులాంగన.

మహాకవి పోతన తన పూర్వజన్మ సుకృతము వలన భాగవతాంధ్రీకరణము తనకొఱకు వేచియున్నదని మురిసినాఁడు. దానిని తెనిఁగించి "మజ్జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్" అని జన్మరాహిత్యమునకే దాని చేఁబట్టినను అది ఆంధ్రులపాలిటి రత్నగర్భయై నిలిచినది. పోతనా మాత్యుఁడు కృష్ణ పరమాత్మను సవిశేషమ్ముగ ధ్యానించి జనకాదులకు లేని భగవత్సాక్షాత్కారమును బొందినాఁడు. బాలగోపాలునితో గంతులవైచి తనియక మురళీధరుని వేణురవామృతధార గ్రోలుటకై, గోవై వీనులిచ్చి గోపికయై పర్వులెత్తినాఁడు. అట్లని పోతన లౌక్యము లెఱుఁగని వెఱ్ఱి విప్రుఁడు కాఁడు. రుక్మిణి మొదలు కొని కుబ్జాంగన వఱకుఁగల కాంతలనందఱను కృష్ణునిచే యథా సంభవముగ మూలమున లేని వానిని చేర్చి సంభావింపఁ జేసినాఁడు. ఆతని కృష్ణునకు గొల్లపడతుల వస్త్రాపహరణము నందెంత ప్రీతియో పాంచాలి మాన రక్షణమన్న నంతమక్కువ. అతఁడు చొరఁబడని యంతఃపురమే లేదు. ఉట్లు గొట్టుట మొదలు యుద్ధరంగముల వఱకు పరిశోధించినాఁడు. చల్దిముద్ద లిడు గోపబాలుఁడు మొదలు కొని విశ్వామిత్రవశిష్ఠ నారదాదుల వఱకు తత్త్వోపదేశము జేసినాఁడు. మొత్తము పై పోతనార్యుఁడు చేపట్టిన గ్రంథమునకు నాతని తత్త్వమునకు నే కవాక్యత కుదిరి, ఆంధ్రులకు అవిచ్ఛిన్నమగు కృష్ణ కథామృత ధార కురిసినది.

సంస్కృత భాగవతమునకు నాతఁడిచ్చిన యాంధ్రతా ముద్ర యాంధ్రులకొక జాతి రత్నమైనది. నాఁటి నుండి యమ్మహనీయ రత్నకాంతి పుంజములలో నిజ స్వరూపమును జూచుకొని మురియని యాంధ్రుఁడు, సాగిలి మ్రొక్కని భక్తుఁడు, మనసారఁ బఠింపని యక్షరాస్యుఁడు, నోరారఁ బాడుకొనని పెద్దముత్తైదువ లేరనుటలో సందియములేదు.

## 17. ఈ రచన కుపయోగపడిన కొన్ని ముఖ్య గ్రంథముల పట్టిక

౧. శ్రీకృష్ణ కర్ణామృతము ......................లీలాశుకుడు

౨. హరివంశము ....................................ఎఱ్ఱాప్రగడ

౩. ఉత్తర హరివంశము ...........................నాచన సోమనాథుడు

౪. విష్ణు పురాణము ...............................వెన్నెలకంటి సూరనార్యుడు

౫. భాగవత సారము ...............................వావిలాల వెంకట శివావధానులు

౬. కృష్ణావతార తత్వము

౭. ఆంధ్ర మహా భారతము ......................కవిత్రయము

౮. శృంగార నైషధము ............................ శ్రీనాథుడు

౯. హరి విలాసము ................................ శ్రీనాథుడు

౧౦. కాశీ ఖండము ................................. శ్రీనాథుడు

౧౧. భీమేశ్వర పురాణము ......................... శ్రీనాథుడు

౧౨. క్రీడాభిరామము ................................ శ్రీనాథుడు

౧౩. బసవ పురాణము .............................. శ్రీనాథుడు

౧౪. పండితారాధ్య చరిత్ర..........................పాలుకురికి సోమనాథుడు

౧౫. వృషాధిప శతకము

౧౬. నృసింహ పురాణము .........................ఎఱ్ఱా ప్రగడ

౧౭. భాస్కర రామాయణము ......................భాస్కరాదులు

౧౮. ప్రతాపరుద్రీయము ...........................విద్యానాథుడు

౧౯. కవి జీవితములు ...............................గురజాడ శ్రీరామ మూర్తిపంతులుగారు

౨౦. లక్ష్మణరాయ వ్యాసావళి ......................కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు

౨౧. సర్వలక్షణసార సంగ్రహము .................కూచిమంచి తిమ్మకవి

౨౨. ఆంధ్ర కవితరంగిణి ...........................చాగంటిశేషయ్య గారు

సంపుటములు ౧, ౨, ౩, ౪, ౫, ౬.... ౧౦

౨౩. శృంగార శ్రీనాథము ......................... వేటూరి ప్రభాకర శాస్త్రి గారు

౨౪. రసార్ణవ సుధాకరము ......................... సర్వజ్ఞ సింగ భూపాలుడు

౨౫. సారస్వతాలోకనము ......................... రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ గారు

౨౬. సంగ్రహ భాగవత సారము ................... జనంచి శేషాద్రి శర్మ గారు

౨౭. భాగవత దర్శనము ........................... ప్రభుదత్త బ్రహ్మారి గారు (అనువాదకులు)

౨౮. భాగవత కథ .................................. ప్రభుదత్త బ్రహ్మరి గారు (అనువాదకులు)

౨౯. వెలుగోటివారి వంశావళి

౩౦. వెలుగోటివరి వంశ చరిత్ర ................... వెల్లాల సదాశివ శాస్త్రిగారు – అవధానము శేషశాస్త్రి గారు

౩౧. వేంకటగిరి సంస్థాన చరిత్ర .................. "

౩౨. చమత్కార చంద్రిక ........................ విశ్వేశ్వర కవి

౩౩. అన్నమాచార్యులవారి వైష్ణవమతము ...... వేటూరి ఆనందమూర్తి

౩౪. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ................. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు

౩౫. వీరభద్ర విజయ వివేకము .................. గురజాడ శ్రీరామ మూర్తి పంతులుగారు

౩౬. మార్కండేయ పురాణము .................. మారన

౩౭. కేయూర బాహు చరిత్ర ..................... మంచన కవి

౩౮. రంగనాథ రామాయణము .................. రంగనాథుడు

౩౯. పద్మ పురాణము

౪౦. భాగవతము – దశమ స్కంధము .......... మడికి సంగన

౪౧. విక్రమార్క చరిత్ర .......................... జక్కన

౪౨. కావ్యాలంకార చూడామణి .................. విన్నకోట పెద్దయ

౪౩. హరిశ్చంద్రోపాఖ్యానము ...................... గౌరన

౪౪. నవనాథ చరిత్రము ........................... గౌరన

౪౫. షోడశ కుమార చరిత్ర ........................ వెన్నెలకంటి అన్నయ

౪౬. శివలీలా విలాసము ..........................నిశ్శంక కొమ్మన

౪౭. ఆంధ్ర వాజ్మయ చరిత్రము ................కవిత్వవేది

౪౮. -డిటో- ..........................................ఖండవల్లి లక్ష్మీ రంజనము గారు

౪౯. -డిటో- ..........................................పింగళి లక్ష్మీకాంతము గారు

౫౦. -డిటో- ..........................................వంగూరి సుబ్బారావు గారు

౫౧. -డిటో- ..........................................నారాయణ మూర్తి గారు

౫౨. -డిటో- ..........................................టేకుమళ్ల అచ్యుతరామయ్య గారు

౫౩. శతక వాజ్మయ సర్వస్వము ...............వేదం వేంకట కృష్ణ శర్మ గారు

౫౪. శతక సంపుటము

౫౫. పదబంధ పారిజాతము .......................ఆంధ్ర సాహిత్య అకాడమీ వారిచే ప్రచురితము

౫౬. కవి జనాశ్రయము ..........................వేములవాడ భీమకవి

౫౭. ఆంధ్ర కుమార సంభవము .................నన్నెచోడుఁడు

౫౮. వరాహ పురాణము ............................నందిమల్లయ్య, ఘంటసింగయ్య

౫౯. స్కాంద పురాణము

౬౦. మత్స్య పురాణము

౬౧. వాయు పురాణము

౬౨. బ్రహ్మ పురాణము

౬౩. బ్రహ్మాండ పురాణము

౬౪. గరుడ పురాణము

౬౫. నారదీయము

౬౬. బ్రహ్మ సూత్రములు

౬౭. వేదాంత సూత్రములు

౬౮. ఉపని షత్తులు

౯౯. భగవద్గీత

౨౦. బమ్మెర పోతన ....................అనుముల సుబ్రమణ్యం శాస్త్రి

౨౧. చాటు పద్యమణి మంజరి

౨౨. వేదాంత రసాయనము ....................మంగళగిరి ఆనంద కవి

౨౩. తెలుఁగు విజ్ఞాన సర్వస్వము ....................తెలుఁగు భాషా సమితి వారిచే ప్రకటితము (౩వ సంపుటి)

౨౪. గద్య చింతామణి ....................గిడుగు రామమూర్తి పంతులు గారు

౨౫. ఆంధ్ర వచన వాఙ్మయము ....................నిడుదవోలు వెంకటరావుగారు

౨౬. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర ....................జివి. రాఘవ రావు, కాశీనాథుని నాగేశ్వర రావు

౨౭. సారస్వతోపన్యాసములు ....................రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ గారు

౨౮. శతక రత్నావళి ....................రెంటాల వెంకట సుబ్బారావు గారిచే సంపాదితము

౨౯. కావ్యాలంకార సూత్రవృత్తి ....................వామనుడు

౩౦. ఉద్భటారాధ్య చరిత్ర ....................తెనాలి రామలింగ కవి

౩౧. పూర్వ గాథాలహరి ....................వేమూరి శ్రీనివాసరావు

౩౨. అప్పకవీయము ....................అప్పకవి

౩౩. రామాభ్యుదయము ....................అయ్యలరాజు రామభద్రుఁడు

౩౪. బమ్మెర పోతనామాత్యుడు ....................పెద్దిబొట్ల వీరయ్య గారు

౩౫. పారిజాతాపహరణము ....................ముక్కు తిమ్మన

౩౬. ఆముక్త మాల్యద ....................కృష్ణ దేవరాయలు

౩౭. శతక కవుల చరిత్ర ....................వంగూరి సుబ్బారావు గారు

౩౮. ప్రబంధ రత్నావళి ....................వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే సంపాదింపబడినది.

౩౯. భోజరాజీయము ....................అనంతామాత్యుడు

౯౦. పంచ తంత్రము ................................ భానుకవి

౯౧. సారార్థ సందర్శిని

౯౨. ఉజ్జ్వల నీలమణి ................................ రూపగోస్వామి

౯౩. బృహదారణ్య శ్రుతి

౯౪. కావ్యాదరశము ................................ దండి

౯౫. కావ్యాలంకార సంగ్రహము .................. మూర్తికవి

౯౬. సీతా రామాంజనేయము

౯౭. సాహిత్య దర్పణము ........................ విశ్వనాధకవిరాజు

౯౮. సూర్యనారాయాంధ్రనిఘంటువు

౯౯. శబ్దరత్నావళి

౧౦౦. మనుచరిత్ర ................................ అల్లసాని పెద్దన

౧౦౧. శ్రీమదాంధ్ర బాగవతము .................. శ్రీరామ నృసింహ మూర్తి కవులు

౧౦౨. గర్గభాగవతము

౧౦౩. ప్రమాణపద్దతులపై ప్రసంగము ............ డా॥ కె.వి.ఆర్. నరసింహము, డా॥ కె. సచ్చిదానందమూర్తి

౧౦౪. శతక కవుల చరిత్ర ........................ వంగూరి సుబ్బారావు గారు

# వ్యాసములు

సర్వజ్ఞ సింగభూపాలుఁడు - పోతన ................ చిలుకూరి పాపయ్య శాస్త్రి గారు ఆంధ్ర సాహిత్యపరిషత్ పత్రిక ౩౨ సంపుటము. సంచిక ౩, ౪

పోతన చరిత్ర స్థలకాలములు ........................ శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

పోతన అనువాద విధానము ........................ శ్రీ కురుగంటి సీతారామయ్యగారు

పోతన కవిత్వము .................................. శ్రీ పుట్టపర్తి శ్రీ నారాయణాచార్యులు

భాగవత రాజవంశములు .............................. శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

ఉపాఖ్యానములు అంతరార్థములు .................. శ్రీ స్వామి శివశంకర శాస్త్రి

వాసుదేవతత్వములు - అవతారములు - ......... శ్రీ వేదాల తిరువెంగళాచార్యులు
భాగవత వైష్ణవము

భాగవత పీఠిక ........................................ శ్రీ వేదేపల్లి వెంకట రమణాచార్యులు గారు

భాగవత తత్వము.................................... శ్రీ కొత్తపల్లి సూర్యరావు గారు ౧, ౨ ఆ.సాహి.ప.ప. సిద్ధార్ధ సంచికలు ౧.౨.సంపు

రసార్ణవ సుధాకరము - చమత్కారచంద్రిక........ శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రి గారు ఆ.సా.ప.ప. ౩౦ సంపుటి. సంచిక ౨,౩

పోతన .................................................. శ్రీ ఏలూరి రామభద్ర చయనులు గారు అ.సా.ప.సంపుటి.౪౬ సంచిక ౬

బమ్మెర పోతరాజు .................................... జయంతి రామయ్య పంతులు గారు అ.సా.ప.ప. ౪వ సంపుటి. సంచిక ౧౨

బమ్మెర పోతరాజు - బంటిమిట్ట ................... శ్రీ వావిలకొలను సుబ్బారావు గారు ఆ.సా.ప.ప. ౬ సం. సంచికలు ౩, ౪

........................................ ౬ సం. సంచికలు ౯

........................................ ౭ సం. సంచికలు ౩

భారత పరమార్థ ప్రదర్శనము ........................ శ్రీ నందూరి బంగారయ్య భారతి ౧౯౩౩ నవంబరు ౧౦ సం.

వేదాంత దర్శనము - అద్వైతము .................. శ్రీ పూర్ణానంద భారతి ౧౯౪౦ ఆగస్టు సంపు. ౧౭

బమ్మెర పోతన మహాకవి సర్వజ్ఞసింగ భూపాలుడు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు భారతి ౧౯౪౪ డిశంబరు సంపుటి ౨౧ సంచి. ౧౨

మధుసూదన సరస్వతి - భక్తి రసాయనము ....... శ్రీ ఏలూరుపాటి రామభద్ర చయినులు భారతి ౧౯౫౪ ఫిబ్రవరి సంపుటం ౩౧. సంచిక ౨.

1. History of Indian Philosophy .......... Surendradanadha Gupta Vol. I, II, III, IV
2. History of the Reddy Kindoms ....... Mr. M. Somasekhara Sarma
3. The Philosophy of Vishnava Religion .......................... Girindra Narayana Mallik (Punjab Oriental (Sanskrit) Series)
4. The Philosophy of Fine art ............. Gerg Wilhelm Fridinch Hegel
5. The Philosopy of Engilish Literature ........................................ Jagam Bryan

